22 ఆయవ్యయ విభాగము 69

23 నాణెములు 70

24 న్యాయ విభాగము 71

25 పరరాజ్య సంబంధము 83

26 కుటిల రాజనీతి 91

27 మునుపటి స్వరాజ్య ప్రేమము 95

28 భీష్ముని రాజకీయాచరణము 97


## పదవ ప్రకరణము

## ధార్మిక యుద్ధము


29 ఉద్దర్షణ విదురుల సంవాదము 102

30 సేన-యుద్ధము 105

31 పదాతులు-అశ్వికులు 109

32 ఏనుగులు 111

33 రథికులు ధనుర్బాణములు 113

34 అస్త్రములు 117

35 సికందరునాటి రథయుద్ధము 120

36 [illegible]ర్ణము 123

37 రథికులయొక్క ద్వంద్వయుద్ధము 130

38 ధర్మయుద్ధ నియమములు 132

39 కూట యుద్ధము 135

40 సేన గుమికూడుట-వ్యూహము 140

41 ఇతర విషయములు 145

42 అక్షౌహిణియొక్క సంఖ్య 146

| | | |
|---|---|---|
| 62 | నదులు | 215 |
| 63 | మహాభారత కాల తీర్థములు | 219 |
| 64 | పుష్కర కురుక్షేత్రముల మహత్త్వము | 227 |
| 65 | నగరములు | 230 |
| 66 | ఆర్య భాగము లేక ఉత్తర ప్రాంత దేశములు | 233 |

## పదమూడవ ప్రకరణము

| | | |
|---|---|---|
| 67 | జ్యోతిర్విషయకమగు జ్ఞానము | 247 |
| 68 | ఋతువులు-సంవత్సరములు | 253 |
| 69 | యుగములు | 256 |
| 70 | కలియుగము | 259 |
| 71 | కల్పము | 261 |

సంస్థలు ఒక స్థానమునుండి యుత్పన్నమై పిమ్మట మెల్ల మెల్లగా వేఱు స్థితిలోఁ బెరిగియున్నవి. మఱియుఁ జివరకు నివుడు బొత్తిగా విస దృశమైన స్థితియందుఁ గన్పడుచున్నవి. తఱచుగా నన్ని విషయముల యందును నీ భేదము చూపట్టుచున్నది; కాని రాజకీయ సంస్థయొక్కయు దత్తద్జ్ఞానసమయయొక్కయు సంబంధమున మాత్రమీభేద మధికముగాఁ గనఁబడుచున్నది. ఇతిహాస ప్రారంభమందు వారి సంస్థలు తఱచు సమా సముగనే కలిసియున్నవి, కాని మహాభారత కాలమందు వానిలో నెక్కు వగనే యంతరము కనఁబడు చున్నదని చెప్పకతప్పదు.

## చిన్న చిన్న రాజ్యములు

భారతీయ కాల ప్రారంభమునందలి హిందుస్థాన రాజకీయ పరి స్థితి మనము సూక్ష్మముగా నిరీక్షింతుమేని, ఆ సమయమున నిచ్చట, గ్రీసుదేశముతో పాటుగా, చిన్న చిన్న భాగములయందు నివసించి యున్న స్వాతంత్ర్య ప్రియులైన లోకులయొక్క వందలకొలది రాజ్య ములుండెనని మనకుఁ గనఁబడును. ఈ రాజ్యముల పేరులు దేశనామ మున నుంపఁబడుటలేదు, కాని అచ్చట నివసించియున్న లోకుల నామ మున నెవరో యొకానొక విశిష్ట రాజుయొక్క నామమున ఆ నామ ములు తటస్థించియుండెను. ఇప్పటి రాజ్యములను విచారించు నెడల! లోకుల నామములనుండి రాజ్య నామములు తటస్థింపలేదు, కాని దేశ నామముఁ బట్టి లోకులకు నామములు తటస్థించి యున్నవని తెలియఁ గలదు. మరాటీలు, మదరాసువారు, బంగాళీలు మొదలైన యిప్పటి నామములు దేశ నామములఁ బట్టి లోకులకు వచ్చియున్నవి. కాని చాల ప్రాచీన కాలమందు దీనికంటె విపరీతమగు పరిస్థితి యుండెను. ఆ సమ యమున లోకులయొక్క నామములఁ బట్టి రాజ్య నామములు తటస్థించు చుండెను. గ్రీసు దేశమందు రాజ్యములయొక్కయు లోకులయొక్కయు నామ ములుపట్టన నామముల, బట్టి తటస్థించుచుండెను, కాని హిందుస్థానమందు అట్లు కూడఁ గాకుండెను. హిందు స్థానమందు రాజునకు. నివాసులకు దేశమునకు

సరిగనే పేరుండెను. ఇచ్చటి రాజ్యములు మిక్కిలి భిన్నములుగా నుండెను. వీని విస్తారము, గ్రీసు దేశమందలి పట్టన రాజ్యములకంటె కొంచెమెక్కువగా నుండెను. మహాభారత కాలమందుఁ గూడ హిందు స్థానములోని ప్రదేశముల జనాభా 212 లోకులు చెప్పఁబడి యున్నారు. ఈ యందఱు లోకులును ఏక వంశస్థులు, ఏక మతస్థులు ఏకభాషా భాగులు నై యుండిరి. సారాంశమేమనఁగా, గ్రీసు దేశీయు లకు సమానముగానే వీరి పరిస్థితి యుండెను. మఱియు ఈ భిన్న భిన్న రాజ్యప్రజలలో తమలో తమకు వివాహ సంబంధముండెను. రాజ కీయ సంబంధమున వీరందఱును స్వతంత్రులై యుండిరి. మఱియు గ్రీకువారితో పాటుగానే వీరికిఁ బరస్పరము నిత్యసంగ్రామములు జరుగు చుండెను. ఇచ్చట వీరు ఒకరు రెండవ వారిని నాశము జేయుట కెన్నడును బ్రయత్నింపలేదనెడు నొక సంగతి ధ్యానింపఁ దగియు న్నది. ఒకజాతి మఱియొక జాతిని గెలుచుచుండెను. కాని పరాజితులైన వారి స్వతంత్రత నెన్నఁడును నశింపఁ జేయకుండెను. ఇట్టి పరిస్థితి భారతీయ కాలమునుండియు ప్రచారముగా నుండెను. మొదట ఆర్యులు అనఁగా సూర్యవంశ క్షత్రియులు పంజాబు మొదలుకొని హిమాలయపు ప్రాంతమున కోసల విదేశముల వఱకు రాజ్యములను స్థాపించిరి. రెండవ చంద్రవంశపు రాజులు గంగా ఘట్టముల గుండ వచ్చిరి; కాని వారు మొదట వచ్చిన వారి స్వాతంత్ర్యమును నశింపఁ జేయుటకుఁబ్రయత్నిం పలేదు. వారు దక్షిణము ప్రపున గంగా యమునల వఱకును మధ్య హిందు స్థానమున మాల్వా, గుజరాతుల వఱకును వందలకొలఁది రాజ్యములను స్థాపించిరి. ఈ రాజ్యములు సికిందరు నాటి వఱకు నిట్లే భిన్న భిన్న రీతిగ నుండెను.పంజాబునందును సింధునందును సికిందరుగెలిచిన విభిన్న లోకుల సంఖ్య 50కి దాదాపుగ నుండి యుండును. పంజాబుసింధువు లివియే రెండు రాజ్యములయినప్పటికిని ఇప్పటి లెక్కఁబట్టి యవి చిన్నవిగా నూహింపఁబడును. ఈ కథనమునకు, అప్పటి రాజ్యములు చిన్నచిన్నవిగా నుండెనని తాత్పర్యము. ప్రతిరాజ్యము యొక్క విస్తారము, దానికి ముఖ్య మైన మధ్యవర్తి రాజధాని యొకటి యుండి దానికి నలుప్రక్కలను గొంత

ప్రదేశముండునంతటిదియే యగుచుండెను. అనఁగా యుధిష్ఠిరుఁడు ఐదు గ్రామములనే కోరి యుండెననుటలోఁ గొంచెమైనను ఆశ్చర్యములేదు. ఆ సమయమున క్షత్రియులకు మహత్త్వకాంక్ష యింతయే యుండెను. మరియు ఈ సమయమునఁ గూడ రాజపుత్రజాతికి మహత్త్వకాంక్ష యట్లే యున్నది. క్రిందనీయఁబడు శ్లోకమందు పైని చెప్పఁబడిన చిత్రము ఉత్తమమైన విధమునఁ బ్రతిబింబితమై యగపడఁగదును.

> గృహే గృహే హిరాజానః స్వస్యస్వస్య ప్రియంకరాః ।
> న చ సామ్రాజ్యమాప్తాస్తే సమ్రాట్శబ్దోహి కృచ్ఛ్రభాక్॥ (సభా 15)

"ఇంటింటను రాజులున్నారు, కాని వారికి సమ్రాట్, వదవిలేకున్నది." ఈ వాక్యముఁబట్టి ప్రతిపట్టనమందును రాజు ఉన్నాఁడని యనుమానముగలదు ఎవరైనను రాజు విశేషబలవంతుఁడై మంచి సమ్రాట్టు కావచ్చును. కాని యతఁడు ఈ రాజుల నశింపఁజేయు వాఁడు మాత్రము కాకుండెను. పరాజితులైన రాజులు తమ ప్రభువునకుఁ గొంతపన్ను మఱియు గానుకలు నిచ్చివేయుచుండిరి. మంచిది, ఇదియే చాలునని యూహింపఁబడుచుండెను. శాంతిపర్వములో జితుఁడైన రాజు నెన్నఁడును బదచ్యుతునిగాఁ జేయఁగూడదని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. వాఁడు జీవించియుండినచో మరల వానినే గద్దెపైని గూర్చుండఁ బెట్టవలయును. వాఁడు చనిపోవు నేని వాని కొడుకును లేక ఎవరైన బంధువును గద్దెపై నెక్కింపవలయును * యుధిష్ఠిరుఁడును

---

* భారతకాలమందుఁ బరాజిత రాష్ట్రమున స్వాతంత్ర్యమునకు నష్టము రానీయకుండెడిపట్ల మిక్కిలి ధ్యానముంపఁబడుచుండెను. ఈ సంగతి యుధిష్ఠిరుకి వ్యాసునిచేత జేయఁబడిన యుపదేశముఁ బట్టి వ్యక్తమగుచున్నది. జితులైన భూపతుల రాష్ట్రములకును నగరములకును బోయి వారి బంధువులను పుత్రులను లేక పౌత్రులను వారి రాజ్యమందు నభిషేకింపుము, వారు బాల్యావస్థయందు లేక గర్భావస్థయందు నుండినను సరియే. ఎవరికిఁ బుత్రులు లేకో వారి యొక్క కన్యలకు నభిషేకింపుము. ఇట్లు చేసిన యెడల, వైభవమందలి యిచ్ఛచేత, స్త్రీలు శోకింపకుందురు. దీనిఁబట్టి మహాభారతకాలమందు, పురుష

లోకుల యొక్కయు దేశము యొక్కయు నామములు ఎల్లపుడు నొక టిగ నుండుచునేయుండెను.

## రాజసత్త.

ఈ యనేకములైన చిన్నచిన్న రాజ్యములయందు రాజకీయ వ్యవస్థ తఱచుగా రాజనిబద్ధమై యుండుచుండెను. యూనానులపూర్వ చరిత్రమందుఁ గూడ హోమరు చేసిన యనేక లోకుల వర్ణనములయందు, ప్రభువు రాజే యుండెనని ఇదే విధముగా, హిందుస్థానమందు గూడ ఈ చిన్నచిన్న రాజ్యముల యందు రాజకీయ సత్త రాజుల చేతిలోనే యుండెను. కాని సర్వసాధారణముగాఁ దఱచు స్వతంత్రులై యుండిరి. విశేషించి బ్రాహ్మణుల స్థితిమిగుల స్వతంత్రముగా నుండుచుండెను. వారు రాజసత్తచేత నణచఁబడిన వారు గాకుండిరి. ఇది గాకుండ ప్రతి యవసరమందును గ్రీసుదేశముతోపాటు నిచ్చుటఁ గూడ, రాజులు జన సమూహము యొక్క యభిప్రాయమును దీసి కొనుచుండుటయు నుండెను. ఉదాహరణార్థము, యువరాజ సంబంధమును బట్టి రాజ్యము యొక్క యేర్పాటును రామున కధీనము చేసివైచుట యుచితమా కాదా, యను నీ సంగతిని విచారించుటకై దశరథుఁడు ప్రతిల సభ నొకదానినిజేసియుండెను. రామాయణమంలో దీనివిషయమునమిక్కిలిసుందరమైన వర్ణనము గలను. ఇటువంటి సభలకు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు నిమంత్రితులగుచుండిరి. అనఁగా ఈ సభలలోఁ గూర్చుండుటకు నార్యులకే యధికారముండెను. రాజసత్త కేవలము అనియంత్రితము కాకుండెను, కాని జన సమూహము యొక్క యభిప్రాయమును దీసికొనుటలో రాజులుసావధానులై యుండుచుండిరి. మహాభారతమందుఁ గూడ లోకుల యభిప్రాయమును బుచ్చుకొనెడి పరిపాటి యుండెనని స్పష్టముగా నగపడుచున్నది. యుద్ధ సమయమున, హస్తినాపురమందు, రాజులయొక్క బ్రాహ్మణులయొక్క సభ ఇట్టిదేసమావేశమై యుండెను; మరియు అచట యుద్ధవిషయమైలోకులందఱ

లై యుండిరి. పర్వత ప్రదేశములయందు నివసించెడు లోకులు తఱచు స్వతంత్రులును ప్రజాసత్తాక ప్రవృత్తి మంతులు నై యున్నారను సంగతి ప్రసిద్ధమై యున్నది. మహాభారతములో ననేక స్థానములందు గణములలో ప్రాముఖ్య మెవిధముగా సంపాదింపవలయునో వ్రాసియు న్నాఁడు. మహాభారత కాలమందుఁ గణపతి, ఒక విశిష్ట పదవిగా నెంచ బడుచుండెను, దానికర్థముఁ గణముఖ్యుఁడు, అని యగుచున్నది.

మహాభారతమందు ఉత్సవ, సంకేత, గోపాల, నారాయణ, సంశప్తకాది నామములతో ఏ గణములు వర్ణితమై యున్నవో, వారు ప్రజా సత్తాకులైన లోకులై యుందురనియే నిశ్చయమగుచున్నది. ఈ లోకులు పంజాబునకు నలుప్రక్కలనున్న పర్వతములందు నివాసులై యుందు రని తెలియుచున్నది. వర్తమాన కాలమునందు నాయవ్య సీమా ప్రాంతమున నున్న ఆఫ్రిదీలు మొదలైన జాతులవారే ప్రాచీన కాల మందలి గణములై యుందురు. గణముల విషయమై శాంతి పర్వ ములో 107 వ యధ్యాయమందు యుధిష్ఠిరుఁడు స్పష్టముగాఁ బ్రశ్నించి యున్నాఁడు. అందులో ఈ లోకులెక్కువగా నున్న కారణముచేత మంత్రము నిలువఁ జాలదయ్యెను మఱియు వీరియొక్క వినాశము భేదము వలన నగుచున్నది యని చెప్పియున్నాఁడు;—

భేదమూలో వినాశో హి గణానాముపలక్షయే ।

మంత్రసంవరణం దుఃఖం బహూనామితి మే మతిః ॥

ఈ లోకులు ప్రాయికముగా నొక్కజాతియు ఒక్క వంశమును గలవారగుచుండిరి; ఇందుచేత వీరినాశము కేవలము భేదముచేతనే కాఁగ లుగుచుండెను. యథా

జాత్యాచ సదృశాః సర్వేకు లేన సదృశాస్తథా।

భేదాచ్చైవ ప్రదానాచ్చ భిద్యంతే రిపుభి ర్గణాః ॥

ఈ గణములు ధనవంతులును శూరులు కూడ నగుచుండిరి;

ద్రవ్యవంతశ్చ శూరాశ్చ శస్త్రజ్ఞాః శాస్త్రపారగాః ।

కాని యీ లోకులయందు మంత్రము కాఁ జాలకుండెను. భీష్ముని యొక్క కథనమున్నది–

న గణాః కృత్స్నశో మంత్రం శ్రోతుమర్హంతి భారత ।

ఈ వర్ణనముఁ బట్టి మహాభారతమందుఁ జెప్పఁబడియున్న గణములు ప్రజా సత్తాకములై లోకులే యై యున్నారని స్పష్టముగా నగపడుచున్నది.

యూనానులకుఁ గూడఁ బంజాబునందు ప్రజాసత్తాకములైన కొందఱు లోకుల పరిచయముండెను. సికందరు యొక్క యితిహాసకారులు మాలవ శూద్రికుని యొక్క వర్ణనము నీ విధముగాఁ జేసియున్నారు:– "మాలవులు స్వతంత్రులైన యిండియన్ జాతి వారై యున్నారు. వారు మిక్కిలి శూరులై యున్నారు. మఱియు వారి సంఖ్యకూడ నధికమై యున్నది. మాలవులయొక్క ఆక్సిడ్రాలయొక్క, భిన్న భిన్న నగరములయందు నివసించుచున్న నాయకులయొక్క వారి ప్రధాన నాయకులయొక్కయు వైపున వకీలుగా వచ్చియుండిరి. వారు మా స్వాతంత్ర్యము నేటివఱకు నెప్పుడును నష్టము కాలేదని, కాఁబట్టి మేము సికిందరుతో యుద్ధము చేసితిమి అని చెప్పిరి. 'చెప్పఁబడియున్న రెండు జాతులవైపు నుండియు నూఱుగురు దూతలు వచ్చిరి. వారి శరీరము మిక్కిలి పెద్దదిగను దృఢమైనదిగను నుండెను. వారి స్వభావముకూడ మిక్కిలి మాన్యవంతముగా నగపడుచుండెను. వారు నేఁటివఱకు మేము రక్షించుకొనియున్న స్వాతంత్ర్యము నిప్పుడు సికిందరునకప్పగించి వైచుచున్నాము" (అరాయన పృష్ఠ 154) ఈ లోకులు సులతానుదగ్గఱ–రావీ. చంద్రభాగాల సంగమమునొద్ద నివసించు చుండిరి, వీరికి నావలవైపున

అంబష్ఠ జాతివారని కూడ వ్రాసియున్నాఁడు– "అనేక నగరములయందు నివసించుచున్నారు మఱియు వారియందుఁ బ్రజాసత్తాకమైన రాజ్య వ్యవస్థ కలదు." మైక్ క్రిండలు చేసిన సికిందరుయొక్క యాక్రమణము గూర్చిన వర్ణనము)

యూనానులయొక్క చెప్పఁబడిన వర్ణనముఁ బట్టియు గణములు ప్రజాసత్తాక వ్యవస్థతో నుండెడి లోకులై యుండిరనియే నిశ్చయమగు చున్నది. శిలా లేఖములయందు ఈ మాలవులను 'మాలవగణ" మని చెప్పియున్నాడు. దీనికిఁ గూడ నర్థమదియే యై యున్నది. ఈ శబ్దము విషయమై యనేకులు సందేహమును బ్రకటించియున్నారు; కాని మహాభారతాధారమునఁ బైని జేయఁబడియున్న గణ వర్ణనముఁబట్టి యీ సందేహము నశించిపోగలదు. యూనానుల యాక్రమణమునకుఁ బిదపఁ బంజాబు నివాసులైన యీ మాలవులే స్వాతంత్ర్యమును గాపాడు కొను టకై మాలవప్రాంతము వఱకుఁ గ్రిందికి దిగివచ్చి యుందురు. మఱియు అచట నుజ్జయిని వఱకు వారి రాజ్యము స్థాపితమై యుండును. అతఁడు పంజాబులోని సిక్కుల నోడించెను. మందోసరములోని శిలా లేఖమందు– 'మాలవగణ స్థిత" నామమున నున్న వర్ణగణనము ఈ లోకుల సంబంధ మున నున్నది. మఱియు నిదే విక్రమ సంవత్సరమై యున్నది. ఈ లోకుల నామముఁ బట్టి యీ ప్రాంతమును మూలవములు అని చెప్పుచు న్నారు.

అగుఁగాక; దీనికిఁ బిమ్మట భారతీ యార్యులయొక్క రాజకీయో త్క్రాంతి యూనానుల యుత్క్రాంతి దిశయు భిన్నముగా నగ పడుచున్నవి. అటు పశ్చిమపు వైపున యూనానులయందు ప్రజాసత్తాక మైన ప్రవృత్తి మెల్ల మెల్లగాఁ బెరిగెను; మఱియుఁ బ్రజాసత్తాక మైన రాజ్య వ్యవస్థను గుఱించి మంచి మంచి కల్పనలు ప్రభావితము లయ్యెను; మఱియు ఇటు భరత ఖండమందు రాజసంస్థ బలవత్తర మయ్యెను. మఱియు రాజునకు సత్తా పూర్ణకముగాఁ బ్రస్థాపితమయ్యెను.

కేనికిఁ గారణమును మనము వెదకవలసియున్నది. వర్ణవ్యవస్థ దృఢప
డిన కొలఁదియు రాజుల యధికారము దృఢపడఁ జొచ్చెను. రాజప్ర
పందు శూద్రవర్ణము వృద్ధియైన కొలఁదియుఁ బ్రజాధికారము తగ్గిపోవ
ఁగెను. రాజ్యముఁజేయుటకు క్షత్రియులకే యధికారమున్నదనియు ఇది
వారి ముఖ్య ధర్మమనియు నిర్ణయ మైనపుడు, బ్రాహ్మణులు వైశ్యులును
రాజకార్యమునుండి తమ మనస్సును దొలఁగింపఁ జొచ్చిరి. మరియొకటి,
ఎప్పుడైతే రాజ్యములు చిన్నచిన్నవియై యుండెనో మరియుఁ జాల
వఱకు లోకులార్యులే యై యుండిరో, ఆ సమయమున రాజకీయ ప్రశ్న
ముల విషయమందు లోకుల సమావేశ వఱచి వారి యభిప్రాయమును
గై కొనుట సంభవముగను నుచితముగను కూడఁ దోచుచుండెను. కాని
రాజ్యములు ఎపుడువిస్తృతములయ్యెనో, శూద్రులయొక్క మిశ్రవర్ణములోని
యొక్క యితరుల సంఖ్య మిక్కిలి పెరిగిపోయెనో, మరియు నీ లోకుల
యొక్క యభిప్రాయమును గైకొనుట యనుచితముగాఁ
దోఁచఁదొడఁగెనో, అపుడిట్టి సభల నిమంత్రణమాగి పోయి
యుండును. స్వాభావికముగా శూద్రులకుఁ బరాజితులయిన సందర్భ
మున రాజకీయాధికారము లీయబడుట సంభవము కాకుండెను. మిక్కిలి ఎక్కు
వయిన మనుష్యసంఖ్య నుండి ప్రతినిధిద్వారమున సమ్మతి గైకొనెడి యాధు
నిక మగు పాశ్చాత్య పద్ధతి ప్రాచీనకాలమందు లేకుండె నన్న సంగతి కూడ
ధ్యానింపఁదగియున్నది. ఇందుచేత గ్రీకులయొక్క రోమనులయొక్కయు
ప్రజాసత్తాకమైన రాజ్యవ్యవస్థనమనసరించి ప్రతి గ్రీకుదేశీయుఁడు లేక రోమను
దేశీయుఁడును సార్వజనిక సభయందు హాజరు కావలసియుండెను. కనుకనే
అచ్చటి ప్రజాసత్తాక రాజ్యములయొక్క యేర్పాటు మెల్లమెల్లగా చెడిపోవ
సాగెను. మఱియు తుదకు ఆ రాజ్యము నశించిపోయెను. ఇదే విధముగా
హిందుస్థానమందుఁగూడ నెప్పటివఱకు రాజ్యములు చిన్నవై యుండెనో
మఱియు రాజ్యాధికారులు ఆర్యులయియుండిరో, అప్పటివరకు రాజకీయ విష

యములందు ఈ కొలఁదిమందియొక్క యభిప్రాయమును బుచ్చుకొనెడిపద్ధతి వ్యాప్తిలోనుండెను. కాని తరువాత నెపుడు రాజ్యము విస్తారముగాఁ బెరిగి పోయి, లోకులసంఖ్య యధికమయ్యెనో, మరియు శూద్రులుకూడఁ జాతుర్వర్ణములో సమావేశమైరో అపుడు సర్వసాధారణాభిప్రాయమును బుచ్చుకొను పద్ధతి కట్టువడిపోయెను. దీని కొక దృఢమైన ప్రమాణము మన కగపడుచున్నది. అది యిట్లున్నది :-

హిందుస్థానమునఁ బశ్చిమ ప్రదేశములోని మరియు విశేషించి పర్వత దేశములోని లోకులు ఒక్కవంశమువారు, ముఖ్యముగా నార్యజాతివారై యుండిరి. కాఁబట్టి వారియొక్క వ్యవస్థ విలక్షణమై యుండెను. అనఁగా అది ప్రముఖుల చేతిలో స్వతంత్ర ప్రకారపుదియై యుండెను. దీనికి విరుద్ధముగా, తూర్పువైపున మగధాధిదేశ రాజ్యములు పెద్దవై యుండెను. అచ్చటి ప్రజలు విశేషముగా శూద్రవర్ణమువారు లేక మిశ్రవర్ణమువారు ఎక్కువై యుండిరి. కాఁబట్టి యచ్చటి రాజ్యవ్యవస్థ మరియొక రీతిదై యుండెను, అనఁగా అది రాజసత్తాకమై యుండెను. ఈ సంగతి యైతరేయ బ్రాహ్మణములోని క్రిందనీయఁబడు భాషాంతరమునుబట్టి తెలియఁగలదు. రమేశచంద్రదత్తు ఈ యనువాదమును దన పుస్తకములలోఁ గైకొనియున్నాఁడు. దీనికి భావ మిదియైయున్నది:- పూర్వరాజునకు సమ్రాట్ పదవియున్నది. దక్షిణరాజును భోజుఁడని చెప్పుచున్నారు, పశ్చిమప్రజలలోఁ "విరాట్" నామమున్నది, మధ్యదేశరాజును కేవలము "రాజు" అనియే చెప్పుచున్నారు. దీనిఁబట్టి పూర్వ ప్రజల యందు సమ్రాటు లేక చక్రవర్తి యనెడు సంజ్ఞ ఉత్పన్నమైయుండెను. అక్కడి రాజుల యధికారములు సంపూర్ణముగా మారిపోయియుండెను మరియు సాధారణ ప్రజల యధికారములు ప్రాయికముగా నష్టములై పో యుండును. అధికార మేమి చెప్పుదుము, ఏకతంత్రమైన రాజ్యపద్ధతి ప్రథమమున పూర్వ దేశములయందే వ్యాపించి యుండును. మ్లేచ్ఛులు లేక మిశ్ర్యులు ఈ దేశమందే యెక్కువగా నుండిరి. ఇతిహాసమునుబట్టి పూర్వదిక్కు

మగధరాజ్యము బలవత్తరమై తరువాత నదియే హిందుస్థానమున సార్వభౌమ రాజ్యమయ్యెను. తూర్పు రాజులకు సమ్రాట్పదవి యుండెననుట కూడ నిర్వివాదమైయున్నది. ఉపనిషత్తులయందుఁ గూడ జనకునికి ఆపదవియే యీఁబడియుండినట్లు కనఁబడుచుండినది. అనఁగా మగధము దక్క విదేహరాజ్యములకుఁ గూడ నీ సంజ్ఞయే యుండెను. మహాభారతము బట్టి కూడ దక్షిణరాజులను భోజులని యనుచున్నట్లు ప్రకటమగుచుండినది. దక్షిణమందు బలవద్రాజులైన భీష్మకునికిని రుక్మికిని ఈ భోజ సంజ్ఞయే యీయఁబడియుండినది. ఇదే విధముగా మధ్యప్రదేశమునందలి కురుపాంచాలాది ప్రజలు రాజులకై, మహాభారతమందుఁ గూడఁ గేవలముఁ రాజు పదముపయోగింపఁబడియున్నది. మత్స్యదేశములోని విరాట్ నామమందు ఈ విచార శ్రేణికంటెఁ గొంత విశేషమైన యర్థము తోఁచుచున్నది. అగుఁగాక; పైయుపకరణముఁబట్టి ఇంకను మహాభారతమందుఁ గూడఁ సమ్రాట్టనెడి కల్పన పూర్వదిక్కునందలి మిశ్రలోకుల యొక్క బహు విస్తీర్ణ రాజ్యముల యాధారముమీఁద నుత్పన్నమై యుండుననియే దృఢానుమానము బయలుదేఱుచున్నది.

## ప్రాచీనమైన సామ్రాజ్య కల్పన

సమ్రాట్టనెడి కల్పన యొక్క యుత్పత్తి విషయమై చమత్కారమగు నొక సిద్ధాంతము మహాభారతములో సభాపర్వమందుఁ జెప్పఁబడియుండినది. యుధిష్ఠిరుఁడు రాజసూయ యజ్ఞము గురించి విచారింపఁ దొడఁగినపుడు ఆ శ్రీకృష్ణుని యభిప్రాయమును బుచ్చుకొనెను. ఆ సమయము శ్రీకృష్ణుఁడిచ్చిన యుత్తరము ఇచట నుద్ధరింపఁదగియుండినది. శ్రీకృష్ణుఁడుచెప్పెను. "మునుపు పరశురాముఁడు క్షత్రియ సంహారమును జేసిన సమయమందుఁ బరువెత్తి దాగుకొని యుండిన క్షత్రియుల కీసంతానము కలదు, కాఁబట్టి వారియందు నుగ్రమైన క్షత్రియ తేజస్సు లేకుండినది. ఈ హీనవీర్యులైన క్షత్రియులు అందఱు క్షత్రియులను జయించిన రాజును ఇతర రాజులు కూడ

సార్వభౌమునిగా నెంచవలయునని నిశ్చయించియుండినారు; ఈ వ్యవహారము నేఁటి వఱకును సాగివచ్చుచున్నది. ఈ సమయమున రాజైన జరాసంధుఁడందఱ కంటెను బలవంతుఁడై యుండెను. పృధివిలోని సమస్త రాజులును వారు ఐళులైననురే ఐక్ష్వాకులైనను సరియే, అతనికిఁ బన్ను జెల్లించుచుండిరి. మరియు తమ్ము జరానంధుని కంకితులనుగాఁ జెప్పుకొనుచుండిరి. ఐళులు యైక్ష్వాకులునైన రాజుల కులములునూఱుండినవి అందు భోజకులస్థుడయిన రాజు ఈ సమయమున బలిష్ఠుఁడై యుండెను, మరియు అందులో జరాసంధుఁడు అందఱను బాదాక్రాంతులనుగాఁ జేసియుండెను. సారాంశము, సమస్త క్షతియులును జరాసంధుని యాధిపత్యమును మన్నించుయుండిరి. మఱియు ఆసార్వభౌమపదవియందుఁ గూర్చుండఁబెట్టియుండిరి. జరాసంధుని వలని భయము చేతనే మేము మధురాదేశమును విడిచిపైచి ద్వారకకుఁ బోయి నివసించియుంటిమి.''
(సభా. అ. 14)

శ్రీకృష్ణుని యొక్క పై భాషణమును బట్టి సమ్రాట్టును లేక చక్రవర్తిని నియోగించుటకై యే పద్ధతి హిందుస్థానమందు వెనుక నుండి వ్యాపించెనో, అది బ్రాహ్మణుల వలని భయముచేతను మఱియు బ్రాహ్మణులసామర్థ్యమును బడఁగొట్టుటకును వ్యాపింపఁజేయఁబడి యుండెనని తెలియుచుండెను. అనఁగా ఒకానొకసమయమున రాజులకు బ్రాహ్మణు లసహ్యమైపోయియుందురని యనుమానము బయులుదేఱుచుండినది, కాని యీ కల్పన యసత్యమై యుండును. దీని యొక్క విచారము ముందుముందు చేయఁబడును. సమ్రాట్టును లేక చక్రవర్తిని నియోగించుటకై వ్యాప్తిలోకి వచ్చిన క్రొత్త పద్ధతి రాజులందఱ సమ్మతి వల్లను బ్రచలితమై యుండెను. ఈ విషయముమీఁద నవశ్యమును ధ్యానముంపవలయును. సమ్రాట్టయిన రాజునకు సమ్రాట్టయినందులకుఁ జిహ్నము బ్రకటింపవలసియుండుటలో సందేహములేదు. అనఁగా రాజకీయము చేయవలసివచ్చుచుండెను; మఱియు ఇట్టి యజ్ఞమునకై అతఁడు

దిగ్విజయముఁ గావించి భిన్నభిన్న రాజలోకమును జయించవలసి వచ్చుచుం డెను. కాని సమ్రాట్టునకుఁ జాలవుంది రాజులు స్వయముగాఁ దమ యిచ్ఛ చేతనే గౌరవించి పన్ను నిచ్చుచు రాజసూయమునకు సమ్మతిని గూడ నిచ్చు చుండిరి. ఈ నియమమునే ననుసరించి పాండవుల దిగ్విజయను సమయ మున శ్రీ కృష్ణాదిలోకులు స్వతంత్రతా పూర్వకముగాఁ దమ సమ్మతినిచ్చి పన్ను గూడ నిచ్చిరి. ఇచ్చట మనము, భారతకాలమందు నారంభమైన సామ్రాజ్యకల్పన సికందరు నాఁటి మగధ సామ్రాజ్య కల్పన కంటె భిన్నమై యుండెను, బౌద్ధ లేఖములఁ బట్టి మగధ సామ్రాజ్యము కాలమున అన్యరాజు లను జయించియే స్థాపితము కాలేదని తెలియుచున్నది, కాని ఆ సమయమున నితర రాజుల రాజ్యములు కూడ అన్యమందుఁ గలిపివేయఁబడి యుండెనుఁ మరియు అచ్చటి రాజవంశములు నశింపఁజేయఁబడియుండెను. బుద్ధుఁడు మరణించిన తరువాత ప్రథమమున కాశీకోసల రాజ్యములను తమరాజ్యములో గలిపిరి. దీనికిఁ బిమ్మట వారు మెల్లమెల్లగా పూర్వపశ్చిమ రాజ్యములను గూడ జయించి తమ రాజ్యములోఁ గలిపికొనిరి. ఈ సమయముననే దాదా పున కాయురస్సు స్థాపించిన పర్షియన సామ్రాజ్యము యొక్క యను కర ణముమీఁద నీ సంగతి జరిగెనని మన యభిప్రాయమై యుండినది. అన్య రాజ్యములను జయించి తన రాజ్యమందుఁ గలిపికొని యచ్చట తన యధి కారులను, గవర్నరులను ఉద్యోగులను నియోగించు పద్ధతి పర్షియన్ చక్రవర్తులు మొదట జారీ చేసిరి. దీని ననుకరణముమీఁద మగధసమ్రాట్టులు ఇతర క్షత్రియరాజ్యములను వశింపఁజేయు క్రమమునారంభించిరి. హిందుస్థాన క్షత్రియుల యంతము గావించు మగధాధిపతి మహానందియైయుండెను ఈవిషయ వర్ణనము, మహాభారతానంతర పురాణములలో స్పష్టముగాఁ గానఁబడుచున్నది ఈ మగధాధి సమ్రాట్టులు, విశేషించి చంద్రగుప్తుఁడు, పర్షియన్ చక్రవర్తి యైన వారియున్న స్థాపించిన యన్ని పద్ధతులను పాటలీపుత్రమందు జారీ చేసెను. మహాభారతమందు ఇట్టి సామ్రాజ్యముల జాడఁ గొంచెమైనను లేకు న్నది. మహాభారతము చంద్రగుప్తుని సామ్రాజ్యమునకుఁ పిదపఁ జేయఁబడి

యున్నదని యొప్పుకొనవలసి యుండును. దీనింబట్టి కొందరు లోకులు మహాభారతములోని మగధము సామ్రాజ్యకల్పనయు జరాసంధునిచిత్రము చంద్రగుప్తుని సామ్రాజ్యము నాధారము చేసికొని యేర్పడియున్న దని యనుమానించుచున్నారు. కాని సరియైనదిగా నచ్చదు. జరాసంధుని సామ్రాజ్యము ప్రాచీనపద్ధతియై యున్నది. అనఁగా, అందు జయింపఁబడిన రాష్ట్రములను నశింపఁజేయుటకై ప్రయత్న మావంతయైనఁ చేయఁబడి యుండలేదు. సామ్రాజ్యముయొక్క కల్పన బహుప్రాచీనము అనఁగా బ్రాహ్మణములనాఁటిదియైయున్నది, మరియు దానికి రాజసూయ యజ్ఞముతో సంబంధ మున్నది. అందు రాష్ట్రములోని దేశము ఏ విధముగాను పెంచఁబడి యుండలేదు; మరియును సమ్రాటుయొక్క యధికారము పరతంత్రమైయుండలేదు; మహాభారతమందు వర్ణింపఁబడిన జరాసంధుని ప్రాచీన చిత్రము, ప్రాచీనకాల వర్ణనములను మరియు ప్రాచీన కల్పనలను ననుసరించి రంగు వేయఁబడియున్నదని మన యభిప్రాయము.

## మహాభారత కాలిక సామ్రాజ్యములు – రాజ సత్తా

మహాభారత సమయమున రాజసత్తా పూర్ణమగు రీతిని యనియంత్రితయైయుండెను; మరియు అన్నిచోట్లను రాజ్యములుకూడ స్థాపితములై యుండెను. ప్రజాసత్తాకమైన రాజ్య వ్యవస్థను మరియు అచ్చటచ్చటఁ గానఁబడుచున్న సర్వసాధారణ సభావర్ణనములను ప్రాచీనము అని యూహింపవలయును. మహాభారతములో శాంతి పర్వమందు వర్ణింపఁబడిన రాజవ్యవస్థ పూర్ణముగా ననియంత్రి స్వరూపముగలది యగుచున్నది. అప్పటి లోకులు రాజుయొక్క యిచ్ఛ పరమేశ్వరుని యిచ్ఛతో పాటు బలవత్తర మనియు; రాజు తనయధికారమును దేవతలనుండి పొందియున్నాడనియు దలంచుచున్నారు. ప్రజలు రాజాజ్ఞను దేవతాజ్ఞతో సమానముగా మన్నించిరి. రాజునకు విరుద్ధముగా నే పనియు లేక యుపద్రవము చేయఁబడుటలేదు, రాజుయొక్క శరీరమునకు నేవిధమైన హానియుఁ గలిగించుటలేదు. అనేక దేవతల యోగముచేత రాజుయొక్క దేహము నిర్మింపఁబడియున్నది. మరియు స్వయముగా భగవంతుఁడైన విష్ణువు రాజుయొక్క దేహమందుఁ బ్రవేశించియున్నాఁడు ఆ సమ

ఘ్నమున రాజున కధికారమెక్కడనుండి యెట్లుత్పన్నమైనదని మిక్కిలి జటిల మగు నొక ప్రశ్నయైయుండెను. తత్త్వవేత్తల కీ విషయమందు మిక్కిలి కాఠిన్యము తటస్థించుచుండెను. వారు ఒక విశిష్టరీతి చేత నీ ప్రశ్నమునకు సమాధానమిచ్చుటకై ప్రయత్నించి యుండిరి. శాంతి పర్వములో రాజ ధర్మ భాగమునకుఁ బ్రారంభమందే యుధిష్ఠిరుఁడు భీష్ముని నిట్లు ప్రశ్నించియు న్నాఁడు– "రాజన్ శబ్ద మెట్లు పుట్టినది, మరియు ఇతర ప్రజలమీఁద రాజు యొక్క యధికార మేందుకు చెల్లుచున్నది ? ఇతర మనుష్యులతో పాటుగనే రాజునకును రెండు చేతులు, రెండునేత్రములు గలవు, మరియు నితర మను ష్యుల కంటె నితని బుద్ధియందుఁ గూడఁ గొంచెమైనను విశేషము లేదు"– ఇందుపై భీష్ముఁడు, "పూర్వము కృతయుగమందు రాజులు లేనేలేరు; ఆ సమయమున లోకులందరును స్వతంత్రులై యుండిరని యుత్తర మిచ్చియు న్నాఁడు. వారు తమ స్వతంత్రేచ్ఛచేత ధర్మమును బాలించుచుండిరి. కాని తరువాత కామము క్రోధము, లోభము మొదలై నవాని ప్రాబల్యముచేత జ్ఞాన లోపము; మరియు ధర్మ నాశము జరిగెను కర్తవ్యాకర్తవ్యముల నెరుంగుట కఠినమయ్యెను, వేదములుకూడ నష్టమైనవి, యజ్ఞాదిమార్గమున స్వర్గలోకము నుండి వర్షము కురియదయ్యెను. అపుడు దేవత లందరును బ్రహ్మను బ్రార్థిం చిరి. బ్రహ్మ తన బుద్ధివలన నొక లక్ష యధ్యాయములుగల యొక గ్రంథ మును నిర్మించెను. అందు ధర్మము, అర్థము, కామమును వర్ణింపఁబడియుం డెను. ఇది గాకుండ అందుఁ బ్రజాపాలన విద్యయు విస్తారపూర్వకముగాఁ జెప్పఁబడియుండెను. సామ, దాన, దండ, భేదాదులయొక్క వర్ణనము అందులో గలదు. మరియు లోకులను దండించు పద్ధతియు నిందుఁ జెప్పఁబడియుం డెను. ఈ గ్రంథమును బ్రహ్మ శంకరునికి నేర్పెను; శంకరుఁ డింద్రునికి, మరియు నింద్రుఁడు బృహస్పతికి నేర్పెను. బృహస్పతి 3000 అధ్యాయముల యందు దానిని సంక్షేపించి జనసమూహమునందు వ్యాపింపఁజేసెను. అదియే బృహస్పతి నీతియై యుండెను. శుక్రుఁడు మరల దానిని 1000 అధ్యాయము లలో సంక్షేపించెను. ప్రజాపతి యీ గ్రంథమును బృథివికి మొదటి రాజగు అనంగునికిచ్చెను. మరియు ఈ శాస్త్రము ననుసరించి రాజకార్యములఁ జేయు మని యతనితోఁ జెప్పెను. ఎప్పుడు అతని బంధువగు వేనుఁడు ఈ నియమ ముల నుల్లంఘించెనో, మరియు నతఁడు తన ప్రజలను గష్టపెట్టఁదొడఁగెనో,

అపుడు ఋషులతనిని జంపివైచిరి. మరియు అతని తొడనుండి పృథునామకుం డైన రాజు నుత్పాదించిరి. అతనికి బ్రాహ్మణులును, దేవతలును జెప్పిరి— "రాగ ద్వేషములను త్యజించి, లోకులందలి విషయమునను సమభావ ముంచి ఏత చ్ఛాస్త్రానుసారముగా పృథ్వీ రాజ్యమును జేయుము. బ్రాహ్మణులను దండింప ననియు, వర్ణసంకరము కానీయ ననియు మాట యిమ్ము." అపుడు పృథువు అట్లు మాట యిచ్చెను. మరియు పృథ్వీరాజ్యము న్యాయముగాం జేసెను. అతండు పృథ్వి పై నుండి రాళ్లను వేరుచేసివైచెను. ఇందువలన భూమియందుం బ్రశస్తములైన వివిధ వనస్పతులు జన్మింపం దొడంగెను. అతండు ప్రజారాజ్యమునుజేసెను. కాంబట్టి అతనికి "రాజ" సంజ్ఞ ప్రాప్తించెను. విష్ణువు తపస్సు చేత నతని శరీరమందుం బ్రవేశించెను. మఱియు అతని యాజ్ఞ నెవ్వరును మీఱం గూడదని నియమము నేర్పఱచెను. కనుకనే సమస్త జగత్తు రాజునకు దేవతతో పాటుగా నమస్కరించుచుండిరి. రాజు విష్ణ్వంశ మున జన్మించుచున్నాండు. అతనికి జన్మముతోడనే దండనీతి యొక్క జ్ఞానము కలుగుచున్నది." (శాంతి. అ 59) ఈ విధముగా మహాభారత కాలమందలి తత్త్వవేత్తలు, రాజు నకధికారోత్పత్తి విషయమై వేచించియుండిరి. బ్రహ్మ విష్ణ్వంశము వలన రాజునకు విభూతిని లోకుల యందధర్మప్రవృత్తి లేకుండు టకై యుత్పాదించియున్నాండు. కాని వారు రాజునకుం తోడ్తోడనే బ్రహ్మ దండ నీతిశాస్త్రమును గూడ నుత్పాదించియున్నాండని సిద్ధాంతీకరించి యున్నాండను సిద్ధాంతమును బ్రతిపాదించియున్నారు.

## నీతినియమములతో రాజసత్త యొక్క నియంత్రణము.

రాజునకు నియంత్రితమైన సత్తను నియతము చేసెడి వ్యవస్థ యీవిధ ముగాం జేయంబడియుండెను. ఇపుడు దానిపైం గొంచెమింకను ధ్యానముంప వలయును. చూడంగా హిందుస్థానమందలి ప్రాచీన రాజులు అనియంత్రిత

మైన రాజసత్త గలవారై యుండిరి. అయినను వారు ఒకరీతిగా సత్యావస్థితులును నియంత్రితులు గూడనై యుండిరి. లోకుల రక్షణమునకై బ్రహ్మ చేసిన నియమముల నుల్లంఘించుటకుఁగాను రాజునకుఁ గూడఁ నధికారము లేకుండెను. వానిని తగ్గించుటకు లేక హెచ్చించుటకు సహితను అధికారము రాజునకు లేకుండెను. రాజునకధికారము పరమేశ్వరునుండి ప్రాప్తమైనట్లే రాజ్యశాసన నియమములు కూడఁ బరమేశ్వరునిచేత నిర్మితములై ప్రాప్తించి యుండెను. కనుకనే వాని నాదరము చేయుటకు, వానిని మార్చుటకు లేక క్రొత్త నియముల నేర్పఱచుటకు నధికారము రాజులకు లేకుండెను. ప్రాచీనులైన భారతీయార్య తత్త్వవేత్తలు రాజుల యనియంత్రితాధికారమును లేక రాజశత్తను ఈ విధముగా నియంత్రితము చేసి వైచెడు వ్యవస్థను చేసి యుండిరి.

ప్రాచీనులు నర్వాచీనులు లేక ప్రాచ్యులును పాశ్చాత్యులును రాజసత్తకు సంబంధించిన కల్పనయందు ఏ యీ మహాభేదమున్నదో, దానిపై నవశ్యము ధ్యానముంపవలయును. రాజకీయసత్తకు స్థానముగా రాజుండవలయును లేక ప్రజాసత్తాకమైన రాజ్యము యొక్క యొకానొక లోకనియుక్తమగు రాజసభ యుండవలయును. అన్ని నియమములు లేక శాసనములు ఆ కేంద్రస్థానము నుండి యేర్పడుచున్నవనునది పాశ్చాత్యుల మీమాంసమైయున్నది. శాసనమందు ఏ శాసనము యొక్క స్వరూపమైయున్నదో లేక శాసనము యొక్క యేబంధనమైతే కలదో, అది రాజసత్త యొక్క యాజ్ఞవలనఁ బ్రాప్తమగుచున్నదని పాశ్చాత్య రాజనైతికశాస్త్రము చెప్పుచున్నది. యీ రీతిని జూచునెడలఁ బాశ్చాత్యదేశములయందు రాజుయొక్క లేకరాజకీయ సంస్థలయొక్క ముఖ్యకర్తము రాజు ప్రజలవ్యవహారమునకై, ఆయాసమయములందు శాసనములఁ జేయువలయునవనియే యగుచున్నది.రాజునకున్న యనేకాధికారములలో రాజుక్రొత్తక్రొత్త శాసనములఁ జేయఁగలఁడనియు, స్వేచ్ఛాచారిరాజగణము ఆయాసమయములందు అన్యాయముగా శాసనములఁ జేసి లోకులను శాసన

విధానమున బాధింపఁగలరనియు, మిక్కిలి మహత్త్వత్ప్రయముగల యొక యధికారమున్నది. హిందుస్థానమందలి భారతీయార్యుల యభిప్రాయ పద్ధతి దీనికి భిన్నమై యుండెను, వారి యభిప్రాయమునందు, శాసనములకు నావిర్భావస్థానము రాజసత్తయందు లేకున్నది; ఈ శాసనములకు లేక నియమములకు ప్రత్యక్షముగా నీశ్వరుఁడులేక బ్రహ్మయొక్క యాజ్ఞయే యాధారమైయున్నది, ఈ యాజ్ఞలు బృహస్పతియొక్క దండనీతిశాస్త్రమందువర్ణింపఁ బడియున్నవి. మఱియు శ్రుతిస్మృత్యాది గ్రంథములయందుఁ బ్రతిపాదితములై యున్నవి, ఈ యాజ్ఞలను మార్చుటకు లేక కొత్త యాజ్ఞలను బ్రకాశింపఁ జేయుటకు నధికారము రాజులకు లేకున్నది, ప్రస్తుత సమయమున రాజసత్తాకుఁ బ్రధానముగానే యంగము ప్రసిద్ధమై యున్నదో. అది హిందుస్థానములోని ప్రాచీన రాజులకు లేకుండెను, అప్పటి రాజ్యముల యందు, ఇప్పటివలె (లెజిస్లేటివ్ కౌన్సిలులు) శాసననిర్మాణసభలు లేకుండెను. క్రొత్త యపరాధములను లేక క్రొత్తదండనముల నుత్పాదించు నధికారము రాజసత్తకు లేకుండెను. వారసుల విషయమై ధర్మశాస్త్రమందుఁ జెప్పఁబడియున్న పద్ధతిని రాజులు మార్చజాలకుండిరి. రాజులకు వారుధర్మశాస్త్రమందు లేక నీతిశాస్త్రమందుఁ జెప్పఁబడియున్న నియమములయొక్క పరిపాలనమును సమబుద్ధితో నిష్పక్షపాతులై చేయవలయుననియే, కర్తవ్యముండెను. ధర్మశాస్త్రముయొక్క యాజ్ఞను దెలిసికొనుటలో సందేహము కలుగునెడల ధర్మశాస్త్రవేత్తలైన బ్రహ్మక్షత్రియ వైశ్యులతోఁగూడిన సభయొక్క యభిప్రాయమును బుచ్చుకొనవలయును; మఱియు శాసనముయొక్క యర్థమును దెలిసికొని దానిని బరిపాలింపవలయును. అవును రాజకీయ సత్తకు సంబంధించిన యిట్టి సిద్ధాంతములవల్ల నౌన్నత్యమునకుఁ గొంత ప్రతిబంధము కాఁగలదనుటమాత్రము సత్యమై యున్నది. కాని ఈ వ్యవస్థచేత రాజులయొక్క యనియంత్రణము మఱియు స్వేచ్ఛాచారియైన వ్యవహారమునకు కాయనాయొక్క స్వరూపమెన్నఁడును లభింపఁజాలదని

జ్ఞప్తి యుండవలయును. మఱియు ఈ వ్యవస్థచేత సమాజస్థితికి చిరస్థాయి యైన స్వరూపము ప్రాప్తమగుచున్నది. ఈ విధముగా సమాజమునకు స్థిరత్వము సిద్ధించెడు కారణముచేత, ప్రాచీనకాలమందు, హిందుస్థానములోని రాజ్యములు అనియంత్రిత మగు రాజసత్త కధీనములై యుండినప్పటికిని మిగుల సౌఖ్యవంతములై యుండెనని చెప్పుటకు నాటంక మేమియును లేదు.

పై కథ వలన, ఏ రాజు ధర్మశాస్త్రానుసారముగాఁ బ్రజలను బరిపాలింపఁడో, అతని దొలఁగించివేయు నధికారము ఋషులకుండెననియు ననుమానము బలముగ దేఱుచున్నది, ఋషులు వేనుఁడను రాజును జంపివైచి యుండిరని ప్రాచీనకథ కలదు. ఇట్టి యుదాహరణములింకను గొన్ని మహాభారతములో నున్నవో లేవో యిది యిప్పుడు చూడవలయును. కానియాసమయమునందు రాజ్యమును జేయు నధికారము రాజవంశమునకే యున్నదనెడి కల్పన యావశ్యకమై యుండెను; ఎందుచేత? వేనుని (జంఘ నుండి) తొడ నుండి క్రొత్తగాఁ బుత్రు నుత్పాదించి యతనిని రాజుగాఁ జేసియుండిరి గనుక. రాజసత్త యీశ్వరదత్తమను కల్పన యెచట నున్నదో, అచట రాజ వంశముపైనే యాధారమున్నది. ఈ సంగతి పాశ్చాత్యులును బ్రాచ్యములు నైన దేశములలోని యనేకోదాహరణములఁ బట్టి సిద్ధింపఁగలదు. ఈకారణము చేతనే హిందుస్థానమందుఁ బ్రాచీనకాలము మొదలుకొని భారతకాలమువఱకు ననేకరాజవంశములేర్పడి యుండును. ఎపుడు బౌద్ధధర్మప్రచారము వలన ధర్మశాస్త్రవిషయమై లోకుల యాదరభావము తగ్గెనో అపుడు రాజసత్త పూర్తిగా ననియంత్రితమై పోయెను. మఱియు తోడుతోడనే రాజవంశమందాదరము కూడఁ దగ్గిపోయెను. ఎవడు వడితే వాఁడు రాజుగాఁదొడఁగెను. మఱియు యథేచ్ఛగ రాజ్యము చేయుఁజొచ్చెను. ఈ పరిస్థితి మహాభారతమునకు దాదాపునఁ బట్టి దానికిఁ బిమ్మట విశేషరూపమున వర్ధిల్లఁజేసెనని యింత మాత్రమవశ్యము చెప్పవలసియున్నది.

## రాజునకుఁ బ్రజలకు నడుమను బ్రతిజ్ఞ యొక్క కల్పన.

రాజసత్త యొక్క నిజమైన యుత్పత్తి యెట్లు జరిగెను; మఱియు ఆ సత్తను దోడ్తోడనే న్యాయానుసారముగా రాజ్యము చేయు నుత్తరదాయిత్వము (జవాబుదారీ) రాజులపై నెట్లు పడెను? ఈ ప్రశ్నముల విషయమున నింకొక సిద్ధాంతము మహాభారతమందుఁ గనఁబడుచున్నది. ఈ సిద్ధాంతమందు, రాజునకును బ్రజలకును నడుమ ప్రతిజ్ఞ జరగియుండెనని కల్పన చేయఁబడియున్నది. పాశ్చాత్యదేశములందు హాబ్సు మొదలైన రాజకీయ తత్త్వవేత్తలచే ఆరంభమున రాజునకుఁ బ్రజలకు నడుమను ప్రతిజ్ఞ యగుచున్నదను సిద్ధాంతము ప్రతిపాదింపఁబడియుండినది. వేలకొలది యేండ్లకు మునుపు భారతీయార్యులు ఈ సిద్ధాంతమునే ప్రతిపాదించియుండిరను సంగతిమీఁద ధ్యానముండవలయును. శాంతిపర్వములో 67వ యధ్యాయమందు, పూర్వము రాజు లేకపోవుట చేత బలవంతుఁడు బలహీనుని, నీటిలోని మత్స్యమువలె భక్షింపఁ దొడఁగెనని వర్ణనమున్నది. అపుడు లోకులందఱును సమావేశమై "ఎవ్వడైనను ఎవనితోనైనను పరుషముగా భాషించునేని, వానిని జంపవలయును లేక ఎవని స్త్రీనైనను లేక ద్రవ్యమునైనను హరించునేని, వానిని మనము త్యజింపవలయును. ఈ నియమమన్ని వర్ణములకును తుల్యమైయున్నది" అని నియమమును జేసికొనిరి. కాని యెపుడు ఇది పరిపాలింపఁబడలేదో, అపుడు సమస్త ప్రజయు బ్రహ్మ యొద్దకుఁబోయెను. మఱియు మమ్ము బరిపాలించెడు నధిపతి నెవనినైనను మాకిమ్మని చెప్పఁదొడఁగెను. అపుడు బ్రహ్మ మనువున కాజ్ఞ యిచ్చెను. అ సమయమున మనువుచెప్పెను "నేను పాపకర్మమునుండి భయపడుచున్నాను. అసన్మార్గమున సంచరించు ప్రజలపై రాజ్యము చేయుట పాపమైయున్నది." అపుడు లోకులు పలికిరి. "రాష్ట్రమందు ఏ పాపము జరుగునో యది కర్తకుఁ దగులును. నీవు భయంపడకుము. నీకు మేము పశువులలో నేబదవ భాగమును ధాన్యములు పంటలోఁ బదియవవంతును నిచ్చెదము; కన్యలయొక్క వివాహసమయమందు

మేము నీకొక కన్య నిచ్చెదము. శస్త్రాస్త్రములను వాహనములను గూని మానాయకులు నిన్ను రక్షించుటకై నీతోఁ గూడ నుందురు. నీవు సుఖముగా నానందముతో రాజ్యము చేయుము. మేము మా ధర్మాచరణములోని నాల్గవ వంతుఁ గూడ నీకిచ్చెదము." దీని కంగీకరించి మనువు రాజ్యము చేయ జొచ్చెను. అధర్మాతులను శత్రువులను దండించి ధర్మునితో తుల్యముగా నతఁడు రాజ్యము చేసెను; ఇట్టి కథయందు, ధర్మము ననుసరించి ప్రజలపై రాజ్యము చేయవలయును. అధర్మాతులను దండింపవలయును: మఱియుఁ బ్రజలతనికిఁ బన్ను నీయవలయును, ముఖ్యముగా భూమియందుఁ బండిన దానిలో దశమాంశమును, పశువుల వ్యాపారము మొదలైన వానిలో ఎనుబదియైదవపాలునీవలయుననియు ప్రతిజ్ఞకు సంబంధించిన కల్పన చేయఁబడి యుండినది. ప్రాచీనకాలమందు భరతఖండమందలి రాజు, ప్రజలు నిద్దఱును ఇట్టి ప్రతిజ్ఞ ననుసరించి నడచుచుండిరి. మఱియు రాజులు ఇంతకంటె నెక్కువ పన్ను దీసికొనకుండిరి,

## అరాజకత యొక్క దుష్పరిణామము

ప్రాచీనకాలమందు ఇట్టి విధముగాఁ బ్రతిజ్ఞకును ధర్మశాస్త్రమునకును సంబంధించిన కల్పనలు ప్రచలితమౌటచేత రాజులకు యథేచ్ఛముగా వ్యవహరించెడి యదను దొరకకుండెను. ఏ రాజైనను అత్యాచారమునుజేసినప్పటికిని అతని యత్యాచారము శాసన స్వరూపము ప్రాప్తింపఁ జాలకుండెను, అందుచేత అతని యన్యాయము ఏ కొంచెపు లోకులకుఁ గాని సమస్త రాష్ట్రమునకుఁగాని హానికరము కాకుండెను. రాజు ఎంత యత్యాచారియైనను అరాజకత ప్రబలియున్న సమాజము కంటె, రాజసత్తతోఁ గూడియున్న రాజ్యము ఎల్లపుడు నధికబలయుక్తముగను సౌఖ్యవంతముగాను నున్నదను విషయముపైఁ గూడ ధ్యానముండవలయును. అరాజకత్వమువలన నుత్పన్నమగు పరిణామము మహాభారతమందు స్పష్టముగా వర్ణింపఁబడియుండినది ఇట్టిఅరాజకపరిస్థితి యితిహాసమందువలుమాఱుత్పన్నమైయుండును. ఇందుచేత

దీనిచెడుపరిణామములవై పునకులోకుల ధ్యానములాగఁబడియుండునుశాంతిపర్వ ములోనిరివయధ్యాయమునందు ఈవర్ణనమున్నది. –"రాజుధర్మమునకుమూలమై యున్నాఁడు. అధర్ములైన లోకులను దండించి యతఁడు వారిని దారికిఁ దీసికొని వచ్చుచున్నాఁడు. సూర్య చంద్రమసులు లేకున్నచో జగత్తు అంధ కారములో నష్టమై పోవునట్లే రాజు లేనియెడల లోకులందరు నశించిపోవు దురు. ఎవఁడును ఈ వస్తువు నాదియని చెప్పుకొనఁజాలఁడు. రాజు లేకపోయి నచో స్త్రీ, పుత్రుఁడు, ద్రవ్యము మొదలైన సమస్తము నష్టమగును. అంత టను శూన్యాకారమగును. దుష్టులు ఇతరుల వాహన వస్త్రాలంకారములను బలాత్కారముగా లాగుకొందురు, ధనవంతులకుఁ బ్రతిదినము హత్యవల్లను బంధనమువల్లను భయము సంభవించును. ఎవ్వఁడును నొకమాటను మన్నిం పఁడు. లోకులు బందిపోటులగుదురుఁ కృషియు వాణిజ్యమును నశించి పోవును. వివాహమన్న మాట పోవునుఁ ధర్మము యజ్ఞముఁగూడనష్టమగును నలువైపులను హాహాకారము వ్యాపించును. విద్యావ్రత సంపన్నులైన బ్రాహ్మ ణులు వేదముల నధ్యయనము చేయరు. సారాంశము, అందఱు లోకులును భయమువల్ల వ్యాకులులై యిటునటు పరుగిడఁజొత్తురు. రాజు ప్రజల సంర క్షించునంతకాలము లోకులు తమ యిండ్ల తలుపులను దెరచియుంచుకొని నిర్భయముగా నిద్రింతురు. కడుపులో నీళ్లు గదలకుండ నిద్రింతురు." ఈ విధ ముగా నరాజకత్వముయొక్క వర్ణనము మహాభారతమందు చెక్కుచెదరఁ గనఁ బడుచున్నది. కనుకనే భారతీయుల కాలమందు, ప్రతిరాజ్యమందును రాజుండుట యావశ్యకమను విషయముమీఁద విశేష బలముఈయఁబడుచుండెను. యుధిష్ఠి రుఁడు ప్రజల ముఖ్య కర్తవ్యమేమని ప్రశ్నించినపుడు భీష్ముఁడు రాజునెన్ను కొనుటయే ప్రథమ కర్తవ్యమని యే యుత్తరమిచ్చెను వెలుపలనుండి యెవ రైనను బలవంతుఁడైన రాజు రాజ్యార్థియై వచ్చునేని యరాజకమైన రాష్ట్రి మతనిని హర్షముతో నాదరింపవలయునని కూడఁ జెప్పఁబడి యున్నది ఎందు చేత? అరాజకత్వముకంటె మఱియొక భయంకరమైన స్థితి లేదుకనుక.

అథచేత్ అభివర్తేత రాజ్యార్థీ బలవత్తరః।
అరాజకాని రాష్ట్రాణి హతవీర్యాణి వా పునః॥
ప్రత్యుద్గమ్యాభి పూజ్యః స్యాదేతదేవ సుమంత్రితమ్।
నహి పాపాత్పరతర మస్తి కించి దరాజకాత్॥

ఎపుడు అరాజకత్వము కంటె వరకీయుఁడైన రాజుండుట శ్రేష్ఠమో అపుడు తమ యత్యాచారియగు రాజుండుట యరాజకత కంటె మిక్కిలి మంచి దని చెప్పవలసిన యవసరము లేదు. అరాజకత భయముచేత హిందుస్థానములోఁ బ్రాచీనకాలమందే రాజసత్త యధిక బలయుక్తమై యున్నదని తెలియుచున్నది.

## రాజునకు దేవతాస్వరూపము

మహాభారత కాలమందు అనియంత్రితమైన రాజసత్త సంపూర్ణవిధముగ స్థాపితమై యుండెను. అందు లోకులయందును, రాజుయొక్క శరీరమునకు నేవిధమైన హానియు రానియ్యఁగూడదను నభిప్రాయము ప్రచలితమై యుండెను. ఏ మనుష్యుడైనను రాజు విషయమున వాని మనస్సులోఁ గొంచెమైనను పాపభావము నుంచుకొనునేని, వాఁడు లోకమందు క్లేశమనుభవించి పరిలోకమందు నరకము పొందఁగలఁడు: ఏ విధముగా—

యస్తస్య పురుషః పాపం మనసా ప్యనుచింతయేత్।
అ సంశయ మిహ క్లిష్టః ప్రేత్యాపి నరకం వ్రజేత్॥

శాంతిపర్వములోని యీ శ్లోకము కూడఁ బ్రసిద్ధమై యున్నది—

నహిజా త్వవమంతవ్యో మనుష్య ఇతి భూమిపః।
మహతీ దేవతాహ్యేషా నరరూపేణ తిష్ఠతి॥

"రాజును మనుష్యుఁడుగా నెంచి యెవడును అతనినవమానింపఁగూడదు. ఎందుచేత? మనుష్యరూపముతో నతఁడు ఒక దేవతయే పృథ్విపై నున్నాఁడు కనుక" ఎపుడు రాజు లోకులను దండించున్నాఁడో అపుడతఁడు యమధర్మరాజు రూపియై యున్నాఁడు. ఎపుఁడవఁడు పాపాత్ముల నుదండించుచున్నాఁడో అపుడతఁడు అగ్నిస్వరూపుఁడై యున్నాఁడు. ఎపుడతఁడు పృథ్విపై పరిభ్ర

మించి రాష్ట్రమును నిరీక్షించుచున్నాఁడో, అపుడు సూర్య స్వరూపుఁడై యున్నాఁడు. ఎపుడతఁడు అపకార్యము చేయువారి సంపత్తును రత్నములను లాగికొని యితరులకిచ్చుచున్నాఁడో, అపుడతఁడు కుబేర స్వరూపుఁడై యున్నాఁడు, మనుష్యుడెన్నడును రాజద్రవ్యము నపహరింపరాదు. ఎవఁడపహరించునో యతఁడు ఈ లోకమందును పరలోకమందును నిందితుఁడగును." సారాంశమేమనఁగా, రాజులకు దేవతా స్వరూపము మహాభారత కాలమందు సంపూర్ణవిధముగా స్థాపితమై యుండెను. మఱియు రాజు విషయమున లోకుల మనస్సునందుఁ పూజ్యభావము, రాజుయొక్క శరీరమును ముట్టుకొనుటయు మహాపాతకముగా నూహింపఁబడునంత యధిక దృఢమై యుండెను.

## దండ స్వరూపము

ప్రజలను పాలించుట ప్రజలకు న్యాయము చేయుట ఇవియే రాజునకు ప్రధాన కర్తవ్యములై యుండెను. దుష్టుని దండించునధికారము రాజునకుండెను. రాజుయొక్క యీ యధికారమునకుఁ 'దండ' సంజ్ఞ ప్రాప్తించియుండెను. మహాభారత కాలమందు ఈ దండమునకొక విలక్షణ స్వరూపము స్థాపితమై యుండెను. శాంతిపర్వములోని 121వ యధ్యాయమందు దీని వర్ణనమున్నది. ఆ దండమెట్లగుచున్నదో? దాని స్వరూపమేమిటి? దానికాధారమేది? ఇవి మొదలుగాఁ ప్రశ్నములను యుధిష్ఠిరుఁడు చేసియున్నాఁడు. మఱియు వీని కుత్తరమిచ్చుచు భీష్ముఁడు దండమును వర్ణించియున్నాఁడు ఇది యొక చమత్కార నాటకమై యున్నది. "ఈదండమును ప్రజాపతి ప్రజాసంరక్షణమునకే యుత్పాదించియున్నాఁడు దానికి వ్యవహారము, ధర్మము వాక్కు, వచనము ఇవి నామములై యున్నవి. ఈ దండమునెల్లపుడు నుచితముగా నుపయోగించునెడల ధర్మము, అర్థము, కామము ప్రవర్తించుచున్నవి. దీనియొక్క యుపయోగమును సమబుద్ధితో రాగ ద్వేషములను త్యజించి చేయవలయును. ఈ దండకము శ్యామ వర్ణము గలది దీనికికోఱలు, నాలుగు చేతులు, ఎనిమిది కాళ్ళు అనేక నేత్రములు. శంకుతుల్యమైన కర్ణములును గలవు. అది జటలను ధరించి కృష్ణాజినమును గప్పుకొని యున్నది.

* బ్రహ్మ దానిని క్షత్రియులకే యిచ్చియున్నాఁడు. ఇతరులకుఁగాదు. రాజు దానిని యధేచ్ఛగా నుపయోగింపక, బ్రహ్మ నిర్మించిన దండనీతి ననుసరించి యుపయోగించుట యుచితమై యున్నది. రాజుయొక్క సమస్త కర్తవ్యము లును ఈ దండనీతి వనమందుఁ జెప్పఁబడియున్నవి. మనుష్యుని యాయువు మిక్కిలి తక్కువయై యున్నది; ఇందుచేత బృహస్పతి యీ గ్రంథము ను సంక్షిప్తము చేసియున్నాడు" బృహస్పతియొక్క యీ గ్రంథము శుక్రుని నీతిగ్రంథము, రెండును మహాభారత కాలమందుఁ బ్రసిద్ధములై యుండె ననియు, వాని తత్త్వము మహాభారతాంతర్గతమైన శాంతిపర్వములోని రాజ ధర్మ భాగమునందు నీయఁబడియున్నవనియు ననుమానించుటకు నేయాటంక మును లేదు. ఈ తత్త్వములు మిగుల నుదాత్తములై యుండెననియు, మహాభారత కాలమందు రాజకార్యములకును రాజ్య వ్యవస్థకును సంబంధించిన కల్పన మిక్కిలి చక్కగా నుండెననియుఁ దెలియుచున్నది. కాని ఈ విషయ మందుఁగూడ, మహాభారత కాలమందు రాజసత్త క్షత్రియులకే యధీనమై యుండెననియు బ్రహ్మ దండమును వారికి సమర్పించియుండెననియు జ్ఞాపి యుంచుకొనవలయును. సమాజమందు క్షత్రియునకు రాజసత్తాధికారము ప్రాప్తమై యుండెను. కాని బ్రాహ్మణవర్గము వారికంటెఁగూడ శ్రేష్ఠమైనదిగా నెంచఁబడుచుండెను. తఱచుగా రాజులకు శ్రద్ధ ధర్మమందుఁ బూర్ణమై యుండుచుండెను; ఇందుచేత ధర్మాన్వితమైన రాజ వ్యవహారములోని నియ మములను విడచిపెట్టుటకై వారు శ్రేష్ఠముగానుద్యుక్తులు కాకుండిరి. వారొక వేళ నుద్యుక్తులైనచో వారిపై బ్రాహ్మణుల ప్రతాపము చూపఁబడుచుండెను. ఇందుచేత విద్య తోడను ప్రశముతోడను సంపన్నులై బ్రాహ్మణులు వారికుప దేశమును జేయుచుండెడివారు కనుక ప్రాచీనకాలమందు రాజ్యసత్త యెంత యనియంత్రిత మైనను దానివలన అత్యాచారములు లేక యున్యాయమెన్న

---

* ఈ స్వరూపకల్పనను తెలుపుటకై టీకాకారుఁడు ప్రయత్నించి యున్నాఁడు, దీనిమీఁద పరిశీలనము ముందు చేయఁబడును.

డును బట్టదయ్యెను. బృహస్పతియొక్క కథఁబట్టి విద్యా వినయ సంపన్నులైన బ్రాహ్మణులు రాజసత్తకు మీరి యుండిరనియుఁగనఁబడుచున్నది. ఇపుడు మనము విస్తారపూర్వకముగా రాజకీయ సంస్థలు దండనీతి ననుసరించి యే విధముగాఁ దమ కార్యమును జేయుచుండెనో యీ విషయమై పరిశీలింప వలయును.

## బృహస్పతి నీతిలో వర్ణితమైన విషయము.

బృహస్పతి శుక్రుల యొక్క గ్రంథముల యాధారముమీఁదనే, శాంతి పర్వములోని ౫౯వ యధ్యాయమందు, దండనీతియొక్క వర్ణనము సంక్షేపముగాఁ జేయఁబడియున్నది, శుక్రనీతి గ్రంథమిపుడు దొరకుచున్నది, కాని యందు ఆధునిక పరిస్థితి యొక్క వర్ణనమీయఁబడియున్నది; మహాభారత మందుఁ జెప్పఁబడియుండిన రాజనీతి మిక్కిలి ప్రాచీనమైయున్నది. బృహస్పతి యొక్క గ్రంథమిపుడు దొరకుటలేదు. మరల శాంతిపర్వములోని యుపర్యుక్తమైన యధ్యాయముఁ బట్టి బృహస్పతి గ్రంథములో నున్న విషయములు స్పషముగాఁ దెలియుచుండినవి. మఱియు దీనిఁబట్టి దండనీతిలోనే యే విషయములుండెనో, భారతీయకాలమందుఁ బ్రజాశాసనశాస్త్ర మెట్లుండెనో, యీ సంగతి చక్కఁగాఁ దెలియుచున్నది. ఈ గ్రంథములో నన్నింటికిని ముందుగా, మనుష్యుని యితికర్తవ్యముధర్మము, అర్థము, కామము, మోక్షము యుండినదని చెప్పియుండిరి. ధర్మమును నీతిని ఎట్లు రక్షింపవలయునో దండనీతి యందుఁ జెప్పఁబడియున్నది. అర్థప్రాప్తి పద్ధతిని నేర్పునట్టిశాస్త్రము వార్తా, నామమునఁ బ్రపద్ధమై యున్నది. మోక్షమునువర్ణించునట్టి శాస్త్రమును అన్వీక్షకి యని చెప్పుచున్నారు; ఈ విభాగములకుఁ బిమ్మట రాజుయొక్క షడంగములు మంత్రివర్గము, వేగులవాండ్రు, యువరాజు మొదలయినవాని గుఱించి పరిశీలనము చేయఁబడియున్నది. దీనికిఁ బిమ్మట శత్రువుతో, సామ దాన, దండ, ఉపేక్షారీతులచేత నెట్లు వ్యవహరింపవలయునో యీ విషయమున్నది. ఇందునని విధములైన రహస్య పరిశీలనము, శత్రువులలో భేదము పట్టించెడు మంత్రము, అధమ, మధ్యమ, ఉత్తమసంధులు, ఇతర

రాజ్యముపై నాక్రమణము; ధర్మవిజయానుర విజయములు, మొదలైన విష యముల వర్ణనము చేయంబడియున్నది. అమాత్య,రాష్ట్ర,దుర్గ,బల, కోశనాను కములైన పంచవర్గముల లక్షణములు చెప్పంబడియున్నవి. సేనావర్గనములో రథ, గజాశ్వపదాతి, కర్మకార, నౌకా, గుప్తదూత, ఉపదేశకులనెడి యష్టాంగ ములు చెప్పంబడియున్నవి. జారణ, మారణాద్యుపాయములు, శత్రు, మిత్రో, దాసీనుల వర్ణనము, భూమి వర్ణనము, ఆత్మసంరక్షణము మనుష్య గజ,రథా, శ్వముల దృఢతయును పుష్టతయును నసేకోపాయములు, నానాప్రకార వ్యూహ ములు, ఆదిగా విషయములు చెప్పంబడియున్నవి. యుద్ధసమయమందలి భిన్నాభిన్నములైన గుప్తప్రయత్నములు, ఉత్పాతములు, ముందునకుం బోవుట, వెనుకకు మరలుట, శస్త్రాస్త్రములకుం బదనుబెట్టుట, సైన్యము నుత్తముగా నుంచెడి యుపాయములు, సైనికులకు ధైర్యము హెచ్చించెడు విధములు, దుందుభిధ్వనితోం బ్రయాణాది విషయముల సూచించు నియమము, మొదలైన విషయముల వర్ణనము కలదు. శత్రుదేశమందు ఆరణ్యకుల ద్వార మున నేప్రదేశమునైనను ధ్వంసము చేయించుట, నిప్పంటించుట, లేక విష ప్రయోగము చేయుట,లేక భిన్నభిన్న వర్ణములనాయకులను మోసపుచ్చుటలేక, వరి మొదలైన సస్యములను గోసికొనిపోవుటవీనుంగులకు మత్తెక్కించు, చుట, లేక భయగ్రస్తముగాం జేయుట, శత్రువులనౌకరులలో శత్రుత్వమును పుట్టించుట, మొదలెన సంగతులుదండనీతిలో వర్ణితములై యున్నవి.రాజ్య మున కున్నతి అవనతియు నేవిధముగా నగుచున్నవో యివికూడ వర్ణింపంబడి యున్నవి. మిత్ర రాష్ట్రముల యుత్కర్షము నేరీతిగాంజేయు వలయునో, ప్రజలకు న్యాయమెట్లు చేయవలయునో, జోరులనెట్లు నిర్మూ లింప వలయునో, బలహీనులనెట్లు రక్షింపవలయునో, బలవంతులకు ముఖ్య నమయమందుం బారితోషికము నెట్లియవలయునో యివికూడం జెప్పియు న్నాండు. రాజులయొక్క సేనాపతులయొక్కగుణదోషముల వర్ణించి, వారు తమ దురాచారములనేవిధముగా విడిచిపెట్టుదురో చెప్పంబడి యున్నది భృత్యుల వేతనములు కూడ వర్ణితమై యున్నవి. రాజునకై, ఆతండు ప్రమాదమును సంశయ వృత్తిని త్యజింపవలయుననియు, ప్రాప్తము కాని ద్రవ్యమును బ్రాప్తింప వలయుననియు, ప్రాప్తధనము వృద్ధినొం

చింది ధనమును సత్పాత్రమున దానము, చేయవలయును, అతఁడు తన సగము ధనమును ధర్మమున కుపయోగింపవలయు, ఒక నాల్గవవంతును స్వేచ్ఛాను సారముగా వ్యయము చేయవలయును, మరియు మిగిలిన నాల్గవ భాగమును గష్టసమయములందు నుపయోగింప వలయునని చెప్ప బడియున్నవి. రోజు ఈ నాలుగు వ్యసనములను విడువవలయుననియుఁ జెప్పఁబడెను. వేట, జూదము, త్రాగుబోతు తనము. స్త్రీలు. రాజు యొక్క యాచరణములు. వస్త్రములు, భూషణములు వీనిని వర్ణించుచు శరీరమును సుదృఢముగాఁ జేసికొనుటకు ననేక ప్రకారములయొక్క వర్ణ నము చేయఁబడి యున్నది. ఉద్యోగము, ధర్మాచారణము, సజ్జనాదర ణము, బహుశ్రుతులైన వారితో సంభాషణము, సత్యములు మృదువులు నైన వచనములు, ఉత్సవము, సభ మొదలగు వాని వర్ణనము కలదు రాజు స్వయముగా, తన సేవకులను పరీక్షింప వలయును. దండార్హుల దండింపవలయును, రాష్ట్రము యొక్క విస్తారమును నుత్కర్షమును గురించి పరిశీలింపవలయుననియుఁ జెప్పఁబడి యున్నది. ఇందు భిన్న భిన్న జాతుల శూరత్వము, క్రూరత్వము మొదలైనగుణదోషములయొక్క ననేక జాతులయొక్క, దేశములయొక్కలో కులయొక్కరీతి రివాజులుకూడ వర్ణింపబడి యున్నవి. తాత్పర్యమేమనఁగా, రాష్ట్రములోని ప్రజలు ఆర్య ధర్మము ననుసరించి యెట్లు నడతురో ఈ విషయమై యన్ని విధ ముల పరిశీలనములును దండనీతియందుఁ జెప్పఁబడియున్నవి. చెప్పఁ బడిన వర్ణనముబట్టి రాజుయొక్క కర్తవ్యములను రాజ సంస్థలోని భిన్న భిన్నాంగములను గురించిన జ్ఞానము భారతకాలమం దెట్లుండెనో దెలియ గలదు. శాంతి పర్వములోని రాజధర్మ భాగమందు, సభా పర్వములోని కచ్చిదధ్యాయమందు, మహాభారతములోని యితరానేక భాగములందునుఁ రాజధర్మమును గూర్చి కనఁబడుచున్న సంగతుల వర్ణనము ఇచట నాలుగు విభాగములలోఁ జేయఁబడును:- మొదటిది రాజదర్బారు, రెండవది భూమి పన్ను, మూఁడవది న్యాయము, నాల్గవది పరరాజ్య సంబంధము.

## రాజదర్బారు

ముందుగా రాజదర్బారునుగూర్చి పరిశీలింతము. ప్రతి రాజునకును ముఖ్యముగా నివసించుటకై యొక రాజధాని యుండుచుండును. రాజధానితోఁ గలిసియున్న యొకకోట యవశ్యముగానుండెడిది. ప్రాచీనకాలమందు రాజధానిని రాజును రక్షించుటకుఁ గోట మిక్కిలి యావశ్యకమై యుండెను. భిన్నభిన్న రాజులలో నెల్లపుడును శత్రుత్వ ముండెడిది కాఁబట్టి యెపుడు శత్రువు దాడిపెడలునో తెలియఁజాలకుండెను. శత్రువు అకస్మాత్తుగాఁ బైబడునేని వాని నెదుర్కొనుటకై కోటల వలన నెక్కువ లాభ మగుచుండెను. మహాభారతమందు నారు విధముల దుర్గములు చెప్పఁబడి యున్నవి. మొదటిది : ఇసుక యెడారి మైదానముచేత నావరింపఁబడిన దుర్గము; రెండవది : పర్వత దుర్గము; మూఁడవది : భూ దుర్గము (భూమిపై నున్నకోట;)ఁనాల్గవది : మట్టి కోట; అయిదవది : నర దుర్గము; ఆఱవది : యరణ్య దుర్గము. నర దుర్గము కేవలము ఆలంకారిక నామమై యున్నది. నరదుర్గము అనఁగా సేనా నివేశము చేతఁ జుట్టఁబడి యున్న రాజు నివసించు చోటు; అనఁగా ఈ దుర్గమందు సమస్తమైన రిజర్వుడు సైన్యముమీఁద అనఁగా మనుష్యులమీఁద నుండును. భూదుర్గమున కుదాహరణము : ఢిల్లీ, ఆగ్రా మొదలైనచోట్లనేకములున్నవి మట్టి కోటలు ఉన్నత ప్రదేశములయందుఁ జాల నున్నవి. కొంకణ ప్రాంతమందు పర్వతదుర్గము లనేకములున్నవి. ఇసుక మైదానపు కోటలు రాజస్థానములోనున్నవి. అచ్చటివి రక్షణమునకు గొప్పసాధనములు, శత్రువు తెఱపిమైదానము నుండి రావలసివచ్చుటయే యైయున్నది. అరణ్య దుర్గమందు రక్షణ సాధనము, శత్రువరణ్యమును దాఁటి రావలసివచ్చుటయైయున్నది. నర దుర్గమున కుదాహరణము : మహారాష్ట్రేతిహాసమందు పూనా నగరపుదియే యైయున్నది. బాజీరావు కోటను గొట్ట నారంభించినపుడు శాహూగో, నీవు నీ రక్షణమునకు ఆశ్రయదుర్గమునం దుండక సైన్యముమీఁద నుండుము అని ఆజ్ఞాపించి యున్నాఁడు. అగుఁగాక; మహాభారతకాలమునఁ బ్రతి రాజ్యమందును దఱుుగా రాజధానిలో నొకకోట యుండెడిది, దానికి నలుపైపులను గొప్పకందక ముండుచుండెను, మరియు కందకముమీఁదఁ గావలసివచ్చినపు డెల్లఁ దెరుచుటకును ముంచుటకును వీలగునట్టి వంతెన లుండుచుండెను. సికందరు పంజా

బును గెలిచినపుడు ప్రతి చిన్న నగరమునను, రాజ్యమునను ఇట్టి కోటలను నతఁడు దాడివెడలి పై కొనవలసివచ్చెను. ప్రతికోట యందును ధాన్యము, శస్త్రములు నిండనుంపఁబడుచుండెడివి. శాంతిపర్వములోని 86వ యధ్యాయమందు కోటలో నీటిని జాగ్రత్తపెట్టుకొని యుండవలయు నని విశేషించి చెప్పియున్నాఁడు. రాజునకుఁ గోటలో శస్త్రము లుంచుకొను కొట్టులు, ధాన్యము పోసికొను కొట్టులు, ధన ముంచుకొను కొట్లును ఆవశ్యకముగా నుండుచుండెను. మహాభారతములో కోటలో యంత్రసామగ్రిని గూడఁ దయారు చేయవలయు నని చెప్పియున్నాఁడు. మహాభారతమందున్న యుద్ధ యంత్ర వర్ణనము బహుశః గ్రీక్కులనుండి గై కొనఁబడిన యంత్రములదిగాఁ దెలియుచున్నది. కారణ మేమనఁగా, పెద్ద పెద్ద కోటలను గెలిచెడి యంత్రములు మిక్కిలి పెద్ద తిరుగళ్లమీఁద నెత్తఁబడి వీవిని గ్రీక్కులు తమతోఁ గూడఁ దీసికొని వచ్చియుండిరో మఱియు వేని సహాయముచేత సికిందరు అనేక కోటలనుజయించియుండెనో, అట్టి రాళ్ళను విసరివై చెడి యంత్రములుండెను. గనుక ఇంతకుఁ బూర్వము భారతీయులు ఈ యంత్రముల నెఱిఁగయున్న యెడల వారు గ్రీక్కుల దాడియందు నధికమైన యాటంకమును దటస్థింపఁజేయఁగలుగుదురు. కనుకనే మహాభారత కాలమందు ఈ యంత్రముల జ్ఞానము యూనానుల నుండియే యైయుండునని యనుమానము జనింపఁగలదు.

రెండు ప్రధాన సాధనములు రాజధానిలోఁ గోటలు—యొక్క వర్ణనము చేయఁబడెను. ఇపుడు రాజునకు గొప్ప మూఁడవసాధనము మంత్రి లేక "ప్రధానుఁడు అయియున్నాఁడు ఎవరితో రాజనీతి సంబంధమైన మంత్రము లేక సలహా తీసికొనఁబడుచున్నదో వారిని మంత్రులని చెప్పుచున్నారు. "అష్టానాం మంత్రిణాం మధ్యే మంత్రం రాజోపధారయేత్" (శాంతి. అ. 85) ఈ శ్లోకమునుబట్టి మంత్రులెనమండుగురై యుందురని తెలియుచున్నది. (వీరు న్యాయసభలోని యష్టమంత్రులనుసరణము సంభవమై యున్నది) కనుకనే అష్టమంత్రుల లేక యష్ట ప్రధానుల సంస్థ మిగులఁ బ్రాచీనముగాఁ దెలియుచున్నది. కాని మహాభారతమందు ఈ యష్టమంత్రులెవరో యిది యెచ్చటను జెప్పఁబడియుండలేదు. సభాపర్వముయొక్క పంచమాధ్యాయమందునే సప్తమంత్రుల వర్ణన లేకున్నది, రాజునొద్ద నింతమంది యధికారులు అవశ్యముగా

నుండవనయునన్న సంగతి సత్యమై యున్నది. ముఖ్య సచివుఁడు, సేనాపతి, పురోహితుఁడు, గుప్తదూత, దుర్గాధ్యక్షుడు, జ్యోతిష్కుఁడు, వైద్యుఁడు వీరుగాక యింకను నధికారులు చెప్పఁబడి యున్నారు. కచ్చిదధ్యాయము లోని యొక శ్లోకమందు 18 అధికారులు చెప్పఁబడియున్నారు. టీకాకారుఁడు వారికీనామములఁబెట్టియున్నాడు. 1 మంత్రి లేక ముఖ్యుఁడు 2 పురోహితుఁడు 3 యువరాజు, 4 సేనాపతి, లేక చమూపతి, 5 ద్వారపాలుఁడు లేక ప్రతిహారి 6 అంతర్వేశికుఁడు లేక అంతఃపురాధికారి, 7 కారాగృహాధికారి, 8 కోశాధ్యక్షుడు 9 న్యాయాదికారి, 10 ప్రదేష్ట, 11 రాజధానిపై నధికారి, 12 కార్యము నియమించెడు నధికారి, 13 ధర్మాధ్యక్షుఁడు, 14 సభాధ్యక్షుఁడు లేక న్యాయాధికారి 15 దండాధ్యక్షుఁడు, 16 దుర్గాధ్యక్షుఁడు, 17 సీమాధ్యక్షుఁడు ఈ యందఱు అధికారులును తీర్థులనిపించుకొనుచుండిరి. ఈ నామమెందుకుఁబెట్టబడెనో తెలియదు ఈ లోకులు పూజ్యులుగా నూహింపఁబడుచుండిరి. ఇందుచేత వారు తీర్థులని చెప్పఁబడియుందురు మరియొకచోటునఁ బదునాల్గు రధికారులు చెప్పఁబడియున్నారు వారి నామములివి:– 1 దేశాధికారి, 2 దుర్గాధికారి, 3 రథాధిపతి, 4 గజాధిపతి, 5 అశ్వాధిపతి, 6 శూరసైనికుఁడు, 7 అంతఃపురాధికారి, 8 అన్నాధికారి, 9 శాస్త్రాధిపతి, 10 సేనానాయకుఁడు, 11 ఆయవ్యయాదిపతి, 12 ధనాదిపతి, 13 గుప్తదూత, 14 ముఖ్య కార్యకర్త. చెప్పఁబడిన రెండు పట్టములఁబట్టియుఁ బాఠకులకు, వర్తమాన రాజ వ్యవస్థయుండెంతమంది యధికారులును వారి కోర్టులును ప్రాచీనకాలమందుండెనో తెలియఁ గలదు.

శాంతిపర్వమందును సభాపర్వమందును రాజుయొక్క వ్యవహారము మిక్కిలి చక్కఁగా వివేచింపఁబడియున్నది. "రాజులు సుఖములనుభవింపవలయును. కాని వానియందు నిమగ్నులు కాఁకూడదు. ధర్మతత్పరులు కావలయును, కాని యర్థముపైపు లక్ష్యములేనివారు కాఁగూడదు. అర్థలోభము చేత ధర్మమును త్యజింపఁగూడదు; అనఁగా ధర్మప్రీతిని, అర్థాలోభమును సుఖాభిలాషను మర్యాదాయుక్తముగా నుండవలయును. ధర్మము, అర్థము,

డును శుచిగా నుండవలయును, మధురమైన భోజనమును చేయవల యును. కాని యది హానికరము కానీయఁ కూడదు. సజ్జనుల మాన మును సంరక్షింపవలయును నిష్కపట భావముతో గురువులను సేవింప వలయును. దంభము లేకుండ దేవతలను బూజింపవలయును. సంపదపై నిచ్ఛయుండ వలయును, కాని యిష్ట సంపత్తి నింద్యము కాఁ కూడదు. సంపత్తి ననుభవింపవలయును, కాని దానిపైఁ బ్రీతి నుండనీయఁ కూడదు. సావధానుఁడై యుండవలయును. కాని, కాలజ్ఞాన శూన్యుఁడై యుండఁగూడదు, ఆశ్వాసన మీయవలయును, కాని, శత్రువును విడిచిపెట్టుటకు నాశ్వాసనమీయఁగూడదు, శత్రువును వాని యపరాధమును దెలిసికోకుండ వానిపై నాయుధమును బ్రయోగింపఁకూడదు శత్రువును జంపి, యందుకై శోకింపఁగూడదు, నిర్నిమిత్తముగాఁ గోపింపఁ డదు. అపరాధిమీఁదను నవకారిమీఁదను దయయుంపఁగూడదు." ఈ నియ మములన్నియు మహత్త్వపూర్ణములై యున్నవి. ఈ విధముగా వ్యవహ రించునట్టి రాజు సత్యముగాఁ బ్రజలకు సుఖదాయకుడై యగును. ఇవి గాకుండ మఱికొన్ని నియమములున్నవి: ఏ విధముగా రాజు ప్రాతఃకాల మున రాత్రియందుఁ జేయఁబడియున్న మంత్రములను బరిశీలింపవలయును మఱియుఁ బ్రజలకు శుభదాయకమైన యుపాయములనాలోచింపవలయును అతఁడు స్వయముగా నొంటరియై యే యాలోచనను జేయఁగూడదు. ఏదైనను వానితోడనైనను నాలోచింపవలయును కాని మూఁడవ వానితోఁగూడదు. యోగ్యముగాఁ బరిశీలించిన పిమ్మట నిశ్చయమైనదని ననుసరించి శ్రేష్ఠము గనే కార్యమాచరింపవలయును. అతఁడు మూర్ఖులను తనదగ్గఱ నుంచుకొనఁ గూడదు కాని వేయి మూర్ఖులకు మాఱొక చతురుఁడైన మనుష్యునుంచు కొనవలయును. విద్వాంసులకెల్లపుడును బహుమతులిచ్చి సంతోషపఱువవల వలయును. అతఁడు తన బంధువులకును గౌరవార్హులకును సహాయము చేయవలయును. సమయమువచ్చినపుడు వ్యాపారులకును శిల్పకారులకును సహాయము చేయవలయును దరిద్రావస్థయందున్న నౌకరులకు సరియైన సమయమున సహాయము చేయవలయును. తమ కర్తవ్యమును జక్కఁగా నెరవేర్చు నధికారములను అపరాధము లేకుండఁ దొలఁగింపఁకూడదు. ముఖ్య

ముగా రాజు ఈశ్వరుడని భయమును మన్నించి సత్యమునెన్నఁడును విడువ గూడదు. రాజసత్తకకును సత్త్వమే యాధారస్తంభమై యున్నది. రాజు ముఖ్యముగా సత్యముమీఁదఁ బూర్ణ ధ్యానముంపవలయును, ఎందుచేతః చెప్పియున్నాఁడు-"యథారాజా తథా ప్రజా" రాజు సత్యమును విడుచు నేని ప్రజకూడ వెంటనే సత్యమును విడుతురు. రాజు ఎల్లప్పుడును ఉద్యోగమును బరిశ్రమను నవలంబింపవలయును. ఏ రాజు సోమరియు అత్తప్పరుఁడునై యుండునో అతనికెప్పుడుకు నాశము కలుగుచున్నది. మహాభారతమందు—

రాజానం చా విరోదారం బ్రాహ్మణం చా ప్రవాసినమ్।
పృథివీ శప్యతే రాజన్ సర్పో బిల శయానివ॥

ఇది ప్రసిద్ధ శ్లోకమై యున్నది. ఇందు వర్ణింపఁబడిన తత్త్వముమిక్కిలి మహత్త్వము కలిగియున్నది. మఱియు నయ్యది యన్ని దేశములకు నన్ని కాలములయందును నుపయోగించునదియై యున్నది. రాజెల్లపుడును యుద్ధము చేయవలయును. మరియు బ్రాహ్మణుఁడెల్లపుడును ప్రవాసము జేయవలయును. అపుడును పూర్వపు శూరత్వమును రెండవ వానివిద్వత్తయు జాగ్రత్తగా నుండఁగలవు. రాజు సదామృదు భాషియు హసన్ముఖుఁడుగను నుండవలయును, కాని నడుమనడుమనతఁడు తన రోషమును తీవ్రతనుగూడఁ బ్రకటింపవలయును. అతఁడు తనయొద్ద విద్వాంసులైన వారిని జేర్చుకొనవలయును అతఁడెక్కువగా నెన్నఁడును నవ్వఁగూడదు. నౌకరులతో నెన్నఁడును బరిహాసమాడఁగూడదు; రాజు సేవకులతోడ బరిహాసమాడునలవాటు పడినయెడల, సేవకులతని ననుమానింపఁ దొడఁగుదురు అతని యాజ్ఞను మన్నింపరు. అతఁడు ప్రజలను సదా సంతుష్టులఁజేయువలయును. వారి కళ్యాణమునకై బ్రయత్నించుచుండవలయును. ఇచట గర్భిణి యొక్క యుపమ మిక్కిలి మార్మికమై యున్నది. గర్భిణియైన స్త్రీ తన సుఖకల్పనను త్యజించి తన గర్భములోని శిశువుయొక్క కళ్యాణమునకై యెల్లపుడు నెట్లు చింతించుచుండెనో యటే రాజు తన ప్రజలయొక్క సుకచింతను చేయవలయును. రాజు ఏ మరి యొక్కని ధనము కుఱకును లోభమును జేయుఁ

గూడదు. ఎవరికైన నేదేని కొంచెము నీయవలయునెడల నతఁడు పూర్తిగా సమయమునందు నీయవలయును. ఎవఁడు పీడితుఁడు లేక దుఃఖితుండగునో అతని పాలన పోషణములను రాజు చేయవలయును. అతఁడు ఏ శూరునిని నవమానింపఁగూడదు. వృద్ధులు ననుభవశాలులునైన వారితో మైత్రితో నుండ వలయును ఏ ప్రసంగమందును ధైర్యమును విడిచిపెట్టఁగూడదు. మంచి భూషణములను వస్త్రములను ధరించి యతఁడు ప్రసన్నముఖుఁడై యెల్లపుడును ప్రజలకు దర్శనమీయవలయును. ఎవనికిని నిషేధము కూడదు. ప్రజల యొక్క పిర్యాదులపై ధ్యానముంచి యుపదేశము మిక్కిలి మార్మికమై యీయవలె. మహాభారత కాలమందు రాజుల వ్యవహారమిట్లే యుండెను ముఖ్యముగాఁబూర్వకాలమందు రాజు ఏమైనను సరియే అతని సత్య, నిష్ఠ, న్యాయము, ఉదారత్వము వీని విశేషమునెన్నఁడును ఎవనికిని సందేహముండెడిదికాదు. ప్రజలపై నతని ప్రేమము తన సంతానముతో పాటుగనే యుండెడిది. ఫలతః ప్రాచీన కాలమందు రాజుపై ప్రజల భక్తియు నెక్కువగా నుండుచుండెను. మరియు, తమ రాజునుద్దేశించి, హిందుస్థానములలోని ప్రజల భక్తి యీ కాలమందుఁగూడ ప్రసిద్ధమై యున్నది.

మహాభారతముయొక్క వనపర్వమందు ధౌమ్య ముఖమున రాజ దర్బారులో సేవకుల వ్యవహార మెట్లుండవలయునో యావిషయమై మిక్కిలి మార్మికమైన వివేచనము చేయింపఁబడి యున్నది. ఎపుడు పాండవులజ్ఞాత వాసమునకై సేవకులై విరటుని నగరమునకుఁ బోఁదొడగిరో అపుడు ధౌమ్యు డుపదేశము నిచ్చియుండెను—“ద్వారపాలుని సమ్మతిని బుచ్చుకొనకుండ రాజునొద్దకుఁబోఁగూడదు. ఏవనిమీఁదను విశ్వాసముంచఁగూడదు. ఎక్కడ నుండి యెవఁడు లేవదీయుడో యిట్టిచోటఁ గూర్చుండకు ఎక్కడఁగూర్చున్న సేవకునికి గొంచెమైన సందేహము కలుగునో అట్టిచోటఁగూర్చుండరాదు; ఎవనితో భాషించినను ఏవనికినిగొంచమైనను సందేహముకలుగునోనట్టివానితో మాట

అడుగకుండ రాజుతో గొంచెమైనను నేదియును జెప్పఁగూడదు, రాజస్త్రీల తోడను లేక రాజద్వేషులతోడను సంబంధము నుంచుకొనఁగూడదు. ఉచ్చ స్థానమందుఁ గూర్చుండవలసినపుడు రాజాజ్ఞచేతఁ గూర్చుండవలయును. అగ్ని తుల్యముగా రాజును సేవింపవలయును, అతనికి మిక్కిలి సమీప మందుఁ గాని మిక్కిలి దూరమందుగాని యుండఁగూడదు. రాజు యొక్క యాజ్ఞానుసారముగా నడచుకొనవలయును. రాజాజ్ఞ వైపు నిర్లక్ష్యము చేయఁ గూడదు. అతనితోఁ బ్రియవ్యాపారములునైన భాషణములఁ జేయవలయును రాజు నీవిషయమై సుప్రసన్నుడుగా నున్నాఁడని యెన్నఁడును నూహింపఁ గూడదు, రాజునకుఁ గుడి ప్రక్కను లేక యెడమప్రక్కను గూర్చుండవల యును. రాజునకు వెనుక రక్షకులు కూర్చుండుటకై స్థానముండును. ఎదుట యాసనము సదా విడువఁబడవలయును. రాజుల సమక్షమునఁ దన తెలివిగల వలని గర్వమునెన్నడును జేయఁగూడదు, నేను తెలివిగలవాఁడను లేక శూరు డననియు గర్వింపఁగూడదు. గర్వితుఁడైన పురుషునికి రాజునొద్ద నవు మానము జరుగుచున్నది, రాజు నెదుర నెవనితోడను నెమ్మదినెమ్మదిగాసంభా షించుచుండుటకును కాలు సౌతు లాడించుచుండుటకును లేక ఇటునటు నుమ్మి వేయుటకును నిషేధమున్నది.మిక్కిలి యెక్కువగా మాటాడగూడదు.రాజునకప రాధము చేయఁగూడదు. రాజునకు ముందు వెనుకను గూడ నతని స్తుతినే చేయవలయును. ఆతని దోషమెన్నఁడును వెదకగూడదు. అతని మిథ్యా ప్రశంసయుఁజేయఁ గూడదు: రాజుయొక్క హితమునకై నదా ధ్యానించు చుండవలయును. రాజు పిలుచు నెడల సేవకుడు వెంటనే యతని యెదుట హాజరుకావలయును. ఏ పనియున్నదో దానిని జేసిచూపవలయును. రాజ కార్యము వచ్చినపుడు స్త్రీ, పుత్రుఁడు, గృహము మొదలైన వానిని స్మరింపఁ గూడదు. రాజు వేషమువలెఁదన వేషము నుంచుకొనఁగూడదు. ఏదో యధి కార పదవి యుండుండుచు రాజు ధనమును ముట్ట గూడదు మరియెవ్వని నుండియు లంచము పుచ్చుకొనఁగూడదు వాహనము, వస్త్రము, ఆభూషణము

మొదటగానే కొంచెము రాజువలన లభించెనో, దానిని ఆనందముతో స్వీకరింప వలయును. దానిని ధరింపవలయును." రాజదర్బారులోని సేవకులకై ధౌమ్యుఁడు చెప్పిన పైనియమములు సర్వకాలమందును నధికారులందఱకును పాలింపఁదగియున్నవని ప్రతివాఁడును నమ్మవలయును. నొప్పుకొన వలయును.

అగుఁగాక; మఱియు ఒకటి రెండు మాటలు రాజువిషయమై చెప్పదగి యుండినవి. మొదటిది,

రాజాగుణ శతాకీర్ణ ఏష్టవ్య స్తాదృశో భవేత్ । (శాంతి. 118-22)

ఇత్యాది శ్లోకములందురాజుయొక్క దేశజమైన యోకగుణము చెప్పబడి యుండినది. రెండవది. ఒక వేయి శూరులచే ఎన్నఁబడిన గుఱ్ఱపు రౌతులు నున్న యెడల పృథ్వీరాజ్యము జయింపఁబడఁగలదని భీష్ముఁడు చెప్పి యుండినాడు.

శక్యా చాశ్వ సహస్రేణ వీరారోహేణ భారత ।
సంగృహీత మనుష్యేణ కృత్స్నా జేతుం వసుంధరా ॥(శాం 118-28)

మూఁడవది ద్రవ్యసంచయ విషయమున రాజు ఒక గ్రుడ్డిగవ్వనైన విడువఁజాలనంత సావధానుఁడై యుండవలయును, "నార్థమల్పం పరిభవేత్" (శాంతి. 120-3) నాల్గవది, రాజు రాష్ట్రమును రక్షింపవలయును రాష్ట్రము రాజును రక్షింపవలయును.

రాజా రాష్ట్రం యథాపత్సు ద్రవ్యౌఘైరపిరక్షతి ।
రాష్ట్రేణ రాజా వ్యసనే రక్షిత వ్యస్తథా భవేత్ ॥ (శాంతి. 130-31)

ధిక్తస్య సేవితం రాష్ట్రం రాజ్ఞోయస్యావసీదతి ।
అవృత్త్యాన్య మనుష్యోపి యో వై దేశిక ఇత్యపి ॥ (శాంతి. అ180-34)

## అధికారి

మంత్రి, అమాత్యుఁడు మొదలైన పదవులందు ఏ యధికారులు రాజుచేత నియమింపఁబడుదురో వారు తెలివిగలవారు, నమ్మకమైనవారు; సదాచారసంపన్నులు, వంశపరంపరాగతులును గావలయుననిచెప్పఁబడియున్నది. వారికెల్లపుడు తగిన సత్కారము చేయవలయును. వారికిఁ దగిన జీతమీయవలయును. రాజునకొక పురోహితుఁడు కూడ నుండవలయును. ఈసంగతి విశేషించి చెప్పఁబడియున్నది. అప్పటి లోకుల ధర్మశ్రద్ధను, యజ్ఞయాగాదులచే నిశ్చయపూర్వకముగాఁ గాఁబోవు సాంసారిక లాభముల విషయమైన పరిశీలము జేసినచో, ధార్మికకృత్యములయందు వారికెంత శ్రద్ధ యుండెనో, సరిగా ధ్యానమునకు రాఁగలదు. కనుకనే రాజునకు అత్యంతము పురోహితుని యావశ్యకత యున్నదని చెప్పబడుచుండెను. అతని విషయమై, అతఁడుఆచారవంతుఁడు, కులీనుఁడు, బ్రాహ్మణుడు కావలయునని చెప్పఁబడియున్నది; మరియు రాజు తన పురోహితునికి నుచితమైన సత్కారములను జేయవలయును. పురోహితుఁడు తఱచు వంశపరంపరాగతుఁడు కాఁగూడదు. పాండవులు ధౌమ్యఋషిని తమకు గ్రొత్త పురోహితునేర్పఱుచుకొనియుండిరి. మరియు ఆతనివలన వారికి అధికోత్కర్షముకూడఁ గలిగినట్లు వర్ణనమున్నది, హోమశాలకుఁ బ్రత్యేక యాజకుఁడుండెను. జ్యోతిషమందెక్కువ నమ్మకమున్నయెడల రాజదర్బారునందు జ్యోతిర్వేత్తలు నియతముగాఁ జేయఁబడవలయునని యాజ్ఞ కలదు. సాముద్రికమునెఱింగినవాఁడు ధూమకేతు భూకంప నేత్రస్ఫురణాద్యుత్పాతముల నెఱింగినవాఁడును, భవిష్యదనర్థములను నవమానించువాఁడును గావలయును. ఇదిగాకుండ రాజునొద్దనొక న్యాయాధిపతి కూడ నవశ్యము ఉండుచుండెను. దీని వర్ణనము ముందు చేయఁబడును. ఇట్లే సేనాపతుల యొక్క ఇతరాధికారులయొక్కయును వర్ణనము ముందు చేయఁబడును. కోశాధ్యక్షుఁడు, దుర్గాధ్యక్షుఁడు మొదలైన భినభిన్న భాగముల (శాఖల) యధ్యక్షులను ఇపుడు వ్యాప్తిలోనున్న భాష

ననుసరించి సూపరెండెంటులని చెప్పఁగలుగుదుము. వీరి దర్జా సచివుని కంటె లేక మంత్రికంటెఁ గొంచెము తక్కువగా నుండెను; అయినను వారు పెద్ద యధికారులై యుండిరి. మరియు వంశపరంపరగా విశ్వాసవంతులై యూహింపఁబడి నియతము చేయబడుచుండిరి.

ఈ యధికారులు గాకుండ నొక మహత్త్వము గల విభాగము గుప్త దూతలది లేక గూఢచారులది యైయుండెను. గూఢచారులు లేక (డిటెక్టివ్) యన్ని దేశములయందును నన్ని కాలములయందును నుండనే యున్నారు. కాని మహాభారతకాలమందు గూఢచారుల మహత్త్వ మెక్కువగా నుండినట్లు తెలియుచున్నది. మోసము చేసి పర రాజ్యములను గెలుచునట్టి మహత్త్వము ఆ సమయమున నెక్కువగా నుండెననియు, భిన్నభిన్న రాజులకు మోసము వలన భయముకూడ నెల్లపుడు నుండియుండుననియుఁ దెలియుచున్నది. కను కనే ఆ సమయమందు నధికారుల నీతి మిక్కిలి సందేహయుక్తమై యుండి యుండునని యనుమానము చేయఁబడఁగలదు. స్వదేశము స్వరాజ్యమునెడి ప్రీతి తఱచుగాఁ దక్కువగా నుండియుండును; ఎందుచేత ? రాజులు తఱచు క్షత్రియులు స్వధర్ములు నగుచుండిరి, కాఁబట్టి వారు మారినపుడు ప్రజల కెక్కుడుహానిగాక యుండెను, రాజులు మారినందువలన నపరాధులైన యధికారుల కెల్లపుడుసు లాభము కలుగుచుండెను. ఈ స్థితి భారతకాలమందుఁగాక యుండును, కాని మహాభారతకాలమందుఁ దప్పకయై యుండును. దీనికిఁ బిమ్మట కాలమందును దుర్దైవము వలన హిందూస్థానమున కీదశయే యుగపడు చున్నది. దండనీతియందు రాజు ఏవిధముగా నెంతమంది వేగులవారి నుంచు కొనవలయునో దేనిదేనికై యుంచుకొనవలయునో విస్తరించి నియమములు చెప్పఁబడియున్నవి, అనేకానేక రాజ్యములలో పైని చెప్పఁబడిన యధికారుల మీఁద ప్రతియొకని వెనుకను ముగ్గురుముగ్గురు వేగులవారినుంచవలయును. తనదేశములోని యేముగ్గురధికారులు విడిచిపెట్టఁబడియున్నారో వారు మంత్రి యువరాజు, పురోహితుఁడు నై యున్నారు. వీరి పరీక్ష చారుల ద్వారమున

చేయఁబడకుండెడిది. దీనికిఁ గారణ మూహకురాకున్నది. వీరి పరీక్షను తఱచుగా రాజు స్వయముగాఁ జేయవలయునని యాశయమై యుండును. కనుకనే యీముగ్గురధికారులు విశ్వాసముగలవారుగను ఎన్నఁడు మోసముచేయని వారుగను నెంచఁబడుచుండి యుందురు, గూఢచారులు ఒండొరులను గుర్తించెడువారు కాకుండ నుండవలయును. వారి వేషము పాషండులవలె నుండవలయును, వారు సర్వ స్థితిగతులను ప్రభువునకు అనఁగా రాజునకు సత్యముగా జెప్పవలయునని వర్ణన మున్నది. గూఢచారుల యేర్పా టున్నప్పటికిని రాజు స్వయముగాఁ దాను ప్రతి పనియందు సమర్థతతో దృష్టి యుండవలయునని యును జెప్పఁబడియున్నది.

రాజుయొక్క ప్రతీహారియు శిరోరక్షకుఁడును (ఇప్పటి శబ్దములలో ఎడిక్యాంప్ మరియు బాడీగార్డు) ఇరువు రధికారులును మిక్కిలి నమ్మకమైన వారును కులపరంపరా గతులును నై యుండుచుండిరి. వారు విద్వాంసులు స్వామిభక్తులు, మితభాషులు, సత్యవాదులు, చతురులు (చురుకైనవారు) దక్షులునై యుండవలయును. ఈ యిద్ద రధికారుల కొఱకును ఈ గుణముల యావశ్యకత యెంతయున్నదో యిది విస్తరించి చెప్పుట యావశ్యకముకాదు. వీరి కార్యము మిక్కిలి మహత్త్వము గలదియు గొప్ప యనిష్టము సంభవించునదియునై యున్నది. బాడీగార్డు శరీర రక్షకులను విడిచి యితరులైన శస్త్ర సంరక్షకులుగూడ రాజ రక్షణమునకై యతని చుట్టును నుండుచుండిరి. సభా పర్వములోని కచ్చిదధ్యాయమందు నీ ప్రశ్న మున్నది :—

> కచ్చిత్ రక్తాంబర ధరాః ఖడ్గ హస్తాః స్వలంకృతాః ।
> ఉపాసతే త్వా మభితో రక్షణార్థ మరిందమ ॥

ఈ శ్లోకముఁబట్టి సంరక్షకుల వస్త్రములు భిన్నములై అనఁగా నెఱుపు రంగునై యుండెను. మరియు వారి శరీరముపై సుందరమైన ఆ భూషణములు మఱియు చేతిలో నొఱదీసిన ఖడ్గములు నుండుచుండె నని తెలియుచు

న్నది. వీనింబట్టి వీరు రాజుయొక్క శరీర రక్షకులని వెంటనే తెలియుచుం డెను. ఈసంరక్షకులు రాజునకు సమీపముగాఁ గొంచె మెడమున నిలవఁబడు చుండిరి. ఈ సంరక్షకుల వర్ణనముఁబట్టి కాళిదాసాది కవులు, యవనస్త్రీలు శస్త్ర వంలను ధరించి యెల్లపుడును రాజునకు సమీపమున నుండెడి వారని వ్రాసి యున్న పద్ధతి ఆ సమయము వఱకు అనఁగా మహాభారతమునాఁటి రాజ సభ లందు ప్రచలితము కాకుండెనని తెలియుచున్నది. మెగస్థనీసు, చంద్రగుప్తుని కాలమందుఁగూడ రాజుల సమీపమున సుందరీమణులును, బలవతులు నయిన స్త్రీలు ప్రహరీ తిరుగు సరిపాటి యుండెనని వ్రాసియున్నాఁడు: మనుస్మృతి యందుఁగూడ– "స్త్రీభిః పరివృతో రాజా" అని వర్ణనమున్నది కనుకనే మను స్మృతి కాలమందును నీ రీతి యుండెను. కాళిదాసు స్త్రీలను యవన లని చెప్పియున్నాఁడు. దీనిఁబట్టి యీ స్త్రీలు యవన జాతివారై యుండి రనియు ఈ పద్ధతిపర్షి యనులయొక్క గ్రీకులయొక్కఁ జక్రవర్తులదర్బారులలో నిరివాఖు మీఁదుగాఁ జంద్రగుప్తునినాఁడు హిందూస్థానమునకుఁ దీసికొనఁబడి యుండునని యును ప్రకటమగుచున్నది. అనఁగా మహాభారతములో నేకొంచెము చెప్పి యున్నాఁడో యిది దీనికంటె మునుపటి రాజుల పరిస్థితి యొక్క వర్ణనమై యున్నది. ఇచట, మనము మహాభారతకాలమును జంద్రగుప్తుని తరువాతది యౌని నిశ్చయించియున్నాము. కాఁబట్టి చంద్రగుప్తునినాఁటి వర్ణనము మహా భారతములోని కావశ్యము వచ్చి యుండవలయు నని శంక కలుగఁ గలదు. కాని దీని కుత్తరము, మహాభారతము అశోకునికి దాదాపుగఁ జంద్రగుప్తునికిఁ బిమ్మట శీఘ్రముగనే యుండెనని మనము నిశ్చయించి నప్పటికిని, ఆ మహాభారతము కూడ అశోకునియొక్క బౌద్ధాదినూతన ప్రవృత్తిని విరోధించుటకై వ్రాయఁబడియున్నదనియు నభిప్రాయమునిచ్చుటకై యున్నది. ఇందు చేత మహాభారతకారుఁడు మగధములకుఁ గ్రొత్త రాజధానియైన పాటలీ పుత్రమునెచ్చటను నుల్లేఖింపలేదు. అచట ఏ నూతన బౌద్ధ ధర్మము ప్రచ లితమై యుండునో, దానిఁగూడ నతఁడుల్లేఖింపలేదు; అచట ఏ క్రొత్త సామ్రాజ్యము స్థాపితమై యుండునో, దానిఁగూడ నతఁడు ల్లేఖింపలేదు;

మరియు అనంత సామ్రాజ్యముయొక్క క్రొత్త దర్బారు పద్ధతియైన, సమ్రాట్టునకు సమీపమున సశస్త్రలైన స్త్రీలు ప్రహరి తిరుగుటయు నతఁడు వర్ణింపలేదు. భారతీయ కాలము మొదలుకొని చిన్నచిన్న రాజ్యములయందు ఏ భిన్న భిన్న సంస్థలు వ్యాప్తిలో నుండెనో, వానినతఁడు వర్ణించియున్నాఁడు మహాభారతకాలమందుఁగూడ నిటువంటి రాజ్యము చాలనుండెనని విశ్వసింపఁగలము.

## అంతఃపురము

ఇపుడు మనము రాజుల యంతఃపురములను వర్ణింతుము. రాజుయొక్క భవనము కోటలోపల నుండుచుండెను. అందనేకములైన యంగణములు లేక కక్ష్యలు యుండుచుండెను, వెలువలి గడపలోనికి నందఱును వచ్చుటకు నాజ్ఞ యుండెను, మరియు రెండవ కక్ష్యలోనికిఁ గేవలము అధికారులును సభలోని వారును రాఁగలిగియుండిరి. మూఁడవ కక్ష్యలో యజ్ఞశాలయు, రాజుయొక్క స్థానము మరియు భోజనగృహము మొదలైనవాని యేర్పాటుండుచుండెను. * నాల్గవ కక్ష్యయందు నంతఃపురముండెను. ఇచ్చటి స్థానము విస్తీర్ణమైయుండెడిది. మరియుఁ బెద్దపెద్ద తోటలుండుచుండెను. రాజుయొక్క యంతఃపురమందు స్త్రీలుండెడివారు. రాజునికొకతె లేక యనేకము పట్టపురాణులుండెడివారు. కాని వీరుగాకుండ, మనము మునుపు చేసినట్లుగా అతనికింకను ననేక స్త్రీ లుండెడివారు. ఈ స్త్రీలు కేవలము బలాత్కారముచేతఁ దీసికొనిరాఁబడువారు కాకుండిరని జ్ఞప్తి యుంచుకొనవలయును, ఈ యనేక స్త్రీలు ఏ విధముగాఁ భ్రోగుచేయఁబడుచుండిరో ఇది మునుపు చెప్పఁబడి యున్నది. దీనిఁ బట్టి ప్రతి వత్సరమునను వివాహ సమయమున రాజునకు మిక్కిలి సుందరులైన కన్యలు నర్పించెడి పరిపాటి ప్రాచీనకాలమందు నిజముగా నుండి

* నాల్గవ కక్షయందు తేత్వతీ ముజనాకీర్ణాః కక్షాస్త్రిస్రోనరర్షభాః॥ అహంకారేణ రాజానముప తస్థుర్గత వ్యథాః॥ జరాసంధవధ స. అ. 22- 0

యుండునని తెలియుచున్నది దీనిఁబట్టి రాజుయొక్క యంతఃపురమందునసేక స్త్రీలు ఒకచోఁ జేర్పఁబడుచుండెడివారు. అనియంత్రితమైన రాజసత్త యొక్క నపరిమిత వైభవముయొక్క యుఁగారణముంచేత రాజులకు ననేక స్త్రీలపై నిచ్ఛ యుండుట స్వాభావికమై యున్నది. మరియు ఈ పరిస్థితియందు బలాత్కారముగా స్త్రీలను బెట్టుకొని తీసికొనుపోయెడి సంభావన కలదు. ఇందుచేత దీనికిబదులుగా, పై ని జెప్పఁబడియున్న వ్యవస్థయే సమంజసమై యుండెను. ఏమైనను జెప్పఁబడుఁగాక, కాని మహాభారత కాలమందు రాజుల యంతఃపురమునందు ననేక స్త్రీలుండెడివారనుట నిర్వివాదమై యున్నది. ఈ విషయమై సభాపర్వమందు, నారదుఁడు రాజులకు నుచితమైన యుపదేశము నిచ్చియున్నాఁడు—“ఇట్టి స్త్రీలను రాజులు సంతుష్టలఁగా నుంచవలయును, వారిపై గఠినమైన పహరా యుంపవలయును మరియు వారిని నమ్మఁగూడదు. వారికి గుప్త విషయములను జెప్పఁగూడదు” ఈ నాలుగు సంగతులను మహత్త్వము గలవై యున్నవి. కాని ఈ సంగతులు యుధిష్ఠిరునికై చెప్పఁబడియుండునని నమ్మఁజాలము. నారదునియొక్క ప్రశ్నము యుధిష్ఠిరుని విషయమై యప్రయుక్తముగా నగపడుచున్నది.

> కచ్చిత్ ప్రియః సాంత్వయసి కచ్చిత్తాశ్చ సురక్షితాః।
> కచ్చిన్నశ్రద్ధ ధాస్యాసాం కచ్చిద్గుహ్యం న భాషసే॥

ఈ ప్రశ్నముయొక్క యుపయోగము యుధిష్ఠిరునికై యేమాత్రము నుగాఁ జాలదు, యుధిష్ఠిరునికి నొక్క స్త్రీయే యుండెను మరియు దానిపై పహరా యుంపవలసిన యావశ్యకత యేమియును లేకుండెను, ఆమెపై నత నికిఁ బూర్ణ విశ్వాసముండెను మరియు ఆమెకు నతఁడు రాజనైతిక రహస్యము లన్నింటిని జెప్పుచుండెడివాఁడు. అగుఁగాక నారదునియొక్క యీ యుపదేశము రాజులందరికిని మిక్కిలి యుపయోగకరమనుటలో సందేహము లేదు. సమస్త రాజలోకము విషయమును బూర్తిగా విచారించునెడల అంతఃపుర స్త్రీలవలన నప్పుడప్పుడు హాని తప్పక వచ్చుచుండుట ప్రకటమైయున్నది

యానానులు కూడ, అప్పుడప్పుడంతఃపుర స్త్రీలనుండి రాజునకుం బ్రాణఘాతము విషమునుండి లేక హంతకులచేతం జేయంబడుచుండెనని వ్రాసియుంచి యున్నాడు కనుకనే అంతఃపుర స్త్రీలపై కఠినమైన పహరా యుంపవలయు ననియు వారిపై నమ్మకముంపరాదనియు నారదుండు సూచింపవలసివచ్చెను పై నీయంబడినయుధిష్ఠిరునియొక్కయు నితరరాజులయొక్కయు భిన్నమైన గృహవర్ణనముంబట్టి భారత కాలారంభమునుండి రాజుల గృహస్వాస్థ్య మెంత బాగుగానుండెనో మరియు మహాభారత కాలమున నెంత చెడిపోయియుండెనో యీ సంగతి యూహకు రాంగలదు.

మహాభారతములోని కచ్చిదధ్యాయమందు లేక శాంతి పర్వములోని రాజధర్మభాగమందు లేక మరియెచ్చటను అంతఃపురమందు పహరాయిచ్చు టకై షండులను లేక కొజ్జావారిని నియమించు పద్ధతి వర్ణింపంబడి యున్న దను సంగతిని గూర్చి స్మరణము మనకు లేదు, భయంకరమగు రీతిని పురుషుల పురుషత్వము నాశముచేసి యంతఃపుర స్త్రీలకై వారిని రాక్షసులుగాం జేసెడి చెడుపద్ధతి భారతీయ కాలమందు హిందుస్థానములోని యార్యులలో బ్రచలితమై కాకుండెను. కాని కథాసరిత్సాగరమందు చంద్రగుప్తుని లేక నందునిసమయమున హిందుస్థానమందలి పాటలీపుత్రములో వర్షవరులుండిరని వ్రాసియున్నాండు. అపుడు ఈ పద్ధతి అన్యచక్రవర్తుల యాచారముతోపాటు. పర్షియా వారినుండి చంద్రగుప్తుని కాలమునం గైకొనంబడియుండునని మనకనుమానము కలుగుచున్నది. మరియు, ఈ లోకులుకూడ అక్కడి నుండియే తీసికొని రాంబడియుందురు. ఎప్పటివఱకు హిందుస్థానమునందు యవనులు, శకులు, మొదలైన పశ్చిమ దేశపు మ్లేచ్ఛుల రాజ్య మేర్పడియెనో అప్పటివఱకు నీ పద్ధతి హిందుస్థానమందుం బ్రచలితమై యుండియుండును. కాని వారి సత్త నష్టమైపోయెను. బాణుండు చేసిన శ్రీహర్షాంతఃపుర వర్ణనమందు వర్షవీరుల

ర్ణనము స్మరణమునకురాకున్నది. దుర్దైవము వలనముసల్మానులరాజ్యములును హిందుస్థానములో స్థాపితమైనపుడు ఈ యాచారము మరల ముసల్మానుల రాజ్యములో దూఱెను. కాని హిందుస్థానపు రాజులయందు నయ్యది బొత్తిగాఁ బ్రవేశింపలేదు. హర్షుని యిటీవలి యితిహాసమందు, క్షత్రియులు లేక యితర హిందూ రాజుల యంతఃపురములో కొజ్జా వారుండుచుండిరన్న ప్రమాణము కనఁబడదు.

## రాజుల దినచర్య

ద్రోణపర్వములోని 82 వ యధ్యాయమందు ఏకాంత యుధిష్ఠిరుని దిన చర్యా వర్ణనము చేయఁబడి యున్నదో యది మనోరంజకమై యున్నది. మరియు నిచ్చట నీయఁదగియున్నది. 'దినము నడచిన సమయమందు ఉదయమందు గానము చేసెడి మగధులు, అరచేతులతో తాళములు వేయుచు, గీతములను బాడఁదొడగిరి, గాయకులును సూతులును యుధిష్ఠిరుని స్తుతింప నారంభించిరి. నర్తకులాడఁ దొడఁగిరి, మరియు సుస్వరమైన కంఠము గల గాయకులు కురువంశముయొక్క స్తుతులతో నిండియున్న గీతములను బాడఁదొడఁగిరి. ఎవరు వాద్యములను వాయించు పనిలో శిక్షపొంది నిపుణులై యుండిరో, వారు మద్దెలలు. తాళములను, పణవములు, ఆనకములు, శాంతికములు, ప్రచండ ధ్వనిగల దుందుభులు మొదలైన వాద్యములను వాయింపఁ దొడగిరి. అపుడు యుధిష్ఠిరునికి నిద్రనుండి మెలకువవచ్చెను. ముఖ్య కార్యములకై యతఁడు స్నానగృహములో బ్రవేశించెను. అచ్చట స్నానము చేసియున్న, శుభ్రవస్త్రములను ధరించియున్న 108 తరుణులైన సేవకులు ఉదకముతో నిండిన సువర్ణకలశములను గైకొని నిలబడియుండిరి పిదప యుధిష్ఠిరుఁడు చిన్న గుడ్డను కట్టుకొని కుర్చీపై గూర్చుండెను. మొదట బలవంతులును సుశిక్షితులైన సేవకులు అనేక వనస్పతులనుండి

తయారు చేయఁబడియున్న నలుగు అతని దేహమందు రుద్ది రుద్ది పట్టించిరి. అనంతరము సుగంధ యుక్తమైన యుదకము చేత నతనిని స్నానము చేయించిరి. తల వెండ్రుకల నారఁబెట్టుటకై యుధిష్ఠిరుఁడు రాజహంసముతోఁ దుల్యమైన తెల్లని వస్త్రమును శిరముపైఁ జుట్టబెట్టెను. పిదప శరీరమందుఁ జందనము పూసికొని, ధోవతి కట్టుకొని, చేతులు జోడించి తూర్పువైపు తిరిగి యతఁడు కొంత సేపటి వఱకుఁ గూర్చుండి యుండెను. గడ్డము చేసికొన్న పిమ్మట నతఁడు ప్రదీప్తమై యున్న యగ్ని గృహమునకు వెళ్లెను. అచట సమిధలను ఆజ్యాహుతిని అతఁడు సమంత్రకముగా హవనము చేసెను. బయటికి వచ్చి యతఁడు వేదవేత్త లయిన బ్రాహ్మణులను దర్శించెను. మఱియు బంధువర్గముచేత నతనిని బూజించెను. వారికొక్కొక నిష్కమును దక్షిణగానిచ్చెను; మఱియు కొమ్ముల యందు బంగారము, డెక్కలయందు వెండియుఁ దగిలించియున్న లేగలతోఁ గూడిన పాడియావుల నిచ్చెను. పిదపఁ బవిత్రమైన పదార్థములను స్పృశించి యుధిష్ఠిరుఁడు వెలుపలి సభకు వచ్చెను. అచట సర్వతోభద్రక మని పేరు గల సువర్ణాసనముండెను. దానిపై నుత్తమమైన యాస్తరణము పరవఁబడి యుం డెను. మఱియు దాని పై భాగము పై కప్పుచేత శోభాయుక్తమైయుండెను. అచటఁగూర్చుండి సేవకులచేతనీయఁబడుచున్న ముత్యములయొక్కరత్నములయొక్క భూషణములను అతఁడు ధరించెను. అపుడు కాలిపై బంగారపు పిడి గలిగి చంద్రకిరణముల వలె స్వచ్ఛమైయున్న వింజామరలాడ దొడఁగెను. వందిజను లతనికి నమస్కరించి యతని గుణావళిని బాడఁదొడఁగిరి. ఇంతలో రథముయొక్క ప్రచండమైన ధ్వని వినఁబడఁజొచ్చెను; కవచకుండలములను ధరించి చేతిలో గత్తిని బట్టుకొనియున్న యువకుఁడైన యొక ద్వారపాల కుఁడు లోపలికి వచ్చెను. ఆతఁడు నేలపై మోకరిలఁబడి యాపంపనీయుఁడైన ధర్మరాజునకు శిరసా ప్రణమిల్లెను. మఱియు శ్రీకృష్ణులు దర్శనమునకై వచ్చుచున్నారని చెప్పెను."— పై వర్ణనముఁబట్టి మహాభారతకాలమునందలి సమృద్ధులును ధార్మికులునైన రాజుల ప్రాతఃకాల దినచర్యా భాగము మఱి

యును రాజసభ యొక్క నమూనాయు (ఆడంబరము) పాఠకుల దృష్టియెదుటికి వచ్చుచున్నది.

## దేశములోని పనిపాటలు

మహాభారతకాలమందు భారతీయరాజ్యములు చిన్నవిగానుండెను, కాని వానిలోని దేశీయావస్థ చక్కగా నుండెడిది. క్రింద నీయఁబడిన వర్ణముఁ బట్టి యీ సంగతి పరిచితము కాఁగలదు. మహాభారత కాలమందు ఏ విభాగముకూడ వర్ణింపఁబడినట్లు కనఁబడదు. కారణ మేమనఁగా ఇప్పటి దొకటి లేక రెండు జిల్లాలకు సమానముగా మహాభారత కాలపు రాజ్యము లుండెడివి. ఉదాహరణార్థము, మహాభారతములోని భీష్మపర్వము నందలి భూవర్ణ నాధ్యాయమందు దక్షిణమున నేఁబది ప్రాంతములు లేక దేశములు చెప్పఁబడి యున్నవి. ఇప్పటి హిందుస్థానమందు, కృష్ణకు దక్షిణపుపైపున, బ్రిటిష్‌రాజ్యములోనినిన్ని జిల్లాలు కూడ లేకున్నవి. తాత్పర్య మేమనఁగా, మహాభారతమునాఁటి దేశముల లేక ప్రాంతములమర్యాద దాదాపు నేఁటిజిల్లాలకుసమానముగానుండుచుండెను. మహాభారతకాలమునకుఁ బిమ్మట రాజ్యములు పెద్దవైనపుడు దేశము, విషయము మొదలైన శబ్దములే విభాగవాచకములయ్యెను. మహాభారతమునాఁటి దేశములందు గ్రామము లవశ్యముగా నుండెను. గ్రామమే పనిపాటలకు నాద్యంత సంస్థయైయుండెను. దేశములోని పనిపాటలకై ప్రతి గ్రామమందును నొక నాయకుఁ డుండెడివాఁడు. అతనిని గ్రామాధిపతి యని చెప్పుచుండిరి. అతఁడు పెద్దవగు పది గ్రామములకు, ఇరువది గ్రామములకు, నూఱు గ్రామములకు, వేయి గ్రామములకు నాయకుఁడగుచుండెను. ఒక గ్రామముయొక్క యధిపతి తనగ్రామములోని మంచిచెడ్డలనన్నిటిని పదిగ్రామముల యధిపతికిఁ దెలియఁజేయుచుండెడివాఁడు; మరల నతఁడు తనకంటె శ్రేష్ఠుఁడైన యధిపతికిఁ జెప్పుచుండెడివాఁడు. గ్రామాధిపతియొక్క వేతనము, అతఁడు తన గ్రామము దగ్గఱనున్న యరణ్యపు రాబడిమీఁద దనను బోషించుకొని తన పైగానున్న దేశ

గ్రామాధిపతిని నతనిపైనే గూఢచారియైయున్న యధికారులకును నరణ్యపు రాబడిలోని భాగము నీయ వలసెడిదయియుండెను. శత గ్రామాధిపతికి నొక స్వతంత్ర గ్రామము తన పోషణమునకై యీయఁబడుచుండెను. ఒక వేయి గ్రామముల యధిపతికి నొక చిన్న నగరము ఈయఁబడుచుండెను. సంపూర్ణ రాష్ట్రములోని దేశముల పనిపాటులు ఒక స్వతంత్రాధికారికి సమర్పింపఁబడుచుండెను. ఈ దేశాధికారియైన మంత్రి రాజు దగ్గఱ నివసించుచుండును. అతఁడన్ని దేశముల నుంమను దిరిగి గ్రామాధిపతుల యొక్క రాష్ట్ర సంబంధ వ్యాపారమును గనిపెట్టుచుండెడివాఁడు. గూఢచారమార్గమునఁ గూడ వానిని బరీక్షించుచుండెడివాఁడు. (భీష్మ ప. అ. 8.) ఇదికాకుండ రాజ్యమండలి పెద్ద పెద్ద నగరము లన్నిటియందును స్వతంత్ర నగరాధిపతులుండెడివారు. నక్షత్రములపై రాహువు తన యధికారమును చెలాయించుచున్నట్లె యీ యధికారి నగరమందు మూర్తివంత మంతమైన భయముగనే యుండియుండును. పైని జెప్పఁబడిన పద్ధతి యొకానొకవేళ కాల్పనికముగనే దోఁచవచ్చును. కాని యట్లు మాత్రము కాకుండెను. ప్రతి గ్రామందును ప్రతి పెద్ద పట్టణ మందును అధిపతు లుండుటలోను, మఱియు దేశపరిస్థితి ననుసరించి పది, ఇరువది, మఱియు నూఱు గ్రామములకు లేక యంతకంటె నెక్కువ తక్కువ గ్రామములకు నధిపతులుగూడ నుండెడువా రనుటలో సందేహములేదు. సాధారణముగా నిప్పటి జిల్లాల ననుసరించి, అప్పటి రాష్ట్రమందు పదునైదు వందలు మొదలు కొని రెండు వేల వఱకు లేక కొంచె మెక్కువ తక్కువయైన గ్రామము లుండియుండును. అనఁగా నొకముఖ్యాధికారి యుండెడివాఁడు, అతనిక్రింద నిద్దఱు సహాయాధికారు లుండెడివారు. వారి క్రింద నిరువది మంది యధికారులుండెడివారు. వీరి ప్రవృత్తి యెల్లపుడును బ్రజలనుశిక్షించుపైపున నున్నదని మహాభారతమందుఁ జెప్పియున్నాఁడు. కనుకనే ప్రధానమంత్రి, పరధనాపహర్తలు మఱియు శఠులునైన యధికారులపై రాహు తుల్యముగాఁ తన ప్రతాపము నుంచవలయు ననియు, వారి నుండి ప్రజలను సంరక్షింపవలయు ననియుఁ జెప్పఁబడియున్నది.

## పన్ను

భూమియొక్కయు వ్యాపారముయొక్కయుఁ పన్ను కలిసి రాజ్యమునకు ముఖ్యమైన ఆయముగా నుండుచుండెను. మఱియు నీయాదాయము ధాన్య హిరణ్య స్వరూపముల నుండుచుండెను. భూమి పన్ను చాల ప్రాచీన కాలమునుండి అనఁగా మొదటి మనువుయొక్క కాలమునుండి యదివేయఁబడియున్నదో అది యొక దశాంశ (1/10) భాగమై యున్నది. కాని యీ నియమము తరువాత నిలువ దయ్యెను. మఱియు ఒక షష్ఠాంశమైపోయెను. సంపూర్ణ భారతకాలమందును, తరువాత స్మృతి కాలమందునుగూడ ఈ పన్నే నిశ్చలమై యగపడుచున్నది.

ఆదదీత బలించాపి ప్రజాభ్యః కురునందన ।
స షడ్భాగమపి ప్రాజ్ఞస్తాసా మేవాభిగుప్తయే ॥
(శాంతి ప. అ. 19)

బుద్ధిమంతుఁడై నరాజు ప్రజలనుండి వారిసంరక్షణమునకై 1/6 పన్ను బుచ్చుకొనవలయును. సభా పర్వమందు నారదుఁ డింతే భాగమును జెప్పియుండెను. మఱియు నింతకంటె నెక్కువ తీసికొనుట లేదుగదా ? యనియు నడిగియుండెను. పొలమునఁ బండిన ధాన్యములో 1/6 భాగమును లోకుల వద్దనుండి గైకొని గ్రామాధిపతి యొకచోటికిఁ జేర్చుచుండెను. ఇట్టి ధాన్యపు కొట్లు ప్రతి చోటను సంపూర్ణముగా నుండెడివి. భూమిపై లోకులకధికారముండెడి దనియు పంటలోని భాగము పన్నుగా నీయఁబడుచుండెడి దనియుఁ దెలియుచుండేను. పశుపాలకులు చాలమంది మేషపాలకులు గొల్లవాండ్రును గూడ రాజ్యములో నివసించుచుండిరి. వారు కూడఁ బశువులలో 1/10 భాగము రాజునకిచ్చుచుండెడివారు. ఈ విధముగా రాజుయొక్క పశుశాలలు స్వతంత్రరీతిని సంపన్నములై యుండెడివి. వాటి

జ్యము మీఁదఁ గేవలము 1/50 భాగమే పన్నుగా నుండెను. ప్రతివస్తువు యొక్క యమ్మకపు వెలలో నూటికి 2 వంతున సర్కారునకుఁ బన్ను నియ వలసియుండెను. లేక ఉత్పన్నమైన వస్తువు మీఁదనైన ఖర్చును దానినుండి నుండి తీసివైచి, వేర్వేఱు వస్తువుల మీఁద వేర్వేఱుగాఁ బన్ను తీసికొనఁబడు చుండెను.

విక్రయం క్రయ మధ్వానం భక్తం చ సపరిచ్ఛదమ్ ।
యోగక్షేమం చ సంప్రేక్ష్య వణిజాం కారయేత్కరాన్ ॥

శాంతిపర్వములో, కొన్నవెల, అమ్మినవెల, దారులనుద్దె, మొత్తము పనివారల ఖర్చు, స్వయముగా వ్యాపారుల పోషణము ఇవి మొదలుగా విష యములను పరిశీలించి వర్తకులపైఁ బన్ను వేయవలయును. పనివారి పైని గూడఁ బన్ను గలదు: లేక వారినుండి ప్రభుత్వపు పని జీతము బత్తెము లేకుండనే చేయించుకొనఁబడుచుండెను. పన్నులన్నియు నింతముట్టునకె యుండెను. చెప్పఁబడని పన్నుల భాగములు ప్రజలకుఁ గష్టము లేకుండను వారిమనస్సునకు సైతము నొప్పికలుగకుండను గైకొనవలయును. ఈ విష యమై వత్సము యొక్క యుదాహరణ మీయఁబడియున్నది, ఎల్లపుడును, ప్రజను దూడగాను రాష్ట్రమును ఆవుగాను నూహించి రాజు, ప్రజారూపమైన వత్సమునకు యోగ్యముగాఁ జనని రాష్ట్రరూపమైన గోవును బితుకవలయు ననియే వర్ణన కనఁబడుచుండినది. రాష్ట్రమునకు ఏ కఠిన సంకటమైనను నుప స్థితమైనవుడు లోకుల నుండి విశేషమైన పన్నును దీసికొనకసామోపచారమున ఋణముఁ బుచ్చుకొనవలయును. ఆపద గడచిన పిమ్మట నయ్యది తీర్చి వేయవలయును. దీని విషయమున, శాంతిపర్వములో, ఇప్పటి యుద్ధ ఋణ ప్రసంగమున బ్రిటిషు గవర్నమెంటు చేసినట్లే చేయవలయునని చెప్పఁబడి యుండినది. ఇట్టి సమయమునందు రాజు ప్రజలను గూర్చి చేయవలసిప్రార్థన కూడ రాజధర్మములో నిచ్చియుండినాడు.

అస్యామాపది ఘోరాయాం సంప్రాప్తే దారుణే భయే ।
పరిత్రాణాయ భవతాం ప్రార్థయిష్యేధనానివః ॥
ప్రతిదాస్యే చ భవతాం సర్వం చాహం భయక్షయే । (శాం. అ 87)

రాజిట్లు చెప్పవలయును. "ఈయాపత్ప్రసంగమందు దారుణమైన భయముత్పన్నమై యున్నది, కనుకనే నేను మిమ్ములను రక్షించుటకే మీ వలన ధనము నడుగుచున్నాను: భయము నశించిన పమ్మట నేనీ ధనమంతను మీకుఁ దిరుగనిచ్చి వేసెదను." తీసికొన్న యప్పును దీర్చివేయుటకు సాధారణమైన యుపాయము శత్రువు నుండి ధనము గైకొనుటయై యుండెను. కాని కేవలము ఆత్మసంరక్షణమే యగు నెడల తీసికొనిన ధనమునుదిరుగనిచ్చుటకు నితరమైన పన్నులు దక్క మఱియొక యుపాయములేదు; లేక మితవ్యయము చేత ఖర్చును తగ్గించుకొనుటయు నొక యుపాయమైయుండినది. కాని యిది యెట్లో యిచట వర్ణింపఁబడియుండలేదు. అయినను యుద్ధసమయమందలి ఋణము తీర్చ్యని మాటలతోడను లోకుల సంతోషముతోడనే తీసికొనవలసి నట్లాజ్ఞయుండినదని యంతమాత్రము విశ్వసింపవలసియుండెను.

రాజుయొక్క యాదాయమునకైమఱికొన్ని పన్నులు కూడ మహాభారతములోఁ జెప్పఁబడియుండినవి: వానిలో గోమంతులైన లోకుల మీఁద అనఁగా ధాన్యపు వర్తకులపై వేయఁబడిన పన్నొకటి ముఖ్యమైన వనియై యుండెను. ప్రాచీనకాలమందు బాటలు లేకపోయిన కారణముచేత ఒక రాష్ట్రము నుండి మఱియొక రాష్ట్రమునకు ధాన్యమును దీసికొనిపోవుట తెచ్చుట యనెడు పనులు ఈ గోమంతులే అనగా ధాన్యపువ్యాపారులె చేయుచుండిరి. ఎద్దులను వేలకొలఁది గుంపుల నుంచుకొని వానిమీద గంతలు వేసి ధాన్యము నితరములైన సరకులను దెచ్చుట తీసికొనిపోవుట యనెడు పనులను వీరే చేయుచుండిరి. వీరిపైఁ బన్ను వేయుట యనఁగా వచ్చిపోయిన సరకులపైఁ బన్ను వేయుటయై యుండినది. కాని వీరితో ప్రేమముగా వ్యవ

హరించి వారి నుండి మెల్ల మెల్లఁగాఁబన్ను పుచ్చుకొనవలయును, ఎందుచేత వీరి గుండ రాష్ట్రమునకు వ్యాపార వ్యవహారము క్షేత్రములు కుత్కర్షమును నగుచున్నది గనుక. శాంతిపర్వములోని 87వ యధ్యాయమందుఁ జెప్పి యుండినాఁడు.

"ప్రభావయంతి రాష్ట్రంచ వ్యవహారం కృషిం తథా ॥"

రాజు మెల్ల మెల్లగాఁ బన్ను హెచ్చింపవలయుననియుఁ జెప్పఁబడి యుండినది. దీనికై వర్తకుల యుదాహరణమే యీయఁబడియుండినది. ఏ విధము నెద్దు మీఁద వేయుబరువు క్రమముగా హెచ్చించుటవల్ల నెద్దు యొక్క శక్తి హెచ్చగలదో, ఆ విధముగనే రాష్ట్రమునకు గూడఁ బన్ను నిచ్చెడి శక్తి హెచ్చు చేయఁబడఁ గలదు. ప్రతి జాతిలోని ముఖ్యముఖ్య లోకులకు గూడఁ గొన్ని తీసివేతలు చేయఁబడవలయును, సమస్త జన సామాన్యముకై పన్ను యొక్క భాగము సాధారణముగా నెక్కువ చేయవల యును. లేక ప్రముఖుల యందు భేదము పుట్టించి సమస్త లోకుల మీఁదను బన్నుఁ బెంపు చేయవలయును. కాని సాధారణముగా శ్రీమంతులందఱతోడను విశేషమైన యాదరము చేయవలయును. ఎందుచేత ? ధనవంతులైన వారు రాజునకాధారస్తంభములగుచున్నారు. గనుక. పన్ను విషయమున నిట్టి నియమములే తెలివిగల రాష్ట్రముఁనన్నిఁటి యందును నగుచున్నవని చెప్ప వలసిన యావశ్యకతలేదు.

ఇది గాకుండ నాదాయమున కన్యవిషయములు గనులు, లవణముఁ శుల్కము, ఓడలు, ఏనుగులునై యుండెను. ఈ యన్ని విషయములకై విశ్వాసపాత్రులయిన వేర్వేరు మంత్రులుంచఁబడవలయుననిశాంతిపర్వములో జెప్పయున్నాఁడు.

ఆకరేలవణే శుల్కే తరే నాగబలే తథా।
న్యసేదమాత్యాన్నృపతిః స్వాప్తాన్వా పురుషాన్హితాన్ ॥

ఆకారమున కర్థముగని. హిందుస్థానమందు బంగారము, వజ్రములు, నీలములు ఇంద్రనీలమణులు) మొదలయిన వాని గనులు ప్రాచీనకాలమందు నెక్కువగా నుండెను. ఇప్పుడవి తక్కువై యున్నవి. వానివల్ల వచ్చెడి యాదాయమంతయు రాజునకే యగుచుండియుండును. కాని యిచట మాత్రము కేవలము పన్ను పుచ్చుకొనెడి నియమము చెప్పఁబడియున్నది. ఈ కార్యములను బూర్తిగా నిరీక్షించుటకును ఏ విధమైన నష్టము జరగ నీయకుండుటకును నమ్మకమైన వారును సమర్థులునగునధికారుల నియమింప వలసిన యావశ్యకత యుండెననుట స్పష్టమైయుండివది.

ప్రాచీన కాలమందు లవణము మిక్కిలి పెద్ద యాదాయపు విషయమై యుండెను. ఈ కాలమున బ్రిటిషు రాజ్యమందుఁ గూడ నయ్యది యొక గొప్ప విషయమయి యుండినది. ఉప్పు సముద్రములయందు లేక గనుల యందును బుట్టుచున్నది. అన్ని చోట్లను నుండదు. కాని దాని యావశ్యకత లోకులందఱకును గనదు. కనుకనే ఉప్పు పుట్టెడు రాష్ట్రమందును పుట్టని రాష్ట్రమందును గూడ నుప్పు పన్ను ఒక వనియగుచున్నది. మరియుదానికై యొకానొక స్వతంత్రుఁడును విశ్వాసముగల యధికారి యొక్క యావశ్యకత యుండినది. శుల్కము అనునే వస్తువు యొక్క బోధమగుచున్నదో నిశ్చయ పూర్వకముగా జెప్పఁబడజాలదు. ధాన్యమమ్మెడి చోటును శుల్కమనుచున్నా రని టీకాకారుఁడు చెప్పియుండినాఁడు. ఇపుడు స్వదేశ సంస్థానములందలి బజారులలోఁ గ్రయవిక్రయములమీఁద సాయరు అను పేరితోఁ దీసికొనఁబడు చుండిన పన్ను శుల్కమై యుండును. కన్యావివాహ సమయమున కన్యాజన కున కీయఁబడుచుండిన ధనమును గూడ శుల్కమని చెప్పుచుండినారు. ఎందు చేత? ఇదికూడ నొక విధమైన కొనుబడియై యుండినది. అనఁగా శుల్కమను పేరు గల పన్ను క్రయవిక్రయములమీఁద వేయఁబడుచుండియుండును మరియు పూర్వము చెప్పినట్లుగా అది ప్రత్యేకము రెండు రూపా యలై యుండును. ఈ పన్నునకు గూడ నమ్మకమైన యొక స్వతంత్రాధి

కారి యొక్క యావశ్యకత కలదు. నదిని లేక సముద్రమును దాటెడి చోటను దీసికొనఁబడుచున్న పన్నును తరమని చెప్పుచున్నారు. ఈ పన్ను ఎందుకు మహత్త్వము గలది గావలయునో యూహకు రాకున్నది. ప్రవాసులను ఈ నుండి యావలకుఁ దీసికొనిపోయెడి పని ఓడనడపు వారిదియై యున్నది. వారు తమ కూలిని వేఱే తీసికొనుచునేయున్నారు. మరియు ప్రాచీనకాలము నుండియాధునికకాలమువఱకు ఓడలపై రాజునకు,వారి యేర్పాటువలనవిషయ మైనఁ గొంచెమైన జగడము రానే రాక చక్కగా నడచుచుండుటఁబట్టి హక్కు కలదనియే విశ్వసింపఁబడి యున్నది. ఈ పడవల ద్వారా మిక్కిలి యెక్కువ యాదాయము వచ్చుచున్నది. ఇపుడు చివర నాగబలము విషయమై కొంత చెప్పవలసి యున్నది. ప్రాచీన కాలమందును ఈ సమయమందును గూడ ఆ దీవులలోని యేనుఁగు లన్నియు రాజువనియే దృఢ నిశ్చ నుు మగపడుచు న్నది. ఏనుఁగులు విశేషించి రాజుయొక్కధనముగా విశ్వసింపఁబడుచున్నవి. పూర్వకాలమందు గజములు సైన్యముగా నుపయోగింపఁబడుచున్నవి. యే యరణ్యమందు గజములు పుట్టుచుండెనో వానిపై రాజునకు స్వతంత్రాధికార ముండుచుండెను. అందు వేఁటాడుటకై యెవరికిని స్వాతంత్ర్యము లేకుం డెను. అందుకై స్వతంత్రధికారులు నియమింపఁబడుచుండిరి. దజబృంపమును వృద్ధి చేయుటకును వానిని బట్టుకొనుటకును నన్ని యేర్పాటులును ఈ యధి కారులగుండా జరుగుచుండెడివి. ఏనుఁగులు లేని యరణ్యములు లోకులకు నిరాటంకములుగా నుండెను. అందుఁ బుల్లలుకొట్టుకొనుటకును పశువుల మేపు కొనుటకును స్వాతంత్ర్య మందఱకును నుండియుండెను. రెండేసి రాష్ట్రముల నడుమ దఱచుగా బెద్ద యరణ్యము లుండెడివి; ఎందుచేత ? రాష్ట్రముల సరి హద్దు ఈ యరణ్యములచేత నిశ్చిత మగుచుండెను. మఱియు ఈ యరణ్య ములు ఏ రాష్ట్రముయొక్క ప్రభుత్వము లోనివిగను నూహింపఁబడుచుండె డివి కాకుండెను. వానిపై నెవరి ప్రభుత్వమును లేకుండెను.

అటవీ పర్వతాశ్చైవ నద్యస్తీర్థాని యానిచ।
సర్వాణ్యస్వామికా న్యాహు ర్నాస్తి తత్ర పరిగ్రహః॥

(అను. అ. 69, శ్లో. 24)

"అడవులు, నదులు, పర్వతములు, తీర్థములు వీనిపై నెవరికిని ప్రభుత్వములేదు, మరియు నెవరికిని నధికారము కూడ నుండఁజాలదు." ఈ కారణము చేతనే ప్రాచీనకాలమందు క్షత్రియులును, బ్రాహ్మణులును నిర్భయులై యరణ్యమునకుఁ బోయి నివసించుచుండిరి. వారిని మీ రెందుల కక్కడ గూర్చుంటి రని ఎవఁడును అడుగఁజాలకుండెను. వందలకొలఁది గొంగళ్ల నేఁతగాండ్రు అరణ్యమందుఁ దమ జంతువులను దీసికొని వెళ్లి నిర్భయత్వముతో నివసించుచుండిరి. ప్రాచీనకాల మందు దీని వలనఁ బ్రజలకు మిక్కిలి యెక్కువైన సౌకర్య ముండెను; ఎందుచేత ? ప్రతి మనుష్యుఁడును స్వయముగాఁ దన పరిశ్రమమువల్ల ఉచితముగా కట్టెలు, రాయి, వట్టిగడ్డి మొదలైనవి తీసికొని పోఁగలిగి యుండిరి గనుక.

## భూ స్వామి త్వ ము

భూమి పన్ను ధాన్య రూపమున నిచ్చెడి యాచారము అన్ని రాజ్యములందును బ్రచలితమై యుండెను. ఇందుచేతఁ బూర్వకాలమందు భూమిని వెల వేయుట కావశ్యకత లేకుండెను. గ్రామముయొక్క హద్దు నిశ్చితమై యుండెను; మఱియు ఆ హద్దులో వ్యవసాయమునకుఁ దగిన భూమి యెంత యుండునో దానిపై గ్రామస్థులకు స్వామిత్వ ముండెడిది. స్వామిత్వ మొకచోట నుండెడిదో లేక విభాజితమై యుండెడిదో నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁబడఁజాలదు, ఎందుచేత ? రెండువిధములైన పరిపాటి యిప్పుడుకూడ నగపడుచున్నది గనుక. అయినను భూమి వేర్వేఱు ఖండములుగాఁ జేయఁబడుచుండెడి దనియు, వానిపై విశిష్ట జనమునకు స్వామిత్వ ముండెడి దనియు నిశ్చి

తమై యున్నది. భూమియొక్క క్రయ విక్రయముల వర్ణనము మహాభారత ములో ననేక స్థానములయందు వచ్చియున్నది. భూమికి వెల యుండెను. దానము మిగులఁ బుణ్యకారకముగాఁ నూహింపఁబడుచుండెను. నేర్పరులైన వారు కొంచెమో గొప్పయో భూమిని గొని దానము చేయవలయునని చెప్పి యున్నాఁడు.

"తస్మాత్క్రీత్వా మహీందద్యాత్ స్వల్పామపి విచక్షణః"
(అనుశా. అ. 67, శ్లో. 34)

భూమియొక్క క్రయవిక్రయము లగుచుండెనేని దానియొక్క వేలము కూడ నగుచుండి యుండును. మహాభారతకాల మందు భూమియొక్క కొలత యే లెక్కచేత నగుచుండెనో నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁజాలదు. 120 చదరపు టడుగుల కొలత ముసల్మానుల కొలతయై యున్నది. మఱియు ఎక రము (ఏకర్) ఇంగ్లీషువారి కొలతయైయున్నది. ఇంతకుముందు నివర్తనపు కొలత ప్రచలితమైయుండె నని టీకావల్లఁ దెలియుచున్నది.

యోవై కనాశః శత నివర్తనాని భూమేః కర్షతి తేన విష్టి రూపేణ
రాజకీయ మపి నివర్తన దశకం కార్షణీయం స్వీయ వద్దక్షణీయంచ ॥

"ఏ రయితు తన నూఱు నివర్తనముల భూమిని దున్నునో, అతఁడు రాజుయొక్క పది నివర్తనముల భూమిని నుచితముగా దున్నవలయు ను మఱియు విత్తులు చల్లవలయును." ఈ రీతియొక్క యీ యనువాదమువల్ల ప్రాచీనకాల మందు నివర్తన శబ్దము 120 చదరపు టడుగుల కొలత యను నర్థమందుఁ బ్రచలితమైయుండెనని తెలియుచున్నది. కాని యది మహాభారత మందుఁ గనఁబడదు. మఱియు నివర్తన శబ్దము చాణక్యుని యర్థశాస్త్రములో గలదు. దాని కర్థము పొడుగులో నిరువది మూరలై యున్నది. అనఁగా క్షేత్రము నివర్తనము యొక్క యర్థము నాలుగు వందల వర్గపు మూర లగు

చున్నది. మహాభారతకాలమందు నివర్తనమై భూమికౌలతగా ప్రసిద్ధమై యుండును. ఈ యవతరణమువల్ల మహాభారతకాలమందు లోకులకుఁ దను భూమిగాకుండ విశేషించి రాజుదిగూడ వేఱు భూమి యుండుచుండె ననియుఁ బ్రకటమగుచున్నది. రాజధానిలోఁ జిన్న పెద్ద యారామములు మొదలైన భూమియొక్క స్వతంత్రభాగములు రాజుయొక్క యుపభోగము నకై యుండుచుండి యుండునుకాని దేశమంతయును భిన్న భిన్న స్థానములలో రాజునకు భూమిలేక యుండును. భూమిపైఁ దరచుగా స్వాతంత్రమంతయు లోకులదే యై యుండెనని మనము ముందే చెప్పి యున్నాము. రాజునకుఁ దన భూమిగాకుండ పెద్ద పెద్ద గోవుల మందలు కూడ నుండెడివి. ఈ మందలు వేర్వేరడవులలో నుండుచుండెను. పన్ను రూపముగా లోకులవల్ల లభించిన పశువులు వీనిలో నుండెడివి. ఈ మందల వర్ణనము మహాభారతములో రెండు మూఁడు చోట్లఁ గనఁబడు చున్నది. పూర్వకాలమందుఁ బ్రతి రాజునొద్దను వేలకొలఁది యావులయొక్క నెద్దులయొక్క మందలుండెడివి. ఎద్దులను వృద్ధిచేయు నట్టియు, వాని లక్షణములను దెలిసికొనునట్టియు, వాని రోగములను బోగొట్టునట్టియు శాస్త్రమాశాలములు మన్నతావస్థలో నుండెను. సహదేవుఁడు పశుపరీక్షకుడై విరాటరాజు యొక్క నౌకరిలో నుండెను. అతఁడు చెప్పుచున్నాడు— "నేను యుధిష్ఠిరుని పశుబృందమునకు సేవకుఁడనై యుంటిని. ఒక మందలో నూఱు పశువులగుచున్నవి; ఇట్టివి యెనిమిది లక్షల మందలు యుధిష్ఠిరుని కుండెను. నేను ఉన్నచోటిమండి చుట్టుప్రక్కలఁ బదియోజనముల వఱకు, గోవులకు ముందేమి యయ్యెనో, ఇఁకముందు వాని కేమి యగునో యీ సంగతులఁ దెలిసికొనఁగలను. గోవృద్ధియే యుపాయముచేత నగుచున్నదో మఱియు నేమిచేయుటవల్ల వానికి రోగము రానేరదో నేను బాగుగా నెఱుఁగుదును. ఉత్తమ వృషభముల లక్షణము లేవియో నే నెఱుంగుదును." (విరాట. అ.10) దుర్యోధనుని ఘోషమునకు

అనఁగా గోబృందముండుటకు స్థానము ద్వైతవనమందుండెను. అచ్చటి కతఁడు బుద్ధిపూర్వకముగా ఘోషమును జూచుటకై వెళ్ళియుండెను. అతఁడు వేలకొలఁది గోవులను జూచెను. అన్నిటియొక్క చిహ్నము లను సంఖ్యనుగూడ నతఁడు పరీక్షించెను. ఆవు దూడలకుఁ జిహ్నముల గుర్తుల వేయించెను. ఏ గోవుల దూడలు లేగలై యుండెనో, వాని విషయమున అతఁడు, యీని యెంత కాలమై యుండునో నిశ్చయిం చెను. గోవులను లెక్క పెట్టించెను. మఱియు మూడేండ్లకుఁ బైగా నున్న యెద్దులను వేఱుగా లెక్క వేయించెను. (వనప. అ 240) పై వర్ణనముఁబట్టి రాజుయొక్క స్వామ్యములో నుండెడి గోబృందముయొక్క యేర్పా టేవిధముగా నుండెడిదో తెలియుగలదు. ఈ గోవులపైని ప్రభు త్వము వారి గొల్లలుండెడివారు. మరియు వారిపై నొక యధికారిగూడ నుండెడివాఁడు,

## జీతము బత్తెము లేకుండ పనిచేయువారు

రాజులకు వెట్టి చాకిరీ చేయించుకొను నధికారముండెను. రాజధర్మ ములో రాజు వేర్వేఱు శిల్పకారుల చేతను గూలివాండ్రచేతను వెట్టి చాకిరి చేయించుకొన వచ్చునని చెప్పఁబడియున్నది, వీరు పది దినములకొక దినము రాజునకు నుచితముగాఁ బనిచేయ వలయునను నట్టి నియమము ప్రాయికముగా నుండియుండును. ఈ విధముగానే సైన్యమునకు రాజ భవనమునకును గావలసిన వస్తువులు వెట్టి నౌకరులచేతఁ దయారు చేయింపఁ బడుచుండెడివి. వెట్టి నౌకరులు లోకులందఱిలో నుండియుఁ దీసికొనఁ బడుచుండెడివారన్న సంగతి యిచ్చటఁ జెప్పవలసియున్నది. బ్రాహ్మణులకు విశేషాధికారము సమస్త రాజ్యముల యందును సమ్మ తింపఁబడు చుండెడివనుట సత్యము. వారి విషయమున వెట్టిచాకిరియుఁ

పన్ను లన్నియు రద్దు చేయఁబడి యుండెను. వారికి మఱియొకరికివలె శిక్షకూడ లేకుండెను. వారిలో నెవరైనను వారసు జ్ఞాతి లేని వారై యుండి చనిపోయి యుండెనేని వాని యాస్తి రాజాధీనమై నది కాకుండెను. కాని యీ యన్ని సౌకర్యములును గేవలము, ఎవరగ్నిని రక్షించుకొని యధ్యయనము, అధ్యాపనము, యజనము, యాజనము మొదలైన బ్రాహ్మణోచిత కర్మములందు నాసక్తులై యుండిరో, ఆ వేదవేత్తలైన బ్రాహ్మణులకై యుండెను- మరియొకరికీ సౌకర్యములు లేకుండెను

> అశ్రోత్రియాః సర్వఏవ సర్వే చానాహితాగ్నయః ॥
> తాన్ సర్వాన్ ధార్మికో రాజా బలిం విష్టించ కారయేత్ ॥
>
> (శాంతి. అ. 76)

ధార్మికుఁడైన రాజు, ఎవరు వేదము నెఱుంగరో మఱియు అగ్నిని, రక్షించువారు కారో, అట్టి సమస్త బ్రాహ్మణులనుండియు వెట్టి చాకిరి పన్నును గైకొనవలయును. అనఁగా, ఇట్టి బ్రాహ్మణులు నామమునకు మాత్రమే బ్రాహ్మణులుకాని వ్యాపారమును బట్టి శూద్రులై యున్నారు కాఁబట్టి వీరిచేత శూద్ర కృత్యమును జేయించుటలో రాజుయొక్క ధార్మికత్వమందు నేవిధమైన దోషముకూడ జనింపనేరదు.

రాజుయొక్క యాదాయమునకు ముఖ్యమైన సాధనము లేవియై యుండెను,- భూమి పన్ను 2 జంతువులపై వేయఁ బడిన పన్ను, 3 సాయరు అనఁగా క్రయ విక్రయములమీఁది పన్ను, గనులయొక్క సంపద 5 ఉప్పుపన్ను 6 వడపనవపు వారైతర మను పేరుగల పన్నులకుఅడవియేను గులు ఇచట నేఁటి భారత ప్రభుత్వముయొక్క యాదాయమునకుఁ గూడ నివ్వియే సాధనములై యున్నవను సంగతి జ్ఞప్తిలో నుంచుకొనవలయును. ఇవి గాకుండ న్యాయ విభాగము (సివిల్‌కోర్టు) లోని యాదా

యము, స్టాంపులు, వారసులు లేని యాస్తి యీ సాధనముల విచారమును మనము ముందునకుఁ బోయి చేయుదము.

## అరణ్యములు ఆబ్కారి పన్ను

వర్తమాన భారత ప్రభుత్వముయొక్క యాదాయమునకు ముఖ్య సాధనములు— నల్లమందు, మహాభారతకాలమందుండుట కనఁబడదు. కాని పూర్వకాలమందు భరత ఖండమున నల్లమందసలుండెనో లేదో యను విషయమై శంక ఉత్పన్నమగుచున్నది నల్లమందిచ్చటనుండి విదేశమునకుఁ బంపఁ బడినట్లెచ్చను వర్ణనములేదు. (నల్లమందునకై సంస్కృతమందు శబ్దముకూడ లేకున్నది. అహిఫేనమనునది యొక నిర్మిత శబ్దమై యున్నది) ఆబ్కారీమీఁదఁ గూడ ప్రభుత్వపు పన్ను ఉన్నట్లగపడదు. శాంతి పర్వమందైతేని. రాజులు కల్లు దుకాణములను మూసివేయింపవలయునని వ్రాసియున్నాడు. కల్లుపైని పన్నున్నట్లు వర్ణన మెందునులేదు. మద్యాది స్థానములను సర్వవిధముల నిరోధించు విషయమై (శాంతి. అ. ౯౯) శాసనమున్నది. మద్యపు దుకాణముల మీఁదను వేశ్యలమీఁదను గఠినమైన నిరీక్షణముండవలయునని కూడఁ జెప్పఁబడి యున్నది. దీనిఁబట్టి మద్యపు దుకాణములు చాల మూయింపఁ బడుచుండి యుండెననియు, మిక్కిలి తక్కువగా నచ్చటన్చట నమ్మఁబడుచున్న వానిమీఁద బలమైన పహరా వేయఁబడు చుండెడిదనియుఁ దెలియుచున్నది. * అరణ్యోత్పత్తి వల్లఁ బ్రజలు ప్రకటముగా లాభమును దీయఁ గలుగుచుండిరి. కేవలము ఏనుగులును మంచి పచ్చగడ్డియుఁ బుట్టుచుండెడి యరణ్య భాగములు ప్రభుత్వపు టరణ్యములుగా విశ్వసింపఁ బడి సురక్షితములుగా నుంపఁ

* పూర్వకాలమందు క్షత్రియులు తక్క యితరులు మద్యమును ద్రాగకుండిరి. క్షత్రియులకు నితర రాజులకును మద్యము త్రాగువారి యిండ్లి యందే చేయఁబడు చుండెను. దీని జూచి మన యభిప్రాయము మద్యము

బడు చుండెడివి. ప్రతి గ్రామమందును, సిలోన్ ప్రాంతమందునుగలిగినట్టి మిగిలిన యరణ్యములన్నియు లోకులు స్వతంత్రముగా నుపభోగించుటకై విడువఁబడియే యుండెను. అరణ్యములపైనే వారికిని ప్రభుత్వము లేదని యింతవఱకు నిశ్చితమై యుండెను.

## ఖర్చుయొక్క పద్దింపు

ఇంతవఱకు రాజుల యాదాయము విచారింపఁబడి యున్నది. ఇపుడు మనము, వేని ననుసరించి రాజులు ఏయే పద్దింపులపై ఖర్చు చేయవలయునని నిశ్చయింపఁబడుచున్నదో, అట్టి నీతి శాస్త్ర నియమములను విచారింతము. ఖర్చునకు నసలైన పద్దింపు. సైన్యమై యుండెను. దాని విచారము స్వతంత్రరీతిని జేయఁబడును; కాని ఖర్చునకు మరియొక పద్దింపుల కల్పన సభాపర్వములోని కచ్చిదధ్యాయము యొక్క యాధారముమీఁదఁ జేయఁబడఁగలదు. మహాభారత కాలమందు రాజుల పనియే కర్తవ్యము లూహింపఁబడుచుండెనో, ఈ విషయమైన యుత్తమ వర్ణనము ఈ యధ్యాయమందుఁ జేయఁబడి యున్నవి నారదుఁడనుచున్నాడు. రాష్ట్రమునకు నీచేత, నీ స్త్రీలచేత, లేక రాజపుత్రులచేత, చోరులచేత లేక లుబ్ధులైనవారిచేతఁ బీడయగుటలేదుగదా?" ఈ ప్రశ్నమువందు అన్యాయముగా నడచు రాష్ట్ర ప్రజలకుఁ దఱచుగా నెవరిచేతఁ బీడ కలుగుచున్నదను విషయమై యుత్తమమైన వర్ణనమున్నది. రాష్ట్రమునకు బహు విధముల అత్యాచారులైన రాజులచేత, వారి బాలురచేత, లేక రాణులచేత, రాజునకుఁ బ్రీతిపాత్రులైన చిన్న నౌకరు

---

పైఁ బన్నులేక యుండునని యగుచున్నది. అనార్యుల దుకాణములు కొన్ని మద్యపువి యుండి యుండును, కాని వానిపైని ప్రభుత్వము యొక్క కఠిన దృష్టి యుండెడిది మఱియు యథా సంభవముగా ఆ దుకాణములు మూసివేయింపఁ బడుచుండెడివి. అబ్కారి విషయమున మహాభారత కాలమందు నిట్టి పరిస్థితి యుండెనని మన యభిప్రాయము.

చేత లేక చోరులచేత నిత్యము పీడకలుగుచున్నదను సంగతి యితిహాస ప్రసిద్ధమై యున్నది. ఈ కారణములచేత హిందు స్థానములోని యితిహాసమందుఁ బ్రజలకు ననేక పర్యాయములు కష్టములు సంభవించిన యుదాహరణములు మనకు దొరకుచున్నవి అంత్యోదాహరణము రెండవ బాజీరావు పేష్వానాఁటిది యై యున్నది. ఆ సమయమున స్వయముగా బాజీరావు లోకుల యాదాయమును దోపిడిచేసి గొల్లగొట్టి ప్రభుత్వపు కోశాగారమందుఁ గలుపుచుండెను. అతనికిఁ బ్రియులైన యధికారులును నితర సేవకులును బ్రజలను వేఱుగాఁ దోపిడిచేయుచుండిరి మఱియు అన్నిటికంటె నెక్కువ దోపిడి పిండారు గుండాలవల్ల జరుగుచుండెను. సారాంశమేమనఁగా అతని కాలమున నన్ని విధములైన దుష్ట వ్యవస్థలును లోకులను భయగ్రస్తులుగాఁ జేయుచుండెను. అందుచేత లోకులకు విదేశీయులైన యాంగ్లేయుల రాజ్యము ప్రియమయ్యెను మరియు వారు దానికిఁ గూడ నంగీకరించిరి. కనుకనే రాజుయొక్క ప్రథమ కర్తవ్యము స్వయముగాఁ దన దర్బారులోని లోకులమని దోపిడి చేయు నిచ్ఛనునణఁచుట యై యున్నది, ఎపుడు తనయొక్క దర్బారుయొక్కయు కర్చును నియమముగా నుంచునో యపుడే యిది కాఁగలదు, రెండవ కర్తవ్యము చోరుల విషయమై చక్కని యేర్పాటు చేయవలసి యుండుటయై యున్నది, విశేషించి పట్టపగలు దోపిడి చేయు దొంగలను నాశనము చేయవలసి యున్నది. ఇందుకై పోలీసులయొక్క చక్కని యేర్పాటునకు నావశ్యకత యుండును, ప్రతి రాష్ట్రములోని పట్టనముల గ్రామము మఱియుఁ బ్రాంతము అనఁగా సీమ యిట్టివి మూడు భాగములు నిత్యము నుంచుచుండెడివి మఱియు నీ సీమాలయందు నరణ్యములుండెను, ఈ ప్రాంతములయందు లేక యడవులయందు నివసించి దొంగలు బ్రిటలను దోపిడి చేయుచుండిరి. మనకు నితిహాసమును బట్టి పిండారులకు నిదే యుపాయమై యుండెనని తెలియుచున్నది, ఇందుకై

ప్రతి నగరమందును ప్రతి గ్రామమందును కోటయొక్క యేర్పాటుండెను. నారదుఁ డొక ప్రశ్నమును జేసియున్నాఁడు. అందు, నీ రాష్ట్రమందు ప్రతి గ్రామము పట్టణముతోఁ దుల్యముగా నున్నదా లేదా? యనియు, ప్రాంతము లేక సీమ గ్రామముతో సమానముగనున్నదా లేదా ? యని యు నడిగెను. దీనిఁబట్టి బైని జెప్పిన ప్రకారముగనే యేర్పాటులుండెనని విదితమగుచున్నది. ఇది గాకుండ నారదుఁడు, దొంగలు వాగుకొనెడి ప్రదేశములకు గుఱ్ఱపుస్వారి చేయువారిని బంపుచున్నావా లేవా? యనియు నడిగియున్నాఁడు. తాత్పర్య మేమనఁగా, దొంగలను నశింపఁజేయుట. లోకులయొక్క శోభాకరమగు వస్తువులను జాగ్రత్తపెట్టుట, వీని విషయమై ప్రస్తుత కాలమున నాంగ్లేయ రాజ్యమందుఁ జేయఁబడుచున్న ప్రయత్నములన్నియు ప్రాచీనకాలమందుఁ జెప్పఁబడి యున్నవి. మఱియు సువ్యవస్థితమైన రాజ్యములలో వాని ననుసరించి ప్రభుత్వము చేయఁబడుచుండెను. ఈ విధముగా పోలీసుశాఖ యొక్క ఖర్చు ప్రధానమై యుండెను.

రెండవ ఖర్చు (వ్యయము) : కాలువల (ఇర్రిగేషన్) శాఖది మైయుండెను. నారదుఁడు, నీ రాజ్యములోఁ దగినచోట్లను నిర్మింపఁబడినదియు, జలపూర్ణములై నవియునగు చెరువు లున్నవియా లేవా ? నీ రాజ్యమందు పంట యాకాశముమండి కురియు వర్షములపై నాధారపడినది కాదుగదా ? యని యడిగియున్నాఁడు. ఈ ప్రశ్నములను బట్టి యిప్పటివలెనే ప్రాచీన కాలమందును సర్వదా యదనున వర్షించునెడి విశ్వాసము లేకుండె ననియు, నెల్లపుడును కఱవులవలని భయము యుండెడి దనియుఁ దెలియుచున్నది. ఇందుచేతఁ బ్రతి చోటునను నీటినిజేర్చి రక్షించికొను జవాబుదారీ ప్రభుత్వము మీఁదమండెను. ఈ విషయమై ఖర్చంతయు ప్రభుత్వము పెట్టవలసియుండెను. మూఁడవ ఖర్చు : పెట్టుబడిదియై యుండెను. దీనిని వర్తమాన కాలమున నచ్చుటచ్చుట ఎరువు మఱియు బీజసంబంధమైన ఖర్చు అని చెప్పుచున్నారు. కృషి చేయువారు ప్రాచీనకాలమునుండియే ప్రభుత్వముయొక్క లేక షాహు

కారు యొక్క సాహాయ్యము లేకుండఁ గృషిని జేయఁజాలక యుండి రను విషయమును జూచి యాశ్చర్యము కలుగుచుండెను. కృషి యొక్కయు ప్యయము విశేషించి మహాభారతకాలమందు వైశ్యులచేతులనుండి యుదయిం చియుండునని, పూర్వకాలమందును భారతకాలమందును వైశ్యుల ముఖ్యోద్య మము కృషియైయుండెను. భగవద్గీతయందుఁ వైశ్యుల వృత్తి, కృషి, గోరక్ష ణము,వాణిజ్యము చెప్పఁబడియుండెను. కాని మహాభారతకాలమందు వైశ్యులు మొదట రెండు వృత్తులను శూద్రులకు సమర్పించి రని తెలియుచుండెను. కాఁబట్టి కృషికై బీజముయొక్కయు మరియు నాలుగుమాసములవఱకు,అన్నఁగా పంట తయారగువఱకుఁ గావలసినయన్నముయొక్కయు కొద్దియో గొప్పయో సౌకర్యమును ప్రభువులయొక్క లేక సాహుకారులయొక్క వైపునుండి చేయు వలసి వచ్చుచుండెను. ముసల్మానుల రాజ్యమునందు ఇట్టి సాహాయ్యమునకుఁ బేరు పెట్టుబడియై యుండెను. మఱియు ప్రస్తుతమున నీ శబ్దమే ప్రచలితమై యుండెను. ఈవిధముగాఁ బ్రభుత్వము సహాయముచేయు నాచారము మహా భారతకాలము నుండియుఁ బ్రచలితమని సిద్ధించుచుండెను. నారదముని ప్రశ్నము నందు ఇది బీజము మఱియు బత్తెములు ప్రభుత్వపు కొట్టుల నుండి యీయఁ బడుచుండెడివి. సాహుకారు యిచ్చునెడలఁ ప్రభుత్వము వసూలుచేసి తిరుగ నిప్పించుచుండి యుందురు. నారదుని యీ ప్రశ్నమునందు వడ్డియొక్క ప్రశ్నముగూడ నిశ్చితమైయగపడుచుండుట యాచ్చర్యవిషయమై యుండెను ప్రతి నివాసమునుండి రూపాయలమీఁద రూపాయయొక్క ప్రమాణము నిశ్చి తమైయుండెను. మఱియు సాహుకారులు ఇంతకంటె నెక్కువ ప్రమాణమున వడ్డి తీసుకొనఁగూడదను నిర్బంధము చేయబడియుండెను. స్వదేశరాజ్యముల యందలి నియమము చంద్రగుప్తుని నాఁటినుండియు నేఁడు 2200 వత్సరము వరకుఁ బ్రచలితమై యుండెను. యిది చూడఁగా హిందుస్థాన మందలి ప్రాచీనసంస్థ యెంత స్థిరముగను మఱియు నెంతపనిచేయునదిగను నుండెనో యీ విషయముయొక్క కల్పన కాఁగలదు. ఈ నియమ ముండెను– "కృషిని వర్ధిల్లఁజేయుటకై రాజు రైతుల స్థితిని జక్కఁగానుంచెడివైపు ధ్యాన ముంప

వలెను. అతఁడు వారివద్ద జీవితమునకై ధాన్యము, బీజములును బూర్తిగా నుండెనో లేదో చూడవలయును. మరియు ప్రతి మాసము నూఱు రూపాయ లొక్కంటికి నొక రూపాయుకంటె నెక్కువ వడ్డిని దీసికొనక యతఁడు దయాపూర్వకముగా వారికి ఈయవలయును" అని.

## గ్రామ సంస్థ

ప్రతిగ్రామమందును నైదైదుగు రధికారు లుండెడివారని సభాపర్వము నందుఁ జెప్పఁబడి యుండెను. ఈ యధికారులు స్థాయులు లేక వంశ పరంపరాగతు లగుచుండిరి. టీకాకారుఁడు వారి నామముల నిట్లు చెప్పియుండెను- ప్రశాస్తా (సరపంచ్)పంచాయితీదారుఁడు,(సమాహర్త) వసూలుచేయువాఁడు (సంవిధాతా లేఖకః) కరణము లేక గుమాస్తా మరియు సాక్షి. సాక్షియొక్క విశేషమైన యావశ్యకత ఎందులకుండెనో యిది చెప్పఁబడజాలదు. రాష్ట్రము నందు మనుష్యుల నివాసము, ప్రాంతము, గ్రామము, నగరము, పురము వీనియందు విభక్తమైయుండెడిది. ప్రస్తుతకాలమున ప్రాంత శబ్దముయొక్క యర్థము దేశముయొక్క విభాగ మగుచుండెను. కాని ప్రాచీనకాల మందు ప్రాంతమున కర్థము అంతముయొక్క సమీపము అనఁగా రాష్ట్రము యొక్క సమీపప్రదేశ మగుచుండెను. పుర మనఁగా రాజధానియై యుండెను. కఱవు భయముచేత నొకచోటికి జేర్పఁబడిన ధాన్యము బహువిధముల నగరమందు లేక రాజధాని యందుఁ జేర్పఁబడుచుండెడిది.

ఇది గాకుండ కృషి, గోరక్ష, వాణిజ్యము వీనియొక్క యభివృద్ధికై రాజు విశేష ప్రయత్నమును జేయవలయునని చెప్పఁబడియున్నది. దీని విషయమై యొక స్వతంత్ర శాస్త్రము వార్తయే నిర్మింపఁబడి యుండెను. దాని ననుసరించి కృషి వాణిజ్యముల నెచ్చుచేసి దేశస్థితి నుత్తమమైనదిగాఁ జేయుటకుఁ బ్రయత్నించుట, వైశ్యులకుఁ గూడ ద్రవ్య సహాయమును జేయుట

రాజులకు గ_ర్తవ్యమై యుండెను. రాజులపై నాల్గవ జవాబుదారీ అకాల గ్రస్తులైన ప్రజలకు నన్నదానము చేయుటయై యుండెను. గ్రుడ్డి, మూగ, కుంటి మొదలగు లోకుల జీవికపై జవాబుదారీకూడ రాజుపైనుండెను.

కచ్చి దంధాంశ్చ మూకాంశ్చ పంగూన్ వ్యంగా నబాంధవాన్
పితేవ పాసి ధర్మజ్ఞ తథా ప్రవ్రజితా నపి ॥

అనఁగా ఎవరు అంధులో, బధిరులో, పంగువులో, వికలాంగులో, ఎవ రికి రక్షకులు లేరో, ఎవరు విరక్తులై సంసారమును ద్యజించి సంన్యాసులై యుండిరో వారి పాలన పోషణములను రాజు తండ్రివలె చేయవలయును. ఇదే విధముగా నతఁడు రాష్ట్రమును అగ్ని, సర్పము, వ్యాఘ్రము, రోగము వీని భయమునుండి కాపాడుటకై యుపాయము చేయువలయును. ప్రస్తుతపు ప్రతి యున్నత రాష్ట్రము తనపై నిట్టి జవాబుదారీ యుండుటను విశ్వసించు చున్నారు. మఱియు మహాభారతకాలపు రాజ్యములయందుఁగూడ నిట్టిజవాబు ధారీయే యూహింపఁబడుచుండెను. దీనిఁబట్టి పాఠకులు పూర్వకాలమునుం డియే రాజులయొక్క క_ర్తవ్యములకల్పన యెంతదూరమువరకు నుండియుఁం డెనో యూహింపఁగలరు. నారదుఁడు ఈ విధములయొక్కయు నగ్రహారముల యొక్కయు సంబంధమైన పూర్వరాజులుచేసిన దానములన్నిటియొక్క పాల నము రాజుద్వారా కావలయునని యుపదేశించియుండెను.

బ్రహ్మదే యాగ్రహారాంశ్చ పరిబర్హాంశ్చ పార్థివ ।
పూర్వరాభిభిపన్నాంశ్చ పాలయుత్యేవ పాండవః ॥

(ఆశ్రమ పర్వం, 10 శ్లో.)

ఏ రాజైనను నితరుల రాజ్యములను జయించినపుడు పూర్వ రాజులచేత నీయఁబడిన ఈనాములను, అగ్రహారములను (బ్రాహ్మణుల కిచ్చిన పూర్ణ గ్రామము) పరిబర్హములను (అనఁగా ఈయఁబడిన యితరాధికారములను,

పరిపాలింపవలెను. ఈ విధముగా ధర్మరాజు, దుర్యోధనునిద్వారా ఇవ్వబడిన హక్కులనుపాలించెనని దీనితోపాటుచెప్పవచ్చు. ఈ తత్త్వములుగూడ అక్కడ ఉన్నరాష్ట్రములకార్యములందు గౌరవింపబడినట్లు తలచబడగలదు. సారాంశ మిది నేటి ఆంగ్లేయుల రివెన్యూవిభాగముల అన్ని ఉదారమైనపనులు పూర్వకాల మున ప్రచురితములై యుండెను ఇంతెందుకు ప్రతిగ్రామములోను లేఖకుల నుంచుట చూచి యిది అంగీకరించుటలో ఇబ్బంది ఏమీలేదు. దేశములో పత్రవ్య వహారములు తయారుచేయబడుచుండెను. భారతకాలపు రాజ్యములలో దేశీ యశాసనములు చాలబాగుగా అమలుజరపబడుచుండెను.

## ఆ య వ్య య వి భా గ ము

ఇపుడు మనము ఈ భాగము ఆయవ్యయముల గూర్చి విచారింతము. రాజ్యములో న్యాయాధికారులు స్వతంత్రముగా నుండిరని పూర్వము చెప్పి యుంటిమి, రాజు జమాఖర్చుల నిత్యము చూచువాడని చెప్పనక్కరలేదు. రోజుకు మొదటిభాగమునందు దినపుఖర్చులు తయారుచేయబడుచుండెను. ఇందుకై ఆయవ్యయములకు సంబంధించిన కర్మచారులను ఉంచుచుండెడివారు,

కచ్చి దాయస్య చార్ధేన చతుర్భాగేన వా పునః ।
పాదభాగై స్త్రిభిర్వాపి వ్యయః సంశుధ్యతే తవ॥

దీనికి సరియైన యర్థము తెలియుటలేదు. మన మతమునసుసరించి దీనికి, సగము లేక మూడుకు చతుర్థాంశములు, లేక 12/16 ఏవిధమునిష్ట పడునో దానిననుసరించి రాజు వ్యయము చేయువలయుననియే యర్థమగు చున్నది. అప్పటి ప్రజానీక స్వతంత్రరాజ్యములయందు ఆయవ్యయములయొక్క నీతి వేఱుగానున్నది. ప్రాచీనకాలమందు రాజులకు కోశమునుంచుకొనుటకై ముఖ్యమైన ఆవశ్యకత యుండెడిదని యిచటజ్ఞప్తి యుంచుకొనవలసి యుండును ఎందుచేత? ఇప్పటిలో నేవి యునిష్టమువచ్చినట్లు క్రొత్త పన్ను

లు వేయఁబడఁజాలకుండెవి. ప్రాచీనపు పన్నులుకూడ హెచ్చింపఁబడఁజాలకుం డెను. కనుక ఇందుకై దండనీతిలో, మిగిలియున్న ధనమును రాజు తన కార్యములకై అనఁగా సుఖింపఁజేయుటకై మఱియు ధర్మము చేయుటకై కూడ వ్యయము చేయరాదని కఠిననియమముండెను,

## నా ణె ము లు

ఇపుడు మనము మహాభారతగాలపు నాణెములను బరిశీలింతము. ఆ సమయమందు ప్రస్తుతపు రాజపాలనయొక్క ఇట్టిమొహరులయొక్క ప్రచార ము లేకుండెను. బౌద్ధగ్రంథములఁబట్టి, ఆకాలమున రాగివి లేక వెండి యొక్క "నాణెములు" ప్రచలితమై యుండెడివని తెలియుచున్నది. కాని మహాభారతములో ఈశబ్దమెందును లభింపకున్నది మహాభారతమందు నిష్కమనెడి పేరు మాటిమాటికిని వచ్చుచున్నది. ఇది బంగారునాణెమై యుం డెను. దీనివెలయెంతయైయుండెనో తెలియకున్నది. అదిమఱియుకను గ్రుడ్డుకంటెనయ్యది పెద్దదై యుండును; ఎందుచేత? నిష్కమునరిగా దొరికినపుడు బ్రాహ్మణులకు నానందము కలుగుచుండెను కనుక మరియు నిట్టియానం దసూచకమైన వర్ణనము కనఁబడుచున్నది. "నాకునిష్కము దొరికెను నీకు నిష్కము దొరికెను" నిష్కమందలి మొహరులు ఇప్పటి మొహరులకు సమానమై యుండి యుండునని యనుమానము కలుగుచున్నది శ్రీమంతులైనవారి దాసీల గళములందు ధరించుటకై యీ నిష్కముల మాలిక తయారుచేయఁ బడుచుండెననియు వర్ణనమున్నది; మఱియు రాజుల దాసీలకై నిష్కకంఠి యనెడు విశేషణముయొక్క ప్రయోగముమాటి మాటికిని జేయఁబడియున్నది మహాభారతమునాటి నాణెములు నేవలు కెచ్చటను దొరకలేదు. దీనినిబట్టి మహాభారతకాలమందు అనఁగా చంద్రగుప్తుని కాలమందు నాణెములప్రచా రమే లేకుండెనని పాశ్చాత్యవిద్వాంసుల యూహయైయున్నది. బంగారము యొక్క కణములనేక చిన్నసంచిలోనుంచి విశిష్టమైన తూనికగల మొహరు

గానుపయోగింపఁబడుచుండెను. నాణెములను జేసెడి కళ హిందూదేశస్థులు గ్రీకులనుండి నేర్చుకొనిరని వారుచెప్పియున్నారు. ప్రాచీనకాలమందు ఇట్టిబంగారు నాణెములుపయోగింపఁబడుచుండెడిదను మాట సత్యమై యున్నది. బంగారురజము టిబెట్టునుండి వచ్చుచుండెను. హిందుదేశభాగములనుండి పర్షియన్ చక్రవర్తులకునీయఁబడెడి ప్రభుత్వపు పన్నులరూపముననే యీయఁబడుచుండెడిదని వ్రాసియున్నాడు. మనము మునుపు, హరివంశముయొక్క శ్లోకమందు దీనారుశబ్దము వచ్చియున్నదని చరిత్రకారులు చెప్పినారు కాని యీ శ్లోకము తరువాతిదియైయున్నది. కాని, మహాభారత కాలమందు నిష్కములు నాణెములై యుండెననియు, బంగారు రజము యొక్క కణములసంచులు లేకుండెననియుఁ జెప్పుట కఠినముకాదు. ఎందుచేతః వానియుపయోగము, చిన్నబొమ్మల మాలగా ఆ కాలమందుఁ జేయఁబడుచుండెను గనుక చాణక్యుని యర్థశాస్త్రములోఁ జంద్రగుప్తుని కోశాగారమును వర్ణించునపుడు స్వర్ణశాలయని పేర్కొని యున్నాఁడు. అందు భిన్నభిన్న ధాతువులయొక్క పరీక్ష యెట్లుచేయవలయునో విస్తరించి చెప్పఁబడియున్నది. కనుకనే మనము ధాతు సంశోధనమును నాటిగ్రీక్కు నాణెములఁ జేయుకళ కలను గ్రీక్కులనుండి నేర్చుకొన్నారను సంగతిచెప్పఁబడఁజాలదు. ఇదిగాకుండఁ గ్రింది శ్లోకములో మొహరుతోఁగూడిననాణెముల యొక్క స్పష్టమైన వర్ణనమున్నది. ఆలోచింపఁగాదానియర్థము గూఢమై యున్నది. అయినను అందు ముద్రశబ్దము స్పష్టముగాయున్నది.

మాతా పుత్రః పితా భ్రాతా భార్యామిత్రజనస్తథా।
అష్టాపద పదస్థానే దక్షముద్రేవలక్షనతే॥(శాం. 208-40)

## న్యాయ విభాగము

ఇప్పటి యున్నతమైన బ్రిటిష్ రాజ్యమందలి దేశవ్యవస్థ ప్రాచీనకాలమందలి భారతీయార్యరాజ్యముల దేశీయవ్యవస్థ కంటె మిగుల భిన్నము

కాకుండెను. కాని ప్రాచీనకాలమందలి న్యాయవ్యవస్థలోను మఱియునేటి న్యాయవ్యవస్థలోను మిక్కిలి యంతరము (తేడ) గలదు. కారణమేనంగా హిందూదేశ బ్రిటిష్‌రాజ్యమందలి దేశీయవ్యవస్థ హిందూస్థానమందలి పురాతన వ్యవస్థయొక్క యాధారముమీఁదనే రచింపఁబడియున్న; కాని యిప్పటి న్యాయపద్ధతి బొత్తిగా విదేశీయమైయున్నది. హిందూస్థానమందలి ప్రాచీన న్యాయపద్ధతితో దానికి గొంచెమైనను గూడ సంబంధము లేకున్నది. అది యింగ్లడు దేశములోని న్యాయపద్ధతియొక్క యాధారముమీఁదఁ జేయఁబడియున్నది. ఇందుచేత హిందుస్థానములకు గొప్పనష్టము తటస్థించెను. ఎందుచేత? హిందుస్థానపు లోకులయందు నేఁటి వ్యాజ్యముల యాట పై రుచి యుత్పన్నమై యున్నదనియు. వారి సత్యవాదిత్వమందుఁ గూడ న్యూనత వచ్చియున్నదనియుఁ జెప్పఁబడగలదు. మంచిది; ఈ విషయమై యెక్కువగాఁ జెప్పక మనమిచ్చట భారతదేశమందలి న్యాయపద్ధతిని వర్ణింతము, దీనిఁబట్టి, బ్రిటిషు రాజ్య మారంభమగునంత వఱకు జాలవఱకు రూపాంతరముతో భారత కాలికమైన న్యాయ పద్ధతియే హిందుస్థానమందుఁ బ్రచలితమై యుండెనని మనకుఁ దెలియఁగలదు,

మహాభారత కాలమందు రాజ్యములు చిన్నవిగా నుండెడివి. కనుకనే, న్యాయ సభలయందు స్వయముగా రాజు కూర్చుండవలయునను నిది స్మృతిశాస్త్ర నియమము బహు విధములఁ బాలింపఁబడుచుండెడిది. రాజు వివాద విషయమున న్యాయము చెప్పవలెనని యెవరికిని సమర్పింపఁ గూడదను నియమము ముమ్ము చెప్పఁబడియున్నది. తదనుసారముగా రాజు ప్రతిదినమును రాజసభకు వచ్చి న్యాయమును జేయుచుండెడివాఁడు న్యాయ కార్యమందు రాజునకు సహాయము చేయుటకై యొక రాజసభ యుండెడిది. ఈ రాజసభయొక్క వర్ణనము శాంతిపర్వములోని (85-వ) యధ్యాయములోఁ జేయఁబడి యున్నది. ఈ యధ్యాయము వివాదముల నిర్ణయించుటకే యైయున్న దనుటలో సందేహములేదు. యుధిష్ఠిరుఁడా

విషయము మీఁదనే ప్రశ్నించియుండెను. అప్పుడు భీష్ముడేయమాత్యులను (మంత్రులను) జెప్పియున్నాఁడో వారు న్యాయ సభలోని వారేయై యున్నారు. మఱియు ఈ యధ్యాయములో సంపూర్ణ వర్ణనమును బట్టి యిదే సిద్ధమగుచున్నది. సభలో వేదవిదులైన గృహస్థులు శుద్ధాచరణవంతులునైన బ్రాహ్మణులు, శస్త్ర ప్రవీణులైన యెనమండుగురు బలవంతులైన క్షత్రియులు. ఇరువదిమంది ధనవంతులైన వైశ్యులు, పవిత్రులును వినయ సంపన్నులునైన ముగ్గురు శూద్రులు నుండవలయును. సారాంశము, అన్ని వర్ణముల జనులతోను నిండియున్న జ్యూరీవంటి న్యాయసభ యొక్క సలహాచేత వివాదము యొక్క నిర్ణయము చేయఁబడవలయునని యిచట నాజ్ఞయీయఁబడినది: ఇది గాకుండ, రాజు విద్యాసంపన్నుడు, ప్రౌఢుఁడు, సూతజాతివాఁడు, ఏఁబదిఁ యేండ్ల వయసుగలవాఁడు, తర్కశాస్త్ర జ్ఞానముగల బ్రాహ్మణునిని పౌరునిగా నేర్పఱచుకొని యెనమండుగురు మంత్రుల నడుమఁ గూర్చుండి న్యాయమును జేయువలయును. న్యాయము చేయునపుడు ఏ పక్షము వైపు నుండియు రాజు అంతస్థుఁడై ద్రవ్యమును గైకొనఁగూడదు. ఎందుచేత? దీనిచేత రాజు కార్యమునకు విఘాతము కలుగును. మఱియు ఇచ్చువారికిని పుచ్చుకొనువారికిని పాపము తగులుచున్నది. "ఇట్లు చేయునేని రాజు దగ్గఱనుండి ప్రజ దేగ లేక గరుడము వద్దనుండి పక్షులు పరుగెత్తినట్లు పరుగెత్తును. మఱియు రాష్ట్రమునకు నాశనము తటస్థించును. ఏ నిర్బలులు మగుల బలవంతునిచేతఁ బీడితులైఁ న్యాయము నాయము, అని యఱచుచు రాజువైపునకు బరువెత్తు వారికి రాజునుండి న్యాయము దొరకవలయును. ప్రతివాది యంగీకరింపకున్నచో సాక్షియొక్క ప్రమాణమువల్ల న్యాయము చేయువలయును. సాక్షిలేనియెడల చిక్కని యుక్తిచేత నిర్ణయము చేయువలయును. అపరాధము యొక్క ప్రమాణమునుబట్టి శిక్ష యీయవలయును, ధనవంతులైన వారికి ధనమీయవలయును, దరిద్రులకు కైదు శిక్షయు దురాచారులైన

లోకులకు బెత్తపు శిక్షయు నీయవలయును. రాజు కూనీచేయువారి ప్రాణములఁ దీయుక మునుపు వారికి మిక్కిలి మర్దన చేయుసవలయును. ఇదే విధముగా నిప్పంటించువారికిని, జాతి భ్రష్టులగాఁ జేయు వారినిగూడ వదము చేయునలయును. న్యాయమ్ముగను ఉచితములైన శిక్షనిచ్చుటలో రాజునకుఁ బాపము తగులదు. కాని యేరాజు ఇష్టము వచ్చినట్లుగా శిక్షించుచున్నాఁడో, వానికి ఈ లోకములో అపకీర్తి కలిగి యంతమున నరకవాసము సంభవించును. ఏఁడోయొకని యపరాధమునకు మాఱుగా మఱియొకనికి శిక్ష సంభవింపఁగూడదను విషయముపైఁ బూర్తిగా ధ్యానముంప వలయును" (శాంతి, అ. ౮౫) ఈ వర్ణనములో సంపూర్ణమైన న్యాయపద్ధతియొక్క తత్త్వము కొద్దిలోఁ బ్రతిపాదింపఁ బడియున్నది. న్యాయకార్యములందు రాజునకు నాలుగు వర్ణములలోని వారి జ్యూరీ యొక్క సహాయము లభించుచుండెడిది. ఈ జ్యూరీలో వైశ్యులసంఖ్య ఎక్కువయినది. కాని. న్యాయ శాపములలో బహువిధముల న్యాయముయొక్క అనఁగా వైశ్యులకు సంబంధించిన వివాదము యెక్కువగా వచ్చుచుండెడివనియు ఇంతమంది వైశ్యానల సహాయముతోడ వ్యాపారవ్యవహారముయొక్క రీతికిని మర్యాదకును ననుకూలముగా నిర్ణయించుటలో సౌకర్యము తటస్థించుచుండెనని స్పష్టమగుచున్నది. మనకు నితిహాసమునుబట్టి యిట్టిచాతుర్వర్ణ్యముయొక్క న్యాయసభ మహాభారత కాలమునకుఁ బిమ్మట కట్టుపడిపోయెనని తెలియుచున్నది. * మృచ్ఛకటీ కటికమ్ములో రాజునకు మాఱుగా నొక న్యాధిపతియు రాజుసభకు మారుగా నొక శ్రేష్ఠిలేక సెట్టి వచ్చుచున్నారు. న్యాయసభలో రాజు స్వయముగాఁ గూర్చున్నప్పుడు నిర్ణయనకై మిక్కిలి కొలఁదిగా జగడములు

---

* కాశ్మీరమ్ములో నియితిహాసమునుబట్టి స్వయముగా రాజుకూడ న్యాయసభలోఁ గూర్చుండుచుండెనని తెలియుచున్నది.

రాజసభకు వచ్చుచుండి యుండును, ఎందుచేత? సాధారణముగా లోకులు రాజునెదుట జగడములను ప్రస్తావించుటలో సందేహించుచుండియుందురు ఆ జంజాటముల నిర్ణయమును వారు తనలోదాము చేసికొనుచుండిరి లేక నియమితన్యాయసభకు వెలుపల వాదప్రతివాదము లుభయసమ్మతిమీఁదఁ రాజీపడుచుండిరి. ఏ యుపాయమును దొరకనపుడు కేసు రాజునెదుటఁ బెట్టఁబడుచుండెను. సారాంశమేమనఁగా ఇప్పటి లెక్కకంటె నానాఁటివ్యాజ్యముల సంఖ్య మిక్కిలి తక్కువయై యుండెడిది. పూర్వకాలమందు విశేషించి, వాదిప్రతివాదులు లేక అర్థిప్రత్యర్థులు రాజునెదుటికిఁగలసియే వెళ్ళవలయును. మఱియు సాక్షులుకూడఁ దోడనేయుండవలయు సను వద్ధతియుండెను. రాజు ఏపక్షమునుండియు లంచముపుచ్చుకొనుట పాపముగా నూహింపఁబడుచుండెనని ముందే చెప్పఁబడి యున్నది. ప్రతివాది వాదియొక్క కంప్లెంటును నిషేధించుచున్న యెడల సాక్షులనుండి ప్రమాణముఁ శపథము తీసికొని నిర్ణయము చేయఁబడుచుండెడిది. పశము నుబుచ్చుకొనెడి పని మిక్కిలి యాడంబరముతో జరగుచుండెను. మఱియు సాక్షియొక్క మనస్సుపై దానియొక్క పరిణామము మిక్కిలి బాగుగా నగుచుండెను. దీని తరువాత న్యాయ సభలోని సభాసదుల జ్ఞానము యొక్క యాధారమున రాజు తన నిర్ణయమును చెప్పుచుండెడివాఁడు. మఱియు శీఘ్రముగనే దానియొక్క పాలనము జరగుచుండెడిది, తాత్పర్యమేమనఁగా పూర్వకాలమందు న్యాయము తొందరగా నగుచుండెడిది. మఱియు స్వయముగా రాజు న్యాయ కర్తయైన కారణముచేత ఎచ్చటను అపీలు చేయు కల్పన యుత్పన్నమగుట సంభవము కాకుండెను. అపీలుయొక్క కల్పన అంగ్లేయ రాజపుధియై యున్నది. మఱియు దానిలో వేఱు వేఱు తరగతులున్న కారణముచేత నిప్పటివారు పిచ్చివారివలె నై పోవుచున్నారు.

పూర్వకాలమందు స్టాంపు డ్యూటీ లేకుండెను. ఈ యేర్పాటు

బ్రిటిష్ శాసనములోని క్రొత్త సంస్కారమును ద్యోతనము చేయుచున్నది. కాని ప్రాచీనకాలమందు వారి ప్రతి వాదులకు ప్రభుత్వదండము భరింపవలసియుండెను. వాది పరాజితుఁడైనచో నతఁడు దండరూపమున దావాసొమ్మునకు రెట్టింపు ప్రభుత్వమున కీయవలసి యుండెడిది: మరి ప్రతివాది పరాజితుఁడైనచో నతఁడు దండస్వరూపమున నంతధనమే యిచ్చుచుండెడువాఁడు. ఈ దండ వ్యవస్థయొక్క కారణముచేతఁ గూడ న్యాయసభలోనికి వచ్చునట్టి దావాలు మిక్కిలి తక్కువ యగుచుండెడివి కాని మహాభారతమందు ఈ దండవ్యవస్థ యెచ్చటను బేర్కొనఁబడ లేదు. టీకాకారుఁడీ యుల్లేఖమును బిమ్మటిస్మృతుల ననుసరించి చేసి యున్నాఁడు. విశేషించి మహాభారతకాలమందు దండ వ్యవస్థ ప్రచలితము కాకుండెనని మన యూహయై యున్నది. ఎందుచేత? ప్రజలకు న్యాయమిచ్చుటకు మఱియు దుష్టులను శిక్షించుటకే రాజునకుఁ బన్నియవలసి వచ్చుచుండెనని చెప్పఁబడి యుండెను. అయినను ఈ విషయమున సంగతియు నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁబడఁజాలదు. వాది ప్రతివాదులిద్దఱకును సాక్షి యెవఁడును లేని యపుడు గొప్పయుక్తితో న్యాయము చేయవలయునవి కూడఁ జెప్పబడి యున్నది. ఇట్టి ప్రసంగములలో యుక్తిని యోచించు విషయమై యనేక కథలు ప్రసిద్ధమైయున్నవి, వాని నిచట వర్ణింపవలసిన యావశ్యకతయేమియును లేదు. కాని, యుక్తిచేతఁ గూడ నిర్ణయము కాఁజాలని యపుడు ఏమి చేయఁబడుచుండెనని ప్రశ్నము బయలుదేఱుచున్నది. స్మృతి గ్రంథములో దివ్యముయొక్క యాచారముయొక్క వర్ణనమున్నది, కాని మహాభారతమందలి భాషాంతరములలో దీని వర్ణనములేదు. అయినను ఈ యాచారము హిందుస్థానమందుఁ జాల ప్రాచీనకాలమునుండియు వ్యాపకమైయున్నది. ఛాందోగ్యోపనిషత్తులో తప్తపరశు దివ్యముయొక్క వర్ణనమున్నది. చోరుఁడు పట్టుకొనఁబడి తీసికొని రాఁబడుచుండెను, మరివాడు దొంగతనము చేయలేదని నిషేధించినపుడు వాని చేతిలో తప్తమైన పరశువు పెట్టఁబడుచుండెడిది.

కాని చేయి కాలిన యెడల వాఁడు చోరుఁడనియు నూహింపఁబడు చుండెను. ఈ వర్ణనము ఛాందోగ్యోపనిషత్తులోఁ గలదు. అగుఁగాక; ఉపాయముచేతను న్యాయము సంభవింపనపుడు మహాభారత కాలమందుఁ గూడ నిట్టి దివ్యముల చేతనే పని సాగింపఁబడుచుండి యుండును. పూర్వ కాలమునందు వివాదములయందు సివిల్ కోర్టునకు క్రిమినల్ కోర్టునకు భేదము లేకుండెను. రెండు విషయముల పరీక్షయు నొక విధముగనే జరగుచుండెను. మఱియు అదికూడ బహు విధముల శీఘ్రముగనే యగు చుండెడిది. వాది ప్రతివాదులిద్దఱును సంతోషముతో న్యాయ సభకు హాజ రగుచుండెడివారు. ప్రతివారిని ప్రభుత్వాధికారులుకూడఁ బట్టుకొని న్యాయ సభ యెదుటికిఁ దీసికొని వచ్చుచుండిరి. శిక్షలో దండము, కైదు. ప్రహరము, వధము అని నాలుగు భేదములుండెను. వధ శబ్దమున కర్థము కేవలము ప్రాణములు తీయుట కాకుండెను. అందు కాలు సేతులు నఱకుట యనెడి శిక్షయు నుచితమగుచున్నది. ధనవంతులైన వారికి ఆర్థిక దండ మీయుపలయునను నిట్టి నియమమున్నదని చెప్పుటలో నొకవేళ యాశ్చర్యము తోఁచవచ్చును. కాని హత్య చౌర్యము మొదలైన యపరాధములయందు దీవసాద లందఱకును వధ శిక్షయే తటస్థిం చుచుండెను. ప్రహరమనఁగా చెత్తము శిక్షయై యున్నది. ఈ శిక్ష యిప్పటి విధానము ననుసరించి దుష్టులను కువృత్తి వంతులునైన లోకులకే యగుచున్నది. ఇట్లే పూర్వకాల న్యాయ వద్ధతియందును నగు చుండెను. అన్యదేశీయమైన ప్రాచీన న్యాయ పద్ధతికంటె హిందుస్థాన మందలి ప్రాచీన న్యాయ పద్ధతిలో, అపరాధము నొప్పించుటకై యే ప్రతివాదికిని గొంచెము గూడ మర్దన చేయఁబడ కుండుట యనునది యొక్క మిక్కిలి గొప్పదైన విశేషగుణమై యుండెను. చీనా దేశమం దును పశ్చిమపు స్పెన్ దేశమందును క్రీస్తు రాజ్యములో నంతర్గతమైన యపరాధమును దగుల్చుటయే మిగుల భయంకరమై యుండెను. ఈ దేశములలో, ప్రతివాది నుండి యంగీకారపుటుత్తరమును దీసికొనుట

యావశ్యకమనియే దృఢ నిశ్చయముండెను. అచ్చటఁ బ్రతివాదియొక్క దుర్దశ యనేక దినముల వఱకు భిన్న భిన్న విధముల శాసనాధార మునఁ బ్రకటింపఁబడు చుండెను. హిందుస్థానము యొక్క ప్రాచీన న్యాయ పద్ధతిలో నిటువంటి వ్యవస్థ లేకుండెననుసంగతి భారతీయా ర్యులకై భూషణ ప్రదమై యున్నది. ఇప్పటి దృష్టిని బట్టి కొన్ని శిక్షలు కఠినములుగాఁ దోఁచుచున్నవి. కాని ప్రాచీన కాలమందు సమస్త దేశములందును కఠిన శిక్షయే యీయఁబడు చుండెను. ఈ విషయము మీఁద మహాభారతములో మనోరంజకమైన యొక కథ గలదు. స్నానము నకై వెళ్ళునపుడొక ఋషి దారిలో నొక సుందరమైన మొక్కజొన్న చేనును జూచెను. అతనికి నిచ్ఛకలిగి యొక్క మొక్కజొన్న పొత్తిని విఱిచెను. కాని కొంత సేపైన తరువాత నతనికి మిక్కిలి పశ్చాత్తాపము కలిగెను. ఆతఁడు దానిని పట్టుకొని రాజు దగ్గఱకు వెళ్ళి తన యపరా ధమును స్వయముగాఁ బ్రకటించుకొని తన చేతిని నఱకుటకై ప్రార్థింపఁ దొడఁగెను. రాజు అతని ప్రార్థన నంగీకరింపలేదు. అపుడతఁడు చెప్పఁ దొడఁగెను—"అపరాధులను శిక్షించునట్టి రాజు స్వర్గమునకుఁ బోవుచు న్నాఁడు. కాని వారిని శిక్షింపనివాఁడు నరకమునకుఁ బోవును." ఈ మాట విని నిరుపాయుడైన రాజు అతని కిష్టమైన దండము నిచ్చెను. మఱియు అతని చేయి తెగుచుండఁగనే దేవతలయొక్క కృపచేత ఆ చోటున మఱియొక సువర్ణ హస్త ముత్పన్నమయ్యెను. దీనిఁ బట్టి, దండింపఁదగిన వారిని దండించుట ప్రాచీన న్యాయపద్ధతిలో రాజునకుఁ బవిత్రమైన కర్తవ్యముగను నత్యంత మహత్త్వవంతముగను నూహింపఁ బడుచుండెనని సిద్ధమగుచున్నది. కాని పూర్వకాలమందు, అపరాధము లేకుండనెవ్వని శిక్షింపఁ గూడదనియు కారణము లేకుండనెవ్వని యాస్తియు వేలము వేయగూడదనియు నొక తత్త్వముకూడ మన్నింపఁ బడుచుం డెను. ఈ తత్త్వమునకు విరుద్ధముగా మునుపటి రాజుగాని యిప్పటి రాజు గాని అన్యాయము చేసినయెడల నియ్యది యా పద్ధతిలోని దోషము కానేరదు. పైని జెప్పఁబడిన న్యాయ పద్ధతి హిందూ దేశీయుల స్వభావము

నకు ననుకూలముగా వారి యితిహాసమునుండి యుత్పన్నమై యుండెను. దానివల్ల వారు సుఖులై యుండెడివారు. వారు దానిని యోగ్యమైనదిగా నూహించుచుండిరి. పూర్వకాలమందు నీ అపరాధులసంఖ్య మిక్కిలి తక్కువగా నుండుచుండెను. మఱియు లోకులయొక్క సత్యవాదిత్వము ఏ విధముగను భగ్నము కాకుండెడిది. సాక్షులు మిక్కిలి కఠినమైన శపథముల ద్వారా సాక్షాత్తు రాజు సమ్ముఖమున నగుచుండిరి. కనుకనే వారనృత మాడకుండిరి. ఆ సమయమున వాది ప్రతివాదులకు వకీళ్ళుండెడివారు కారు మఱియు ముఖ్యముగా ప్రకటనము ప్రతివాది వైపునుండు వాది పక్షపు సాక్ష్యమును బరీక్షించుట, విచారణము, మొదలగు నాగడములు లేకుండెడివి. ప్రతి వ్యాజ్యము నందును రాజునకు బుద్ధిమంతుల సలహాయొక్క యావశ్యకత యుండుచుండెను మఱియు న్యాయసభలోని సభ్యులు నాలుగు వర్ణముల వారు నగుటచేత సాక్షులతోఁ బరిచితులై యుండుచుండిరి. వేర్వేఱు తరగతుల యప్పీలు కోర్టులు బొత్తిగా లేకుండెను. ప్రత్యక్షముగా రాజుయొక్క లేక బుద్ధిమంతుల యొక్క నమ్మకమున స్థిరమైన న్యాయము అగుచుండెను. ఇందువలన నిష్టము వచ్చినట్లు సాక్షమిచ్చుటకు నిష్టము వచ్చినట్లుగా జగడములఁ బుట్టించుటకును మార్గములన్నియుఁ బూర్వకాలమందు బందయి పోయి యుండెను బహుధా లోకులు జగడముల తీర్మానమును తమలోనే వారెంచుకొనుచుండిరి మఱియు వారబద్ధ మాడుటకెన్నడును తయారుగాకుండిరి ఈ సంగతి గ్రీకుల వర్ణనముఁ బట్టియు మహాభారతకాలమ్మందు నిజముగా నుండెనని సిద్ధించుచున్నది హిందూదేశీయుల యొక్క సత్యము విషయమై వారు ప్రమాణమును వ్రాసియుంచి యున్నారు. వారు చంద్రగుప్తుని ప్రచండమైన సేనలో మిక్కిలి తక్కువ యపరాధములగు చుండెననియు వ్రాసియున్నారు వారి లేఖములఁబట్టి హిందుస్థానమందు రాజ సభకు సంబంధించిన దావాలు బొత్తిగా లేనట్లు ప్రకటమగుచున్నది వారి వర్ణనముఁ బట్టి యెవరైనను మఱియొకనికి ద్రవ్యమునిచ్చి ఆ

ద్రవ్యము వానికి మరల లభించనప్పుడు అతఁడు పెండన వానిపై నమ్మక ముంచిన కారణము చేతఁ దన దోషమనియే యనుకొనుచుండెనని తెలియుచున్నది

చంద్రగుప్తునియొక్కయు మహాభారతముయొక్కయు గాలమునకుఁ బిమ్మట రాజ్యములు పెద్దవై పోయినవి ఇందుచేత, అన్ని వ్యాజ్యముల నిర్ణయమును స్వయముగా రాజే చేయవలయునను నియమము శిథిలమై పోవుచు వచ్చెను మఱియు న్యాయాధిపతిని లేక యమాత్యుని నుంచు కొనెడి పద్ధతి యారంభమయ్యెను వీనియొక్క యుల్లేఖము మహాభారత మందే యున్నది కోర్టులో నయ్యెడి యుండఱు సాక్షులకును బూర్వకాల మందు పత్రములుంచబడు చుండెడివికావు సాక్షి శబ్దముయొక్క నిజమైన యర్థము ననుసరించి యన్ని విషయములును ముఖముతోఁ జెప్పఁబడుట ప్రశస్తముగాఁ దోచుచుండెను కాని మృచ్ఛకటికమునందు కోర్టు వర్ణన సందర్భమున లేఖకులు, వారియొక్కయు వారి సాక్షి యొక్కయు ప్రకటనము వ్రాయుచుండెడివారని చెప్పఁబడి యున్నది దేశీయ కార్యములకై లేఖకు లుండెడివారని ముందే చెప్పఁబడి యున్నది ఇందుచేత న్యాయ కార్యమునందుఁ గూడ లేఖకుఁడుంట యసంభముగా దోఁచదు,

మహాభారతమందు వర్ణింపఁబడి యున్న దండముయొక్క యుల్లేఖ రీతినే యున్నది కాని యుపయుక్తము కాని శ్లోకములవలె నగపడు చున్న యీ శ్లోకములకు నిజమైన యర్థమేమో విచారింపవలసి యున్నది టీకాకారుఁడు వానికి అర్థమును స్మృతి శాస్త్రములో నీయఁబడియున్న న్యాయపద్ధతికి ననురూపముగాఁ జేసియున్నాఁడు ఈ పద్ధతియొక్క విస్తృతమైన యుల్లేఖము స్మృతులలో నున్నట్లుగా యద్యపి మహాభారతమందు లేకున్నది అయినను అట్టి పద్ధతి మహాభారతకాలమందుఁ గూడ నుండి యుండునను నమమానమును నిర్వివాదముగా బయలుదేఱుఁ దీనవ లసి యున్నది దండము యొక్క వర్ణనమిట్లు చేయఁబడి యున్నది—

నీలోత్పలదలశ్యామ శ్చతుర్దంష్ట్రశ్చతుర్భుజః।
అష్టపాన్నైకనయనః శంకు కర్ణోర్ధ్వరోమవాన్॥

జటీద్విజిహ్వ స్తామ్రాక్షో మృగరాజ తనుచ్ఛదః। [శాం. అ. 121-15

అనఁగా దండము నల్లనిది; దానికి నాలుగు దంతములు, నాలుగు భుజములు, ఎనిమిదికాళ్ళు, అనేకనేత్రములు, శంకుకర్ణములు, నిలబడి యున్న కేశములు, జటలు, రెండునాలుకలు, ఎఱుపురంగుగల కన్నులు, సింహచర్మముయొక్క వస్త్రమును గలవు. టీకాకారుఁడే వర్ణనముయొక్క సందర్భమునిట్లు కలిపియున్నాఁడు నాలుగుదంతములనఁగా నాలుగువిధము శిక్షలు-దండము, కైదు, కొట్టుట, చంపుట. నాలుగు భుజములనఁగా ద్రవ్యము తీసుకొనుటలోని నాలుగు పద్ధతులు-నగరదండము గైకొనుట, వాదినుండి తీసికొనఁబడిన ధనము రెట్టింపుగా వసూలుచేయుట, ప్రతివాది నుండి తీసికొనఁబడిన ధనమునకుఁ దుల్యముగా వసూలుచేయుట, ఆస్తిని పొందుట. [మహాభారతములో ఈభేదములు వర్ణనము చేయఁబడలేదు.] దండముయొక్క యెనిమిది కాళ్ళనఁగా వివాదపరిక్షణమునకు సెనిమిది చీడీలు- 1 వాదియొక్క ఫిర్యాదు, 2 వాదిసాక్షి, 3 ప్రతివాదిని స్వీకరింప కుండుట లేక 4 మనము స్వీకరించుట, 5 ఇతరమైన జగడములు లేక ఫిర్యాదులు [మొఱలు] [ప్రతివాదియొక్క దావాను అంగీకరించినపుడు దండమున కవకాశముండదనుట స్పష్టమైయున్నది.] 6 [అపరాదులవాదుల నుండి దండము యొక్క పేరుమీఁదఁబుచ్చుకొన్న ధరానతు] 7 మనము నిర్ణయము టీకాకారుని చేతఁజెప్పఁబడియున్న యీ యెనిమిది సోపానముల వర్ణనము ఏగ్రంథమందును లేకున్నది. అయినను అది మిక్కిలి యుక్తి పూర్వముగాఁదఁచుచున్నది. అనేక నేత్రములనఁగా రాజుయొక్క యిష్టమంత్రులు మఱియు 36 సభాసదులుగూడనని చక్కఁగా వచ్చుచున్నది. శంకుకర్ణము సంపూర్ణముగాధ్యానించుటకును ఊర్ధ్వరోమము

ఆశ్చర్యమునకును చిహ్నములై యున్నవి. ఇదేవిధముగా, శిరముపై జట యుండుట వాజ్యములో ప్రశ్నముల యొక్క విచారణముల యొక్క చిక్కులకు లక్షణమైయున్నదనుటయు రెండునాలుకలు వాదిప్రతుల విషయమైయున్న చూచించెవవిషయమైయున్నవి శక్తివర్ణము నేత్రములకుండుట క్రోధచిహ్నమై యున్నది. మఱియు సింహచర్మధారణము న్యాయాసనము నెదుట జరుగు పరీక్షకు అత్యంతధార్మికత్వమును బవిత్రతను సూచించుచున్నది. వాస్తవమున పై శ్లోకమునకు సత్యమైన యర్థమిదియేయని నిశ్చయముగా చెప్పఁబడఁజాలదు, అయినన్ను, ఇందుసౌతినోటనం న్యాయపద్ధతి యొక్క స్వభావము వర్ణింపఁబడియున్నదనియు దానియొక్క నిజమైన చిత్రము ఈ రూపమున మనయెదుట నిలబడినదనియు సూత్రము నిర్ణయమైనది.

న్యాయాధికారులయొక్క యుల్లేఖము మహాభారతమందు కచ్చిదాధ్యాయములోనే కలదు. సమ్ముఖమునకు వచ్చిన వాదిప్రతివాదుల మాటలను శాంతిచిత్తముతో వినుటయు నుచితమైన నిర్ణయమును జేయుటయు రాజునకు ప్రథమకర్తవ్యమైయున్నది. కనుకనే నీవు ఈ కార్యములో నాలస్యము జేయుటలేదుకదా? అని యిట్లు స్పష్టముగాఁ బ్రశ్నముచేయఁబడియున్నది. ఇందు భారతకాలమందలి పరిస్థితిచేప్పఁబడియున్నది. కాని పిమ్మటఁబ్రశ్నముజేయఁబడియున్నది — "నిర్మలాచారవంతుడైన యేసాధువుమీదనైనను చౌర్యము నిందిచటము సైనంర న్కమునపరాధము నిరూపింపఁబడునని వానిని వ్యర్థముగా దండించుట యనుచితము. ఇట్టి సదాభావకమైన మనుష్యుల సంహత్తు నపహరించి యూతనికి మృత్యుదండమున విధించు నిట్టిలోభులైన యామాత్యులను మూర్ఖములని యూహింపవలయును. నీరాజ్యమందు నిట్టియనాబాయకులేరుగదే యని. దీనిఁబట్టి మహాభారతకాలమందు న్యాయము చేయునట్టి యమాత్యునుత్పన్నులై యుండిరని తెలియుచున్నది.

కచ్చిద్దార్యో విశుద్ధాత్మా క్షారితశ్చౌరకర్మణి।
అదృష్టశాస్త్రకుశలై రని లోభాద్వ్యధతే శుచిః॥ [సభా. అ. 5-104]

క్రీస్తు ధర్మమై యున్నది. ఇటువంటి వన్నియు నున్నప్పటికిని ఒకటే యార్యవంశము వారై నప్పటికినిగూడ నెన్నెన్నటి మహాయుద్ధమును బట్టి, యీ యూరపియన్ రాష్ట్రములు ఒకటి మఱియొక దానిని ద్రోసివేచు టకై యెట్లు తయారై కూర్చున్నవో మనకుఁ దెలియుచున్నది. స్పెన్సరు యొక్క సిద్ధతదనుసారముగా రాష్ట్రముల స్పర్ధయే వాని యున్నతికిఁ గారణమై యున్నది, ఈ సంగతికూడ నీ యుద్ధము వల్లఁ దెలియఁ గలదు. రాష్ట్రము లోకదానినొకటి జయించుటకై యత్నించుట యుద్ధ శాస్త్రముయొక్క మేన్నత్యమునకుఁ గారణమై యున్నది; ఇంతియేకాక, మనుష్యునకేమి హక్కుగలదో, రాష్ట్రములకుఁ బరస్పర సంబంధమేమి యున్నదో మఱియు రాష్ట్రములకు శత్రు సంబంధమెట్లున్నదో యీ తత్వములకు గూడ బూర్ణ వికాసము అయి యున్నది. మహాభారతకాల మందుఁగూడ నీ విషయమున భారతీయార్యుల యొక్క యున్నతి మిక్కిలి దూరముగాఁక అయియుండెను. ఆ సమయమున, శత్రువు నెట్లు స్థిరముగానుంచుకొన వలయునో మిత్రరాష్ట్రముల నెట్లు చేయువల యునో మాండాపకులైన రాజుల ను దనయధినతలో నెట్లుంచుకొనవల యునో ఈ మొదలైన వన్నిటి జ్ఞానము అయి యుండెను. కనుక మనము పరరాజ్య సంబంధమైన తత్వమ్మునిచట విచారింతము.

మహాభారత కాలమందలి భిన్న భిన్నములైన యార్య రాష్ట్రములోఁ బములోఁ దమకు నెన్ని జగడములు ఎన్ని యుద్ధములు జరిగినను ఆ రాష్ట్రములయందు మిక్కిలి తీవ్రతతోడను మిక్కిలి ప్రజ్వలిత రూపము తోడను వానికిఁ దమ స్వాతంత్ర్యమునకు నాశము రానీయఁ గూడదను భావము బాగారుకమై యుండు చుండెను. ఇప్పటి యూరిపియన్ రాష్ట్ర ములకు వలె వానికి ఈ విషయములై మిక్కిలి ధ్యాన ముండెడిది. ప్రస్తుతపు పాశ్చాత్యరాజు శాస్త్రవేత్తలయొక్క సిద్ధాంతము స్వతం త్రులైన యొక మతమువారు ఎంత తక్కువ మంది యైనను సరియే

వారి స్వాతంత్ర్యము ఏ విధమునను నష్టము చేయఁబడఁ జాలదని యై యున్నది. ప్రాచీన భారతీయార్య రాష్ట్రముల పరిస్థితి యీ సిద్ధాంతమున కనుకూలమై యుండెను. వానికి స్వతంత్రతా సంబంధియగు నభిమాన మెల్లప్పుడును జాగరూకమై యుండుచుండెను. ఎప్పుడైన నొక రాష్ట్రమును గెలిచినపుడుకూడ అయ్యది రెండవ దానిని పాదాక్రాంతముగా లేక నష్టమైన దానిని జేయఁజాలకుండెను. ఈ కారణముచేత భారతీయ కాలము మొదలు ప్రాయికముగాఁ దుదవఱకు మునుపటి వారే యగపడుచున్నారు మహాభారత కాలమునకు దాదాపున అన్యరాజ్యములను నశింపఁజేసి చంద్రగుప్తుని రాజ్యమువంటి పెద్దపెద్దరాజ్యము లుత్పన్నమగుట యారంభమై యుండెను. కాని భారతకాలమందు ఆర్యుల స్వాతంత్ర్యము స్థిరమైయున్న కారణముచేత — ప్రస్తుతకాలమున ఈ రోజునందు పుర్తుగల్ బెల్జియమ్ మొదలైన చిన్నచిన్న స్వతంత్ర రాజ్యములు స్థిరముగానున్నట్లే ప్రాచీనకాలమందు భారతీయార్యులు తమతమ చిన్నచిన్న రాజ్యములను వందలకొలఁది యేండ్లవఱకు స్థిరముగానుంచియుండిరి. * ఆర్యరాష్ట్రముల సముదాయమునకు లక్ష్యమిట్లే యుండెను. వర్తమానము యూరోపురాష్ట్రముల సముదాయమునకు, ఏ రాష్ట్రమును నశింపనీయఁగూడదనునట్టి ఏ నీతికలదో

* ఏ రాజైనను వెంబఁటను ఎపుడు అంతఃపురమునకు అనఁగా స్త్రీలను గూడఁజింత చేయనక్కఱలేదు. వారిని జంపవలయునా? రాజపుత్రుల వలె స్త్రీ నాశము చేయవలయునా?

అవరోధాన్ జుగుప్సేత కా సపత్నధనే దయా।
నత్వేవాత్మా ప్రదాతవ్యః క్షమే సతి కథంచన॥ శాంతి 131-8

లేక,

హతో వా దివ మారోహేత్ హత్వా వా క్షితి మావసేత్।
యుద్ధేహి సంత్యజన్ ప్రాణాన్ శక్రస్యైతి సలోకతామ్॥ అ. 131-12

రాజు చనిపోయినప్పటికిని ఉద్యోగమును విడువనక్కరలేదు లేక ఎవనిని శరణు జొచ్చవలసినవసరములేదు.

అట్లే ప్రాచీనకాలమందు భారతీయార్యులనుగూడ నిట్టి నీతియే యుండెను. ఆసమయమున నేరాజైనను గెలువఁబడునేని వానిరాజ్యము వానికొడుకునకు లేక బంధువులకే యీయవలయునని నిశ్చితమైయుండెను. రాష్ట్రముయొక్క స్వాతంత్ర్యమును నశింపఁజేయఁగూడదను నియమముండెను. రాష్ట్రస్వాతంత్ర్యమునకై భారతీయార్యులెంత యుత్సాహముపొందు దృఢతతోడను బోరాడుచుండిరో యీ సంగతికుదాహరణము భారతీయయుద్ధమే యైయున్నది. ఒక చిన్న పాండవరాష్ట్రమునకై భరతఖండములోని రాజులందఱును ఒక యుద్ధములోఁజేరి యుద్ధారంభమునను న్న ౧౮ లక్షలమందిలోను తుదికి నెనకుండుగురుమాత్రమే జీవించి మిగులనంతటి యుత్సాహముతో బోరాడిరి. ఇది యొకవేళనతిశయోక్తి యగుఁగాక, అయినను వర్తమాన యూరోపీయ యుద్ధమందు యుద్ధముచేసినవారియొక్కయుఁ జనిపోయినవారియొక్కయు సంఖ్యను విచారింపఁగా మనకు నంతము విషయములో వర్తమాన యూరోపీయ యుద్ధముయొక్క సామ్యమగపడుచున్నది.

ఈవిధముగా భారతీయప్రాంతములయొక్క స్వాతంత్ర్యప్రీతి మిక్కిలి దృఢమైయుండెను మఱియు ఇందుచేత ప్రాంతములకు నాశము లేకుండెడిది. అయినను ఈ యార్యప్రాంతములయందును ఎల్లపుడును శత్రుత్వమునకు సంబంధమున్న కారణముచేత నొకరిపై నొకరు ఆక్రమించుటకై యెల్లపుడును తయారగుచుండెడివారు. మహాభారతమందు రాజధర్మములో, రాజెన్నఁడును చేయిపైఁ జేయివైచుకొని కూర్చుండరాదని జెప్పఁబడియున్నది. ఏదోయొక

ఉద్యచ్ఛేదేవ న నమేదుద్యమో హ్యేవ పౌరుషం
అప్యపర్వణి భజ్యేత న నమేద్దేవ కస్యచిత్ ।
అప్యరణ్యం సమాశ్రిత్య చరేన్మృగ గణైస్సహ
నత్వేవోద్ధత మర్యాదై ర్దస్యుభిః సహిత శ్చరేత్॥

ఈ వాక్యములఁబట్టి, సికందరుకాలమున భారతీయ క్షత్రియులు స్వాతంత్ర్యయముకై యేవిధముగాఁ బ్రాణత్యాగమును జేసియుండిరో యీ మాట తెలియుచున్నది. ఈ యధ్యాయములోని వర్ణముఁబట్టి, యీ ప్రసంగము గ్రీకువారియుద్ధముదేయని తెలియుచున్నది.

దేశముమీఁద నవశ్యము దండెత్తవలయును, * ఈ కారణముచేతఁ బ్రతి ప్రాంతమందును సైన్యమెల్లపుడును దయారగుచుండెడిది, లోకులయొక్క పూర్తత్వమెన్నండును మందముగా నిలబడెడిదికాదు మఱియు వారి స్వాతంత్ర్య ప్రీతికి బాధ రాకుండెను. మఱియు ఆర్యులనీతిమత్త విషయమై యుద్ధ నియమములు ధర్మముచేత మిగుల బిగించి కట్టఁబడి యుండెడి దనుటయు తోడ్తోడనే దయాయుక్తులగుచుండుటయు నత్యంతముభూషణప్రదమగు సంగతియైయున్నది, ఈ విషయముయొక్క నిర్ణయము ముందు కాఁగలదు. భారతీయార్యరాజులకు. ఇతరుని గెలువవలయుననెడి తమయిచ్ఛను నెఱవేర్చుకొనుటకై తృప్తిఁ బొందించుటకై అధార్మిక యుద్ధమునైన నాశ్రయింపవలయుననెడి కల్పనకాకుండెను—వారియొక్క స్పర్ధ భారతీయ సేనయొక్క యుత్కృష్టపరిస్థితిని గూర్చియే యగుచుండెను. ఈకారణముచేత భారతీయార్యులు యుద్ధమున అజయ్యులై యైపోయియుండిరి. గ్రీకులు వారియుద్ధ సామర్థ్యమును మిక్కిలి ప్రశంసించియున్నారు. వారు ప్రాచీనకాలమందు హిందుస్థానముమీఁదికి సికందరుకాలము మునుపు ఎవరును దండెత్తియుండలేదు. చంద్రగుప్తునియొక్కయు నశోకునియొక్కయు సమయమున నుండి రాజకీయమును ధార్మికమునైన రెండుస్థితులును మారిపోయెను. అందుచేత భారతీయార్యుల యుద్ధసామర్థ్యము, స్వాతంత్ర్య ప్రీతియుఁ దగ్గిపోయెను కనుకనే హిందుస్థానేతిహాసముయొక్క దిశయు నదే సమయమునుండి మాఱుచుఁబోయెను

ఆలోచింపఁగా శత్రువును గెల్చుటకై దండము సైన్యము ముఖ్యోపాయములై యుండెను. అయినను ఈ కార్యమునకై మఱియొక యుపాయముకూడ ఆసమయమందుఁ దెలియఁబడియుండెను. మహాభారతములో కచ్చిదధ్యాయమందును శాంతిపర్వములోని రాజధర్మమందును నీయఁబడియున్న నీతిశాస్త్రనియమములో శత్రువుఁబరాజయము జేయుటకై సామము, దానము, భేదము, దండము, మంత్రము, ఔషధము మఱియు ఇంద్రజాలములోని యేడుపాయములను నిర్ణయింపఁబడియున్నవి. శత్రువు

---

భూమిరేతౌ నిగిరతి సర్పో బిల శయానివ।
రాజానం చావిరోద్ధారం బ్రాహ్మణం చాప్రవాసినం॥

యొక్క బలాబలములను బరీక్షించి విజిగీషులైనవాఁడు- చెప్పఁబడియున్న యుపాయములలో నేదైన యుపాయమును- యోచింపవలయునని చెప్పఁబడియున్నది. వీనిలో మంత్రము దైవోపాయమైయున్నది. మనమిది విచారింపఁగూడదు. మనము ఇంద్రజాలముయొక్క విచారమును జేయము. సామమనఁగా సంధియైయున్నది. ఇది శత్రువుతో సంధిచేసికొని యొండొరుల వైమనస్యమును దొలగించుకొనుటకు నుపాయమైయున్నది.

ఈ సంబంధములో, మహాభారతమందు విగ్రహము లేక సంధిచేసికొను నధికారియు విశేషమంత్రి లేక అమాత్యుఁడు చెప్పఁబడియుండకుండుట యాశ్చర్యకరముగా నగపడుచున్నది. అయినను ఇట్టిసంధివిగ్రహ కర్తయగు నధికారి యవశ్యము ఉండియుండును. గుప్తకాలమగు శిలాలేఖములయందు ఈ యమాత్యునిపేరు మహాసంధివిగ్రహకుడని చెప్పఁబడియుండెను. వీరి యిప్పటి "ఫారిన్‌మినిస్టరు" అయియున్నాఁడు. ఇట్టియమాత్యులకు పరప్రాంతములతో నిత్యసంబధము ఉండుచునేయుండును. వీరు మహాభారత మునాఁటి రాజవ్యవస్థయందు నావశ్యముగా నుండియుందురు. యుద్ధముకంటె సామము యొక్క వెలయెక్కువై యున్నది. ఈసంగతి యుపాయములన్నిటిలోను సామమునకు నగ్రస్థానమిచ్చుటచేత సిద్ధమగుచుండెను. భారతీయయుద్ధకాలమున శ్రీకృష్ణుండు యుద్ధమునకు ముందుగా సంధిచేయుటకై పంపఁబడియుండెను. శత్రువునకు ద్రవ్యమునిచ్చి యాతనిని ప్రసన్నము చేయుటదానమైయున్నది. ఈ విధముగాను కాక యుక్తిచేత ప్రాంతములు తాము స్వాతంత్ర్యమును నిలుపుకొన వలయును. దండముయొక్కయు యుద్ధముయొక్కయు నుపాయములు వేఱుగావర్ణింపఁబడును.

ప్రాచీనకాలమందు భేదమునకెక్కువ మహత్త్వమీయఁబడియుండెను. ప్రతిరాజును వాని రాజ్యమందు ద్రోహమునుత్పాదించుటకుఁ బ్రయత్నించవలయునని రాజనీతిలోఁ బ్రకటముగాఁజెప్పఁబడియుండెను. యద్యపి యీసంగతి ప్రస్తుతకాలమునఁ బ్రకటనగాఁ జెప్పఁబడుచుండుటలేదు, అయినను ప్రతియున్నతప్రాంతము ఇపుడుకూడ నీయుపాయమునుస్వీకరించుచుండెను ప్రతిరాజును బరరాజ్యమునకు గుప్తచరులను బంపవలయుననియు నచ్చటి

వారునగువారికి నభీష్టవస్తువు ప్రాప్తించదు * రాజ్యాంగములనన్నిటిని గుప్తముగా నుంచుకొనవలయును. బకమువలె నభీష్టవస్తువును జింతించుచు నుండవలయును, సింహమువలెఁ బరాక్రమమును జూపుచుండవలయును

బాణమువలె శత్రువుపై విరుచుకొని పడవలయును. మృగము వలె సావధానతతో నిద్రింపవలయును. అవసరము వచ్చినమీఁదఁ జెవిటియు గ్రుడ్డియుఁ గూడఁ గావలయును. యోగ్యమగు దేశకాలములు దొరకిన తోడనే పరాక్రమింపవలయును. యద్యపి ప్రయత్నమునకు ఫలము సంపూర్ణము కాకపోవచ్చును, అయినను బూర్ణత్వమును బొందినట్లుగానే యాచరణము చేయవలయును. అవసరముము వచ్చినపుడు శత్రువు నాశపెట్టవలయును. దానికి నొక సమయము హద్దుగాఁ జెప్పవలయును. పిదప నయ్యది సఫలమగుటలో మాత్రము విఘ్నము చేసిపై వవలయును. పిదప విఘ్నములకుఁ గారణములఁ జెప్పవలయును. గారణములకు మూలముగా నొక హేతువు చెప్పవలయును. శత్రువునకు భయముత్పన్నము కానంతవఱకు భయపడిన వాడువలె వ్యవహరింపవలయును. కాని భయము పుట్టఁగానే నిర్భయుఁడైన వానివలె వానిపైఁ బ్రహారము చేయవలయును. సంకేతములోఁబడకుండ మనుష్యుని దృష్టి యందు శుభమగుపడదు; కాని సంకటములోఁబడిన మీదట జీవించియున్నంతట, కళ్యాణమవశ్యముగా నగపడగలదు. శత్రువుతో సంధిచేసికొని వానిపై నమ్మకముంచి సుఖముగాఁబడియున్నవాఁడు వృక్షశిఖరముపై నిద్రించు మనుష్యునివలెఁ గ్రిందకుఁ బడిపోవుచున్నాడు. సౌమ్యుఁడైనను భయంలేనివాడైనను సరియే, యేదోయొక విధమైన కార్యమునుజేసి దీన దశనుండి తన్నుద్ధరించుకొనవలయును; సామర్థ్యము వచ్చినమీఁదట ధర్మమును జేయవలయును. శత్రువుయొక్క శత్రువుతో సహవాసముజేయవలయును. ఉపవనము, విహారస్థలము, చలివెందర, ధర్మశాల, మద్యపాన గృహము, వైశ్యలయిండ్లు, తీర్థములు వీనికి ధర్మవిధ్వంసకులు,

---

* ఈవాక్య మత్యంతమును మార్మికమైయున్నది:-
నాలసాః ప్రాప్నువంత్యర్థా న్నక్లీబానాభిమానినః । నచలోకరవాద్భీతో నవై శశ్వత్ప్రతీక్షిణః॥ (శాం. అ. 14(-23)

చోరులు, లోకవిద్యులు, గూఢచారులు వంటివారు వచ్చుచుందురు. వారిని వెదకి తెలిసికొని నశింపఁజేయవలయును. నమ్మకమువల్ల భయ ముత్పన్నమగుచున్నది. కనుకఁబరీక్షింపకుండ విశ్వసింపఁకూడదు. సం దేహించుటకు శాంతించుటకుఁ కారణమేదియులేనివానిపైఁగూడ శాంతికలిగి యుండవలయును. శత్రువుయొక్క విశ్వాసమును దెలిసికొన్నమీఁదఁ గాషాయ వస్త్రములు, జటలు మొదలైన వైరాగ్య చిహ్నములను స్వీక రించి వానిని నశింపఁజేయవలయును. మరియొకని మర్మము భేదింప కుండనే హింసింపకుండ సంపత్తు లభింపదు. జన్మముతోనే వాఁడును మిత్రుడైగాని, శత్రుడైగాని యుండఁడు. వారు కేవలము సామర్థ్యము యొక్క సంబంధముచేత శత్రువైకాని మిత్రువైకాని యుందురు, శస్త్ర పాతమును జేయవలసియున్నను ప్రియములను భాషింపవలయును. ప్రహరించిన మీఁదనుకూడఁ బ్రియములను భాషింపవలయును. అగ్నిని శత్రువును నిశ్శేషము చేయవలయును, ఎప్పుడును సావధానుఁడై యుండవలయును లోభులకు ద్రవ్యమిచ్చి వశపఱచుకొనవలయును, సమాన శత్రువుతో యుద్ధము చేయవలయును, తన మిత్రమండలియం దును అమాత్యులయందును భేదము పుట్టనీయఁగూడదు వారిలో నైక మత్యమును గూడఁగానీయఁగూడదు, ఎల్లప్పుడు మృదువు లేక ఎల్లపుడు తీక్ష్ణుఁడును గాఁగూడదు. జ్ఞాన సంపన్నులైన వారితో విరోధము పెట్టు కొనఁగూడదు, ఈ ప్రకారముగా నీకు నీతిశాస్త్రమును జెప్పితిని, ఈ నీతికిఁబాతకముతో సంబంధమున్నది, ఇందుచేత నిట్టి యాచరణమెల్లప్పుడును జేయఁగూడదు. శత్రుపట్టి యాచరణమును బ్రయోగించునపుడే యిట్టి నీతినుపయోగించుటకై యాలోచింపవలయును." తాత్పర్యము, ఈ నీతి రాజులకు, దస్యులచేత లేకమ్లేచ్ఛులచేత గ్రస్తులైనప్పుడు ఆచరణమునకై చెప్పఁ బడియున్నది. ఇందులో, ఇట్టి యాచరణమెల్లపుడును జేయఁగూడ దనియు సదాయాచరించుట వల్ల పాతకము సంభవించుననియు స్పష్ట ముగాఁజెప్పబడియున్నది. మ్లేచ్ఛులతో యుద్ధముచేయుచు ఆపత్స మయములయందు శివాజీ మహారాజు ఈ నీతినవలంబించియుండెనని చదవరులకు జ్ఞప్తికి రాఁగలదు.

వివిధాధికారుల యాచరణముపై దృష్టి నుంచవలయుననియు మునుపు చెప్పఁబడియున్నది. పూర్వకాలమునఁ బరరాజ్యములోని యధికారులకు (లంచములనిచ్చి) వశపఱుచుకొను నుపాయము తఱచు సఫలముగా నుండెడిదని విశ్వసింపవలసియున్నది. రాష్ట్రస్వాతంత్ర్య ప్రీతికి మేళనము ఈ విరుద్ధగుణమైన యామోసముతో నెట్లగుచుండెడిదో యిది చెప్పఁగలుగుట కఠినమైయున్నది. అయినను ఈసంగతి ప్రకటముగాఁ బ్రచలితమైయుండెను. దీనికిఁ బ్రమాణము నారదుని ప్రశ్నమువల్ల లభించుచున్నది. నారదుఁడు యుధిష్ఠిరుని, శత్రుసేనలోని ముఖ్యులను వశముచేసుకొనుటకై నీవు రత్నములు మొదలైన కానుకలను రహస్యముగాఁ బంపుచున్నావా? యని యడిగెను. దీనిఁబట్టి యాకాలమునందుఁ బ్రతిరాజునకును, ఎపుడుతనసేనలేక యధికారులు మోసముచేయుదురో యనుభయము కలుగుచుండియుండును. భారతకాలమందు మాత్రమిట్టి యుదాహరణములు మిక్కిలితక్కువగా దొరకఁగావు; కాని పిమ్మటి యితిహాసమునందు నిట్టియుదాహరణములు ఎడతెగక దొరకుచున్నవి.

## కు టి ల రా జ నీ తి

మహాభారతకాలమందు, శత్రువునేవిధముగను మోసము చేయరనుట ముఖ్యనీతియైయుండెను. కాని శత్రువు కపటాచరణము చేయునేని తానును గపటము నాచరింప వలయును. ఇదిగా కుండ రాజ్యమునకాపద తటస్థించి నప్పుడు కపటాచరణము చేయుటకు నేయాటంకమునులేదు. రాజనీతికం తనుకు రెండు భేదములు చెప్పఁబడియున్నవి. ఒకటి సరళమైన రాజనీతి రెండవది కుటిలరాజనీతి. సరళమైన రాజనీతివల్లఁ బనినెఱవేఱునేని రాజు దానిని త్యజింపఁ గూడదని స్పష్టముగాఁజెప్పఁబడియున్నది. అతఁడు మాయవలన లేక దంభమువల్లగాని యైశ్వర్యమును సంపాదించుటకు నిచ్ఛింపఁగూడదు. దౌష్ట్యముచేసి శత్రువు నెన్నడును జిక్కుపెట్టఁగూడదు మరియు నేవిధముననను వానిని నశింపఁజేయఁగూడదు." (శాంతి. అ 96) అయినను యుధిష్ఠిరుఁడు శాంతిపపర్వములయొక్క 140వ యధ్యాయమందు దుష్టులవల్లనధికపీడ సంభవించినపుడు ఏమిచేయవలయునని ప్రశ్నించి

యున్నాఁడు. ప్రాచీనకాలపురాజనీతి భారతీయార్య రాజులకుఁ బరస్పరము సంబంధించియున్నది. మఱియు నీసమయమందు భీష్ముఁడు చెప్పిన యాపత్సమయమందలి నీతి మ్లేచ్ఛుల యాక్రమణమునాఁటిదై యున్నది. నీవు, యుగక్షయమైన కారణముచేత ధర్మము క్షీణించియున్నది మఱియు దస్యులచేతఁ బీడయగుచున్నదియను నీ ప్రసంగము మహాభారతమునాఁటి సకందరు నాక్రమణసమయమును లక్ష్యముగాఁజేసి చెప్పఁబడియున్నదని చెప్పిన సరిగానుండఁగలదు. ఈసంగతి యవనుల యాక్రమమునకే సరియైనదికాఁగలదు. భీష్ముఁడుత్తరమునిచ్చి యుండెను—ఇట్టియాపత్సమయమున రాజు ప్రకటముగా శూరత్వమును జూపవలయును. తనయందు నేదమైన ఛిద్రమునుంచుకొనఁగూడదు. శత్రునియొక్క ఛిద్రమగపడఁగనే తత్క్షణమాక్రమణము చేయవలయును. సామాది చతురుపాయములోపలను దండము శ్రేష్ఠమైయున్నది. దానియాధారమున శత్రునాశము చేయవలయును ఆపత్కాలమందు దగిన సలహా చేయవలయును తగినరీతిగా బరాక్రమము చూపవలయును; అవసరమువచ్చునేని దగురీతిని బరువెత్తుటయుఁ జేయవలయును, ఈ విషయమై విచారింపఁగూడదు. శత్రువునకును తనకును హితవగునేని సంధిచేసికొనవలయును. కాని శత్రువుపై నమ్మకముంపఁగూడదు. తీపిమాటలచేత మిత్రునివలె శత్రువునిగూడ సాంత్వనము చేయుచుండవలయును. కాని పాముతోఁగూడిన యింట వసించుటచే నెల్లపుడు భయపడుచున్నట్లే శత్రునివల్లగూడ నెల్లపుడు భయంపడుచునే యుండవలయును. తనకు మేలును గోరువాఁడు ప్రసంగానుసారముగా, శత్రువునకుఁ జేతులు జోడింపవలయును మఱియు మట్టుపెట్టుకోవలయును, కాని యదనుదొరికినపుడు బుజముపైని బెట్టుకొనియున్న మట్టికడవనువలె వానిని ఱాతిపై విసరికొట్ట తుత్తునియలుగాఁ జేయవలయును. సమయము వచ్చినప్పుడు క్షణములో నగ్నివలెమిక్కిలి ప్రజ్వలితుడు కావలయును: కాని (యూక) పొల్లువలె బొత్తిగా జ్వాలాహీనుఁడై చిరకాలమువఱకుఁ కుతకుతనుయుడుకుచు నుండఁగూడదు. ఉద్యోగమునకై సదాతత్పరుఁడై యుండవలయును. తన్నునారాధించువారియొక్క బజలయొక్కభివృద్ధిపై నిచ్ఛకలిగి యుండవలయును. సోమరులు, ధైర్యశూన్యులు, అభిమానులు, లోకులనుం భయపడువారు, ఎల్లపుడు ననుకూలసమయమును నిరీక్షించు

ఈ నీతికిఁబేరు గీత నీతిగాఁ యున్నది. ధృతరాష్ట్రుఁడు పాండవుల బలమును, వీర్యమును, పరాక్రమమును జూచియు వారికిని దన పుత్రులకును గల పరంపర వైరభావమును విచారించియు కరకుఁడనెడి మంత్రినుండి సలహాను దీసికొనెను; అపుడతఁడీ నీతినుపదేశించియుండెను. కాని యీ సమయమున ధృతరాష్ట్రునిపైకి నేవిధమైన యాపత్తియు రాకుండెను. కాబట్టి ధృతరాష్ట్రుఁడు కణికుని నీతివిని యావిధముగా నాచరించుటలోఁదప్పు పనిచేసెనని చెప్పవలసిన యవసరము లేదు. ఆదిపర్వమునందు కణికనీతి వర్ణింపఁబడియున్నది. దాని తాత్పర్యమిది— 'శత్రువులు మూఁడు విధములుగానున్నారు – దుర్బలులు, సమానులు, బలిష్ఠులు. దుర్బలులపై నెల్లపుడును వారెన్నిటికిని దమశిరస్సునెత్తిఁ జాలకుండునుండునట్లు గాశస్త్రము నెత్తుచుండవలయును. సమాన శత్రువుయొక్క దృష్టిలో నెల్లపుడును దన పరాక్రమమును జాగ్రత్తగా నుంచుకొనవలయును. మఱియుఁదన బలము వృద్ధిపఱచుకొని వానిపై నాక్రమింపవలయును. బలిష్ఠుఁడైన శత్రువుయొక్క ఛిద్రమును గనుఁగొని భేదోపాయముచేత నాతని నశింపఁజేయవలయును. ఒకమాఱు శత్రువుపైకి శస్త్రమునెత్తిన తరువాత ఆతని బూర్తిగా నశింపఁజేసివైవవలయును— సగము సగముచేసి విడిచిపెట్టగూఁడదు. శరణము చొచ్చిన శత్రువును జంపివైచుట ప్రశస్తమైయున్నది. విషాది ప్రయోగములచేతఁ గూడఁబ్రబల శత్రువునకు ప్రాణహాని చేయవలయును. శత్రువుయొక్క సేవకులలో స్వామిద్రోహము నుత్పాదింపవలయును. శత్రుపక్షమునకు సహాయులైన వారిని గూడ నీ విధముగానే చంపివేయవలయును. తనకుఁ బ్రతికూల సమయము వచ్చినపుడు శత్రువును నెత్తిపైగూడ నెక్కించుకొనవలయును, కాని యనుకూల సమయము రాగానే వానిని నెత్తిపైనున్న ఘటమును వలె నేలపైఁబడవైచి చూర్ణము చేసివేయవలయును. పుత్రుడు, మిత్రుడు, మాత పిత మొదలైనవారు గూడ వైరమును జేసినయెడల వారిని వధించుటలోనె ఔత్కృష్ట్యమును గోరు రాజునకు హితమున్నది. తన హృదయములోని సంగతినెవరికిని దెలియనీయఁగూడదు. ఎవరిని జంపవలెయునో వారియింట నిప్పంటించవలయును. తన విషయమున సందేహింపకుండఁ జేసికొనవలయును, ఇందులకై అనేకులు చోరులు మొదే

లైన వారిని దేశమునుండి వెడలఁగొట్టవలయును. తన మాటలను వెన్న వలె మెత్తనైనవిగను—మనస్సును తీక్షణముగను నుంచుకొనవలయును. తన కార్యముల స్థితిని మిత్రులకుఁగాని శత్రువులకుఁగాని కొంచెముగూడఁ దెలియనీయఁగూడదు." పై నియమములను కణికుఁడు ధృతరాష్ట్రునికిఁ జెప్పెను. మఱియు నతనికిఁదన సోదర పుత్రులైన పాండవులను నశింపఁ జేయుటకై యుపదేశించెను. ఈ సత్యములను భారతీయార్యులు గ్రీక్కుల నుండి నేర్చుకొనియుండిరా? లేక వారియందే యీ విధమైన కపటరాజ నీతి తత్వము ఎట్లుత్పన్నములై యుండెనో యను ప్రశ్నమునకు ప్రత్యు త్తరమీయఁగలగుట కఠినమై యున్నది. భారతీయ కాలపురాజుల శత్రు విషయక నీతి యత్యంత సత్యమును నుదాత్తములై యుండెనన్నట్లో సందేహములేదు. భారతీయ యుద్ధకాలమునందలి రాజులయొక్క యధి కారులు మోసము, విశ్వాసఘాతము బొత్తిగా చేయకుండిరి. భీష్మద్రోణా దులచరణమత్యంత పరిశుద్ధమై యుండెను. సౌతి తననాఁటి పరిస్థితి ననుసరించి, వారివిషయమై, వారు విపక్షులలోఁగలసి పోయిరనియు వారు పాండవులకుఁ దమ్ముఁజంపు నుపాయమునుగూడఁ జెప్పియుండిరనియు మహాభారతమందచ్చటచ్చట వర్ణించియున్నాఁడు. కాని యథార్థమున భీష్ముఁడుగాని ద్రోణుఁడుగాని యిట్టి యాచరణము నెన్నఁడును జేయలేదని మననిశ్చయము. శ్రీకృష్ణుఁడు కర్ణునికి గుప్తమైన సలహానిచ్చి తనపక్షము లోఁగలుపుకొనుటకై యత్నించియుండెనని మహాభారతమందే వర్ణనమున్నదో అప్రసంగముకూడఁ దరువాతఁగలుపుఁబడెనని తోఁచుచున్నది. కర్ణుఁడుకూడ నీయవసరమున, ఉదారాచరణవంతుని వలెనే వ్యవహరించి యున్నాఁడు. అశ్వత్థామ, కృపాచార్యుఁడు మొదలైన భారతయోధులు స్వామిభక్తులును దేశభక్తులునైన యధికారులకుఁ దగినట్లే యాచరించియున్నపుడు, కుటిలనీతికి సంబంధించిన యేవిషయములు కణికనీతియొక్క యధ్యాయ మునఁ గనఁబడుచున్నవో, అవిమహాభారతకాల మందుఁ గొత్తగాఁ బుట్టి యుండుననిఁ దలఁచుటకు నేయాటంకమునులేదు. నీతిమేకియావల్లి యనెడు యూరపు దేశప్రసిద్ధుఁడగు కుటిలరాజనీతి ప్రతిపాదమని మతమువలెనే కుటిలమైయుండెను, మఱియుఁజాణక్యచంద్ర గుప్తుల యితిహాసముఁబట్టి, ఆసమయమున హిందుస్థానమందు నిట్టినీతి

యొక్క యధిక వ్రిభావముకూడ బాగుగాఁబడియుండెనని తెలియుచున్నది. చాణక్యుని గ్రంథముఁబట్టి యతనినీతికూడ నిటువంటిదేయైయుండెనని తెలియుచున్నది. సారాంశమేమనఁగా చంద్రగుప్తుని సమయమున మునుపటి సరళమైన రాజనీతి యంతరించియుండెను. మఱియుఁ గుటిలమైన రాజనీతియొక్క వ్యవహారము వ్యాప్తమైయుండెను.

## మునుపటి స్వరాజ్యప్రేమము

దీనికిఁ గారణమూహింపఁబడునేని, మహాభారతకాలమందు రాజుల సత్తయతి ప్రబలమైయుండెననియుఁ బ్రజయంతఃకరణమున నుండవలసిన యంత స్వరాజ్య ప్రేమము లేకుండెననియుఁ దెలియఁగలదు, అందుచేతనే యీ భిన్న ప్రకారమైన రాజకీయపరిస్థితియు తటస్థమయ్యెను. పశుపు కత్తెలయొక్క సంపత్తులవలెనే రాజ్యము రాజుయొక్క రాష్ట్రమని యెపుడు విశ్వసింపఁబడుచున్నదో, అపుడు ప్రజలయందు ఈ రాజ్యము మనదియను భావము స్థిరపడుట యసంభవమైయున్నది. దేశమంతయు సమస్త ప్రజలది యన్న భావము ప్రకాశించునంతవఱకు, ప్రజలయంతఃకరణమందుఁ బరరాష్ట్ర ద్వారమునఁ జేయఁబడు భేదప్రయత్నముల ప్రాబల్యమంతగా సఫలముకాఁజాలదు. ఎచటరాజులయొక్క సత్తయతిప్రబలమైయుండునో అచట లోకులకు రాజే రాజ్యమునకు స్వామియై యున్నాఁడను దృఢ నిశ్చయముకలుగుచున్నది – అతనిస్థానమున మఱియొకఁడెవరైన రాజై యుండునేని యతఁడుకూడ మునుపటిరాజువలె రాజై యే యుండును స్వరాజ్యమునకు బ్రధానలక్షణము రాజ్యము రాజును సుఖయముతనది గాతలంచెడి దృఢభావన ప్రజలయందు నాటుకొనియుండుటయే. రాజ్యము లోని ప్రతిమార్పును లోకులసమ్మతినిబట్టి జరుగుగవలయును. ప్రతివరి వర్తనముతోడను దాను సుఖదుఃఖములకు సంబంధమునందును కల్పన లోకులకుండవలయును. లోకులందఱు నొక్కవంశములోనివారును, సమాన బుద్ధిశాలులును, సదృశ సభ్యతాపాయుక్తులునై యున్నపుడు, వారియందిట్టి రాజకీయభావనగా రూపమైయున్నది. కార్యసమయమున రాజ్యమందు వేఱువేఱు దర్భారు సభ్యతయుగల లోకులు జితులుజేతలుననెడి సంబంధముతో నొకచోటికి వచ్చుచున్నారో, ఆసమయమున రాష్ట్రీయ

భావన తగ్గిపోవును, లెక్కచేయరు రాజురాజ్యమునకుఁ బూర్తిగా స్వామియై పోవుచున్నాఁడు. ఇట్టిపరిస్థితిలో మహత్త్వాకాంక్షులైన లోకులకు, నానా విధములైన యుపాయములయొక్క వైభవములయుం లోభమువల్ల సులభముగానే, రాద్రోహులుగానై ప్రతి కుతంత్రమునందును దిగుట సంభవించుచున్నది. ఎందుచేత ? రాజ్యము ప్రజలదియైయున్నది వారితోపాటుగా నాదికూడనై యున్నది యను భావమెపుడు నష్టమైపోవుచున్నదో, అపుడు ఈశక్తదుష్టవాసనయొక్క విరోధము ఏవిధమైన యున్నతమనోవృత్తమును జేయుదు. స్వరాజ్యముయొక్క కల్పన జాగరూపమై కానిచోటను లోకులు భేదమునకు బలియగుటకై యెల్లపుడును దయారగుచున్నారు ; మఱియు నొకరాజుపోయి మఱియొకరాజు వచ్చుచుండుటవల్ల వారికి, మనకేమియు హానికలుగలేదనియే తెలియుచున్నది. ఇంతేకాక కొన్ని విశేషసమయము లందు వారికి, లాభముకూడ సంభవించుచున్నది.

భారతీయకాలారంభమున హిందూస్థానమందలి రాజ్యము లస్థితి మునుపటి వర్ణననునుసరించియుండెను. రాజ్యమందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు ప్రతిరాజకీయ వ్యాపారమునందును మనస్సునుబెట్టుచుండిరి. వారికి ఈరాజ్యము తమదియను భావన సంపూర్ణముగా జాగరూపమైయుండెను. ప్రభువీపనినెందులకుఁ జేసెనను విషయము ప్రజల యెదుట నూహకు వచ్చుచుండెను. దీనికొకానొక మనోరంజకమైన యుదాహరణము శ్రీకృష్ణునిభాషణమందే యుద్యోగపర్వములోఁ గనుఁబడుచున్నది కౌరవపాండవయుద్ధమెందుకు వచ్చెననియు నీ విషయమున నపరాధము వారిదనియు నీ విషయము నూహింపవలసిన యావశ్యకత లోకులకుండెను. "నేను నాలుగువర్ణములను నూహించిచెప్పెదను. నాలుగువర్ణములును బ్రోగైనమీదట యుధిష్ఠిరుని గుణములేవియో దుర్యోధనుని యపరాధము లేవియో వారిని నమ్మింతును." శ్రీకృష్ణుఁడు చెప్పినదేమనఁగా :

> గర్హయిష్యామిచైవైనం పౌరజానపదేష్వపి।
> వృద్ధాబాలానుపాదాయ చాతుర్వర్ణ్యే సమాగతే ॥ (ఉ. అ. 73-33)

అనఁగా రాజకీయకార్యములయందుఁ జాతుర్వర్ణ్యమునకు జ్ఞానముండుటయావశ్యకమైయుండెను. ఎఖాటరాజ్య ప్రజలీవిధముగా రాజ్యమును

ద్రమదిగాఁదలఁచి రాజకీయకార్యములయందు మనస్సునుంచుకొని యుందురో అచట రాజద్రోహముపుట్టుట సంభవముకాదు. మహాభారతమందిదికూడఁ జెప్పఁబడియున్నది - "ఒకరాజు మఱియొకని రాజ్యమును గెలిచినమీఁదట నచ్చట వారితో నేను మీకు రాజునగుచున్నానని చెప్పవలయును- మీరు నాకు రాజ్యమును సమర్పింపుఁడు " అనఁగా లోకుల సమ్మతి లేకుండ రాజ్యముయొక్క కార్యములయందు లేక వ్యవస్థయుందుఁ బరివర్తనము కాకుండెను. కాని యీ పరిస్థితి మహాభారత కాలమందు నధికముగా మాఱిపోయెను. విశేషించి మును పటి రాజ్యంబులు విస్తృతములై యుండెను. మఱియు నచ్చటి చాలమంది ప్రజలు శూద్రజాతి వారును హీన సభ్యత కలవారును నై యుండిరి; బ్రహ్మ క్షత్రియ వైశ్యుల సంఖ్య మిక్కిలి తక్కువయై యున్న కారణముచేత రాజ్య కలహములయందు వారు జోక్యము కలిగించుకొనుట మిక్కిలి తక్కువయై యుండెను. మఱియు వారు ధ్యానముకూడ నుంచకుండిరి. పాటలీపుత్రరాజ్యమందు నంద క్షత్రియులు సింహాసన మెక్కిరి లేక చంద్రగుప్త శూద్రుఁడు సింహాసన మెక్కెను. జన సమూహమున కీ విషయమున నెంతమాత్రమును జింత లేక యుండెను. వారికి నోరెత్తు నధికారముగూడ లేకుండెను. సామర్థ్యము గూడ లేకుండెను. కనుక నిట్టి రాజ్యములయందుఁ గుతంత్రకారులును రాజద్రోహులునైన లోకులు తయారైరి. కాఁబట్టి, రాజులు సామ దాన దండ భేదోపాయములలో భేదములే యెక్కువగా నుపయోగింప నారంభించుటలో నాశ్చర్యపడవలసిన యవసరములేదు. భారతీయ కాలారంభమున నుచ్చకోటి అగు రాజనీతి యుండెను; కాని మహాభారత కాలమందుఁ గుటిల రాజనీతికి నెక్కువ ప్రభావ మయ్యెను. మఱియు రాజకీయాధికారుల నీతి మిక్కిలి భ్రష్టమైపోయెను.

## భీష్ముని రాజకీయాచరణము

ఈ విషయమై భారతీయ యుద్ధ సమయమున భీష్ముని యాచరణ మత్యంతోదాత్తమును ననుకరణీయమునునై యున్నది. యుద్ధసమయమందు

భీష్ముఁడు దుర్యోధనునివైపునఁ జేసిన యుద్ధము యోగ్యమైనదా కాదా యని చాలమంది ప్రశ్నించుచున్నారు. భీష్ముఁడు దుర్యోధనునితో నీ పక్ష మన్యాయముతో నిండియున్న దని స్పష్టముగాఁ జెప్పి యుండెను. ఆయన యతనితో షరతు ననుసరించి పాండవులకు రాజ్య మవశ్యముగా నీయవలయునని గూడ జెప్పి యుండెను. ఆ విధముగనే ఎపుడు శ్రీకృష్ణుఁడు పాండవుల వైపున నుండెనో మఱియు భీష్ముఁడు శ్రీకృష్ణుని నీశ్వరావతారముగాఁ దలఁచి యతనిని సంపూర్ణముగా భజించుచుండెనో, అపుడు భీష్ముఁడు దుర్యోధను వైపున నుండి శ్రీకృష్ణునితో విరోధించుట సమంజస మని చెప్పఁబడఁగలదా ? రామాయణమందు విభీషణుని యాచరణమట్టులేదు అని మఱియొక ప్రశ్నము వేయఁబడుచున్నది. అతఁడు రావణుని విడిచిపెట్టి రామునితో జేరెను. రావణుని కృత్యము దుర్యోధునివలెనే నింద్యమై యుండెను. మఱియు విభీషణుఁడు భీష్మునివలె రామునకు భక్తుడై యుండెను. కనుక, ఇట్టి స్థితియందు భీష్ముఁడు కావించిన యాచరణము మిక్కిలి న్యాయమైనదా, లేక విభీషణుఁడు కావించిన యాచరణము మిక్కిలి న్యాయమైనదో యను ప్రశ్నము కలుగుచున్నది. కాని రాజనీతి దృష్టినిబట్టి భీష్ముని యాచరణమే శ్రేష్టమైన దనుటలో సందేహములేదు. ఎవని యంతఃకరణమందు సత్యమైన స్వరాజ్య తత్త్వము స్థిరపడియున్నదో యతఁడు స్వరాజ్యముయొక్క పక్షము నెన్నఁడును విడునజాలఁడు దుర్యోధనుని పక్షమన్యాయపూర్ణమై యుండెను; అయినను అది స్వరాజ్యముయొక్క పక్షమై యుండెను. మఱియు భీష్ముఁడు తన స్వరాజ్య సంబంధియగు కర్తవ్యమును జక్కఁగాఁ బరిపాలించెను. రామాయణమందుఁగూడ విభీషణునికి నాశ్రయమునిచ్చుచు రాముఁడు, ఇతఁడు తన యన్నతోగలహమాడి వచ్చియున్నాడు. కనుక రాజ్యాధిపతిద్వైన కారణము చేత నీ భేదమున కుపయోగింపఁ గలదని స్పష్టముగాఁ జెప్పియున్నాడు ఉచ్చ సభ్యతయందును హీన సభ్యతయందును నిదియే యంతరము. రాజకీయనీతి సందర్భము భీష్ముని యాచరణమే యధిక శ్రేష్టమగుటయు మఱియు రామభక్తత్వ సంబంధమునబట్టి విభీషణునికి మహత్త్వమెంత యున్నను రాజనీతి దృష్టినిబట్టి యతని యాచరణము హీనమే యనుట యునిర్వివాదమై యున్నది.

యుద్ధారంభమున యుధిష్ఠిరుఁడు భీష్మునికి నమస్కరించుటకై వెళ్ళినపుడు భీష్ముఁడు చెప్పెను– "పురుషుఁడు ధనమునకు దాసుఁడగుచున్నాఁడు. కాబట్టి నేను దుర్యోధనుని పైపునఁ బోరాడుచున్నాను, అనఁగా నేటివఱకు నేను ఈ శాఖయొక్క డబ్బు తినుచున్నాను. కనుకనే నీ వైపునుండి పోరాడుచున్నాను. ఈ కథనముకూడ నొక దృష్టిని బట్టి యపూర్ణమే యగుచున్నది. వారింతకంటెను నధికమగు నుదాత్త పద్ధతిని జెప్పఁజాలచుండిరి. అయినను వారు చెప్పిన వచనముకూడ నుదారుఁడైనవానిది వలెనున్నది. వన పర్వములో యుధిష్ఠిరుఁడు భీముని నీ విధముగా సమాధానపరిచియున్నాఁడు. ఎవుడు భీముండాగ్రహముతో వనవాస నియమమును విడరాడి నా బలముచేత మనము కౌరవులను జంపుదమని చెప్పఁ దొడగెనో, మఱియు ఈ కార్య మధర్మమని చెప్పఁబడిన మీఁదటగూడ నెపుడతనికి సమాధానముకాలేదో, అపుడు యుధిష్ఠిరుడతనితో ననెను— "నీవు నీ బలమునే ప్రశంసించుకొనుచున్నావు; కాని కౌరవులవైపు ప్రబలవీరులైన భీష్మ ద్రోణులు లేరో? వీరు తిన్న యన్నమునకు పారవశ్యము ఋణము తీర్చుకొందురు." [వనవర్వ. అ. ३६] దీనిని నాలకించి భీముఁడూరకుండెను. సారాంశమేమనఁగా, భీష్మద్రోణులు మిక్కిలి రాజభక్తులై యున్నారనవలసిన వారు తన రాజు పక్షము నెన్నడును వదలరనియే లోకులందఱకును నమ్మకముండెను, మహాభారతమందుఁ బిదప, యుద్ధ ప్రసంగమున భీష్ముఁడు యుధిష్ఠిరునికి, తన మృత్యువునకుపాయము చెప్పెనని యే వర్ణనమున్నదో, అది తరువాత జేర్పఁబడియున్నది. మహాభారత కాలికమైన రాజనీతి చెడిపోయియుండెను. ఇందుచేత సౌతి సమయమున ఎటువంటి రాజ్యాధికారియైనను సరియే, నీతినుండి భ్రష్టుఁడుగాఁ జేయఁబడి తన పక్షములోఁ గలుపుకొనఁబడఁగలఁడను దృఢనిశ్చయముండెను. మఱియు నీ దృఢనిశ్చయమునే యనుసరించి సౌతి భీష్ముఁడు భ్రష్టుడైన యొక ప్రసంగమును గలిపియున్నాఁడు. కాని భీష్మునియొక్క నీతి యత్యుదాత్తమై

యుండెను. అతఁడీ విధముగా విశ్వాస ఘాతమును జేయుట సంభవము కాదు. భీష్ముఁడు తనవారితో యుద్ధారంభమందు నేను దుర్యోధనుని అన్నము తిన్నానని చెప్పియున్నాడు. మఱియు వన పర్వములో యుధిష్ఠిరుఁడు సైత మీసంగతిని రెట్టించియున్నాడు. భీష్ముడీ రెండు ధర్మములకును విరుద్ధమైన యాచరణమును జేయుననుట సంభవము కానేరదు. ఈ ప్రసంగము, "కర్ణునికి గర్వభంగమును నేను జేయుదును" ఈ విశ్వాస ఘాతపూర్ణమైన శల్యుని భాషణమువలె, ఆసంభాషమును బూర్వాపర విరోధ మగుచున్నది: మఱియు నియ్యది మహాభారత కాలికమైన రాజనీతి యొక్క కల్పన ననుసరించి సౌతి ద్వారమునఁ దరువాత కలుపఁబడి యున్నది, భీష్మపర్వములో 107 వ యధ్యాయమందు జేయఁబడియున్న వర్ణనము ననుసరించి, నిజముగా యుధిష్ఠిరుఁడును శ్రీకృష్ణుడు కౌరవ సేనలోనికి భీష్ముని జంపు నుపాయమడుగుటకై వెళ్ళియుండును ఈ సంగతి దుర్యోధనునికిఁ దెలియకుండుట వంభవముకాదు. ఇది గాకుండగా శ్రీకృష్ణుఁడు స్వయముగా భీష్ముని వధించు నుపాయమును జెప్పఁజాల కుండెననుటయు విశ్వసింపబడఁజాలదు. సారాంశమేమనఁగా భీష్మునికిఁ గళంకము దెచ్చిపెట్టునట్టి యీ గథాభాగము పిమ్మటిదియై యున్నది.

తన రాజు అసత్యాచరణము చేయునపుడును అతని పక్షము పూర్తిగా నన్యాయపూరితమై యున్నపుడును, అతనిపైపునుండి యుద్ధము చేయుటయు నన్యాయముకాదా? ఇట్టిచో నీతిమంతుడైన వాఁడేమి చేయు వలయును? అని యిచ్చట ప్రశ్నముఅగుచున్నది. ఈ ప్రశ్నముల విష యమై మహాభారతములో నొకమ నోరంజనమగు సంవాదము కనఁబడు చున్నది. ఈ సంవాదము భీష్మ శ్రీకృష్ణులకు నడుమను, భీష్ముఁడు మిగులఁ బరాక్రమము జూపి యర్జునుని మూర్ఛిల్లఁజేయఁగా శ్రీ కృష్ణుఁడు తతపెట్టిన ప్రతిజ్ఞను వదలుకొని భీష్మునిపైఁ జక్రమెత్తినపుడు జరగెను.

ఆ సమయమున శ్రీకృష్ణుఁడు చక్రముపట్టి యెపుడు పైకెత్తెనో, అపుడు భీష్మునితో ననెను- "అన్నియనర్థములను మూలమునీవే; నీవు దుర్యోధను నెందులకు శిక్షించ మంటివి?" అపుడు తనయాచరణమును సమర్థించు కొనుటకై భీష్ముఁడుత్తరమిచ్చెను (రాజావరం దైవత మిత్యువాచ-) "రాజెల్లరకును బరమ దేవతమైయున్నాఁడు" భీష్ముఁడిదికూడ ననియెను- నీవు నాపైని జక్రమెత్తుచున్నావు, ఈ సంగతియేనాకు "త్రైలోక్యమందును గౌరవ సూచితమైయున్నది; నేను నీకు నమస్కరించు చున్నాను." ఇంత మాత్రము చెప్పి భీష్ముఁడు మాటాడకుండ నిలబడెను. ఇంతలో నర్జునుఁడు తెప్పరిల్లి శ్రీకృష్ణుని వెనుకకు తీసుకొనివచ్చెను. ఈ భావము భీష్మపర్వము లో ౫౯వ యధ్యాయమందున్నది. కాని చాలప్రతులందు ఇచ్చట మృత్యువు నకు సంబంధించినశ్లోకములులేవు. ఇచ్చట శ్లోకములివ్వి:-

> శ్రుత్వావచః శాంతనవస్య కృష్ణః। వేగేనధావం స్తమధాభ్యువాచ।
> త్వాం మూలమస్యేహ భువి క్షయస్యదుర్యోధనం హ్యద్యసముద్ధరిష్యసి॥
> దుర్ద్యూతదేవీ నృపతిర్నివార్యః। సన్మంత్రిణా ధర్మపథిస్థితేన॥
> త్యాజ్యోథవా కాలపరీతబుద్ధి। ర్ధర్మాతిగోయః కులపాంసనః స్యాత్॥
> భీష్మ స్తదాకర్ణ్య కురుప్రవీరం। రాజా వరం దైవత మిత్యువాచ॥

ఈ శ్లోకములు మిగుల మహత్త్వము కలవైయున్నవి, వీనిలో నత్యంత మహత్త్వముఁగల యొక ప్రశ్నము విషయమై పూర్వకాలమున రెండు మతములున్నట్లు కనఁబడుచున్నవి. రాజు దురాచారుఁడగు నెడల నేమి చేయవలయునని ప్రశ్నము బయలుదేరినపుడు, దాని విషయమున భీష్ముడు అతని యాజ్ఞను సర్వవిధముల మాననీయముగా నెంచి యతని పక్షమెన్నడును విడువకూడదను నీతత్త్వమును ప్రతిపాదించి యున్నాఁడు; మరియు శ్రీకృష్ణుఁడు, ఉత్తములైన మంత్రులు రాజును నిగ్రహింపవలయు ననియు అతఁడు కొంచెమైనను నంగీకరింప కున్నయెడల నతని త్యజించి వేయవలయుననియు ఈ తత్త్వములను ప్రతిపాదించియున్నాఁడు. అనఁగ, అతనిని గద్దెనుండి దింపివైచి మరియొకరాజును గూర్చుండఁబెట్టవలయును. రెండు పక్షములను గొప్ప రాజనీతికి సంబంధించియున్నదియు పూజ్య

ములునై యున్నవి వీనిని భీష్ముఁడును శ్రీకృష్ణుఁడును తమ యాచరణ ముల బట్టికూడఁజూపి యున్నారు. కాని యీ పరిస్థితియందు శత్రువు తోగలసి పోవుట అనెడి మూడవమార్గమును విభీషణుడు స్వీకరించియున్నాడు అది హీనమును నింద్యమునై యున్నది. భారతమందు వర్ణింపబడినయే యుదాత్తాచరణముగల యే వ్యక్తియును హీనతత్త్వమును స్వీకరింప లేదని జ్ఞప్తియుంచుకొనవలయును.

(ఉద్ధర్షణ విదులల సంవాదను.)

పరాజితుఁడైన రాజును ధైర్యశాలునిగను ఉత్సాహయుక్తునిగను జేయునట్టి యుద్ధర్షణ విదులా సంవాదము రాజకీయ ధర్మములో నత్యంతమహత్త్వముగల యొకభాగమైయున్నది; కనుక నయ్యది యంతయును బేర్కొనఁదగినది. భారతములోని తత్త్వజ్ఞానముయొక్క సర్వస్వము గీత యెట్లో, యట్లే యీ సంవాదము రాజధర్మముయొక్క సర్వస్వమైయున్నది. మనము దీనిని భావసారాంశరూపమున నిచ్చుచున్నారము. ఈ సంవాదము కేవలము దైన్యావస్థలోనున్న క్షత్రియులను లక్ష్యముగా నుంచుకొని వ్రాయఁబడియుండుననరాదు. విపత్సమయమందుఁ బ్రపంచములోని ప్రతి మనుష్యుఁడు నీ యుపదేశమును ధ్యానములో నుంచుకొనవలయును. ఈ యుపదేశములో వ్యవహారమునకును రాజకీయపరిస్థితికిని సంబంధించిన యుదాత్తము నుత్సాహయుక్తమగు నీతి నిండియున్నది. ఇందునేవిధమైన కుటిలత్వముగల నీతియు నులేదు-కేవలముత్సాహము నుత్పాదించునట్టి నీతియున్నది. ఇందుచేత మనమిచ్చట దానిని సంగ్రహముగా వ్రాయుచున్నాము, సంజయుఁడనెడి రాజపుత్రునిపై నింధురాజాక్రమింపఁగా సంజయుడు రణమున బరువెత్తుకొని వచ్చెను. అపుడు వాని రాజనీతి కుశలయు ధైర్యవతియునగు తల్లి విదుల చెప్పదొడఁగెను. (ఉద్యోగ అ. 133-136)

విదు-మాత్మాన మవమన్యస్వ మైన మల్పేన బీభర।
ఉత్తిష్ఠ హే కాపురుష మాశేష్వైవం పరాజితః॥
అలాతం తిందు కస్యేవ ముహూర్తమపి హి జ్వల।

ఆ సమయమున శ్రీకృష్ణుఁడు చక్రముపట్టి యెపుడు పైకెత్తెనో, అపుడు భీష్మునితో ననెను- "అన్నియనర్థములను మూలమునీవే; నీవు దుర్యోధను నెందులకు శిక్షించ మంటివి?" అపుడు తనయాచరణమును సమర్థించు కొనుటకై భీష్ముఁడుత్తరమిచ్చెను (రాజావరం దైవత మిత్యువాచ-) "రాజెల్లరకును బరమ దేవతమైయున్నాడు" భీష్ముఁడిదికూడ ననియెను- నీవు నాపైని జక్రమెత్తుచున్నావు, ఈ సంగతియేనాకు "త్రైలోక్యమందును గౌరవ సూచితమైయున్నది; నేను నీకు నమస్కరించు చున్నాను." ఇంత మాత్రము చెప్పి భీష్ముఁడు మాటాడకుండ నిలబడెను. ఇంతలో నర్జునుఁడు తెప్పిరిల్లి శ్రీకృష్ణుని వెనుకకు తీసుకొనివచ్చెను. ఈ భావము భీష్మపర్వము లో 59వ యధ్యాయమందున్నది. కాని చాలప్రతులందు ఇచ్చట ముప్పు త్యువు నకు సంబంధించినశ్లోకములులేవు. ఇచ్చట శ్లోకములివ్వి:-

> శ్రుత్వావచః శాంతనవస్య కృష్ణో। వేగేనధావం స్తమధాభ్యువాచ।
> త్వాం మూలమస్యేహ భువి క్షయస్యదుర్యోధనం నాద్యసముద్ధరిష్యసి॥
> దుర్ద్యూతదేవీ నృపతిర్నివార్యః। సమ్మంత్రిణా ధర్మపథిస్థితేన॥
> త్యాజ్యోథవా కాలపరీతబుద్ధి। ర్ధర్మాతిగోయః కులపాంసనః స్యాత్॥
> భీష్మ స్తదాకర్ణ్య కురుప్రవీరం। రాజా వరం దైవత మిత్యువాచ॥

ఈ శ్లోకములు మిగుల మహత్త్వము కలవై యున్నవి. వీనిలో నత్యంత మహత్త్వముఁగల యొక ప్రశ్నము విషయమై పూర్వకాలమున రెండు మతములున్నట్లు కనఁబడుచున్నవి. రాజు దురాచారుఁడగు నెడల నేమి చేయవలయునని ప్రశ్నము బయలుదేరినపుడు, దాని విషయమున భీష్ముడు అతని యాజ్ఞను సర్వవిధముల మాననీయముగా నెంచి యతని పక్షమెన్నడును విడువకూడదను నీతత్వమును బ్రతిపాదించి యున్నాడు; మరియు శ్రీకృష్ణుఁడు, ఉత్తములైన మంత్రులు రాజును నిగ్రహింపవలయు ననియు అతఁడు కొంచెమైనను నంగీకరింప కున్న యెడల నతని త్యజించి వేయవలయుననియు ఈ తత్త్వములను బ్రతిపాదించియున్నాడు. అనఁగ, అతనిని గద్దెనుండి దింపివైచి మరియొకరాజును గూర్చుండఁబెట్టవలయు ను. రెండు పక్షములను గొప్ప రాజనీతికి సంబంధించియున్నదియు పూజ్య

ప్రాజ్ఞస్య నృపపతేరాశు వృద్ధిర్భవతి పుత్రక।
యద్యైవ శత్రుర్జానీయాత్ సయత్నం త్యక్త జీవితమ్॥
తద్యైవా స్మాదుద్విజతే సర్పాద్వేశ్మ గతాదివ।
నైవ రాజ్ఞాదరః కార్యోజాతు కస్యాంచిదాపది॥
అథ చేదపి దీర్ణః స్యాన్నైవ వర్తేత దీర్ణవత్ ।
దీర్ణం హి దృష్ట్వా రాజానం సర్వమేవాను దీర్యతే ॥
రాజ్ఞాం బల మమాత్యాశ్చ పృథక్కుర్వన్తి తే మతిః ।
య ఏవాత్యంత సుహృద స్త ఏనం పర్యుపాసతే ॥
శోచన్తమను శోచన్తి పతితానివ బాన్ధవాన్ ।
యే రాష్ట్ర దుఖిమన్యన్తే రాజ్ఞో వ్యసనమీయుషః ॥
మాదీదర స్త్వం సుహృదో మాంత్వాం దీర్ణం ప్రహాసిషుః ।
యదే తత్సం విజానాసి యది యది సమ్యక్ బ్రమీమ్యహమ్ ॥
కృత్వా త్వాసౌమ్యమి వాత్మానం జయా యోత్తిష్ఠ సంజయ ।

ఈ విధముగా నుద్ధర్షణమైన తల్లియుపదేశమును విని సంజయుఁడులేచి తిరుగ బరాక్రమించి రాజ్యమును బ్రాపించెను. సౌతి యీసంవాదము యొక్క ప్రశంసను ఫలశ్రుతినిగూడ యోగ్యమైనరీతిని జేసియున్నాడు. శత్రుపీడితుఁడైన రాజునకు ఈ యుద్ధర్షణమును భీమతేజోవర్ధనమునైన సంవాదమవశ్యము వినదగియున్నది; కానియిదికూడఁజెప్పియున్నాడు-

ఇదంపుంసవనం చైవ వీరాజనమేవచ॥
అభీక్ష్ణం గర్భిణీశ్రుత్వా ధ్రువం వీరం ప్రజాయతే ॥
ధృతిమన్తమనాధృషసం జేతార మపరాజితమ్ ।
ఈదృశం క్షత్రియా సూతే వీరం సత్యపరాక్రమమ్ ॥

ఈ యుపదేశమునందుఁ బరాక్రమము, ధైర్యము, నిశ్చయము పరాతంత్రుఁడుగాఁగాని, హీనుఁడుగాఁగాని యెన్నఁడునుండని మానసిక వృత్తి మఱియు నుద్యోగము వీనిపైని ప్రాబల్యమీయఁబడి యున్న ఇట్టి హేతువు సిద్ధింపని యెడల మృత్యువునుగూడ స్వీకరింపవలసియుండెను. కాని ప్రయత్నము చేయకుండ ఫలమెన్నఁడును లభింపనేరదు. ప్రయత్నము చేయునెడల ఫలము లభించెదినని భావనయున్నది. వ్యవహారశుదమైన సిద్ధాంతము నాధారముగాఁ జేసికొని దైన్యావస్థలోని జేరుకొనున రాజు, రాష్ట్రము, కుటుంబము లేక మనుష్యుఁడు వీరి విశ్వాసముంచు విషయమై యత్యంతము మార్మికమైన ఈ యుపదేశము చేయఁబడియున్న

# సేన-యుద్ధము

భారతీయ కాలమందు భిన్న భిన్న రాజ్యములకు స్పర్ధయున్న కార
ణముచేత యుద్ధ ప్రసంగము లెడతెగకుండ వచ్చుచుండెను; ఇందుచేత
భారతీయ సేనయొక్క వ్యవస్థ మిక్కిలి యున్నతావస్థకు వచ్చియుండెను.
మఱియు నందలి యుద్ధపద్ధతులు కూడఁ జాలవఱకు బాగుపడియుండెను.
కాని యన్నింటిలో విశేషమైన సంగతి యేమనఁగా యుద్ధము పరస్పరము
మార్పులలోనే జరుగుచుండెను. కనుకనే యుద్ధ తత్త్వములు, ధార్మిక
మైన రీతిని జరుగుచున్న యిప్పటి యున్నత శీలమగు రాష్ట్రముల యుద్ధ
ప్రకారము ననుసరించియే నియమబద్ధములై యుండెను. ఆ సమయ
మున ధర్మయుద్ధము విషయమై యెక్కువ ఆదరభావముండెను. ధర్మ
యుద్ధములోని నియమములు కూడ నిశ్చితములై యుండెను. యోధులెవ్వ
రును ఆ నియమముల నుల్లంఘింపకుండిరి. ఈ పద్ధతి మనభారత కాల
మున గ్రొంతచెడిపోయినదై కనఁబడుచున్నది. దీనికి కారణము యూనాను
యుద్ధపద్ధతియై యున్నది. పాశ్చాత్య దేశములందుఁ గూడ ఈ సమయ
మున యూరోపియ రాష్ట్రముల నడుమను యుద్ధ మారంభమగునపుడు,
దయా, ధర్మములకనుకూలముగా నిశ్చయింపఁబడియున్న నియమముల
యుత్క్రమణము తఱుచు అనుమతించుట లేదు. కాని యా యుద్ధమే
యూరోపియాను ఏషియాటిక్ రాష్ట్రములనడుమ నారంభమగునపుడు మరి
యొక నియమముల వలనఁబని జరుగుచున్నది. ఇదే విధముగా యూనా
నులు ఏషియాటిక్ రాష్ట్రములతో యుద్ధము చేయునపుడు క్రూర నియమ
ముల నవలంబించిరి. స్వభావమున మహాభారత కాలమందు ననేక క్రూర
నియమములు భారతీయ యుద్ధ విధృతిలోఁ బ్రవేశించుట పరిణమించెను.
మహాభారతమున వ్రాయబడియున్న పేవావర్ణనముఁ బట్టియు, అందుఁ
జెప్పఁబడియున్న ధర్మయుద్ధ నియమములఁబట్టియుఁ పాఠకులకు,
ప్రాచీనకాలమందలి యుద్ధపద్ధతి యెంత బాగుపడియుండెనో, బాగుపడి
యున్న నేటి పాశ్చాత్యరాష్ట్రముల యుద్ధ నియమములతో పాటు నే
యా పద్ధతి విషయమునఁగూడఁ తమ మనస్సులోనింత ఆదరభావముత్పన్న
మగుచున్నదో ఈ విషయముయొక్క కల్పన కాఁగలదు.

ప్రతి రాష్ట్రమందును ప్రాచీనకాలమున నెంతయో కొంతసేన యెల్లపుడును యుద్ధముకై తయారుగానుండుచుండెను. సమయమువచ్చినపుడు తన యిష్టముచొప్పున సైనికుఁడు రావచ్చుననెడి నియమము ఆ సమయమందుఁగూడఁ బ్రచలితము కాకుండెను; ఎందుచేత? ఆ దినములలో యుద్ధశాస్త్రము ప్రతి మనుష్యుఁడును తనయిచ్ఛ ననుసరించి మనసువచ్చినప్పుడెల్లను కత్తి, బల్లెము గైకొని యుద్ధములోఁ జేరఁ జాలమందునంత యున్నమైయుండెను. ప్రతిసైనికుఁడును ననేక యత్నములు యుద్ధశిక్షను బొందుట యావశ్యకమై యుండెను. సేనలో నాలుగు ముఖ్య విభాగములుండెను.– పదాతులు, అశ్వములు, గజములు, రథములును అనఁగా ప్రాచీనకాలమందలి సైన్యమును చతురంగ దళమని చెప్పుచుండిరి. ప్రస్తుతకాలమున సేనలు మూఁడంగములు కలవై యున్నవి. యెందుచేత? గజములనెడి యంగమిపుడు లుప్తమైయున్నది. ఇందుచేతఁ బ్రస్తుతమున సేనలను త్ర్యంగము అని చెప్పిన పద్ధతి వచ్చియున్నది. గజరూపమైన యుద్ధసాధనము ప్రాచీన సమయమందు భయదాయకమై యుండెను. ఇతరులకు హిందువుల సేనవలన గజముల కారణముచేతనే, మిక్కిలి భయము సంభవించుచుండెను. ఒక సికందరు బుద్ధిమాత్రము ఈ భయమును దొలగించివైచి యుండెను. తరువాత ననేక శతాబ్దులవఱకు, అనఁగా ఫిరంగులు ప్రచారములోని వచ్చునంతదాఁక, గజముయొక్క యుపయోగము యుద్ధకృత్యమందు బొత్తిగాఁ తగ్గిపోయుండెను. సెల్యూకస్సు చంద్రగుప్తరాజునకుఁ తన కూతురునిచ్చి ౫00 ఏనుఁగులను బుచ్చుకొనెను. ఇదే విధముగా ప్యారిసు చక్రవర్తి రోమనుప్రజలకు విరుద్ధముగా పోరాడునపుడు ఏనుగుల నుపయోగించుచు వచ్చెననియు వర్ణనముకలదు. తైమూరు లంగు అనునతఁడు తురకలలో (మొగలుఁబోతును, బలాఢ్యుఁడునునైన బజాజతు చక్రవర్తి (పాదుషా) ని తుదకు గజసాహాయ్యము చేతనే యోడించి విజయమ్మును పొందెను. దీనికిఁ పిమ్మటి యితిహాసములో ఏనుఁగుల యుపయోగము కనిపింపదు. ఏనుఁగులకు మాఱుగా ఇపుడు ఫిరంగులు వచ్చెను.

సైన్యములోని ప్రతివానికిని యుక్త సమయమునందు వేతనము

నిచ్చెడి యేర్పాటు ప్రాచీనకాలమందుండెను. ఈ వేతనము కొంత ధాన్య రూపముగను, కొంత ద్రవ్యరూపముగను నీయఁబడుచుండెడిది. కచ్చిద ధ్యాయములో నారదుఁడు యుక్తసమయమందు వేతనమీయఁబడుచున్నది గదా! అందులో ఏమాత్రమును తగ్గింపఁబడుచుండుట లేదుగదా యని యుధిష్ఠిరుని కుపదేశించి యున్నాఁడు.

కచ్చిద్బలస్య భక్తంచ వేతనం చ యథోచితమ్ ।
సంప్రాప్తకాలే దాతవ్యం దదాసి న వికర్షని ॥ (సభా. అ. 5)

నారదుఁడీ స్థానమందు, సైనికులకు యుక్తసమయమున వేతనము, ధాన్యము లభింపనిచో వారియందు, స్వామికి భయంకరమగు హాని సంభవించునంతటి వ్యవస్థాభావము తటస్థించునని చెప్పియున్నాఁడు. మహారాష్ట్రుల రాజ్యమునందు శివాజీనాఁటి నుండియు నానాసాహేబు పీష్వా సమయము వఱకు ఈ విషయమై చక్కఁగా ధ్యానమీయఁ బడుచుండెను. కాని దీనికిఁ పిమ్మట నపుడైతే (పతనకాల) పఠానులు కాలమందు సేన యొక్క వేతనము యుక్త సమయమందు నీయఁబడుట మానివేయుట యారంభమయ్యెనో, అప్పటినుండియు భయంకరములైన అనేక కష్టములు ఉత్పన్నములు కాఁదొడగెను. ఈ విషయములు సింధియా, భోంసలో, హోల్కరు మొదలైనవారియొక్క యితిహాసమందుఁ ప్రసిద్ధములై యే యున్నవి. పతనకాలమందిట్టి ప్రసంగములు రాజ్యములన్నింటియందును గనిపించుచున్నవి. సేనకు యుక్త సమయమున వేతనమిచ్చుట సువ్యవస్థితమైన రాజ్యమునకు ప్రధానాంగమైయున్నది. ప్రాచీనకాలమందు సేనకు వేతనమెంత ఈయఁబడుచుండెనో, ఈ విషయమై యంచనా వేయుటకు సాధనమేదియు నుపలబ్ధము కానున్నది. కాని అది ధాన్యము, రొక్కము వీని రూపమున నీయఁబడుచుండెననుటలో మాత్రము సందేహము లేదు. ధాన్యము ప్రభువుల కొట్టునుండి ఈయఁబడుచుండుట స్పష్టమై యున్నది. రైతులు పన్నును ధాన్యరూపముననే యిచ్చుచుండిరని మును పు చెప్పఁబడియున్నది. యుద్ధములో ఓడిపోయిన వీరులయొక్క కుటుంబము (స్త్రీ) లను పాలించుటయు, పోషించుటయు యోగ్యమైన రాజునకు కర్తవ్యముగా మాహింపఁబడుచుండెను. నారదుఁడు ప్రశ్నించి యున్నాఁడు:—

కచ్చిద్దారాన్ మనుష్యాణాం తవార్థే మృత్యుమీయుషామ్ ।
వ్యసనం చాభ్యుపేతానాం బిభర్షి భరతర్షభ ॥

సేనయందలి నాలుగంగములలోను ప్రతి పదిమంది మనుష్యులమీదను నూఱుగురిమీదను, వేయిమందిమీదను ఒక్కొక్కయధికారియుండుచుండెను.-

దశాధి పతయః కార్యాః శతాధిపతయ స్తథా।
తతః శహస్రాధిపతిం కుర్యాత్ శూరమతంద్రితం॥ (శాంతి. అ. 100)

ఈ విధమైన యేర్పాటుండుట యసంభవము కానేరదు. అట్టి వ్యవస్థ యే యిపుడుకూడ ప్రచలితమైయున్నది. ఒక వేయిమంది యోధులకు అందరికంటెను ముఖ్యాధికారి, కర్నల్ తరగతి కలవాడుగాఁ జెప్పఁబడు చుండెను. అతఁడు రాజుచేతనే సమ్మానితుఁడగుటకు యోగ్యుఁడుగాఁదలఁప బడుచుండెను.

కచ్చిద్బలస్యతే ముఖ్యాః సర్వేయుద్ధవిశారదాః।
ధృష్టావదాతా విక్రాంతాః త్వయాసత్కృత్యమానిత్వాః॥ (స అ.5)

భిన్నభిన్నములైన నాలు గంగములతోను గూడ నెక్కొక యధి కారి యశ్వాధిపతి లోనగు వారుండెడివారు. వీరుగాకుండ సైన్యమంతకు నొకముఖ్యుఁడు కమాండర ఛీఫు అనఁగా సేనాపతి యుండు చుండెను. అతనివర్ణనమిట్లు చేయఁబడియున్నది. నారదుఁడు, నీ సేనాపతి ధృష్టుఁడు, శూరుఁడు, బుద్ధిమంతుడు, శుచికులీనుఁడు అనురక్తుఁడు, దక్షుఁడునై యున్నాఁడా యని యడిగియున్నాఁడు, శాంతిపర్వములో, అతఁడు వ్యూహములను, యంత్రములు, ఆయుధ శాస్త్రము, వీని నెఱింగిన వాఁడుగా నుండవలయుననికూడఁ చెప్పంబడియున్నది. అదేవిధముగా వాన, చలి, యెండ వీని సహించు శక్తియు తనకుండ వలయును మఱియు నాతఁడు శత్రువుల ఛిద్రములను గాని పట్టఁగలిగినవాఁడుగా నుండ వలయును (శాం.అ. 85-13).

చతురంగదళము గాకుండ సైన్యమున కింకను నాలుగు మహత్త్వ పుష్కలములైన విభాగములుండెను. అవి విష్టి (ట్రాన్స్పోర్ట్) నౌక, గూఢచారుడు వేగులవాఁడని దేశికుడు అని చెప్పబడి యున్నది.

వీనిలో విష్టి అన్నివిధములైన సామానులను మోయించుకొని తీసికొని పోవునేర్పాటుమ మఱియు సాధనములుగాఁ జెప్పుచున్నారు. ఈ విష యమునకు మహత్త్వము ప్రాచీన యుద్ధములందుఁగూడ మిక్కిలి యెక్కువగానుండెను. బాణములతోడను ఆయుధములతోడను వేలకొలది బండ్లు నింపి వెంటదీసికొనిపోవలసియుండెను. నౌకలోను సముద్రమందును నదులయందును నడచునట్టినౌకల సమూహముకలదు. ప్రాచీన కాలమందు నౌకలపై గూడఁబోరాడవలసిన యవసరము తటస్థించియుండును. ఉత్తర హిందు స్థాన మందలి నదులు పెద్దపెద్దవియై యున్నవి వానిని దాటు టకై నౌకా సాధన మావశ్యకమై యుండెను. సముద్రపుటొడ్డున నున్న రాష్ట్రములయందు నౌకలు పోరాడుటకును సామానులదీసికొని పోవుటకు కును నుపయోగింపఁ బడుచుండియుండును. గూఢచారుల వర్ణనము మునుపు చేయఁబడియే యున్నది. యుద్ధములో వారెక్కువగా నుపయో గించుచున్నారు. దేశికులనఁగా నెవరోయీవిషయమై స్పష్టముగా దెలియ కున్నది. వారివర్ణనముకూడ సరిగాఁచేయఁబడియుండలేదు. అయినను, వీరు స్కౌటులు అనగా వేర్వేరుసమయములందు ముందు నడచి దారిచూపు వారును శత్రువులస్థితిని దెలియఁజెప్పువారునై యుందురని చెప్పబడగలదు. సైన్యములోని యీ యెనిమిదంగములును గ్రిందవ్రాయఁబడియున్న శ్లోక ముందుచెప్పఁబడియుండెను.

రథా నాగా హయాశ్చైవ పాదాతాశ్చైవ పాండవ ।
విష్టిర్నావశ్చరాశ్చైవ దేశికా ఇతి చాష్టమః ॥ (శాంతి. అ. 59)

### పదాతులు ఆశ్వికులు

పదాతులు లేక కాలిబంటులవద్ద నుండెడి ఆయుధములు డాలులు, కత్తులునై యుండెను. ఇవిగాక ఇతర ఆయుధములుకూడ చెప్పఁబడి యున్నవి. ఏవిధములుగాననఁగా ప్రాసము (బళ్ళెము), పరశువు (గొడ్డలి), భిండిపాలము, తోమరము, ఋష్టి, శూలము, భిండిపాలము మొదలైన ఆయుధములు ఎట్లుండినవో చెప్పుటకు సాధ్యము కాకున్నది. ఖడ్గము ఒక చిన్న కత్తియై యున్నది. గదయనెడి యాయుధము పదాతుల

యొద్దనే నుండును. ఎందుచేత? ఈ యాయుధము నుపయోగించుటకై మిక్కిలి శక్తి యావశ్యకమై యుండెను. ఈ యాయుధము ద్వంద్వ యుద్ధములో నుపయోగింపఁబడుచుండెను. ఇట్లే యేనుగులలో పోరాడు నప్పుడు కూడ గదయుపయుక్తమగుచుండెను. గదయొక్క యుపయోగ మును విశేషబలవంతులైన క్షత్రియులే చేయుచుండిరి. గుఱ్ఱపురౌతుల యొద్ద (కత్తులు, బల్లెములు నుపయోగింపబడుచుండెను. బల్లెము కొంత యెక్కువ పొడవుగా నుండెడిది. గాంధార రాజగు శకునిదగ్గఱ పదివేల అశ్వసేన విశాలముగను వాయిగలదియు నైన బల్లెములతోఁ బోరాడునది యుండెనని వర్ణింపఁబడియున్నది.

> అనీకం దశసాహస్ర మశ్వానాం భరతర్షభ।
> ఆసీద్గాంధార రాజస్య విశాల ప్రాసయోధినామ్॥ (శల్య. అ. 23

గుఱ్ఱపుస్వారి చేయువారియుద్ధమిచ్చట బాగుగా వర్ణింపఁబడి యున్నది. రెండుపక్షములలోని రౌతులును ఒకరు రెండవవారిపై దాడి చేయుచు నున్నంతలో పైఁగాకవియునపుడు, బల్లెములుమాని బాహుయుద్ధ మును జేయఁజొచ్చిరి. మఱియు నొకొక్క రౌతు మఱియొకరౌతును గుఱ్ఱ ముపై నుండి క్రిందికి పడవేయ యత్నించుచుండెను. ప్రతి మనుష్యుని యొద్దను కవచముండి యుండుట సంభావనీయమై యగుపడదు. కవచ మనఁగా (జిరాక్ బఖ్తర్) అని యున్నది. ఇది తుదకు బరువుగానుండును. తెలికగానుండునేని దాని వెల యెక్కువయై యున్నది. ఇందుచేత పదాతు లకు గుఱ్ఱపురౌతుల సమీపమున కవచములు లేకుండెను. అయినను గవచముల దాల్చు పదాతులు కూడ వర్ణింపఁబడియున్నారు. రథికులును గజములపైగూర్చుండు యోధుల యొద్ద నెల్లపుడును గవచములుండెను. కవ చముల యొక్క యుపయోగమును రథులు, సారథులు తఱచుఁజేయు చుండిరి. బాణములయొక్క వర్షము తఱచుగా రథికులకు, సారథులకు పయినే యగుచుండెను. ఇందుచేత వారికి గవచములెక్కువ యావశ్య కమై యుండెను. మఱియును యోధులుకూడ గొప్పగొప్ప క్షత్రియు లగుచుండిరి. ఇందుకై వారు వెలగల కవచముల నుపయోగింప జాలి యుండిరి. ఏనుఁగులపై నుండి పోరాడువారికిఁ గూడనిదే స్థితియుండెను.

వారు ఉన్నతస్థానముపై నుండుచుండిరి. కనుకనే వారిపై ఎక్కువ బాణ వర్షమగుచుండెను. వారికిఁగవచధారణమవశ్యమై యుండెను. ఏనుఁగుల పైనుండి పోరాడు యోధులు ధనవంతులైన కారణముచేతఁ గవచములు మెండుగలిగి యుండిరి.

వేఱువేఱు యోధులకు వేర్వేఱు యుద్ధముల విషయమున ఖ్యాతి యుండెను. పాశ్చాత్య దేశములైన గాంధారము, సింధువు, సౌవీరము, అశ్వసేన విషయమై ప్రసిద్ధములై యుండెను. ఈ దేశములయందు ప్రాచీనకాలమున ఉత్తమాశ్వములు ఉత్పన్నములగుచుండెను. ఇపుడుకూడ అగుచున్నవి. ప్యారిస్, ఆఫ్గనీస్థానములోని గుఱ్ఱములకు ఇపుడుకూడ ప్రశంసయగుచున్నది. ఈదేశములలోని వీరులు గుఱ్ఱములపైఁగూర్చుండివదునైన బల్లెములతోఁ బోరాడుచున్నారు. "ఉశీనరప్రజ అన్నివిధముల యుద్ధములయందును గుశలులై యుండిరి. ప్రాచ్యులు మాతంగ యుద్ధమునయందుఁ ప్రసిద్ధులై యుండిరి. హిమాలయ, వింధ్యపర్వతముల యరణ్యముల యందు నేనుఁగు లధికముగాఁ గనఁబడుచుండెను. ఇందుచేతఁ బ్రాచీన మగధాది దేశీయులు గజయుద్ధములోఁ బ్రవీణులగుట స్వాభావికమేయై యున్నది. వారియొక్క కుస్తీ చాతుర్యయుద్ధఖ్యాతి నేటివఱకు స్థిరమైయున్నది. దాక్షిణాత్యయోధులు కత్తి త్రిప్పుటయందుఁ గుశలులగుచుండిరి. మహారాష్ట్రులు యిప్పటి కీర్తి గుఱ్ఱములపైనుండి ముట్టడించుటకు విషయము గలదై యున్నది. ఇచ్చట పైనిచెప్పఁబడిన దక్షిణదేశీయులు విదర్భదేశములో నుండెడు వారను సంగతిపై ధ్యానముంచవలసి యున్నది. (శాంతి. అ. 69)

## ఏ ను ఁ గు లు

ఇప్పుడు మనము ఏనుఁగుల విషయమై విచారింతుము. ఏనుఁగు యొక్క తీవ్రశక్తిచేతను మావటివాని యాజ్ఞననుసరించి పనిచేయుటకుఁ తయారుపడుటచేతను ఏనుఁగునకు సేనయందు మహత్త్వపూర్ణమైన స్థానము లభించియుండెను. కాని దానియొక్క తొండము మెత్తనిదైన కారణము చేత సులభముగానే భగ్నము చేయఁబడఁజాలినదై యున్నది. ఇందుచేత చెక్కిలినుండి తొండము చివరవఱకు ఏనుఁగునకు లోహపు కవచమునుఁ

గట్టుచుండిరి. మఱియు దాని పాదములయందుఁ గూడఁ గవచముండుచుం డెను. ఈ కారణమున ఏనుఁగులు యుద్ధములో విపక్షులయొక్క సమా చారమును చక్కఁగా తెలిసికొని వచ్చుచుండెను. ఆలోచింపఁగా విషయ మిట్లుండెను. అయినను మల్లులు చేతులలో నాయుధమేదియు గైకొన కయే ఏనుఁగులతో పోరాడుచుండిరి. ఏనుఁగుయొక్క కడుపు క్రిందికి లాఘవమున దూఱి, గుద్దుల దెబ్బలచేత దాని వ్యాకులపఱిచి కుండలా కారముగా నాడించిన వర్ణనము భీమ భగదత్తుల యుద్ధములోఁ జేయఁబడి యున్నది. (ద్రోణ. అ. 26) వర్తమానకాలమందుఁ గూడ హిందూదేశ ములో స్వదేశ సంస్థానములలో అప్పుడప్పుడు జరుగుచున్న గజయుద్ధ ముల వలన ధైర్యము, శక్తియుఁ గల యిట్టి కార్యములు సంభవములు కావని లోకులకు విశ్వాసము కలిగియున్నది. దతియా సంస్థానమందు నేఁటివఱకు అప్పుడప్పుడు ఈ యాటలు జరుగుచుండెను. ఏనుగుయొక్క దంతమందు ఐదువందల రూపాయల సంచియొకటి కట్టఁబడుచుండెను. మఱియు ఆటగాడు ఆ ఏనుగుతో పోరాడి సంచిని లాగుకొనుచుండువాఁడు, అగుఁగాక ప్రాచీనకాలమందు ఏనుఁగుమీఁద మావటివాఁడు, యుద్ధముచేయు యోధుఁడు ఇద్దఱును కూర్చుండెడివారు. యుద్ధము చేయునతఁడు ధను ర్బాణములను, విశేషించి శక్తిలేక బల్లెమును ఉపయోగపఱచుచుండెడివాడు. గజసైన్యమునకు అప్పుడప్పుడు పరాజయము కూడఁ గలుగుచుండెడిది. ఈ విధముగా గజసైన్యముయొక్క మొదటిదాడిని సహించి యాసేన యొక మాఱు మరల్చఁబడునేని యది తన సైన్యమునే నాశనము చేయుచుం డెను, లేక తనంతదానైనను నశించిపోవుచుండెను. గజసైన్యముతో పోరాడుటకై ముందుగా సికందరు కని పెట్టిన యుక్తి యియ్యదియై యున్నది. బాణము వేయఁగలిగిన కవచ హీనులగు పదాతులకు, వారు దూరమునుండియే ముందుగా మావటీలపై బాణప్రయోగముచేసి వారిని గొట్టి వేయవలయునని యాజ్ఞ యిచ్చి యుండెను. కవచము ధరించియున్న పదాతులు గజముల పాదములను ఖండింపవలయును లేక వానిని గాయ పడునట్లు చేయవలయును. సికందరు ప్రత్యేకముగా పొడవైన వంపు కత్తులను చేయించి ఆ సైన్యమునకు ఇచ్చుచుండెడువాఁడు. ఈ కత్తుల చేత ఏనుఁగుల తొండములను నఱుకుటకు ఆజ్ఞ యిచ్చెను. ఈ రీతిగా

గజసైన్యమును సరాభవించుచుండెను. ఈ సంగతి మహాభారతములోని అనేక యుద్ధ వర్ణనములఁబట్టి గజసేన శత్రుపక్షమునకు భయంకరమై యుండినట్లే స్వపక్షమునకుఁగూడ భయంకరము అనగా హానికరమై యుండెనని యగుపడుచున్నది.

## రథికులు ధనుర్బాణములు

భారతీయ కాలమందు రథికులు అందఱికంటె ఎక్కువగా అజయ్యులైన యోధులై యుండుచుండిరి. ప్రస్తుతకాలపువారు రథికులకు మహత్త్వ కల్పనను చేయఁజాలరు. వారేవిధముగా యుద్ధము చేయుచుండిరో మఱియు నింతగా ప్రాణనాశనముచేయు సామర్థ్యము వారియందెందు కుండెనో ఈ విషయమై కొంచెమైనను కల్పన చేయఁజాలము. కారణ మేమనఁగా ప్రస్తుత దినములలో ఎచ్చటను రథముయొక్క ఉపయోగ మగుచుండుట లేదు. ధనుర్బాణములకుఁగూడ నేఁడు జాడ తొలగిపోయి యున్నది. ఇపుడైతే ధనుర్బాణముల స్థానమున తుపాకియు గుండును వచ్చియున్నవి. ప్రాచీనకాలమందు ధనుర్బాణములే శస్త్రములన్నింటి లోను దూరమునుండి శత్రువును గాయపఱుచునట్టి లేక చంపునట్టి అస్త్రమై యుండెను. ఇందుచేత ఆ సమయమందు శస్త్రాస్త్రములలో ధనుర్బాణము లెక్క మొట్టమొదటిదియై యుండెను. అస్త్రములలో లేక విసరిచంపునట్టి ఆయుధములలో రెండాయుధములు— శక్తి లేక బల్లెము మఱియు చక్రము మిక్కిలి తేజోవంతములు, నాశనము చేయునవియునై యుండెను. రెండాయుధములను భారతీయార్యు లుపయోగ పఱచుచుం డిరి. శక్తికంటె చక్రమెక్కువ దూరము వఱకు పోవుచుండెను. చక్రము యొక్క యుపయోగము ఈ కాలమందు కూడ పంజాబులోని సిక్కులు చేయుచున్నారు. కాని చక్రముకంటె ధనుర్బాణముల శక్తి అధికమైయు న్నది. బాణము, మనుష్యుని బలముఁ బట్టి యొకమైలుదాకఁ గూడపోఁ గలుగుచున్నది. ప్రాచీన సమయమందు ధనుర్బాణముల విద్య నార్యులు మిక్కిలి యౌన్నత్యమునకుఁ దెచ్చిరి. ధనుర్బాణముల యుపయోగమందు విశేషమైన సౌకర్యముండెను. బల్లెము లేక చక్రము తిరుగునుగాని చేతికి

రానేరాదు. మఱియు నే మనుష్యుఁడును చాల బల్లెములను లేక చక్రము లను తన చేతితోఁ గైకొనఁ జాలుఁడు కూడను. కాని యే యోధుఁడైనను సరియే పది లేక యిరువది బాణములను స్వయముగా తనయొద్ద నుంచు కొనఁగలుగుచుండెను. మఱియు ననేక బాణములను బండ్లలో నింపుకొని తనతోఁగూడఁ దీసికొని పోఁగలుగుచుండెను. ప్రస్తుత కాలమున ఏవిధముగా తుపాకిమందు, గుండులని, బండ్లను సైన్యముతోడ్తడనే యుంచుకొనుటకు వీలగునేమో, ఆ విధముగానే పూర్వకాలమందును బాణముల బండ్లుంచు కొనఁబడుచుండెను. ఈ కారణముచేత రథముల యుపయోగము ధనుర్బా ణముల యుపయోగించునట్టి యోధుల కెక్కువగా నుండెను. ఇది గాకుండ రథములనేక స్థానములయందు వడిగా నడుపఁబడఁగలుగుచుండెను మఱియు అక్కడనుండి శత్రువులపై బాణముల మార్గమున దాడివెడలుటలో యోధు లకై రథమెక్కువగా నుపయోగపడు చుండెను. ప్రాచీన సమయమందు లోకు లందఱికును ధనుర్బాణముల జ్ఞానముండెను. మఱియు రథముల కల్పనయు నందఱు లోకులకు నుండెను. హోమరుచేత వర్ణింపఁబడిన యుద్ధము వలన యూనానులలో రథికులు కూడ నుండిరనియు రథయుద్ధములు కూడ జరుగు చుండెననియుఁ దెలియుచున్నది. కాని యూనానుల చరిత్రకాలపు యుద్ధ ములలో రథముల వర్ణనము లభింపకున్నది. ఈజిప్టియన్ లోకులయందు బహు ప్రాచీన కాలమున యుద్ధ రథములుపయోగించిన వర్ణనమున్నది. అసీరియమ్‌ల యందును బేబిలోనియనులయందును గూడ రథముల వర్ణనము చేయఁబడి యున్నది. ప్యారిసు నివాసుల సైన్యములో భిన్న ప్రకారమైన రథములుండెను. వారి చక్రములలోఁ జాకులు కట్టఁబడి యుండెను. వానివలన శత్రు సైనికులకు మిక్కిలి గాయములు తగులుచుండెను. భారతీయార్యుల సేనలో రథములు సికందరు కాలము వఱకు నుండెను. యూనానులు భారతీయార్యుల యొక్క ధనుర్బాణ విష యక విద్య యితరులకంటె వృద్ధినొంది యున్నదని వ్రాసియుంచి యున్నారు. మఱియు ఇతరుల రథముల కంటె భారతీయార్యుల రథ ములు పెద్దవై యుండునని యనుమానముఁబట్టి తెలియుచున్నది. హిందు స్థానీయుల ధనుస్సులు మనుష్యుని శిరముదాఁక నెత్తుగలవిగను మఱియు వారి బాణములు మూఁడుచేతుల మూరల పొడవైనవిగను నుండుచుండెనని

యూనానులు వర్ణించియున్నారు. బాణముల యొక్క యినుము లేక అలుగులు (ఫలములు) మిక్కిలి పదునైనవిగాను పొడపైనవిగాను నుండుచుండెను. ఇట్టి ధనుస్సులను లాగునట్టి మనుష్యుని భుజమునందు మిక్కిలి శక్తి అవశ్యకమై యుండెను. ఆలోచింపఁగా యూనానుల సమయమందు నిచట ధనుర్బాణకళ కొంచెము తగ్గియుండెను, అయినను అప్పటి యార్యయోధుల చేత ప్రయోగింపఁబడు బాణము చాల వేగముగా వచ్చుటను జూచి యూనానులకు ఆశ్చర్యము కలుగుచుండెను. ఇట్టి బాణములచేత లావుపాటి యినుపపట్టాలు కూడ ఛేదింపఁబడఁ గలుగుచుండెనని వారు వ్రాసిపెట్టియున్నారు. భారతీయ క్షత్రియుల ధనుర్విద్యా విషయమైన కీర్తి యెడలను వారి విలక్షణ సామర్థ్యము విషయమునను ప్రపంచమునకు పృథ్వీరాజు కాలమువఱకు ఆశ్చర్యముతోఁచుచుండెనన్న సంగతి యితిహాసములో వ్రాయఁబడియున్నది. భారతీయార్యులలో ఈ చివరి ధనుర్వీరుఁడు బాణముచేత దళసరిలోహపు పెనములను ఛేదించి యుండెనన్న సంగతి యితిహాసములోఁ వర్ణింపఁబడి యున్నది.

పొడవుపాటి ధనుస్సును గైకొని బరువైన బాణములను ప్రయోగించునలవాటు చేతులందుండుటచేత స్వభావమున శారిరక శక్తియొక్క యావశ్యకత యుండెను. కాని బాణముల సరిగా గుఱి చూచివేయుటకై ధనుర్బాణ వ్యాసంగము కూడ రాత్రింబవళ్ళు చేయువలసియుండెను. తుపాకి లక్ష్య ఛేదనముకై కొంత యీశ్వర దత్తమగు గుణమావశ్యకమై యున్నట్లే ధనుర్బాణములకుఁ గూడ గుఱిని సరిగాఁ గొట్టుటకై యీశ్వరదత్తమైన శక్తి యావశ్యకమై యున్నది. కాని యిట్టి గుణముపయోగించుటకై నిరంతరాభ్యాసమునకుఁ గూడ ఆవశ్యకత కలదు. ఇందుచేతఁ బ్రతి మనుష్యుఁడును ధనుర్వీరుఁడు కాఁజాలఁడు. సహజ శక్తి, చిరకాలాభ్యాసము, ఉత్తమ గురువు, ఈమూడు విషయముల మేళనము కలిగియుండుట చేతనే అర్జునుఁడు ప్రఖ్యాతధనుర్ధరుఁడయ్యెను.

తదభ్యాస కృతం మత్వా రాత్రావాపి సపాండవః ।
యోగ్యాం చక్రే మహాబాహుర్ధనుషాం పాండునందనః ॥

(ఆది. అ. 132)

ఈ సంగతిని తెలిసికొనియే అర్జునుఁడు రాత్రివేళయందుఁ గూడ ధనుర్బాణములను ప్రయోగించెడి పరిశ్రమమునుయోగ్యమైన అభ్యాసము న నైపుణ్యము ప్రాప్తమగునంత గావించియుండెను. ఇందు రెండు సంగతుల వైపున ధ్యానముండుచుండెను. మొదటిదైతే గుఱికి సరిగాఁ తగులవలయును. మరియు బాణముకూడ తీవ్రముగా వేయఁగలిగి యుం డవలయును. ధనుర్ధరుఁడు వేఱువేఱు వేగములతోడను, వేర్వేఱు రీతుల తోడను ధనుర్బాణముల నుపయోగింపఁగలిగి యుండవలయును. ధనుస్సును (నెడతెగకుండ) విడువకుండ నుపయోగించుచున్న కారణమున అర్జునుని యెడమ చేతిమీఁద గాయాలు కలిగియుండెను. వానివతఁడు బాహుభూష ణములఁ దాల్చి బృహన్నలా వేషమందు దాచియుండెను.

ధనుర్వీరునియొక్క (ధానుష్కునియొక్క) శక్తి రథ సాహాయ్యము వలనఁ పదిరెట్లు వృద్ధి చెందుచున్నది. పాదచారియైన ధనుర్ధరుఁడు ఒక మనుష్యుఁడెత్తఁ గలిగినన్ని బాణములనే తీసికొని పోఁగలఁడు; కాని రథ మందుఁ కావలసినన్ని బాణములుంచుకొనఁ బడఁగలవు. ఇదిగాకుండ, బాణ మునుపయోగింపవలసిన చోటికిఁ పాదచారియైనవీరుఁడు సులభముగా మార్చఁ జాలఁడు; కాని రథముయొక్క సాహాయ్యముచేత ధనుర్వీరుఁడు గుఱి కొట్ట వలసిన వేర్వేఱు స్థానములకు వేగముగాఁ బోఁగలుగుట యనెడి లాభము అగుపడుచున్నది. మరియు రథవేగముచేత లక్ష్యమును సుఘటితము చేయు టలో అవకాశము దొరకుచున్నది. ఇందుచేత రథముపై నుండి గుఱి కొట్టు టకుఁ గూడ అభ్యాసము చేయవలసియున్నది. రథముయొక్క గుఱ్ఱముల మీఁదికిని సారథి మీఁదికిని దాడి వెడలఁబడఁగలదు. ఇందుచేత రథయోధు నకు శత్రువును నశింపఁజేయునట్టి శక్తి అధికముగాఁ ప్రాప్తమగుచుండెను. అయినను అతనికి జవాబు దారికూడ అధికముగాఁ పెరుగుచుండెను. నేఁటి యూరోపియను యుద్ధము వలన ప్రస్తుత కాలమునఁ గూడ యుద్ధములో రథముయొక్క యుపయోగము మెల్ల మెల్లగాఁ ఆరంభించెనని అనుమానిం పఁబడుచున్నది. వర్తమాన కాలమందు మాక్సిమ్ గన్కు తుపాకిని మోటారుబండిపై నుంచుకొని వేర్వేఱు చోటులకు శీఘ్రముగాఁ తీసి కొని పోయి అచ్చటినుండి లక్ష్యమును గొట్టునట్టి యుక్తి నడచుచున్నది.

అది రథమువంటిదే యై యున్నది. ఈ మోటారుపైని గుండు తగలకుండ నుండుటకై కడచిన యుద్ధములో (ట్రైంకు) యొక్క యేకల్పన బయలు దేఱెనో, అది కూడ రథమువంటిదేయై యున్నది. పూర్వ కాలపు యుద్ధములలో రథముయొక్క యుపయోగము నేఁటి (తొఫ్ఖానా) బండ్లవలె విశేషించి గుఱ్ఱపు ఫిరంగులవలె నగుచుండెను. వేర్వేఱు చోటులనుండి గుఱికొట్టుటకై రథములను బరువెత్తించుచు ఒకచోటనుండి మఱియొక చోటికిఁ తీసికొని పోఁబడవలసి యుండెడిది. కాని ప్రస్తుతకాలపు ఫిరంగి బండ్లతోపాటుగానే మందుగుండ్లయొక్క చోటున బాణములను సంగ్రహించుట యావశ్యకమై యుండెను. మహారాష్ట్రుల యుద్ధ వర్ణనమునందు బాణముల బండ్లయొక్క యుల్లేఖ మెండతెగకుండఁ జేయఁబడి యున్నది. కర్ణ పర్వములోని అశ్వత్థామ యొక్క కథనమున్నది.— 'బాణములతో నిండియున్న యేడుబండ్లు నాకింట నుండనిమ్ము'; మఱియొకచోట అశ్వత్థామ మూఁడుఘంటల వ్యవధిలోపలనే ఎనిమిదెనిమిది యెద్దుల గట్టిన యెనిమిది బండ్లలోని శస్త్రాస్త్రముల నన్నింటిని ప్రయోగించి నట్టిపిగాఁ జేదిపై చెనని వర్ణనమున్నది. దీనినిఁబట్టి యిప్పటి ఫిరంగి బండ్లతోపాటుగానే రథయోధులకు బండ్ల సంగ్రహమెక్కువ అవశ్యకమై యుండెనని చెప్పఁబడుచున్నది. దీనినిఁ బట్టి ఆధునిక సమయాను సారముగనే ప్రాచీన కాలపు యుద్ధములలో వాహనారూవ సాధనము లెక్కువగా నగుపడు చుండెనని కూడఁ తెలియుచున్నది.

## అస్త్రములు

రథికులు తఱచుగా ఉపయోగించు చుండిన అస్త్రములేవియై యుండెనని యిచటఁ ప్రశ్నము కలుగుచున్నది. అస్త్రముల విషయమున వివేచనా దృష్టిచేత ఏ అభిప్రాయము మీయఁబడఁగలదో తెలిసికొనుటకై పాఠకులకు నిచ్ఛ సహజముగనే కాఁగలదు. అస్త్రములను తఱచుగా రథికులే యుపయోగపఱచు చుండిరని వర్ణనము కనఁబడుచున్నది. ధనుస్సు బాణము తగిలించి దానిపైఁ కొన్ని మంత్రములను ప్రయోగించి బాణములు ప్రయోగింపఁ బడుచుండెనను వర్ణనము కూడఁ గలదు. ఆ సమయమున దైవికశక్తిచేత విలక్షణములైన శాస్త్రములులేక పదార్థములు వాయువు, విద్యుత్తు, వర్షము మొద

లగు వానివంటివి యుత్పన్నమగుచుండెను. వానిచేత శత్రుసేనకు భయంకర మైన నాశము సంభవించుచుండెను. ఈ అస్త్రములకు అగ్న్యస్త్రము, వాయ వ్యాస్త్రము మొదలైన నామములుండెను. ఈ దైవిక మంత్రములు తఱచుగా బాణముల మీఁదఁ కూర్పఁబడుచుండెను. వీనియందు విలక్షణమైన దైవిక శక్తులు నిండియుండెడివి. కేవలము బాణముల మీఁదనే అస్త్రముల యొక్క మంత్రములు జపింపఁబడుచుండెనని ఊహింపరాదు. భగదత్తుఁడు అంకు శము మీఁద వైష్ణవాస్త్ర మంత్రమును జపించి దానిని ప్రయోగించి యుం డెను. అశ్వత్థామ యుద్ధమునకుఁ పిమ్మట భగీరథీతీరమున వ్యాసునియొద్దఁ కూర్చుండెను. ఆ సమయమునఁ పాండవులాతని చంపుటకై వచ్చినపుడు అతఁడొక దర్భకాడమీఁద బ్రహ్మశిరో నామకాస్త్రమును జపించి ఆ కాడను పాం డవులమీఁద విసరియుండెను. సారాంశము అస్త్రములకు ధనుస్సులేక బాణమే కావలయుననెడి యావశ్యకత యుండెనని చెప్పఁబడఁ జాలదు. ధనుర్వేద మందుఁ చెప్పఁబడియున్న విశేషాస్త్ర మంత్రములను అప్పుడప్పుడు చేతిలో ఉదకము గైకొని శుద్ధాంతఃకరణముతో జపింప వలసియుండెను. పిమ్మట తదను సారముగ భయంకరమైన అస్త్రము లేక జ్వాల, విద్యుత్తు మొద లైనవన్ని యుత్పత్తి యగుచుండెడివి. అస్త్రయోచనయందు నాలుగు భాగ ములుండెను. ఈ నాలుగు భాగములు మంత్రము, ఉపచారము, ప్రయో గము, సంహారములై యున్నవి. ఉద్యోగపర్వ. అ. ౫ యందు 'యోస్త్రం చతుష్పాత్ పునరేవ చక్రే' అని చెప్పియున్నాఁడు. సంహార శీలము చేత అస్త్రమును ప్రయోగించిన యోధుని యందాయస్త్రమును మరల త్రిప్పి వైచెడు శక్తి కలదని తెలియుచున్నది. ధనుర్వేదమందు శాస్త్రములయొక్క వర్ణనతో పాటుగా అస్త్రముల విస్తృతమైన వర్ణనముండెను. భారతీయ కాలమందు ప్రతి క్షత్రియుఁడును ఈ అస్త్రవిద్యనభ్యసింప వలయునను నియ మముండెను. ఈ విషయము గురువునుండి ధనుర్వేద సాహాయ్యమున క్షత్రి యుఁడు అస్త్రప్రయోగోప సంహారము లే ప్రకారముగాఁ జేయఁబడుచుండెనో నేర్చుకొనవలసియుండెను. వేదశిక్షనిచ్చెడు అధికారము బ్రాహ్మణులకుండెను. ఇందుచేత ధనుర్వేదములోని ఆ అస్త్రమంత్రములను నేర్పుటయు, వాని యొక్క ప్రయోగ సంహారములను ప్రత్యక్షానుభవ ద్వారమునఁ చెప్పుటయు ననెడి పనులుకూడ బ్రాహ్మణులే చేయవలసి యుండెను. మహాభారతములో

ఈయఁబడియున్న అస్త్ర వర్ణనములఁ బట్టి యీ సంగతులన్నియుఁ తెలియుచున్నవి. ఈ అస్త్రములు వాస్తవములో కాల్పనికములో యీ సంగతినిర్ణయింపఁబడఁ జాలదు. మంత్రములయందు అద్భుతమైన దైవికశక్తియుండఁ జాలియుండును. కాని ఇచ్చట రెండుమూడు సంగతులింకను చెప్పవలసియున్నవి. అస్త్రవిద్య ధనుర్విద్యకాదు బొత్తిగా వేరైయుండెను. అస్త్రవిద్య యొకానొక మంత్రవిద్యయై యున్నది. ధనుర్విద్య ధనుస్సునకు సంబంధించి యొక మానస విద్యయై యున్నది. ధనుర్విద్యయందు ప్రావీణ్యము ప్రాప్తించుటకై అర్జునునికి రాత్రిందినములు ధనుర్బాణాభ్యాసము చేయవలసి యుండెను. కాని అస్త్రవిద్య అతనికి గురు ప్రసాదము వలన మిక్కిలి శీఘ్రముగా ప్రాప్తమై యుండెను. సారాంశము, అస్త్రవిద్య దైవవిద్యగను, ధనుర్విద్య మానవ విద్యగను నుండెను. రెండవ సంగతి యేమనఁగా అప్పటి ధర్మయుద్ధములో అస్త్రవేత్త, అనస్త్రవేత్తపై అనఁగా అస్త్రములేని వానిపై అస్త్రముల నుపయోగింపరాదను నియమముండెను. తుపాకిని పట్టుకొన్న వారికి శస్త్రహీనులపై తుపాకిని ప్రేల్చుట అన్యాయముగాను, క్రూరముగాను తలంపఁ బడుచున్నట్లే యస్త్రతుల్యముగా భయంకరమైన దైవికశక్తి యెవనియొద్ద నున్నదో, అతఁడు అస్త్రముల నేయగానే వానిపై అనఁగా దైవికశక్తి విహీనులపై అస్త్ర ప్రయోగము చేయరాదని నియమముండెను. ద్రోణుఁడు క్రోధవశుఁడై చేసియుండిన యిట్టి భయంకర కృత్యము అనుచితమని చెప్పఁబడి యున్నది.

> బ్రహ్మాస్త్రేణ త్వయాదగ్ధా అనస్త్రజ్ఞా నరా భువి ।
> యదేత దీదృశం కర్మకృతం విప్రవన సాధు తత్ ॥ (ద్రో. అ. 180)

అనఁగా ఈ అస్త్రము నెల్లపుడు నుపయోగింపఁ గూడదను సంగతి నిశ్చితమై యుండెను. ఈ వైదిక మంత్రములు ప్రసంగవశమున జ్ఞప్తికివచ్చుచుండెడివి కావన్న సంగతి మూఁడవదియై యున్నది. కర్ణునికి యుక్త సమయమున బ్రహ్మాస్త్రము జ్ఞప్తికి రావచ్చును. అర్జునునికిఁ గూడ శ్రీకృష్ణ నిర్యాణమునకుఁ పిదప దస్యువుల యుద్ధ సమయమున అస్త్రములు జ్ఞప్తికి రావయ్యెను. ఈ విషయముల నన్నిటిని విచారింపఁగా ఈ దైవికశక్తి కల

అస్త్రములు ప్రాచీనకాలమున అనఁగా భారతీయ యుద్ధ కాలమున విశ్వసింపఁబడి నప్పటికిని, యుద్ధముయొక్క అంత్య పరిణామమందు వానికెక్కువ యుపయోగము లేదయ్యెనని ఇచ్చటఁ చెప్పవలసి వచ్చుచున్నది.

## సికందరునాటి రథయుద్ధము

అస్త్ర యుద్ధమే కాకుండ భారతీయ యుద్ధ రథికుల యుద్ధముయొక్క వర్ణనము కూడ మహాభారత మందెక్కువగా నున్నదన్న సంగతి సత్యమై యున్నది. కాని ప్రస్తుత కాలమున మనము రథికులయొక్క యుద్ధమేవిధముగా నగుచుండెనో యీ సంగతియొక్క కల్పనను చేయుజాలము. కారణమేమనఁగా ప్రస్తుతకాలపు వారియొక్క బుద్ధియందు ఫిరంగి బండ్ల యుద్ధ వర్ణనమే పూర్తిగా నిండియున్నది. మఱియు, ప్రాచీన కాలమందు అస్త్రములు లేకయు రథికులు మిక్కిలి మహత్త్వ పూర్ణులైన యోధులై యుండియుందురనుటకు సందేహము లేదు. శాంతిపర్వము యొక్క 10వ అధ్యాయమందు రథికుని యొక్క యుద్ధము ఏ సమయమున మరి ఏ భూమిని గావలయునో యీ విషయమై నియమము చెప్పఁబడి యున్నది. పదాతులు కల సైన్యమన్నిటికంటె ఎక్కువ బలవంతమనియు (ఇప్పటి అనుభవము కూడ ఇట్లేయున్నది.) గోతులు మొదలైనవి లేనిచోట వర్షము కురియని సమయమందు అశ్వసేనయు, రథములు ఎక్కువ యుపయోగించు ననియు చెప్పఁబడి యున్నది. మహాభారతము నాఁటి ప్రత్యక్ష యుద్ధముల ప్రాప్తి మిది సూచింపఁ బడియున్నది. యునానుల యాక్రమణ కాలమున రథ యుద్ధములు ప్రత్యక్షముగా నెట్లు జరుగుచుండెడివో యీ సంగతి యిచ్చట వర్ణింపఁ బడునేని, యది పాఠకులకు మనోరంజకమని తెలియఁగలదు. పంజాబులో వితస్తా నదీతీరమున సికిందరుతో జరిగిన పోరాడు రాజుయొక్క యుద్ధములో సైన్యమున రథములే ప్రధానాంగాలై యుండెను. ఇతిహాసకారుడైన కార్టియాన్ రూఫ్స్ అనునతఁడు వారికి యుద్ధమెట్లు జరిగెనో, వారికి పరాభవము ఏ విధముగా జరిగెనో యీ సంగతిని వ్రాసి యుంచి యున్నాఁడు. "యుద్ధమునకు మొదటనే వర్షము కురియఁ దొడఁగెను. కనుక ఎక్కడను ఏదియు కనఁబడకుండెను. కాని కొంతసేపటికి ఆకాశము

మేఘశ్యామమయ్యెను. అప్పుడు ఇరుపక్షసేనలు కనంబడందొడంగెను. రాజైన ఫోరస్ యూనానుల నడ్డగించుటకై నూఱు రథములను, నాలుగువేల గుఱ్ఱములను ముందుకుం బంపెను. ఈ చిన్న సేనయొక్క శక్తియంతయు రథముల పైనే ఆధారపడి యుండెను. ఈ రథములు నాలుగేసి గుఱ్ఱములచేత లాగంబడు చుండెను. ప్రతి రథమందును నలుగురేసి యుండిరి. అందులో ఇద్దఱు డాలు చేతపట్టుకొని నిలంబడి యుండెడివారు. ఇద్దఱు రెండువైపులను విల్లుపట్టుకొని నిలంబడియుండిరి. మిగతా ఇద్దరును సారథులై యుండిరి. ఈ సారథులు యుద్ధము చేయువారు కూడనై యుండిరి. పోరాటమారంభమైనపుడు ఈ సారథులు పొడవుపాటి కళ్లెమును క్రిందంబెట్టి చేతులతో శత్రువులపై బల్లెముల ( రువ్వుచుండిరి ) విసరుచుండిరి. కాని ఆ దినమున వీరు రథములంతగా నుపయోగింపలేదు, ఎందుచేత? వర్షమెక్కువంగా కురియుండెను. నేల చాల దిగంబడి పోవుచుండెను. గుఱ్ఱములు పరువెత్తంజాలకుండెను. కనుక ఇంతియేకాక వర్షముచేత రథచక్రములు రొంపిలో దిగంబడ నారంభించెను. మరియు నయ్యవి యెక్కువ బరువుగానున్న కారణముచేత రథమునొక చోటినుండి మరియొకచోటికి లాగుకొని పోవుటకు వీలు లేకపోయెను. ఇటు సికందరుకూడ వేగముతో వానిపై ముట్టడించెను, ఎందుచేత? వాని సైన్యమునొద్ద నంతగా శస్త్రములు లేకుండెను. ముందుగా సథియావారు భారతీయులపై ముట్టడి చేసిరి. మరల రాజు తన రౌతులకు వారికి తూర్పున ముట్టడించుటకై ఆజ్ఞ యిచ్చెను. ఈ విధముగా సంచలమారంభమయ్యెను. ఇంతలోనే రథసారథులు తమ రథములను పూర్ణవేగముతో తోలుచు యుద్ధ మధ్యభాగమునకు తీసికొని పోయిరి. మరియు వారు తమ మిత్రులకెక్కువ సాహాయ్యమును జేసికొన తలంపం దొడంగిరి. కాని యిందుచేత నే సైన్యమున అధిక నాశమయ్యెనో యీ సంగతి నిర్ణయింపంబడం జాలదు. సికందరున కెదుటనున్న పదాతులు ఈ ముట్టడియొక్క మొదటి తాకుడు వలన నేలపైంబడిరి. కొన్ని రథములు, గుఱ్ఱములు కోపగించెను. రథములను గోతులలోను, నదులలోను పడవైచి యవి తప్పించుకొనెను. మిగిలిన కొన్నింటిపై శత్రుబాణముల వర్షము కాందొడంగెను. ఇందుచేత నయ్యవి పోరసు యొక్క సేనపై పునకుం దిరుగంబోయెను".

పై వర్ణనముఁ బట్టి మహాభారత కాలమున అనఁగా యూనానుల దండ యాత్రిలో రథములచే నెట్లు యుద్ధము చేయఁబడుచుండెనో యుద్ధములోనవి యెంత యుపయోగించు చుండెనో యా సంగతి యొక్క కల్పన కాఁగలదు. భారతీయ యుద్ధసమయము మొదలుకొని యూనానుల సమ యము వరకు రథములయుద్ధపద్ధతిలోఁ జాల నంతరము సంభవించి యుండెనను సంగతి పై వర్ణనముఁ బట్టిఁకూడ గనబడుచున్నది. భారతీయ యుద్ధములో వందలకొలఁది రథములొక్కచోట యుద్ధము చేసిన వర్ణనము లంతగా లేవు. ప్రతి రథికుఁడును వేఱువేఱుగా యుద్ధము చేయుచుండెను నదికూడ దూరమునుండియే. అశ్వసేనవలె నేకకాలమునందే పరుగెత్తి దేనిపైనను మట్టడించుట రథముల యొక్క యుద్దేశము కాకుం డెను. యుద్ధముయొక్క భిన్న భిన్న స్థానముల యందు వేగముగాఁ జేరు కొని బాణవర్షము కురిపించుటయే రథముయొక్క ముఖ్యకృత్యమై యుం డెను. భారతీయ కాలమందుఁ గూడ రథమునకు నాలుగేసి గుఱ్ఱములుండు చుండెను. కాని రథముపైన ధనుర్ధరుఁడే యొక సారథియే నివసించుచుం డెను. యూనానుల వర్ణనము ననుసరించి యిద్దరు ధనుర్ధరులు లేక యిరు వురు సారథులు లేకుండిరి. ధనుర్ధరునియొక్క సంరక్షణకై డాలుగలవారి యావశ్యకత లేకుండెను. యుద్ధము యొక్క వర్ణనముఁ బట్టి రథమునకిద్ద రేసి చక్ర రక్షకులుండెడి వారని తెలియుచున్నది. రథముల పైకి రెండు వైపుల నుండియు ముట్టడి కలుగనీయకుండుటకై రథముల యొక్క రెంక వైపులను చక్రములదగ్గర నింకను రెండు రథములు నడుచుచుండెడివి వాని యందుండెడి ధనుర్ధరులకు చక్ర రక్షకులని చెప్పుచుండిరి. రథముల ముఖ్య కృత్యము ఒకచోట నుండి మఱియొక చోటకి రాకపోకలై యుండెను. కనుక నవి యిటు నిటు తిరుగుటకై బయట ప్రదేశము అవశ్యకమగు చుండెను. ఇందుచేత, రథములయొక్క యుపయోగము భారతీయుద్ధకాల మందు ముట్టడులకై కాకుండెను.

అపంకా గర్త రహితా రథభూమిః ప్రశస్యతే ।
రథాశ్చ బహులాసేనా సుదినేషు ప్రశస్యతే ॥

రథము నడుపుటకై బురదలేనిది, మఱియు గోతులులేనిది యగు భూమి మంచిదిగా యున్నది. ఇది కూడఁ జెప్పఁబడియున్నది--

పదాతినాగ బహులా ప్రావృట్కాలే ప్రశస్యతే।

గుణా నేతాం ప్రసంఖ్యాయ దేశకాలే ప్రయోజయేత్॥ [శాంతి.అ100]

వర్షము కురిసినప్పటికిని పోరస్సు రథములను రౌతుల నుపయోగపఱిచెను ఇది యాశ్చర్యమై యున్నది. మహాభారతమందు యుద్ధ సంబంధి నియమములు చెప్పఁబడియున్నవి. ఇంతేకాక యప్పటి నీతిశాస్త్రమందుఁగూడ నివే నియమాలు ఈయఁబడియున్నవి. ఈ నియమముల నతిక్రమించుటచేత పోరస్సుయొక్క రథములకుఁ బరాజయమయ్యెననుట యాశ్చర్య విషయము కాదు. రథయుద్ధము యొక్క పద్ధతి మహాభారతకాలమునఁ జాలవఱకుఁజెడి పోయి యుండినట్లగపడుచున్నది; మరల మహాభారతోక్త సమరముబట్టి యస్త్రయుద్ధము చేయురీతి, లేక యనుభవజన్యమైన నియమము, యుద్ధ శాస్త్రమందుఁ జక్కగాఁ జెప్పఁబడి యుండెనను సంగతి నిర్వివాదమై యున్నది.

## రథవర్ణనము

రథముల నింకను గొంచెము వర్ణింపవలయును. రథమునకు నెల్లపుడును నాలుగు గుఱ్ఱములు కట్టబడుచుండెను; రథములు చక్కగా నలంకరింపబడుచుండెడివి, ఇట్లె గుఱ్ఱములుకూడఁ చక్కఁగా నలంకరింపఁబడుచుండెను,మఱియు వాని సామానులన్నియు వెండి బంగారములు మలామా చేసి సుందరముగాఁ జేయఁబడుచుండెను. రథముమీఁద మందిర శిఖరమువలె గుండ్రని శిఖరముండుచుండెను మఱియు దానిపై జెండా యెగురుచుండెడిది, ప్రతివీరుని జెండా యొక్కయు రంగు దాని చిహ్నము వేఱుగా నుండెను ఈ చిహ్నములఁబట్టి, దూరమునుండియే, ఆ వీరుఁడెవఁడో గురితింప వీలగుచుండెను. ద్రోణపర్వముయొక్క 2వ యధ్యాయమందు యొక్క వేడుకల రథముల యుద్ధముల వర్ణనము చేయఁబడి యున్నది.

భీముని రథముయొక్క గుఱ్ఱములు నలుపు రంగుగలవై యుండెను. మఱియు వాని సామాను బంగారపుదై యుండెను. నకులుని గుఱ్ఱములు కాంభోజ దేశపువియై యుండెను. వాని నుదురు, మెడ, రొమ్ము, వెనుకటిభాగము విశాలమై యున్నది; మెడ, ఒడలు పొడవై యున్నది. మఱియు, డిబ్బెలు ఇరుకైనవిగానున్నవి. ద్రోణుని రథముయొక్క జెండా నలుపు తెలుపును గలదియై మఱియు పసిడి కుండతోఁ గూడినదియై యుండెను. భీమసేనుని జెండాపై భయంకరమగు సింహముండెను. కర్ణుని జెండాపై నేనుఁగు గొలుసుయొక్క చిహ్నమున్నది. యుధిష్ఠిరుని జెండా గ్రహణము పట్టని చంద్రుడువలె శోభిల్లుచుండెను. నకులుని జెండామీఁద నడుము బంగారపుదిగాఁగల శరభమృగపు చిహ్నముండెను. రథమందు నొక డోలు వ్రేలాడుచుండెడిదని కూడ వర్ణితమై యున్నది. కొన్ని రథములపై రెండు మద్దెలలు రథము కదల నారంభింపఁగనే, తమంతటఁదాము ఏదో ఎన్నికచేత మ్రోగ మొదలు పెట్టినట్లుగా నుండెడివి.

మృదంగౌ చాత్ర విపులౌ దివ్యౌ నందోపనందనౌ।

యంత్రేణాహన్యమానౌ చ సుస్వనౌ హర్షవర్ధనౌ॥

భిన్న భిన్నమైన యోధగణము మద్దెలయొక్క లేక డోలుయొక్క చప్పుడుచేత మత్తెక్కినదై పోరాడుచుండి యుందురనుట అసంభవ నీయము కాదు ప్రస్తుత దినములలోఁ బాశ్చాత్య యుద్ధములలోఁ గూడ నీ సంగతి యగపడుచున్నది. ఐర్లండువారి సైన్యము ముట్టడించుటకై యెపుడు ముందులఁ బోవుచున్నదో, అపుడు దానితోపాటుఁ పాయిప, అనువాద్యము వాయింపబడుచున్నది. యుద్ధమారంభమగు నపుడెల్లను వాద్యము వాయించువారు మిక్కిలి వడిగా కరవాద్యమును వాయించు చుందురు, స్వయముగా యుద్ధము చేయుచుండగా గాయపడినప్పటికిని తన రణ వాద్యమును వాయించుచునే యుండుననుటలో హాని వీరత్వము తెలియుచున్నది. యుద్ధ సమయమునఁ అత్యక్ష యుద్ధము కానారంభమైనపుడు ముమ్మరముతైన రణ వాద్యములకు మత్తెక్కించునట్టి మ్రోత యావశ్యకమగుచున్నది.

ఈ సంగతి చెప్పఁబడిన యుదాహరణము వలన స్పష్టముగా దెలియును రథములు మిక్కిలి పెద్దవియై యుండుచుండెను. ప్రతి చోటను వానికై నగరాకార, విశేష ముపయోగింపఁబడుచున్నది. అందు బాణము శక్తి మొదలైనవి యయినను వచ్చినపు డుపయోగించు ననేక వస్త్రములు నింపఁబడుచుండెను. రథికుని శరీరము మీఁద నెల్లపుడును గవచముండుచుండెను. చేతులకై యుడుముతోఁ జేసిన యంగుళిత్రాణము --వ్రేళ్ళను గాపాడుకొనుటకై యుడుముతోఁ జేసిన, యొక యావరణము – యుండుచుండెను. బద్ధగోధాంగుళిత్రాణః, మాటి మాటికిని జెప్పఁబడి యున్నది. రథికునితో పాటు సారథికిని గవచ ముండుచుండెను. రథికుల విషయమై మఱికొన్ని సంగతులు చెప్పఁదగి యున్నవి. భారతీయ యుద్ధ కాలమందు రథమునకు రెండే చక్రములుండి యుండునని తెలియుచున్నది. ఉదాహరణార్థము, ద్రోణ. అ. 15కు నారంభమున ద్రోణుని కుడిచక్రము (ఏకవచనము) నే వాఁడు రక్షించు చుండెను. నేడును దానినే వాఁడు రక్షించు చుండెను. మునుపటి యన్యదేశపు రథముల వర్ణనములందును చిత్రముల యందును రెండే చక్రములు చూడఁబడుచున్నవి. బాబిలోనియా, ఖాల్డియా, అసీరియా, ఈజిప్టు, గ్రీకుదేశములలోఁ బ్రాచీనకాలమున రథములుండెను. కాని వాని నన్నిటికిని రెండే చక్రములుండెననియే వర్ణనము కనఁబడుచున్నది. ఇదే విధముగా మహాభారత మందును రెండు చక్రముల రథములే వర్ణింపఁబడి యున్నవి. నాలుగేసి చక్రములుకూడ నుండి యుండును. ఘటోత్కచుని రథమునకు ఎనిమిది చక్రములుండెనని కూడ వర్ణనమున్నది. "అతని రథము నాలుగువందల మూరలదియై యుండెను. అందు చిఱుగజ్జెలు వ్రేలాడుచుండెను, మరియు నందుపైనే మూడురంగులు గల జెండా యెగురుచుండెను. నాలుగువందల మూరలు పొడవు, వెడల్పును గల రథముపై నెలుగుతోలు తోడి యావరణము వ్రేలాడుచుండెను. అందుననేక శస్త్రాస్త్రములు నిండియుండెను. దానికెనిమిది చక్రములుండెను. మరియు వడిగలవియు బలముగలవియునైన నూఱు గుఱ్ఱములు కట్టఁబడి యుండెను. పెద్దపెద్ద కన్నులుగల సారథియొకఁడుండెను. ఆకాశముతో డీకొనెడి యతి ప్రపంచమైన ధ్వజము దానిపై నెగురుచుండెను. మరియు ఎఱ్ఱనితల కలిగి యత్యంతభయంకరమైన గూర్ధ్రా యా ధ్వజముపైఁ గూర్చుండెను. అతని ధనుస్సు

పురాతన చిత్రములననుసరించి, ఒక పంక్తిగనే పోవుచుండెనో లేదో యని కూడ లేక మహత్త్వపూర్ణమును కఠినములైన ప్రశ్నము కలుగు చున్నది; ఎందుచేత? రెండె దండెలు ఎల్లపుడును వర్ణింపఁబడియున్నవి; దీని విషయమున ననుమానించుటకై లబ్ధమగుచున్న వర్ణనముల నన్నింటి నిపుడు విచారింపవలయును,

విరాటపర్వములోని 45 వ యధ్యాయమందు ఉత్తరుఁడు తన రథముయొక్క గుఱ్ఱములనిట్లు వర్ణించియున్నాడు—

దక్షిణాం యోధురంయుక్తః సుగ్రీవసదృశోహయః ।
యోయంధురం ధుర్యవహోవామం వహతి శోభనః ॥
తంమన్యే మేఘపుష్పస్య జలేన సదృశం హయం ॥ 21
యోయం కాంచన సన్నాహః పార్ష్ణిం వహతి శోభనః ।
సమం శైబ్యస్యతం మన్యే జవేన బలవత్తరమ్ ।
యోయంవహతి మేపార్ష్ణిం ధక్షిణామభితః స్థితః ।
బలాహకాదపి గతః స జవే దీర్ఘవత్తరః ॥ 23

టీకాకారుఁడు చెప్పిన దేమనఁగా—

'పురః స్థితయోరశ్వయోః పృష్ఠభాగం పాశ్చాత్యం యుగం పార్ష్ణిదు.

మంచిది; ఈ శ్లోకములఁ బట్టియు ఈ టీకనుబట్టియుఁ గూడఁ బూర్తిగా బోధము కానున్నది. రెండు గుఱ్ఱములు ముందు వెళ్ళుచుండెను వానికి వెనుక రెండు గుఱ్ఱములుండు చుండెడివి, అనఁగా సాధారణముగా నిప్పుడు నాలుగు గుఱ్ఱములును బండికిఁ గట్టెడు పద్ధతియే కనఁబడుచున్నది, కాని నాలుగు గుఱ్ఱములును నొక వరుసయందే అనఁగా రెండెడమ వైపునను రెండు కుడి వైపునను నుండఁగలిగియుండును. పార్ష్ణి ఇశబ్దమచటఁ గూడ సందిగ్ధమై యున్నది. సౌప్తిక పర్వములోని 13 వ యధ్యాయమందు శ్రీ కృష్ణుని రథమిట్లు వర్ణింపఁబడి యున్నది—

దక్షిణా మవహచ్ఛైబ్యః సుగ్రీవః సవ్యతోభవత్ ।
పార్ష్ణివాహౌతు తస్యాస్తాం మేఘపుష్ప వలాహకౌ ॥

ఇచటఁ గూడ నాశంక మిగిలిపోవుచునే యున్నది. ఒక యుదారుఁడైన రాజు తన రథముయొక్క గుఱ్ఱములను నొకటి తరువాత నొకదానిని విప్పి బ్రాహ్మణునికి దానము చేసెనని వనపర్వములో జెప్పఁబడి యున్నది. [వన. అ. 198 ]. అతని రథము మూఁడు గుఱ్ఱములతో లేక యొక గుఱ్ఱముతో నెట్లు నడువఁగలిగెనో యిది గూఢముగా నున్నది ఈ ప్రశ్నము అనిశ్చితముగానే మిగిలిపోవుచున్నది. అగుఁగాక; రథమునకు రెండె చక్రములుండెడివని నిశ్చయపూర్వకముగాఁ దెలియుచున్నది, వన. అ 172-8 , లో ఇంద్రుని రథముపైఁ గూర్చుండి యర్జునుఁడు నివాత కవచముతో యుద్ధము చేయుచుండెను, ఆ సమయమున "వ్యగృహ్ణన్ దానవాఘోరా రథచక్రేచ భారత" అని చెప్పఁబడి యున్నది.

ఇచట రెండు చక్రముల వర్ణనమే యున్నది. ఇదే విధముగా శ్రీ కృష్ణుఁడు దౌత్యము చేయుటకై వెళ్ళినపుడు అతని రథముయొక్క వర్ణనము ఉద్యోగపర్వములోఁ జేయఁబడి యున్నది. అక్కడఁ గూడ రెండు చక్రముల యుల్లేఖము చేయఁబడియున్నది. [అ. 83]

సూర్యచంద్ర ప్రకాశాభ్యాం చక్రాభ్యాం సమలంకృతం॥

సారాంశము, గొప్ప గొప్ప వ్యక్తులన్నిటి రథములకును రెండే చక్రములున్నట్లు వర్ణనము కనఁబడుచున్నది. అసఁగా అప్పటి రథములు రెండు చక్రములు కలవియే యగుచుండెనని నిశ్చయమగుచున్నది. రథములు నాలుగు చక్రములు కలవియై యుండెననెడి ఈ సాధారణపు జ్ఞానము అసత్యమై యున్నది. వనపర్వములో నొక సంవాదములోని వాక్యమున్నది-

ద్వావాశ్వి నౌద్వేరథ స్యాపిచక్రే।

పం[డెండు (ముందేహోక్ష) మూరల పొడవై యుండెను. మరియు దాని వెనుకవైపు సరిగా నొక మూరెడుండెను. "ఈ వర్ణనముం బట్టి సామాన్య రథముయొక్కయుం గల్పన చేయంబడంగలదు. ఉక్త వర్ణనమందు రథము యొక్క పరిమాణమంతయు రాక్షసులకై పెంపంబడి యున్నదనుటయే కేవలము అవసరమై యున్నది. ధ్వజముపై నుండిన చిహ్నము కఱ్ఱయొక్క స్వతంత్రాకృతి రూపమున నుండెనో లేక జెండా గుడ్డమీందనే గీయంబడి యుండెనో యీ సంగతి తెలియదు. కాని రెండు పద్ధతులును బ్రచలితమై యుండి యుండునని తెలియుచున్నది. యూనానులు చేసిన వర్ణనమునను సరించి యొక సారథి రాకుండ నపుడపుడు రథముపై రెండవ సారథికూడ నుండుచుండెను. అతనిని పార్ష్ణి సారథియని చెప్పియున్నాండు. ఒకండు చని పోయినచో రెండవవాండు పయోగించంబడు చుండెనని కల్పన కాంగలదు. ధ్వజము, పతాకము రెండును భిన్న భిన్నములై యుండును. రథము నుండి ధ్వజము వేఱుచేయంబడం గలిగి యుండెను. ఉత్తర గోగ్రహణ సమయమున న త్తరుని ధ్వజముపై సింహముండెననియు దానినర్జునుండు తీసి వైచి జమ్మిచెట్టు క్రింద నుంచియుండెననియు వర్ణనమున్నది. "ధ్వజం సింహం (సింహాకార- టీకా।)

అపనీయ మహారథః।

ప్రణినాయ శమమూలే ప్రాయాదుత్తర సారథిః॥" (వి. అ.)

అర్జునుండు తన రథముపైన నున్న వానర చిహ్నమును ధ్యానించెననియు దానిని రథముపైం గట్టెననియు వర్ణనము కూడం గనంబడుచున్నది. ఈ వీరునియొక్క యీ ధ్వజచిహ్నమును గనుంగొని గొప్ప యోధులకుం గూడ భయము (కానారంభమయ్యెను) కలిగియుండును. సాధారణమైన రథము ఇప్పటి రెండు చక్రముల మామూలు బండివలె నుండి యుండుననుట సంభవమై యున్నది. కాని పెద్ద పెద్ద యోధుల రథములకు కూడ రెండు చక్రములవిగానే యుండుచుండెను. బైబిలులోని యూనులు, అసిరియానులు, యూనానులు, ఈజిప్టియనులు మొదలైన పాశ్చాత్యుల యుద్ధములలోని రథములు రెండు చక్రములు కలవిగానే యుండు చుండెనను

సంగతి ప్రసిద్ధమై యున్నది. ఇదే విధముగా భారతీయ యుద్ధములోని రథములు కూడ రెండు చక్రములవియై యుండెను. అర్జునుని రథమునకు రెండే చక్రములుండెనని లోకమాన్యతిలకు యొక్క మతము నాకుఁ దెలిసినపుడు, నేను మహాభారత యుద్ధ వర్ణనములను తిరుగ ధ్యానపూర్వకముగా జదివి చూచితిని. వారి మతము సరియైనదనియు ఇప్పుడు కనఁబడుచున్న అర్జున రథచిత్రములనియు అసత్యములనియు మన యభిప్రాయము. ర్ణ పర్వములోని 4?వ యధ్యాయమందు అర్జునునియొక్క సంశప్తకులయుక యుద్ధ వర్ణనమందు ఈ శ్లోకమున్నది.—

> తే హయాన్ రథచక్రేచ రథేషాం చాపి మారిష।
> విగృహీతు ముపక్రామన్ క్రోధావిష్టాః సమంతతః

ఇందు రథచక్రే, అనిచెప్పబడియున్నది. సంస్కృతములో ద్వివచనము స్వతంత్రమై యునది, ఇందుచేత నితర భాషలలో లేని నిందు సందేహముండజాలదు. కర్ణుని రథమును సంశప్తకులు ముట్టడించిరి, దానికి రెండే చక్రములు బెట్టబడియున్నవి. కర్ణుని రథమునకు గూడ రెండే చక్రములుండెనని తెలియుచు ఇది. ద్రోణ పర్వములోని 189వ యధ్యాయమందీ శ్లోకమున్నది—

> రథచక్రం చ కర్ణస్య బభంజ సమహాబలః।
> ఏకం చక్రం రథం తస్య తమూహుః సుచిరంహయాః ॥
> ఏక చక్ర మివారవుస్య రథం సప్త హయ ఇవ ॥ 54

ఇచట ఒక చక్రము విరిగిపోయినిప్పటికిని కర్ణుని రథమును నొక చక్రముమీదనే గుఱ్ఱములు చాలసేపటివఱకు లాగుచుండెనని వర్ణనము కలదు; అగుఁగాక: గొప్ప గొప్ప యోధుల రథములకు రెండేసి చక్రములే యుండెనని తెలియుచున్నది: కాని, ఇట్టి రణములయందు ననేకమైన యాయుధములును సామానులు ఎట్లుండఁ గలిగి యుండుననియు నిట్టి రథములను 'నగఆకార అని యెందుకుఁ జెప్పిననియుఁ బ్రశ్నము కలుగుచున్నది, మంచిది: లోకమాన్యతిలకుని స్మరణశక్తి వాస్తవముగఁ బ్రశంసనీయమై యున్నది. అనేక వర్ణనములఁబట్టి రథములయొక్క రూపకము చేయఁబడిన చోటులనెల్లఁ జక్రములు రెండే కనఁబడుచున్నవి. కాని గుఱ్ఱములు మాత్రము నాలుగున్నవియని నిర్వివాదము సిద్ధమై యున్నది. గుఱ్ఱముల విషయము నదిచన ప్రయోగ మెచ్చటను చేయఁబడలేదు, రూపకమునం దెల్లపుడును నాలుగు వస్తువులవ ననము గుఱ్ఱముల స్థానమునందుఁ జేయఁబడుచున్నది.ఈ గుఱ్ఱములు, పాశ్చాత్య దేశములలోని

దీనినిఁ బట్టియు నా సంగతియే స్పష్టమగుచున్నది. రథ సంబంధమైన సాధారణ దృఢ నిశ్చయములో ఇంకను కొంత పొరపాటగు పడుచున్నది. రథముయొక్క భిన్న భిన్నావయములకుఁ గనఁబడుచున్న నామములఁ కల్పన సరిగాఁ జేయఁబడదు. ఆ నామములివియై యున్నవి.—

యొగమీషాం వరూథం చ తథైహధ్యామి సారథీ।
అశ్వాస్త్రి వేణుం తల్పం చ తిలశోత్య ధమచ్ఛరైః ॥

ఇదే విధముగా వానిపర్వమందలి 242వ యధ్యాయములోఁ గిరికుంబర పాదాక్షం శుభవేణు త్రివేణుమత్, ఈ కావ్యముకూడ నున్నది. ఈ వాక్యమును బట్టియు ఇంక నితరములయిన యనేకోల్లేఖములఁబట్టియు యుగము, ఈష, కూబరము, అక్షము, త్రివేణువు, ధ్వజము, ఛత్రము, వీరూథము, బంధురము, ఏతాక రథమునకు భిన్న భిన్నాంగములై యుండెనని తెలియుచున్నది. ఈ యంగముల కల్పన సరిగా లేదు. యుద్ధవర్ణనములోఁ ధ్వజయష్టిం సమాలంబ్య అనువచనము మాటి మాటికిఁ గనఁబడుచున్నది. అనఁగా యోధుఁడు బాణవిద్ధుడైన పిమ్మట ధ్వజయష్టిని పట్టుకొను చుండెడివాఁడు. (జీర్ణాలబడు చుండెడివాఁడు) ఇందుచేత వాఁడు క్రిందికిఁ బడుచుండెడువాఁడు. దీనినిఁబట్టి యీ యష్టి జెండాకుఁ క్రిందుగా రథమున నుండియుండునని ప్రకటనగు చున్నది. అట్టిచో ఈ ధ్వజయష్టి యే విధముగా నుండెడిదో యీ సంగతి ఊహకు రానున్నది.

## రథికుల యొక్క ద్వంద్వయుద్ధము

మహాభారతములో రథికులయొక్క యుద్ధము పలుమాఱు వర్ణింపఁబడియున్నది. ఈ యుద్ధములు తఱచు ద్వంద్వ యుద్ధములై యుండెను. ఈ ద్వంద్వ యుద్ధముల వర్ణనము కేవలము కల్పనికము కాదు. ప్రాచీన కాలమందు రెండు సైన్యములయందలి ముఖ్య సేనానాయములు నెదుటికి వచ్చి యుద్ధము చేయుచుండుటయే పద్ధతియై యుండెను. ఇప్పుడువలె నుక నుండవలయునను నియమము లేకుండెను. సేనాపతులు లేక విశిష్ట

వీరులు ప్రత్యక్షముగా యుద్ధములో రణశూరులై యుండిరి. మఱియు పరస్పరము పోరాడువారై కూడ నుండిరి. ఈ సేనాపతులు ప్రాయ్యముగా రథికులై యుండిరి. ఇందుచేత రథికులకు ద్వంద్వ యుద్ధము తఱచుగా జరగుచుండెను. ఇట్టి సమయమందు నితర సైనికులు తమ యుద్ధమును గట్టిపెట్టి వారివైపు చూచుచుండిన సంగతియు వర్ణింపఁబడి యున్నది. ఇట్టి ద్వంద్వ యుద్ధముల వర్ణనమును హెూమరుకూడఁ జేసియున్నాఁడు. (ముఠభేడ్) ద్వంద్వ యుద్ధమారంభ మగునపుడు రెండక్షముల వీరులను కొంచెము సేపటివఱకు నాగి ప్రసిద్ధ వీరుల ద్వంద్వ యుద్ధమును చూచుటకై తయారగు చుండిరి. ఇట్టి సమయమునందు ధర్మ యుద్ధ నియమముల ననుసరించి ద్వంద్వ యుద్ధమును చేయుచున్న వీరులకు ఇతరులు సాహాయ్యము చేయకుండిరి. ధర్మయుద్ధపు నియమము ననుసరించి ప్రతి మనుష్యుఁడును మఱియొక మనుష్యునిపై ముట్టడింపఁ గలుగుచున్నాడు. ఇతర విధమైన యుద్ధము జరుగుచుండినపుడు ద్వంద్వ యుద్ధములు జరుగకుండెను. మహాభారతమందు వర్ణింపఁబడియున్న యీ ద్వంద్వ యుద్ధ వర్ణనమునకు నన్నిటికంటె గొప్ప యుదాహరణము కర్ణార్జున యుద్ధమేయై యున్నది. రథ యుద్ధములయందు సారథులకుఁగూడ గొప్ప మహాత్యమున్నది. సమము విషమమునైన భూములను చూచి రథము నడపుట, ఇట్టి భిన్న భిన్న స్థానములపై రథమును గుఱి తప్పకుండఁ దగులునట్టి చోటులలోనుండి తీసికొని పోవుట రథికునికి మాటిమాటికిఁ బ్రోత్సాహమిచ్చుట మొదలైన పనులను సారథులు చేయవలసి యుండెను. ఇరువురు రథికులలో యుద్ధమారంభ మగునపుడు రథములొకచోటనే యాగకుండెను. రథములకు స్థానాంతరము బాణముల దెబ్బ తప్పిపోవుటకై కూడఁ జేయఁబడుచుండెను, కాని ఈ సంగతి యొక్క కల్పన సరిగాఁ జేయఁబడఁజాలదు. కర్ణుని రథముయొక్క చక్రము గోతిలో దిగఁబడిపోయినప్పుడు అతఁడు ఆ చక్రమును పైకి లాగ మొదలు పెట్టెను. ఈ వర్ణనముఁ బట్టి ద్వంద్వ యుద్ధములో రథములు కుండలాకారముగాఁ తిరుగుచుండెడివని తెలియుచున్నది. ఇపుడు మనము భారతీయ యుద్ధకాలమందు ధర్మయుద్ధ నియమము లెట్లుండెనో ఏ విధములైన బాణములెట్లుండెనో ఈ సంగతిని వర్ణింతము.

## ధర్మయుద్ధ నియమములు

చాలబాణములు మిక్కిలి చిన్నవి అనఁగాఁ పొడవులో బెత్తెడుమాత్రమే యుండెడివి. శత్రువు మిక్కిలి దగ్గఱకు వచ్చినపుడు యా బాణము లుపయోగింప బడుచుండెడివి. కొన్ని బాణములు తిన్ననియంచు గలవిగా నుండక యర్ధచంద్రాకారమైన వాయికలవియై యుండు చుండెను. ఇట్టి బాణముల యుపయోగము, కుత్తుకను నాలాతి తలను మొండెమునుండి వేఱుపఱుచుటకై, జేయఁబడుచుండెను. కొన్ని బాణముల కొనయందు విషములగ్నమై యుండెడిది, ధర్మయుద్ధములో విషదిద్ధములైన బాణము నుపయోగింపఁ గూడదనియుమ ముండెను ఇప్పటి యుద్ధములయందుఁగూడ సభ్యరాష్ట్రములందు కూడ పేలెరు గుండ్లు నుపయోగింపరాదని నియమమున్నది. అనఁగా, ఇప్పటి మునుపటి ధర్మయుద్ధములు రెంటను ధర్మమన కర్ధముదయమై యున్నదను తత్త్వమే యవలంభింపఁబడియున్నది. చాల బాణములు కర్ణిశరములై యుండెను. అనఁగా వానియందు దిన్నని యంచునకు మారుగా రెండు కాకొని కొకటి యెదురైన తలలుండుచుండెను. శరీరములోనికిఁ దూరియీ బాణముు బయుల వెడలుచుఁడినపుడు ఈ యెదరు నున్న శిరస్సులుగాయము నింకను నెక్కువగాఁ పెంచుచుండెను. ఈ బాణములు కూడ ధర్మయుద్ధములోఁ బ్రశస్తములుగా నెంచఁబడకుండెను. మహాభారతమందు బాణముల యొక్క భిన్న భిన్న విధములైన, విశేషించి పదివిధములైన గతుల వర్ణనము చేయఁబడి యున్నది. బాణము లెదురుగాను, వాలుగాను లేక గుండ్రముగాను బోవుచుఁడెడివి. ఆలోచించి చూడఁగా ధనుర్బాణకళ భారతీయ యుద్ధకాలమందు మిక్కిలి యుత్తమ స్థితికిఁ జేరియుండెను. అయినను బాణములు గోళముగా అనఁగా వర్తులాకారముగాఁ బోవుచుండెనను సంగతి సంభావనీయముగా దోఁచదు. బాణముల విషయమున, అవితమపని సెఱ వేర్చుకొని నురల బ్రయోగించిన వాని చేతికి వచ్చుచుండెనను సంగతి కూడ వర్ణింపఁబడియున్నది. కాని యిదికూడ అతిశయోక్తియై యున్నది, బాణము కవచమును బేధించుకొని శరీరములో దూఱిపోవుననుట సంభవమై యున్నది. కాని యాలోచింపఁగా బాణము లిట్లు వేగముగాఁ బ్రయోగింపఁ బడుచున్నను యోధులయొక్క వివిధరీతుల కారణముచేతఁ జాలమట్టునకుఁ కిందఁబడు

చుండి యుండుననియుఁ గాబట్టి యోధులు అనేక బాణములను విడువ వలసి వచ్చుచుండి యుంగుననియుఁ గూడ నగపడుచున్నది.

ధర్మయుద్ధములో, రథికుఁడు రథికునిమీఁదను, మావటివాఁడు మావాటి వాని పైనను రౌతు రౌతుపైనను దాడి వెడలవలయు ననెడి నియమముం డెను. ఈ నియమముఁబట్టి సంకుల యుద్ధము జరుగుట సంభవము కానేరదుఁ. కాని ద్వంద్వ యుద్ధమునకు నియమమై యుండునని సత్యముగాఁ దెలియు చున్నది. గుఱ్ఱములపైఁ గూర్చున్నవారు రథారూఢులపై ముట్టడి చేయ గూడదు. మరియు రథారూఢులు అశ్వములపై ముట్టడింపఁ గూడదు. (శాం. ప. అ ౯౫) ఇరువారు యోధుల శాస్త్రములను ఏక విధమైనవే కావల యునని కూడ నియమముండెను. దుర్యోధనుఁడు గదాయుద్ధ సమయ మున నాపై రథముతో ముట్టడింపకను, గదతో యుద్ధము చేయుము అని చెప్పియుండెను. ప్రత్యక్షి దుఃఖ స్థితి నుండునేని యతనిపైఁ బ్రహారము చేయఁగూడదు. భీతుఁడైనవానిపై, పరాజితునిమీఁద లేక పరువెత్తువానిపై శస్త్రమును ప్రయోగింపరాదు. బాణములు విషలిప్తములు లేక యెదురు ముల్లుగలవియై కాఁగూడదు. భారతీయ యుద్ధ కాలమందు ధర్మయుద్ధ నియమము లిట్లుండెను. ప్రతిపక్షియొక్క శస్త్రము భగ్నమగునేని, (ప్రత్యంబటువంటిజాయ్,) వాని కవచము పోవునేని లేక వాని వాహనము హతమగునేని వానిపైఁ బ్రహారము చేయఁగూడదనియు నియమముండెను. (శాంతి ప. అ. ౯౫) యుద్ధములో గాయపడిన శత్రువును తన రాష్ట్రములో నుంచుకొని వానికౌషధ మీయవలయును లేక అతనిని తన ఇంటికిఁ జేర్ప వలయునని కూడఁ జెప్పఁబడి యున్నది. గాయపడిన శత్రువును అతని గాయము మాన్పిన తరువాత విడిచిపెట్టుట సనాతన ధర్మమై యున్నవి. ఈ సంగతులఁ బట్టి ధార్మిక యుద్ధము యొక్క కల్పన ప్రాచీన కాలమందు ఎంత ఘనతకుఁ బోయియుండెనో చక్కగా నగపడుచున్నది. ఇప్పటి సభ్య ములైన పాశ్చాత్య రాష్ట్రములందుఁ గూడ ఈ నియమమే పాలింపఁ బడు చున్నది. గత యూరోపియ యుద్ధములందు ఈ నియమమునే యనుస రించి, రెండు పక్షములలోని గాయపడిన యోద్ధృగణము పెద్ద పెద్ద యాసు పత్రులకుఁ జేర్పఁబడు చుండెడివారు. మరియు అచట వారి గాయములకు

జక్కని చికిత్స చేయబడుచుండెను. ఇది చూచి భారతీయ యుద్ధకాలమున నడచు యుక్త నియమము ననుసరించియే కార్యము చేయఁబడు చుండెనని యాశ్చర్యమగుచున్నది.

రాజు ధర్మయుద్ధ నియమముల నెన్నఁడును ద్య జిం ప ( గూ డ దు. శాంతిపర్వములోని 95వ అధ్యాయమందు ఈ నియమములను పరిపాలించుటలో రాజునకు మృత్యువు కూడ సంభవించి నప్పటికిని నుత్తమమే యని చెప్పఁబడి యున్నది. కాని మహాభారత కాలపర్యంతమున ఈ నియమములు మారిపోయి యుండినట్లు కనఁబడుచున్నది. భీష్ముఁడు—

> నిక్షిత్తు శాస్త్రే పతితే విముక్త కవచధ్వజే।
> ద్రవమాణే చ భీతేచ తవ చాస్మి తివాదిని॥
> స్త్రియాం స్త్రినామధేయే చ వికలే చైకపుత్రిణి।
> అప్రశాన్తే నరే చైవ న యుద్ధం రోచతే మమ॥

అని ధర్మ యుద్ధముయొక్క యే శ్రేష్ఠమైన ధ్యేయమును చెప్పి యున్నాఁడో అది మహాభారత కాలమందుఁ గట్టుపడిపోయి యుండెను. ఎవరు నిద్రించి యుండునో, తృషితుఁడగునో, అలసియుండునో, తన కవచము విడుచుటకుఁ తయారై యుండునో, నీరు త్రాగుచుండునో లేక భుజించుచుండునో లేక గడ్డియు, గింజలును తీసికొనిపోవుచుండునో అట్టి మనుష్యునిపై శస్త్రమును ప్రయోగింపరాదని చెప్పియున్నాఁడు. ప్రాచీన కాలమందు ధర్మయుద్ధమునకు నిదే నియమమై యుండెను. కాని మహాభారతకాలమందు ఈ నియమములు మాఱిపోయి యుండెను కూటయుద్ధ నియమముల ననుసరించి కార్యము చేయఁబడుచుండెను. యునానులు భీతులైన యార్యుల ధర్మయుద్ధ సంబంధమున, "యుద్ధసమయమున భూమిని దున్నువానియొక్క లేక పంటయొక్క నాశనము కాలేదని వ్రాసియున్నారు. యుద్ధము జరుగుచున్నప్పటికిని రైతులు తమ కార్యములను సులభముగాజేసికొనుచున్నారు. దీనిబట్టి ప్రాచీన కాలికమైన భారతీయార్యుల ధర్మయుద్ధమువలన బ్రజలకు గొంచెమైనను నిబ్బంది కాకుండెనని

యగపడుచున్నది. కాని మహాభారతకాలమందు కొన్ని ప్రసంగాలలో వీనికి విరుద్ధమైన నియమములుకూడ జెప్పబడియున్నవి, వానిననుస రించి కార్యముకూడ జేయబడుచుండెను. ఇప్పుడీవిషయము విచారింప బడును.

## కూ ట యు ద్ధ ము

ధర్మ యుద్ధమందుఁ గపటము, ప్రజానాశము, అశక్తులను బరా జితుల నైన లోకులను గష్టపెట్టుట మొదలైన విషయములకు నిషేధ ముండెను. కాని కూట యుద్ధమందు నీ విషయములన్నిటికిని బ్రవేశము కానారంభమయ్యెను. శాంతి పర్వములో 69 వ యధ్యాయమ్మందుఁ గ్రింద వ్రాయబడియున్న నియమములు, యుద్ధ సమయమున రాజేమి జేయ వలయునను విషయమై యీయఁబడి యున్నవి. రాజు ముందుగాఁ దన ముఖ్య దుర్గము నాశ్రయింపవలయును. తన గోవులన్నిటిని నర ణ్యము నుండి విడిపించి దారిలోనికిఁ దీసికొని రావలయును మఱియు గ్రామములో నివసించుచున్నవారిని ముఖ్య ముఖ్య పట్టనములకు దీసి కొని రావలయును. శ్రీమంతులైన వారికిఁ గోటలో స్థానము నీయ వలయును. అచట సైన్యమును గావలి పెట్టవలయును. తనతోఁ దీసి కొని రాఁజాలని సామగ్రిని గాల్చి వేయవలయును. ఇదే విధముగా గడ్డినిగూడఁ గాల్చివేయువలయును. పొలములలోని ధాన్యమును గూడఁ గాల్చివేయువలయును. నదిపైనున్న వంతెనలను దారులను ధ్వంసము చేయవలయును. జలాశయము లన్నిటిని తెగఁ గొట్టవలయును. తెగ గొట్ట రాని వానిని విషాది సహాయ్యమునఁ బాడుచేసివైవలయును. కోటకు నలుప్రక్కల నున్న యరణ్యముల నన్నిటిని నఱికి వేయువల యును. పెద్ద పెద్ద వృక్షముల కొమ్మలను ఛేదించవలయును. కాని రావి చెట్టు యొక్క యొక యాకును గూడ రాల్చఁగూడదు. మందిరమునకు జుట్టుప్రక్కలనున్న చెట్లను గూడ ఛేదింపఁ గూడదు. కోటపై శత్రువు లను చూచుటకై యెత్తు చోటు నేర్పఱుప వలయును. శత్రువులను గుఱిచూచి కొట్టుటకై సంరక్షితమైన స్థానములను మందిరాలు బెజ్జములను

నేర్పఱుప వలయును. కందకములో నీటిని నింపింపవలయును, దాని లోపలి భాగమున గుప్తములైన కీలములు నాటింపవలయును, మఱియు అందులో మొసళ్ళను విడవవలయును. కోటనుండియుఁ బట్టణము నుండియు వెలుపలికిఁ బోవుటకై గుప్తమైన మార్గముల నేర్పరుప వలయును. కోట తలుపునొద్ద యంత్రము తగిలింప వలయును. శతఘ్ని నుంచవలయును. శతఘ్ని యనఁగా నేమియోఁ చెప్పఁబడఁ జాలదు. ఫిరంగియై యుండునని చాలమంది యభిప్రాయమై యున్నది. అనేక వర్ణములబట్టి శాతఘ్నికి అజుత్రములుండెడివని తెలియుచున్నది. కాని అచ్చటచ్చట శతఘ్ని చేతిలో నుండెననుసంగతియు వర్ణింపబడియున్నది. ప్రాచీనకాలపు వర్ణనపై ధ్యానముంచినచో, ఇది పిరంగి కాకుండునని మనకు దెలియుచున్నది.) కోటలో (గట్టెలు) మొదలైనవి ప్రోగుచేయవలయుననియు గ్రొత్తనూతులు త్రవ్వవలయుననియు బ్రాతనూతులను బాగుచేయ వలయుననియు నియమము చెప్పబడియున్నది. రాత్రిమాత్రమే బోజనము వండుకొన వలయును. పగలు అగ్నిహోత్రము తక్క నేవిధమైన యగ్నియు వెలిగింపగూడదు. గడ్డియున్న యిండ్లపై గుండ్రముగా మట్టి పూయవలయును. ఎవఁడైన నిప్పు వెలింగించిన యెడల వానిని శిక్షింపవలయును. బిచ్చమెత్తుకొను వారు, బండ్లవారు, నపుంసకులు, ఉన్మత్తులు, జడులును నైనవారిని పట్నము వెలుపలికి వెడలఁ గొట్టవలయును. శస్త్రాగారము యంత్రాగారము అశ్వశాల, గజశాల, సేనా శిబిరములు, కందకములు వీనిని మిక్కిలి కాపుదలలో నుంచవలయును. స్వరాజ్య రక్షణమునకై చెప్పఁబడిన నియమములతో పాటు శత్రురాజ్య ధ్వంసమునకై చెప్పఁబడిన రీతులు కూడ భయంకరములై యున్నవి. నిప్పంటించువారిని, విషము కలుపువారిని చోరులు లేక బందిపోటులను, ఆటవికులను పంపి శత్రు రాష్ట్రమును ధ్వంసము చేయవలయును. అనఁగా శత్రు రాష్ట్రములోని ఊళ్ళను గాల్చి వేయవలయును. కొల్లగొట్టవలయును లేక త్రాగెడి నీటిని విషముకలిపి పాడుచేయ వలయును. పొలములలోని ధాన్యమును కోసి

వేయవలయును. చెట్లను నఱికివైచి శత్రుసైన్యములోని యేనుఁగులకు పిచ్చి యెత్తునట్లు చేయవలయును. శత్రుసైన్యమందు భేదమును లేక ద్రోహము నుత్పాదింప వలయును. ఈ నియమము లన్నియుఁ గ్రూరతా పూర్ణములై యున్నవి. మరియు పూర్వ కాలికములైన ధర్మయుద్ధ నియమముల కంటె బొత్తిగా విరుద్ధములై యున్నవి. ఈ క్రొత్త నియమముల యొక్క ప్రచారము ప్రాయికముగా యూనానుల యాక్రమణము మొదలుకొనియేయై యుండును. ప్రాచీన కాలమందు ఆర్య రాజ్యములకు పరస్పరము జరిగిన యుద్ధములయందు కేవలము క్షత్రియులకే యుద్ధము జరుగుచుండెను. ఇతర ప్రబలమగు కృషికులకును దుఃఖపెట్టుతలపు రాజు మనస్సులో లేకుండెను. ఏ రాజునకైనను పరాభవము సంభవించి నప్పటికిని వాని రాజ్యమును తన రాజ్యములోఁ గలిపివైచి కొనెడి యాచారము లేకుండెను. కనుకనే జయించిన రాజునకుఁ గ్రూరకర్మము చేయుటకై పర రాష్ట్రమును బలహీనను చేయుటకై లేక ధ్వంసము చేయుటకై యిచ్ఛ లేకుండెను. ఫలతః భారతీయ కాలమందు ధర్మ యుద్ధ నియమములు మిగులఁ జక్కగా నుండెను. కాని సికందరు కాలమున యూనానులు భిన్నమైన యుద్ధ పద్ధతిని స్వీకరించి యుండిరి. వారి యుద్ధ శాస్త్రములో ఏ ప్రకారమైననుసరియే శత్రువును పరాజితుని చేయవలయును. యుదమునందన్ని విషయములును న్యాయ్యములే అను నియమముండెను. ఈ నియమములనే హిందూ దేశస్థులు యూనానుల నుండి నేర్చుకొనిరి. అప్పటి నుండి ధర్మ యుద్ధ నియమములు ప్రాయిముగా లుప్తములయ్యెను. క్రమముగా ముసల్మానుల యుద్ధములయందు అనేక భయంకర విషయములు కాదొడఁగెను. వేలకొలఁది నిరపరాధులను హత్య చేసి యన్యాయము జేయుబడఁ దొడఁగెను.

> అయుధ్య మానస్య వధో దారామర్శః కృతఘ్నతా ।
> బ్రహ్మవిత్త స్యచాదానం నిశ్శేష కరణం తథా ॥
> స్త్రియామోషః పతిస్థానం దస్యుష్వేతద్వి గర్హితమ్ ।
> సంశ్లేషం చపర స్త్రీభిర్ద స్యురేతాని వర్జయేత్ ॥ శాం 134–17

ఇట్టి యాచారమును వారు స్వయముగాఁ తమవారితోఁ గూడఁ జేయు చుండిరన్న సంగతి యూనానుల యితిహాసముఁ బట్టి తెలియుచున్నది. ఇంక వారు హిందూ దేశీయులతో నిట్టి యాచారమును చేయుచున్నా రనుటలో ఆశ్చర్యమేమున్నది. కాని యీ విషయములన్నియు నింద్య ములై యున్నవి. ఇవ్వి భారతీయుల యుద్ధములో నగపడు చుం డెను. ఇట్టి వ్యవహారము దస్యువులకుఁ గూడఁ జేయఁగూడదని యిచ్చట చెప్పఁబడియున్నది. దస్యువులు యూనానులే యగుటలో సందేహము లేదు. యూనానులు కూ్రరత్వమును అధర్మమైన యుద్ధపద్ధతిని హిం దుస్థానమందు మొట్టమొదట వ్యాపింపఁజేసిరి; ఎందుచేత? దస్యువుల యొక్క గుణవర్ణనమిట్లు చేయఁబడి యున్నది:—

దస్యూనాం సులభా సేవా రౌద్రకర్మసు భారత ।

## విమానముల ద్వార ఆక్రమణము

మహాభారతమందు విమానములతో నాక్రమణము చేసినట్లు కూడ వర్ణనమున్నది. సాల్వరాజు ద్వారకపై ముట్టడించినపుడు అతఁడు విమాన ములతో ద్వారకపైకి వెళ్ళి రాళ్ళను బాణములను వర్షించి యుండెను. ఈ వర్ణనమును పఠింపఁగా మహాభారతములో లేనియట్టిది కొంచెమైనను కాదు అని నీతి వాక్యముయొక్క స్మరణ మగుచున్నది. ఈ ప్రసంగము గడచిన యుద్ధములో జర్మనులు విమానముల ద్వారమున లండను పట్ట ణముపై పోరువిధముగనే యున్నది. పదునైదవ యధ్యాయ మందు ద్వారకయొక్క హడావడి యిట్లు వర్ణింపఁబడి యున్నది. "సాళ్వుఁడు ద్వారకపై నాక్రమించినపుడు పట్టణము యిరు వైపుల మండియు ఎచ్చటను ఛత్రము కనఁబడ నంతగా నాయుధములు ప్రయోగింపఁబడెను. ద్వార కలో ప్రతిచోటను శతఘ్నులును యంత్రములును స్థాపింపఁబడి యుండెను. కోటలయొక్క బురుజుల మీఁద (మోర్చె) శతఘ్నులు బంధింపఁబడి యుం డెను. శత్రువులచేత విసరఁబడిన ఫిరంగి గుండ్లను పడఁగొట్టుటకై శక్తు లనెడి యాయుధములుండెను. అందు అగ్న్యుత్పాదకములైన పదార్థము లతో నిండియున్న గుండ్లను ప్రయోగించుటకై శృంగాకారమగుఁ బిల్లన

గోఫెణివంటి యంత్రములు కూడ నుండెను. పట్నములలో ప్రతిచోట
నను గుల్మములనెడి ప్రదేశములందు ఎక్కియున్న సైనికులు శత్రువు
లపైఁ బ్రహరించుటకు తయారుగా నుండిరి. ఎవరును నజాగ్రత్తతో నుం
డరాదనియు మద్యపానము కూడ చేయరాదనియుఁ చాటింపఁబడి యుం
డెను. నగరిలోనున్న యానర్త దేశవాసులైన నటులు, నర్తకులు, గాయ
కులు వెలుపలికి పంపివేయఁబడిరి. నౌకలయొక్క రాకపోకలు బందు
చేయఁబడెను. నలువైపులను నొక కోసువరకు సొరంగము త్రవ్వింపఁ
బడెను. ద్వారకయొక్క కోట సహజముగానే సురక్షితమై యున్నది. కాని
రాజుయొక్క మొహరువేసిన యనుమతి పత్రము (పాస్‌పోర్టు) తీసికొన
కుండ ఎవ్వఁడును నగరిలోనికి రాజాలకుండెను. ఎవ్వడును వెలుపలికి
పోజాలకుండెను. సేనకు ఆయుధములు ద్రవ్యము, బహుమతులును
నీయఁబడి యుండెను. ఏ సైనికునికిని వెండి బంగారముల నాణెములు
ఎక్కడ మరియొక విధమైన వేతనము లభింపకుండెను. ఎవనికిని వేత
నము బాకీ లేకుండెను. సాల్వుఁడు నగరిని ముట్టడించుటయే గాక సౌభన
గరముల యందు అనఁగా విమానముల యందుఁ గూర్చుండి ద్వారకపై
దండు వెడలెను. ఆ సౌభనగరములలోఁ గూర్చుండిన దైత్యులు పట్న
ముపై శస్త్రములను బ్రయోగింపఁ దొడగిరి. అప్పుడు ప్రద్యుమ్నుఁడు
లోకులకు ధైర్యమిచ్చెను. మరియు ఆ సౌభనగరములపై బాణములఁగురిసెను.
ఇంకను యథార్థ సంచారము చేయునట్టి సౌభనగరము నుండి క్రిందికి దిగి
సాల్వుడు ప్రద్యుమ్నునితో యుద్ధము చేయఁదొడఁగెను. సాల్వ రాజు
యొక్క రథము మాయచే నిర్మింపఁబడి యుండెను. మరియు బంగా
రముతోను చేయఁబడి యుండెను. రథముల కెల్లపుడును జరిగెడి యుద్ధ
మువంటిదే సాల్వ ప్రద్యుమ్నులకు ద్వంద్వ యుద్ధము జరిగెనని దీని తరు
వాత వర్ణనమున్నది ఈ సౌభనగరము విమానమేయై యుండును. దానిని
దైత్యులు నిర్మించి యుండిరి. దీనిఁబట్టి యది కాల్పనికమై యుండునని
తెలియుచున్నది. కాని, దృఢమైన గోడతో చేతనావరింపఁ బడియున్న
పట్టణములపై విమానములతో ముట్టడించెడు పద్ధతి నేఁడు క్రొత్తగా నుత్ప
న్నమైనది కాదు— వేలకొలది యేండ్లనాటిదై యున్నది యని చూచి
యాశ్చర్యమగుచున్నది.

సేన గుమికూడుట — వ్యూహము.

ఇంతవఱకు సేనయొక్క భిన్న భిన్న భాగములయొక్కయు యుద్ధములోని రెండు భేదములయొక్కయు అనఁగా ధర్మయుద్ధ కూట యుద్ధములయొక్క వర్ణనము జరగియున్నది. కాని ప్రత్యక్ష యుద్ధమునందు సైనికుల యొక్క గుమికూడుట యెట్లు చేయఁబడుచుండెనో యుద్ధమేవిధముగా జరుగుచుండెనో యిది తెలిసికొనుట మిక్కిలి మహత్త్వముకలదై యున్నది. ముందుగా నక్షౌహిణి యొక్క పరిమాణమును దెలిసికొనవలయును. ఇప్పటి డివిజను బట్టి యక్షౌహిణియొక్క కల్పన కాఁగలదు. జర్మనులయొక్క, బ్రిటీషువారియొక్క సైన్యసంఖ్య ప్రస్తుతమున డివిజనుయొక్క పరిమాణముచేతఁ జెప్పఁబడుచున్నట్లే భారతీయ యుద్ధకాలమందు నక్షౌహిణియను పేరు ప్రచలితమై యుండెను. భారత ప్రారంభమందే యక్షౌహిణీ సంఖ్య యీయఁబడి యున్నది. "ఒక గజము, ఒక రథము, మూడు గుఱ్ఱములు, అయిదుగురు పదాతులును గలసి యొకపత్తి యగుచున్నది. 3 పత్తులకు నొక సేనాముఖము; 3 ముఖముల కొక్క గుల్మము; 3 గుల్మముల కొక్క గణము; 3 గణముల కొక్క వాహిని; 3 వాహినుల కొక్క పృతన; 3 పృతనల కొక్క చమువు; 3 చమువుల కొక్క యనీకిని, పది యనీకముల కొక్క యక్షౌహిణి" ఇందలి యనేక శబ్దములు కేవలము సేనావాచకములై యున్నవి. లెక్క పెట్టిన మీఁదట మొత్తము కలసి యక్షౌహిణి యందు 21870 రథములు, అన్నియే గజములు, 65610 అశ్వములు, 109350 పదాతులును గలరు. ఇందు రథములయొక్క, గజములయొక్క సంఖ్య మిక్కిలి పెద్దదిగాఁ దెలియుచున్నది. ఆరంభమునఁ జెర్చిన పత్తియొక్క లక్షణముఁబట్టి యుద్ధ సమయమున నొక రథము, ఒక గజము, మూఁడశ్వములు, అయిదుగురు కాలబంట్లకును నొక స్వతంత్ర సమూహము నిర్మింపఁబడు చుండియుండునని విశ్వసింపఁబడ జాలదు. అనఁగా ప్రతి రథము నొద్దను నొక గజము, ముగ్గురు రౌతులు, అయిదుగురు పదాతులు నిలఁబడి యుండుచుండిరని నమ్మఁబడఁ జాలదు. గజసేన, రథసేన, పదాతిసేనయు వేర్వేఱుగా నుండియుండును. ఎందుచేత ననఁగా 10, 100, 1000 సైనికులపై నొక్కొక్క యధికారి యుండుచుండెనను వర్ణనము మొదట వచ్చియేయున్నది. దీనిబట్టి పదాతి సైన్యము వేరుగాను అశ్వసేన వేఱుగను మన వశ్యముగానుండి యుండునని ప్రకటన

మగుచున్నది. కొందరు రాజులవద్దఁ కేవల మశ్వసేనయే యుండెను. శకునివద్గర 12000 రౌతులుండిరని మనుపు చెప్పబడి యున్నది. దీనిబట్టి పత్తి మొదలుకొని యక్షౌహిణివఱకు జెప్పబడిన సంఖ్య కోష్టక ( లెక్క ) మునకై మఱియు సాధారణముగా వేర్వేఱంగములకు బరస్పరమును సంబంధము చూపుటకై ప్రమాణ విధము సనియుఁబడి యున్నదని తెలియుచున్నది. యుద్ధసమయమున సేనయేవిధముగా నిలఁబవలకయునో, యీసంగతి శాంతిపర్వములో 99వ యధ్యాయమందుఁ చెప్పబడి యున్నది. సేనయొమటఁ దఱచుగానేనుగులు నిలఁబెట్టఁబడు చుండెను. ఏనుగులనడుమను రథములు, రథములవెనుకను రౌతులు, రౌతులనడుమను కవచములుదాల్చిన బల్లెను నుంచుటకై చెప్పబడి యున్నది. తనసేనయిందీ విధమైన వ్యూహమును రచించిన రాజు తప్పక తనశత్రువును గెల్చుచున్నాడు. ( శాంతిపర్వము ) ఈ వర్ణనముకల్పనికము కాదు. మహాభారతకాలములో రణభూమియందు సేనయొక్క గుమికూడుట యీ విధముగా నగుచుండియుండును. కాని భారతీయయుద్ధవర్ణనమందు నీ విధంగా గూర్చఁబడియున్నట్లు జ్ఞాపకములేదు. యుద్ధసమయమునఁ జేయ బడుచున్న సేనాసంచలనమును ఇంగ్లీషు భాషలో టైక్టిక్సు అని చెప్పు చున్నారు. మఱియు సమస్త మహాయుద్ధము యొక్క భిన్న భిన్న రణ భూములయందు వేఱు వేఱుగా సేనలను బోగుచేయుట, యుద్ధ మును బ్రచలింపజేయుట లేక యుద్ధగింపుట యనెడు రీతులను స్ట్రేటజి యందురు. భారతీయ యుద్ధమొక విశేష యుద్ధమైయుండెను. అందు గ్రీవలము టైక్టిక్సునలే యుపయోగముండెను. మహాభారతమందు, ప్రతిదినము తెల్లవారఁగనే సేనాపతులు తమ సేనలయొక్క భిన్న భిన్న విభాగముల నెట్లు నడిపిరో మఱియు సమస్త రణభూమియందును యుద్ధమెట్లారంభమయ్యెనో యీ సంగతి విశేషముగా వర్ణింపబడి యున్నది. కాని యొక్కమాఱు వ్యూహరచన జరిగిన పిమ్మట సేనయొక్క భిన్నభిన్న విభాగములతో సేనాపతికి సంబంధమేమియు లేకుండెడిది. వ్యూహరచన తఱచుగా ప్రాతఃకాలము యుద్ధారంభమందే జరుగుచుండెను. మఱియు వ్యూహము పిదప స్థిరముగా నుండెడిదో లేదో యీ సంగతి చెప్పఁబడజాలదు అక్షౌహిణియొక్క పరిమాణమును జూడగా, సేనయొక్క

వ్యాప్తికొన్ని కోసులదాక నుండు చుండియుండునని చెప్పవలసి వచ్చు చున్నది. ఇంత దూరమున్న మంబియున్న సేనలో అధిపతులనుండి సేనాపతి వరకు వార్తను దీసికొని పోయెడివారి శ్రేణులుండెనను వర్ణన మెచ్చటను గనపడదు. మహాభారతమందు వర్ణితమైన వ్యూహముల యాకారము తఱచు పక్షివలెనగుపడుచున్నది. ఈ కల్పన సహజముగనే తోచగలిగి యుండెను. మఱియు నన్ని సమయములందును నన్నిదేశములందును నిదియే ప్రఛలితమై యుండెను. ఎందుచేతననగా అన్నిచోట్లను "సేన యొక్క రెండు భుజములను పక్షములు" లేక "వింగ్సు" (ఱెక్కలు) అని చెప్పుచున్నారు. సేనయొక్క యీ భాగము లెల్లపుగనున్నవి-ఒక మధ్యభాగముండును రెండువైపులను రెండు పక్షములుండును. వానిలో గొంచెము కొంచెము ఎడముండును. మరియు వానితో బరస్పరము ఒక దానికొకటి యాధారమై యుండును. భారతీయ యుద్ధము నాఁటి భిన్న భిన్నములైన యన్ని వ్యూహములందును ఇట్టి సైన్య విభాగముండెను. ఉదాహరణము, పాండవులు మొదటి దినమున నిర్మించిన క్రౌంచ వ్యూహమునకుఁ గూడ ముఖ్యభాగ మిట్లే యుండెను. పక్షియొక్క శిరస్థానమందు ద్రుపదుఁడుండెను. నేత్రస్థానమందుఁ గుంతిభోజుడును చైద్యుఁడును నుండిరి. అనఁగా వీరు ముగ్గురును కలసి సేనాగ్రమందుండిరి. ఇతరులతో పాటుగా యుధిష్ఠిరుఁడు పృష్ఠ భాగమందు అనఁగా మధ్యభాగమందుండెను. ధృష్టద్యుమ్నుఁడును భీమసేనుఁడును పక్షముల స్థానమందు అనఁగా కుడి యెడమల నుండిరి. ద్రౌపదీ పుత్త్రుఁడును ఇతర రాజులును కుడి పక్షమునకు సహాయులై యుండిరి. ఎడమ పక్షముయొక్క సాహాయ్యమునకై కూడ నితర రాజులుండిరి. విరాటుఁడు, శైబ్యుఁడు, కాశీరాజును వెనుకవైపున నుండిరి. ఈ విధముఁగాఁ జేయఁబడిన క్రౌంచారుణ మహావ్యూహ వర్ణనమునకుఁదాత్పర్యము, సేనకు నెప్పటి యట్లు నప్పుడును నుండెడి విభాగములే చేయఁబడి యుండెననియే; ఏ విధముగా ననఁగా అగ్రము, మధ్యమున రెండు పక్షములు, మఱియు వెనుక భాగము. కౌరవ సేనయొక్క విభాగము కూడ దీనికెదురుగా నిట్లే చేయఁబడి యుండెను. భీష్ముఁడును, ద్రోణుఁడు నగ్రభాగమందుండిరి. దుర్యోధనుఁడును, శకునియు మధ్యమందుండిరి, భగదత్తుఁడు, విందుఁడు, అనువిందుఁడు, శల్యుఁడు, భూరి

శ్రీవుఁడును నెడమ వైపున నుండిరి. సోమ దత్తియును,సుశర్మ యుఁగాం భోజుఁడును కుడివైపున నుండిరి. అశ్వత్థామ, కృపుడు, కృతవర్మయు రీయర్, లో సంరక్షణము (కావలి) లో నుండిరి. ప్రతి దినమునను యుద్ధారంభమున ఇట్టి వర్ణనమే లభింపఁగలదు. కాని యుద్ధ మారంభమైన పిమ్మట భిన్న భిన్న పక్షములందు ఎదుటివారికి ఎదుటివారితోడను, నడమ నున్న వారికి నడుమనున్న వారితోడనే యుద్ధము జరుగుచుండెడిదని చెప్పఁబడ జాలదు. యుద్ధములోఁ దఱచుగా రథికులయొక్క ద్వంద్వ యుద్ధమే యెక్కువగా వర్ణింపఁబడి యున్నది. దానికి వ్యూహ రచనతో విశేష సంబంధమగుపడదు. ఇట్టి వ్యూహములను ప్రతి దినమందును గ్రొత్త క్రొత్త పేరులతో నిర్మించు చుండిరి. ఉదాహరణార్థము, రెండవనాఁడు కౌరవులు గరుడ వ్యూహమును బన్నియుండిరి. మరియుఁ బాండవులు దాని కుత్తరముగా అర్థ చంద్ర వ్యూహమును రచించి యుండిరి. క్రౌంచ వ్యూహమునకును గరుడ వ్యూహము నకును భేదమేమి యుండెనో యిది ఇప్పుడు చెప్పఁగలుగుట కఠినమై యున్నది. ఈ భిన్న భిన్న వ్యూహముల వర్ణనము దండనీతి శాస్త్రములోఁ గలదు. కాని యిప్పటి కాలపుస్థితి వేఱుగానున్న కారణముచేత వాని (యొక్క యధార్థమును) నున్నవి యున్నట్లుగాఁ దెలిసికొనుట శక్యము కాదు. మరియు వానియొక్క యుద్ధ పద్ధతి గూడ ఊహకు రాకున్నది.

చక్ర వ్యూహముయొక్క కల్పనయైతే ఇప్పుడు బొత్తిగానే కాజాలదు. ద్రోణుఁడు పన్ని యుండిన చక్ర వ్యూహము స్వసంరక్షణమునకు లేక శత్రు నాశనమునకో యనియే మొదటి ప్రశ్నమై యున్నది. అయ్యది శత్రునాశనమునకు లేక పరాభవమునకై నిర్మింపబడెనేని, యీకార్యము చక్రవ్యూహముద్వారము జాలదనుట నిర్వివాదమైయున్నది. ఇప్పటిలో జక్రవ్యూహ విషయమున బ్రచలితమై యున్న కల్పనయు నసత్యముగా దోఁచుచున్నది, భ్రమలో బడవేయునట్టి గోళాకృతియొక్క పేరు చక్రవ్యూహమని యిప్పటి దృఢనిశ్చయము. ఇంగ్లీషులో దీనిని లేబరింధ అని చెప్పుచున్నారు దానికర్థము మోసపుచ్చుట యనియైయున్నది. ఇటువంటి లేబరంధులు ఉపవనముల యందు నిర్మింపఁ బడుచున్నవి. వానిలో బ్రవేశింతురేని మరల బయుటికివచ్చుట కఠినమగుచున్నది.

ద్రోణుడిటువంటి వ్యూహమును రచించియుండునని నమ్మజాలము. చక్ర మనగా రథముయొక్క బండికను అటువంటి వ్యూహమును నిర్మించి నట్లు వర్ణనము కలదు. "బండి కంటియొక్క యూకుల స్థానమున బరా క్రమ వంతులైన రాజకుమారులు నిలఁబెట్టఁబడిరి. స్వయముగా దుర్యోధనుఁడు వ్యూహముయొక్క మధ్యభాగమున నుండెను. వానికి నలుప్రక్క లను కర్ణుఁడు, దుశ్శాసనుఁడు, కృపాచార్యుఁడు మొదలగు మహా రథికులైన వీరులుండిరి. సేనా ముఖమునొద్ద స్వయముగా ద్రోణాచార్యుడుండెను. మరియు వీరి దగ్గఱ సింధుపతియగు జయద్రథు డుండెను. వానికి పార్శ్వమున అశ్వత్థామ నిలచియుండెను. రెండవ వైపున గాంధారరాజు శకుని, శల్యుడు మొదలైన వారుండిరి. అనఁగా వీరబాధ యొప్పటివలెనే యుండెను. చక్ర వ్యూహముయొక్క రచన దుర్యోధనుని సంరక్షణము నకై చేయఁబడి యుండెనని చెప్పఁగలము. మధ్యమున ద్రోణుఁడు, వామ భాగమున ద్రోణపుత్రుఁడును జయద్రథుఁడును దక్షిణ భాగమున శకుని, శల్యుడును నుండిరి. ఈ సమూహమునకు వెనుక చక్ర వ్యూహ ముండెను. కాని ఈ చక్రముయొక్క పరిమాణమునందు సైన్య మే విధముగా మరియు నెందులకు నిలబడి యుండెనో యీ సంగతి యొక్క కల్పన కాజాలదు. ఈ ముఖములు తెఱువబడి యుండెనని కూడ నిచ్చట జెప్పఁబడలేదు. చక్ర వ్యూహమును సరిగా కల్పన చేయుటకై యింత కంటె ఎక్కువ సాధనములు లేకున్న వని మనము మునుపు చెప్పి యుంటిమి. ఈ వ్యూహములోనికి మొదటిగా అభిమన్యుఁడు పోవుటకుఁ బ్రయోజనమేమియో కూడఁ దెలియకున్నది.

అగును, మహాభారత మందుఁ గనఁబడుచున్న సంకులు యుద్ధము యొక్క వర్ణనమునకును ఇప్పటి యుద్ధ వర్ణనములకును చాలవఱకుఁ బోలిక యున్నది. రథ సైన్యముతో రథ సైన్యమునకును, అశ్వముతో అశ్వమునకును, గజముతో గజమునకును, పదాతులతోఁ బదాతులకును యుద్ధ మగుట తఱచుగా సంకుల యుద్ధమునకుఁ గ్రమమై యుండెను. ఇది యుంగాక రథికులు కూడ గజస్థుల మీఁద బాణము లుపయోగించుచుండిరి. పదాతులను గూడ తీవ్ర బాణములతోఁ గొట్టుచుండిరి. పదాతులు పదాతులను వడిసెల తోడను గొడ్డండ్ర తోడను గొట్టుచుండిరి. రథములపైఁ గూడ

నాక్రమణమున జేయుచుండిరి. ఏనుఁగులు కాల్బమును ముక్కలు చేయు చుండెను. కాబములు గజారోహకులను బడవేయు చుండిరి. ఏనుఁగులును గుఱ్ఱములును, గాల్బలమునకు హాని చేయుచుండెను. అయినను గాల్బ లము కూడ వానిపై నాక్రమించు చుండెను. ఈ విధమైన (భీష్మ. అ. 57) యుద్ధముల వర్ణనములు మహాభారతమం దనేకము లున్నవి. కాని చివర దినమున యుద్ధముయొక్క వర్ణనము మిక్కిలి యుత్తమమైయున్నది. ఆయుద్ధము చాలవఱకుఁ బానీపట్టు నందలి చివర యుద్ధమునకు సదృశ మైయున్నది. ఇంతేకాక శల్యుఁడు మొదటినుండియు నందఱకును ద్వంద్వయుద్ధము చేయక సంకుల యుద్ధము జేయుఁడని సూచన చేసి యుండెను. అనంతరము భిన్న భిన్న పార్శ్వ యుద్ధములకు మధ్య యుద్ధములును వెనుక యుద్ధములును జరిగెను. విశ్వాసరావువలె శల్యుఁ డును ఒండ్రెండు గంటలకు దాదాపుఁ బడిపోయెను. కాని యుద్ధమాగి పోలేదు. శకుని గుఱ్ఱపు రౌతులతోఁ బాండవుల వెనుకపైపు నాక్రమించెను. అపుడు యుధిష్ఠిరుఁడు కూడ నతని పైపునకు సహదేవుని గుఱ్ఱపు రౌతు లతోఁ బంపెను. రెండు పక్షముల యొక్క యుద్ధ వర్ణన మత్యంత సుందరమై యున్నది. చివరకు కౌరవులకు నపజయము కాఁదొడంగెను మఱియు వారి దళము రెండు మూఁడు గంటలకు దాదాపుఁ జిందర వందఱ కా మొదలిడెను, భావువలె దుర్యోధనుఁడు యుద్ధ భూమిని విడిచి కానరాకుండఁబోయెను. అగుఁగాక; మహాభారతములోని సంకుల యుద్ధ వర్ణనములు చాల విధముల నిప్పటి యుద్ధములను బోలియున్నవి.

## ఇ త ర వి ష య ము లు

సేనతోపాటు సాధారణ జనము కూడ నావశ్యకమై యుండెను. వారి వర్ణనము ఉద్యోగ పర్వాంతమున నిట్లున్నది. "సామానులతో నిండియున్న వాహనములు, గజములు, అశ్వములు, స్త్రీలు కుంటివాండ్రు మొదలైన నిరుపయోగులైన జనము, ద్రవ్యము, ధాన్యము మొదలైన సామానుల మోయుచు ఏనుగులను దనతోపాటు గైకొని యుధిష్ఠిరుని వాహనము బయలు దేఱెను. "పూర్వకాలమందేమి; అర్వా

చీన కాలమందేమి సేనతోపాటు వేశ్యలుండనే యున్నారు. వారిప్పటి కఠిన నియమముల యధికారములో నుండరను నంత మాత్రమే యంత రమై యున్నది. ఈ విధముగా భిన్న భిన్నావయవములయు వర్ణనము, మహాభారతములో ననేక స్థలముల యందీయఁ బడియున్న వర్ణనముల యాధారమునఁ జేయఁబడి యున్నది, మునుపటి యిప్పటి యుద్ధపద్ధతు లయందును శస్త్రాస్త్రము లందును మిక్కిలి యంతరమై యున్నది. ఇందు చేత మనము ప్రాచీన యుద్ధముయొక్క కల్పన కాఁజాలదు. ఉదాహ రణార్థము, యుద్ధవీరుల పరస్పర భాషణము మనకు నసంభవముగాఁ దోఁచుచున్నది. ప్రస్తుతమున నొకఁడు మఱియొకని దూషించుటయుఁ దన శూరత్వమును బొగడు కొనుటయు నసంభవమైయున్నది. కాని ధర్మ యుద్ధకాలమందు వీరులు దగ్గఱ దగ్గఱగా నుండుటచేత నయ్యది సంభ వమై యుండెను. యోధులలో నొకరు మఱియొకరికి దమ నామము లను వినిపించుచుండిరనియు వర్ణనమున్నది. స్వయంవర భూమియందు రాజుల పేరులు వినిపింపఁబడుచున్నట్లే రణ భూమియందుఁ గూడ విని పింపఁ బడుచుండెను. ఇది కూడ నాశ్చర్య విషయముకాదు. మహాభారత కాలమం దిప్పటి సైన్య పరిశ్రమము లేకుండెను. అయినను ఒక చోట నుండి మఱియొక చోటికి సమాచారము లేక యాజ్ఞ చేరుటకై గుఱ్ఱపు రౌతులు దూతలుగా నుండిరి.

దూతైశ్శీఘ్రాశ్వ సంయుక్తైః సమంతాత్ పర్యవారయన్ ।

(భీ. అ. 120, 26)

## అక్షౌహిణీ యొక్క సంఖ్య

భారతీయ యుద్ధ కాలమందు అక్షౌహిణీ యొక్క సంఖ్య నిజముగా నెంతయుండెడిదో, దీనికి బొత్తిగా మైత్రి కుదురకున్నది. ఆది పర్వమునకు మొదట నుపర్యుక్త వర్ణములలో నుండి కోష్టక రూపమున నంకెలలో నీయఁబడి యున్న దానికంటె వేఱుగా నుద్యోగ పర్వము యొక్క 155వ యధ్యాయమందీయ బడియున్నది.

సేనా పంచశతంనాగా రథాస్తావంత ఏవచ ॥
దశసేనాచ పృతనా పృతనా దశవాహినీ॥

ఈ విధముగా కోష్టకము నిచ్చి మరల వెంటనే సేన, వాహిని, పృతన, ధ్వజిని, చమువు, అక్షౌహిణి, వరూధిని యన్నియుఁ బర్యాయవాచి శబ్దములని చెప్పఁబడి యున్నది. (అయినను విషయమింత మాత్రమే కాదు) ఇంత మాత్రముతో నూరకుండలేదు. దీనికిఁ బిమ్మట వెంటనే మరి యొక సంఖ్య యీయఁబడియున్నది.

నరాణాం పంచ పంచాశ దేషా పత్తి ర్విధీయతే ।
ఇందు ఆదిపర్వమందు వలెనే కోష్టకముయొక్క ప్రారంభము పత్తితో జేయఁబడియున్నది. కాని పత్తికి మరియొకయర్థమె బద్దెనుగురుమనుష్యులని చెప్పబడి యున్నది. తరువాత 3పత్తులకు సేనాముఖమని, 3సేనాముఖములు గుల్మము, 3గుల్మములు గణమని చెప్పి గణమనఁగాఁ బదివేలని చెప్పి యున్నాఁడు. ఇక్కడఁ డీకాకారుఁడు గూడఁ గలతపడి యున్నాడు. తాత్పర్యము, అక్షౌహిణి, చమువు మొదలైన ప్రాత శబ్దములు పాశ్చాత్య సైన్యముల యొక్క ఆర్మీ, డివిజన్, కోరు అను నామముల వలెనే నిశ్చితములై యుండెననియే చెప్పవలసి యుండును.

శల్యుని సేనానాయకత్వమున అనఁగా యుద్ధముయొక్క పదునెనిమిదవ నాఁడు కౌరవులయొద్దఁ గోటి పదాతులును 3లక్షల అశ్వములును పాండవుల వైపున 2 కోట్లు పదాతులును, 10 వేల అశ్వములును మిగిలియుండిరి. (శ. అ. 8) ఈ విధముగానే స్త్రీ పర్వముయొక్క తుది వర్ణనమున్నది. "ఈ సంగ్రామమున వీరు వారును గలసి 66 కోట్లు, 2 లక్షలు, 4 వేలమనుష్యులు చనిపోయిరి". (స్త్రీ: అ. 26) ఈ అంకె 18 అక్షౌహిణుల సంఖ్య కంటె ఎక్కువయని స్పష్టమై యున్నది. సౌతి యెఱిఁగి యుండియు బుద్ధిపూర్వకముగా ఇతర స్థలములయందు వలె నీ సంఖ్యలను గూడఁ గూటముగా నుంచి యున్నాఁడని మనమూహించు చున్నాము. వానిని స్పష్టపఱచుట యెక్కువ కఠినమై యున్నది.

## పదునొకండవ ప్రకరణము

## వ్యా పా ర ము ప ని పా ట లు

మనమీ ప్రకరణమునందు మహాభారత కాలమున హిందు స్థానమందలి వ్యాపారము యొక్కయు, ఉద్యోగ ప్రయత్నముల యొక్కయు స్థితి యెట్లుండెనో దీనిని విచారింతము. ముందుగా ఆ సమయమున హిందు స్థానమందలి రాజ్యము లన్నిటియొక్క రాజ్య వ్యవస్థలయందు వ్యాపారోద్యోగముల వృద్ధి వైపునఁ బ్రభుత్వము యొక్క సంపూర్ణ దృష్టి యుండెనను విషయముపై ధ్యానముంచ వలయును. ఈ విషయము ఒక స్వతంత్రమైన రాజ్య విభాగమునకు నధీనమై చేయఁబడి యుండెను. ఈ విషయము మీఁద ఇంత ప్రాచీన కాలమందును, రాజ్యపుటేర్పాటులఁ జేయు వారికి ధ్యానముండుటను జూచి యాశ్చర్యమగుచున్నది. సభా పర్వమున రాజ్య వ్యవస్థ విషయమై నారదుఁడు యుధిష్ఠిరుని జేసియున్న మార్మిక ప్రశ్నములలో నొకటి యిది కూడనై యున్నది.

> కచ్చి తస్వి నుష్ఠితా తాత వార్తాతే సాధు భిర్జనైః ।
> వార్తాయాం సంశ్రితే నూనం లోకోయం సుఖమేధతే ॥

"వార్తయందందఱు లోకులును చక్కగా నిమగ్నులై యున్నమీఁదట లోకులకు సౌఖ్యము వర్థిల్లుచున్నది; కనుకనే నీరాజ్యమందు విషయముల వైపు మంచివారి యొక్క యోజన యున్నదా?" అను నీ ప్రశ్నమందు వార్తా విషయమై రాజుయొక్క కర్తవ్యమునకు మహత్త్వము పూర్తిగా జూపఁబడి యున్నది. సారాంశ మేమనఁగా ఇప్పటి యున్నత రాజుల కర్తవ్యములయొక్క కల్పన యందును మునుపటి కల్పన యందును గొంచెమైనను నంతరము లేకున్నది. ఇప్పటి వార్త యనఁగా లోకుల ప్రవృత్తి యొక్క అనఁగా ఉద్యోగము, జీవిత సాధనము వీనియొక్క శాస్త్రమై యున్నది. ఇందు వైశ్యుల సమున్నోద్యమములయొక్క సమావేశ ముండుచుండెను. మహాభారత కాలమున ఈ యుద్యమములు పరిధాముగా

మూఁడై యుండెను; కృషి వాణిజ్యము, గోరక్షణము వీనియొక్క యుల్లే ఖము భగవద్గీతా వాక్యములందు గలదు.. అనఁగా కృషి, గోవులను రక్షించుట, వ్యాపారము ఇవియే యా సమయమున మూడుద్యమములై యుండెను. వ్యాపారమందే కుసీదము, అనఁగా వడ్డీ కమీషనుయొక్క యుద్యమము మిలితమై యున్నది. మనము మునుపు మహాభారతకాల మందలి యుద్యోగోద్యమముల విషయమున కృషి విషయమున గోరక్షా విషయమున అనఁగా వార్తయంత విషయమున వేర్వేఱు గ్రంథములుం డెనని చెప్పియున్నాము. ధర్మ శాస్త్రమును దండనీతి, అర్థ శాస్త్రమును వార్త, మోక్షశాస్త్రమును ఆన్వీక్షకి యని చెప్పు చుండి రనియు మునుపు చెప్పఁబడి యుండెను. దురదృష్ట వశమున ఈ గ్రంథము లిపుడు దొరకుట లేదు. అందుచేత మనకు మహాభారత కాలమందలి యుద్యోగములు కృషి మొదలైన వాని విషయమున నెంతవఱకు జ్ఞానము పెరిఁగి యుండెనో మరియు నీ కార్యముల పట్లఁ బ్రభుత్వమునుండి యెట్టి సాహాయ్యము లభించు చుండెనో యిదితెలియకున్నది. అయినను ఆ గ్రంథములనుండియును వదించి దండనీతియొక్క లేక మోక్ష శాస్త్రముయొక్క మతములు మహాభారతములో నక్కడక్కడ నీయఁబడియున్నట్లే మహాభారతమందు వార్తా విషయమునఁ గూడ నచ్చటచ్చట నుల్లేఖము కనఁబడుచున్నది. దానిఁబట్టి మనము ఈ విషయము మీఁదఁ గొంత వెల్లడింపఁగలము. దీనిచేత మనకు మహాభారత కాలికములైన యుద్యోగములయొక్క పరిస్థితికిఁగొంత యంచనా కాఁగలదు.

## పొలములోని పంటలు తోటలు

మహాభారత కాలమున నిప్పటిలోవలె లోకులకు ముఖ్యమైన యుద్య మమున కృషియే యై యుండెను. యుద్యమమున కెంత యుత్కర్షము అయియున్నదో యంతమాత్రము మహాభారతమందుఁ గూడ నయి యుండెను. ప్రస్తుతమున నెన్ని వృత్తు లుత్పాదింపఁబడుచున్నవో,యవ న్నియు నా సమయమందుఁ గూడ నుత్పాదింపఁబడుచుండెడివి. ఉపని షత్తులందుఁ గూడ నీ ధాన్యముల యుల్లేఖము కనఁబడుచున్నది, బృహ

దారణ్యమున బియ్యము, ఉప్పులు, గోధుమలు, జొన్నలు మొదలైనవారి యుల్లేఖమున్నది.

దశగ్రామ్యాని ధాన్యాని భవంతి వ్రీహియవాస్తిలమాషా ॥
అణుప్రియంగవో గోధూమాశ్చ మసూరాశ్చ ఖల్వాశ్చ ఖలకులాశ్చ।

(తైత్తిరీయ బ్రాహ్మణ అధ్యాయః 3)- ఈ పేరస్తునందు సెనగల యుల్లేఖము లేదు.)

కృషి పద్ధతి యిప్పటి వర్షము లేనప్పుడు పెద్ద పెద్ద చెరువులను త్రవ్వించి లోకులకు నుదకమునకు సదుపాయము చేయుట ప్రభుత్వమునకు నావశ్యకర్తవ్యమని చెప్పఁబడుచుండెను, నారదుఁడు యుధిష్ఠిరుని బ్రశ్నించి యున్నాడు— "నీరాజ్యమందుఁ గృషి వర్షముపై నాధారపడలేదు గదా! నీవు నీ రాజ్యమందుఁ దగిన చోట్లను జెరువుల ద్రవ్వించితివా, నీరు పెట్టబడియున్న ధాన్యములయొక్క పంట విశేష మహత్త్వము కలదై యుండెడి దని చెప్పనక్కఱలేదు. ఆ కాలమందు జెఱకు నీలి మొదలైన వనస్పతుల పంటవి కూడ దడునఁబడిన పొలములలోఁ జేయఁబడుచుండెను, (ఇతర చరిత్రములఁ బట్టి ఆ సమయమున నల్లమందుయొక్క యుత్పత్తియు కృషియు లేకపోయి యుండునని యనుమానమగుచున్నది.) ఆ సమయమున పెద్ద పెద్ద చెట్ల తోటలను వేయు విషయమై యెక్కువ ప్రవృత్తి యుండెను. మఱియు విశేషించి యిట్టి తోటలయందు మామిడిచెట్లు వేయఁబడుచుండెను. ఆ సమయమునఁ గొలఁదిగా అనఁగా అయిదేండ్లనాఁటికి మామిడిచెట్లును ఫలింపఁ జేసెడి విద్య తెలిసియుండెను.

చూతారామో యథాభగ్నః పంచవర్షః ఫలోపగః ।

ఈ యుదాహరణము ఒకచోట ద్రోణపర్వములో నీయఁబడియున్నది. పండియున్న యైదేండ్ల వయసుగల మామిడి తోట నెట్లు భగ్నము చేయుదుము.) భగ్నము చేసినట్లుగా, ఈ యుపమానమును బట్టి యిప్పటి చిన్న చిన్న యంటుమామిడి తోటల కల్పన యగుచున్నది. మహాభారతమందుఁ గృషి విషయమునఁ గొంచెము మాత్రమే

యుల్లేకము ఉన్నదనుట స్వాభావికమై యున్నది. దీని యాధారమునం దెలియజాలిన సంగతులు పైనీయంబడియున్నవి. రైతులకు బ్రభుత్వమునుండి విత్తనములు లభించు చుండెనని మనము మునుపు చెప్పియున్నాము; నాలుగు మాసముల జీతతసునకై ధాన్యము కావలసిన వారికి లభించు చుండెను, రైతులకు సర్కారువారులేక సాహుకారులు ఇచ్చిన ఋణమునకు వడ్డీ నూటికొక్క రూపాయికంటె నెక్కువలేకుండెను.

కృషితరువాత రెండవ మహత్త్వముగలయుద్యమము గోరక్షణమై యుండెను. అరణ్యములో గోవులు మేయుటకై నిరాంతంకమైన సాధనములుండుటచేత నీయుద్యమము చక్కగా సాగుచుండెను. సంచారులైన వర్తకులకు నెద్దులయావశ్యతయుండెను. ఎందుచేత? ఆకాలమందు సరుకుల రాక పోకల సౌకర్యములన్నియు నెద్దుల వలననే జరుగుచుండెను. ఆవులయొక్క పెరుగు, పాలు ఇవికూడ నెక్కువ యావశ్యకమగుచుండెను. ఇదియుగాక, గోవుల విషయమున బూజ్యతాబుద్ధి యుండుటచేత లోకులందరును వానిని దమయింటనే యవశ్యము పాలించు చుండిరి. విరాట రాజువద్దకు సహదేవుడు తంతిపాలనామకుడైన గోపాలుడై వెళ్లినపుడు అతఁడు తనజ్ఞానమునిట్లు వర్ణించియుండెను:-

> క్షిప్రంచ గావో బహుళాభవంతి।
> న తాసు రోగోభవతీహకశ్చన॥

దీనింబట్టి భారతకాలమందు జంతువుల విషయమై యెక్కువ జ్ఞానముండి యుండునని తెలియుచున్నది. అజావికము అనఁగా మేకలయొక్క గొఱ్ఱెలయొక్క గూడ నెక్కువ నిరీక్షణము జరుగుచుండెడిది. ఆ కాలమున గజములకు అశ్వములకు సంబంధించిన విద్యను గూడ లోకులు బాగుగా నెఱిగియుండిరి. నకులుఁడు విరాట రాజు నొద్దకు గ్రంధికుఁడను పేరి యశ్వ శిక్షకుడై వెళ్ళినపుడు అతడు తన జ్ఞానము నిట్లు వర్ణించి యుండెను:—

అశ్వానాం ప్రకృతిం వేద్మి వినయం చాపి సర్వశః ।
దుష్టానాం ప్రతి పత్తించ కృత్స్నంచ చికిత్సితమ్ ॥

అతఁడు చెప్పెను :— 'నేను గుఱ్ఱముల శిక్షణము, వానిని శిక్షించుట, చెడు గుఱ్ఱముల దోషమును దొలఁగించుట, జబ్బుగల గుఱ్ఱములకు చికిత్స చేయుట యెఱుంగుదును. మహాభారతమందు నశ్వశాస్త్రము అనఁగా శాలి హోత్రము యొక్క యుల్లేకము కలదు, గజాశ్వముల విషయమై మహాభారత కాలమున మంచి చెడ్డలఁ దెలుపు గ్రంథ మవశ్యముగా నుండి యుండును. "నీవు గజ సూత్రము అశ్వసూత్రము, రథసూత్రము మొదలైన వాని యభ్యాసమును జేయుచున్నావా? అని నారదుని యొక్క ప్రశ్నమున్నది. ప్రాచీన కాలమున సెద్దులయొక్క గుఱ్ఱములయొక్క, ఏనుఁగులయొక్కయు విషయమున మిక్కిలి యభ్యాసము అయియుండెను, మఱియు వానియొక్క రోగ చికిత్స విషయమై కూడ జ్ఞానమెక్కువగాఁ బెరిఁగి యుండెనని తెలియుచున్నది.

త్రిః ప్రస్రుతమదః శుష్మీ షష్టి వర్షీ మతంగరాట్ ॥ 4 ॥ (అ..51)

అఱువది సంవత్సరములకు గజమునకుఁ బూర్ణవికాసము అనఁగా యౌవనము వచ్చుచున్నది. మఱియు నా సమయమున దానికి మూఁడు చోట్ల మదము కారుచున్నది. చెవుల వెనుక, చెక్కిళ్ళనుండి గుహ్య ప్రదేశమందును. మహాభారత కాలమందలి యీ జ్ఞానము మహత్త్వపూర్ణమై యున్న దీనిఁబట్టి యా సమయమున గజముల విషయమై జ్ఞానమెంత పూర్ణమై యుండెనో విదితమగుచున్నది.

## పట్టు, నూలు, ఉన్ని బట్టలు

ఇపుడు మనము వార్తలోని మూఁడవ విషయము అనఁగా వ్యాపారమును గుఱించి విచారింతుము. దీనితోపాటు భిన్న భిన్నము లయిన యుద్యమముల విచారింతుము. ప్రాచీన కాలమందు సరకుల రాకపోక

లకై సాధనము లిప్పటిలో వలె విపులముగా లేకపోవుటచేత హిందుస్థాన మందలి భిన్న భిన్నములైన రాజ్యములయందే కొఁలదిగా వ్యాపారము జరగియుండును. హిందుస్థానమందు విశేషముగా నుండెడి పదార్థములే వెలుపలికిఁ బోవుచుండి యుండును. మఱియు వెలుపటి దేశములనుండి యిచ్చటికి నిచ్చట నుత్పన్నము కాని పదార్థములే వచ్చుచుండి యుండును. ఇట్లనుమానించుటకై కారణము భారతకాలమందుఁ గూడ సముద్రము ద్వారమున వ్యాపారము జరగుచుండినట్లు కనఁబడు చున్నది. వెలుపలికిఁ బోవు వస్తువులలో నన్నిటికంటె మొట్టమొదటిదాని పేరు ప్రత్తి చేతఁ దయారు చేయఁబడు సన్న వస్త్రములదియై యున్నది; ప్రస్తుత కాలమున నిచ్చటినుండి బయటికిఁ బోవు వస్తువులలో ముఖ్యమయినది ప్రత్తియేయై యున్నది. ప్రాచీన కాలమునఁ బ్రత్తి హిందుస్థాన మందే యగుచుండెను. యూనానులు హిందుస్థాన మందలి ప్రత్తిని వర్ణించుచు దానిని చెట్టుపై నుత్పన్నమైన యున్నియని చెప్పియున్నారు. అనఁగా వారు ప్రత్తిచెట్లను హిందుస్థానమందే చూచి యుండిరి. ప్రస్తుత కాలమునఁ గూడఁ బ్రత్తి విశేషముగా హిందుస్థానము, ఈజిప్టు, అమెరికాలయందే యగుచున్నది. మరియు ఈజిప్టునకును, అమెరికాకును హిందుస్థానము నుండియే ప్రత్తి యెగుమతియై యుండెను. కార్పాసమను నది సంస్కృత శబ్దముకాదని కొందఱనుచున్నారు. అది మున్ముందుగా మనుస్మృతిలోఁ గనఁబడు చున్నది. కాని దీనిలోఁ బొరపాటున్నది. ఈ శబ్దము మహాభారతములో ననేక స్థలములయందు వచ్చియున్నది. మఱియు మహాభారత గ్రంథము మనుస్మృతికి మునుపటిదియని మనము చూచియున్నాము. ద్రావిడ భాషయందు కార్పాసమువంటి శబ్దమేదియు లేదు. భారతీయార్యులు హిందుస్థానమునకు వచ్చినపుడు వారికి ప్రత్తి చెట్లు కనఁబడెననుట స్వాభావికమై యున్నది. ఈ కారణముచేతఁ గాబోలును వేదాంత గ్రంథములలో వాని యుల్లేకము లేకున్నది. కాని కార్పాసమను పేరును వారే యుంచి యున్నారు. ఇదిగాకుండఁ బ్రత్తికి మరియొక పర్వమున తూలమను శబ్దమున్నది. అది యుపనిషత్తులలోఁ గూడ లభించుచున్నది. యూనానులలో మొదటి యితిహాస కర్తలగు హెరోడోదుస్సు మరియు డిటీయస్సు ప్రత్తితో జేయఁబడిన వస్త్రములను వర్ణించి

యున్నారు. వారు హిందుస్థానము వారు ఉన్ని బట్టలను ధరించు చుండి రనియు వ్రాసియున్నారు. ప్రత్తినుండి దారముతీసి దానితో వస్త్రము లను తయారుచేయు విద్య హిందుస్థానమందు అతి ప్రాచీన కాలమునుండి యునుండెను. మమతురి, వేమ, (స్పిండిల్ మరియు లూము) ఈ ప్రాచీన యంత్రముల ననుకరణము మీఁద నిపుడు జిలాయతు మొదలైన దేశములందు సంస్కరింపఁ బడిన యంత్రములు నిర్మింపఁబడి యున్నది. భారతీయ తత్త్వజ్ఞానములో వచ్చుంతతు పట శబ్దములు మిక్కిలి ప్రాచీనములై యున్నవి. మఱియు బట్టలను వేసేడి మగ్గము లేక సాలెవాడు ప్రాచీన శిల్పియై యున్నాఁడు. మహా భారతకాలమున మిగుల సన్నని బట్టలను నేయుకళ సంపూర్ణమై యుండెను. దీనికిఁ బ్రమాణము యూనానీ గ్రంథములనుండి దొరకు చున్నది, ఈ సన్నని బట్టలు పర్శియా, గ్రీసు, రోము మొదలయిన దేశములకు బంపఁబడుచుండెను. రోమను స్త్రీలకు హిందూస్థానమున నేయఁ బడు సన్నబట్టలపై నెక్కువ ప్రేమ యుండెనని యితిహాసమును బట్టి తెలియుచున్నది. మహాభారతమందుఁ గూడ సన్నని ప్రత్తి బట్టల వర్ణనము న్నది. రాజసయ యజ్ఞమందు యధిష్ఠిని కీయఁబడియున్న పలు విధము లైన కుప్పముల వర్ణనమందుఁ జెప్పఁబడినది యేమనఁగా—

శతం దాసీసహ ప్రాణాం కార్పానిక నివాసినాం ।
బలిం చకృత్స్నమాదాయ భరుకచ్ఛ నివాసినః । (సభా. 5.1)

భరుకచ్ఛము (భడౌచు) నందు నుండెడు జనులు సన్నని కార్పస వస్త్రములను ధరించిన యొక్క లక్ష దాసీలను బమ్మృగాఁ దీసికొని వచ్చి యుండిరి. భడౌబనగరర మిప్పటికిని ప్రత్తికిఁ బ్రసిద్ధమై యునది.ఇందే కాక యచ్చటి ప్రత్తిలెందు స్థానమండలి ప్రత్తులలో సర్వోత్తమముగా విశ్వసింపఁఒడుచునది. కనుకనే ప్రత్తి విషయమున భడౌచులోఁ బ్రాచీన కాలమందు వర్ణనము కనఁబడుట యాశ్చర్య విషయముకాదు.భడౌచు నర్మదా నదియొక్క ప్రాచీనమైన పట్టణము కూడనై యుండెను. మహాభా

రత కాలమున భద్రాచలలోనిది వంటి సన్నని ప్రత్తి బట్టల విషయమునం బాండ్యచోల దేశములకుం గూడ ఖ్యాతి యుండెను. మఱియు మహాప్రసు యొక్క తూర్పు నకులేరు సూక్ష్మవస్త్రముల విషయమున నిపుడు జూపి యున్నది.

మణిరత్నాని భాస్వంతి కార్పాసం సూక్ష్మ వస్త్రకం ॥

చోల పాండ్యావపి ద్వారం నలేభాతే హ్యుపస్థితౌ ॥

ఈ విధముగా మనకు మహాభారతములోఁ చోళపాండ్య దేశముల లోని సూక్ష్మ వస్త్రముల ఖ్యాతియొక్క వర్ణనము దొరకుచున్నది, దక్షిణ మునందున్న దేశము ఉన్ని, పట్టు వీని సన్నని బట్టల నేయు పనిలో విఖ్యా తములై యుండెను. ఈ వస్త్రములు పలురంగుల, మిక్కిలి మెత్తనివి మఱియు కలిపి నిర్మింపఁబడు చుండెను. సభాపర్వములోని రాజసూయయజ్ఞ సమయమున నిట్టి వస్త్రములను గానుకగాఁ దీసికొచ్చిన వర్ణనమున్నది.

ప్రమాణ రాగస్ప ర్శాడ్య బాహ్లీ చీన సముద్భవమ్ ।

ఔర్ణంచ రాంకవం చైవ కీటజం పదజం తథా ॥

కుటీకృతం తథేవాత్ర కమలాభం సహస్రశః ॥

శ్లక్ష్ణం వస్త్రమ కార్పా సమావికం మృదు చాజినమ్ ।

ఇందు ఔర్ణము అనఁగా ఉన్నితో నేయఁబడు వస్త్రములయొక్క, రాంకవం అనఁగా రాంకుమృగ రోమములతో నేయఁబడు వస్త్రములయొక్క కీటజం అనఁగా పట్టుబట్టలయొక్క స్పష్టమైన వర్ణనము కలదు. కాని పదజంలను దాని కర్థము తెలియకున్నది. ఈ వస్త్రములు పంజాబు ఆఫ గని స్థానములనుండి వునఁ జేయఁ బడు చుండి యుండును, చీనానుండి పట్టు

బట్టలు వచ్చుచుండి యుండును. శాలువల విషయమునఁ బంజాబు, కాశ్మీరము లిపుడు కూడఁ బ్రసిద్ధములై యున్నవి. ఇందుఁ జేయఁబడి యున్న కుటీకృత వర్ణనముఁ బట్టి యిప్పటి పంజాబు నందు ఉన్నినుండి తంతువులను దీయకుండ నిర్మింపఁబడెడి వస్త్రములు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ప్రత్తి, పట్టు, ఉన్నుల మిశ్రితమైన దారముతో వస్త్రములను నిర్మించెడి కళ మహాభారత కాలమందుఁ గూడఁ బ్రచలితమై యుండెను. ఈ పద్ధతిని వస్త్రముల వెల తగ్గుచున్నది. కనుకనే పై శ్లోకములో అకార్పాస అని విశేషణ ముంచఁబడి యున్నది. గొఱ్ఱెలయొక్క ఉన్నిగాకుండ ఇతర జంతువుల యొక్క మెత్తని రోమములతోఁ గూడ వస్త్రములను నిర్మించెడి కళ తెలిసి యుండెను.

ఔర్ణాన్ బైలాన్ వార్షదంతాన్ జాతి రూప పరిష్కృతాన్ ।
ప్రావారాజినముఖ్యాంశ్చ కాంబోజః ప్రదదౌ బహూన్ ॥

"ఔర్ణాన్ అనఁగా మేకలయున్ని తోడను, బైలాన్ అనఁగా బిలముల యందుండెడి జంతువుల యున్నితోడను, ఆఁడు పిల్లుల యున్ని తోడను మఱియు (గలాబత్తు) తోడను సుందరముగా నిర్మింపఁ బడిన వస్త్రములను కాంబోజ రాజు ఇచ్చెను". మహాభారత కాలమందుఁ గలాబత్తాని జేసెడు కళ వ్యాప్తమై యుండును. మరియు ఈ కారణము చేతఁ బరదేశ స్వదేశ వాసులైన శ్రీమంతులు హిందుస్థానములోఁ జేయఁబడు సన్ని పట్టు, ఉన్ని, ప్రత్తుల బట్టలను ధరించు చుండిరి. ఈ వస్త్రములు పరదేశములకు సముద్రములయు భూములయు మార్గమున వెళ్ళు చుండెను. విశేషముగా స్త్రీలకి బట్టల మీఁద ఎక్కువ కోరిక యుండెను. ధనవంతుల స్త్రీలకై మహాభారతములో సూక్ష్మం కంబళి వాసినీ యన్న విశేషణము తఱచుగా నుంచఁ బడుచుండెను. ఇందలి కంబళి శబ్దమునకు అర్థము మామూలు కంబళినిఁ దీసికొనఁ గూడదని వాని వలెనెఁ గేవలము ఉన్ని వస్త్రముల నూహింప వలయును. ఈ విశేషణము వలెనే సూక్ష్మ కాశేయవాసినీయన్న విశేషణము కూడఁ దఱచుగాఁ బ్రయుక్తమై యున్నది. దీనివలన స్త్రీలకుఁ బలుచని పచ్చ పట్టు బట్టలు మిక్కిలి ప్రియములై యుండెనని తెలియుచున్నది.

## శిల్పకారుల సాహాయ్యము

ఈ విధముగా వెలగల బట్టలను దయారు చేయుటకు ముఖ్యమైన సాధనము మిక్కిలి యెక్కువయైన మూలధనమైయుండెను. ఇది శిల్పకారులకు దొరకఁజాలదు. అందులకు ప్రభుత్వము లేక సాహుకారు ద్రవ్యసాహాయ్యము యొక్క యావశ్యకత యుండనే యుండెను. ప్రాచీన కాలమందుఁ బ్రభుత్వము నుండి యిట్టి సాహాయ్యము లభించెడు పద్ధతి ప్రచలితమై యుండెనని తెలియుచుండెను. నారదుఁడు చెప్పిన మిక్కిలి మహత్త్వపూర్వమును మనోరంజకములైన రాజనీతితో నీ సంగతిఁ గూడ నుల్లేఖముండెను.

ద్రవ్యోప కరణం కచ్చిత్ సర్వదా సర్వ శిల్పినామ్।
చాతుర్మాస్యవరం సమ్యక్ నియతం సంప్ర యచ్ఛసి॥

ఓ యుధిష్ఠిరుఁడా, శిల్పకారులందఱకును ద్రవ్యము నుపకరణములును అనఁగా సామానులును నాలుగు మాసముల వఱకును పనిచేయుటకుఁ దగినవి నిత్యము నిచ్చుచుంటివా? నారదుని యీ ప్రశ్నములోఁ బ్రభుత్వమునకు తన ప్రజలకు నుద్యోగోద్యమమునకు సంబంధించిన వృద్ధికైయెంత జాగరూకత యుండవలసి యుండెనో చూపఁబడి యుండెను. అహల్యాబాయి మహాభారత పురాణములలో ఏవి విని యుండెనో యవి యే మాత్రము వ్యర్థము కానిచ్చెడి కాదు; ఎందుచేత? రాజనీతిక నారదుని యీ మహత్త్వపూర్ణమైన యుపదేశము ఆమె మనస్సునందుఁ బూర్తిగా నంకితమై యుండెను. మహేశ్వరము నందుఁ బ్రభుత్వపు దుకాణమును దెరచి యామె చీనానుండి పట్టును తెప్పించి శిల్పకారులకు నిప్పించు నేర్పాటు చేసియుండెను. ఇందుచేత మహేశ్వరములోని శిల్పస్థితి బాగుపడుటయు జగత్ప్రసిద్ధమై యీ ప్రభుత్వపు దుకాణమందే పట్టుతోఁ గూడిన యధికారులుండిరి. కచ్చిదధ్యాయములో లోకుల యుద్యమ విషయమున రక్షణముంచి ప్రతి సమయామునను వారికి సాహాయ్యమిచ్చుటకై ప్రభువులు అధికారులను నియోగింప వలయునని చెప్పఁబడి యున్నది. మహాభారత

కాలమందు వార్త అనఁగా నుద్యమముల యుత్కర్షము వైపు రాజుయొక్క పరిపూర్ణ ధ్యానముండెనని సారాంశము.

## రంగు

పత్తి, విశేషించి ఉన్ని, పట్టు బట్టలను నిర్మించుటకై రంగులకు సంబంధించిన కళయొక్క జ్ఞానమత్యంతా వశ్యకమై యుండెను. మహా భారత కాలమందు హిందుస్థానములో రంగునకు సంబంధించిన కళ పరిపూర్ణావస్థకు వచ్చియుండెను. ఈ రంగులు తఱచుగా వనస్పతుల నుండి నిర్మింపఁ బడుచుండెను. మరియు వాని సంపర్కముచేత వస్త్రములయందు నేయఁబడు రంగులు స్థిరములుగను, పనిచేయునవిగను నుండుచుండెను. ప్రాచీనకాలమందు రంగుల కళ యెంత యుచ్చ దశకుఁ బోయియుండెనో, యీ విషయమై పాఠకులకు నమ్మకము కలిగించుటకై అజంతా గుహల యందు చిత్రములను జేయుటకై యుపయోగింపఁ బడియుండిన రంగు లిప్పటికిని – పదకొండువేల యొకవంద సంవత్సరముల తరువాత– ఉననవి యున్నట్లుగానే ప్రకాశించుచుఁ దేజోవంతములై కనఁబడు చున్నవని చెప్పినఁ జాలును. ఈ కళ మహాభారత కాలమందు సుజ్ఞాతమై యుండెనని తెలియుచున్నది. ఎందుచేత? యూనానులు కూడ హిందుస్థానమందలి వర్ణకళా విషయమున నుల్లేఖించి యున్నారు. వారు హిందుస్థాన వాసులకు రంగు బట్టలను దాల్చుటకై యెక్కువ యభిలాష మున్నదని కూడ వ్రాసియున్నారు. ఈ రంగు విద్యయొక్క జ్ఞానము మఱియు తాత్రియము, జర్మనుల రసాయనిక వర్ణనములు వచ్చిన కారణముచేత దుర్దైవ వశమున చాలవఱకు మఱువఁబడెను. మఱియు నష్టప్రాయమయ్యెను.

## అన్ని ధాతువుల జ్ఞానము

ఇప్పుడు మనము ఈ వస్త్రోద్యమము గాకుండ హిందుస్థానీయులకు మరియొక యే యే యుద్యమముల జ్ఞానముండెనో యిది చూతుము. భారతీయార్యులకు మహాభారత కాలమునఁ దఱచుగా ధాతువు లన్నిటి జ్ఞాన

మును నుండెను. మరియు వారికి వాని గుణములు కూడఁ దెలిసియుండెను. ఛాందోగ్యోప నిషత్తు యొక్క నాల్గవ ప్రపాఠక మందు మహత్త్వపూర్ణమైన వాక్యము కలదు. దానిఁబట్టి హిందుస్థానీయులకు నింత ప్రాచీన కాలమందు భిన్న భిన్న ధాతువుల విషయమునఁ జక్కని జ్ఞానముండెనని తెలియుచున్నది. "ఏ విధముగా బంగారము క్షారముతో జూపింపఁబడుచున్నదో, వెండి బంగారముతో జూపింపఁ బడుచున్నదో, సత్తు వెండితోను, సీసము సత్తుతోడను, ఇనుము (ఉక్కు) సీసము తోడను, కట్టె యినుము తోడను, చర్మము కట్టెతోడను జోడింపఁ బడుచున్నవో" ఈ వాక్యముఁబట్టి ప్రాచీన కాలమందు భిన్న భిన్న ధాతువుల జ్ఞానముంచుట సిద్ధమగుచున్నది. ఆ సమయమున ఇనుప తాఁపు (ముల్లు) లను జేసెడు జ్ఞానముండెను.) యీ వాక్యమువలెనె మహాభారతమందు ఉద్యోగ పర్వములోని 19వ యధ్యాయమందు నొక వాక్యమున్నది :—

సువర్ణ స్యమలం రూప్యం రూప్యస్యాపి మలం త్రపు।
జ్ఞేయం త్రపుమలం శీసం శీసస్యాపి మలం మలం॥

దీని కర్థము సరిగాఁ జెప్పజాలము. అయినను మహాభారత కాలమందు ఈ ధాతువులన్నింటి ప్రక్రియయు శిల్పకారులందఱకును దెలసియుండును. ఆ కాలమందు హిందుస్థానమున గనుసాలుల యుద్యమము చక్కగా సాగుచుండెను. ఆసమయమున నిచ్చట సువర్ణముయొక్క యుత్పత్తి యెక్కువగా నుండెను. హిందుస్థానమందలిఁ దఱచుగా నన్ని భాగములందును సువర్ణోత్పత్తి యగుచుండెను. హిమాలయమున కుత్తరమునఁ జాల బంగారము దొరకుచుండెను. ఉత్తర హిందూస్థానము యొక్క సదులలో సువర్ణ నాణెములు కొట్టుకొని వచ్చుచుండెడివి. దక్షిణమునఁ బర్వత ప్రదేశములయందుఁ జాల బంగారపు గనులుండెను. నిపుడు కూడ నున్నవి. సభా పర్వములోని 51 వ యధ్యాయమందు యుధిష్ఠిరునికి భిన్న భిన్న లోకులనుండి కానుకలు లభించినట్లు చేసిన వర్ణనములోఁ దఱచు బంగారము యొక్క పేరు వచ్చుచున్నది. విశేషముగాఁ జోళముఁ పాండ్యము నసెడి దక్షిణ దేశముల రాజులచేత కాంచనమీయఁ బడిన యుల్లేఖము న్నది. హిమాలయము పైపునుండి వచ్చిన లోకులు కూడ బంగారము

నిచ్చి యుండిరి. వీనిలో నొక వర్ణనము మాత్రమెక్కువ మనోరంజకమై యున్నది.

ఖసా ఏకాసనాః హ్యర్హాః ప్రదరా దీర్ఘ వేణవః ॥
పారదాశ్చ కులిందాశ్చ తంగణాః పరతంగణాః ।
తద్వై పిపీలికం నామ ఉద్ధృతం యత్పిపీలికైః ॥
జాతరూపం ద్రోణమేయ మహార్షుః పుంజశోన్నృపాః

(సభా. 5.2)

హిమాలయవాసులైన ఖసాదులైనతంగణులును పారాతంగణులు గూడ నొక విధమైన బంగారమునుదెచ్చి యుధిష్ఠిరునికిఁ గానుక లిచ్చుటకై వచ్చియుండిరి. ఈ బంగారము కొంత భిన్న ప్రకారమై యుండెను. దానిని జాతరూపమని చెప్పుచుండిరి. అది దొరకిన వర్ణనముకూడ మిక్కిలి ఉన్నదన్న ప్రకారమై యున్నది. ఆ సువర్ణ కణములను పిపీలికలు తమ బిలములలో నుండి బైటికివచ్చి ప్రోగు చేయుచుండెను. ఆ కణములు చిన్న చిన్న సంచులలో నింపించుకొని దీసికొని రాఁబడు చుండెను. ఈ బంగారమును వారు యుధిష్ఠిరునికి నీ నజరాణాగా నిచ్చుటకై యొక ద్రోణము (ఒక పురాతనపు కొలత) తెచ్చియుండిరి. ఈ కారణముచేత నా బంగారమునకుఁ బపీలిక నామము వచ్చియుండెను. ఈ సంగతి యసత్యముగాఁ గనఁబడదు, ఎందుచేత? మేగస్థానీసు తోడను సికందర తోడను వచ్చియున్న గ్రీకు చరిత్రకారులు ఈ విషయమును గొంత యతిశయోక్తి తోడ వ్రాసి యున్నారు. "ఈ చీమలు కుక్కలతో సమానముగాఁ బెద్దవి యగుచున్నవి. అవి సువర్ణ కణములను దమ కాళ్ళతో నీడ్చుకొని బైటికి దెచ్చి యుంచు చున్నవి. ఎవడైనను ఆ సువర్ణ రాశిని గైగొనుటకుఁ

బోవునేని యవి వానిపై నాక్రమించి వారి ప్రాణములు దీసివేయు చున్నవి. కనుక లోకులు శిరముపైఁ గరిబరిశమును గప్పుకొని, రాత్రి సమయమున, రహస్యముగా వెళ్ళి, ఈ సువర్ణ కణరాసిని దీసికొని వచ్చు చుంటిరి." ఈ వర్ణనము అతిశయోక్తి పూర్ణమై యుండెను. కాని టిబెట్టు వైపున హిమాలయముయొక్క సమభూమిపై మిక్కిలి భూ స్పష్టమునొద్ద సువర్ణ కణములు విశేషముగాఁ గనఁబడి యుండుటయు ఈ కణముల నొక విధమైన జంతువులు నేల లోపలనుండి త్రవ్వుకొని పైకిఁ దీసికొని వచ్చుటయు మాత్రము నిర్వివాదమై యుండెను. ఈ సంగతి టిబెట్టులో నిప్పటికిని జాల చోటులయందుఁ గనఁబడుచుండెను. ఈ సువర్ణకణములను తంగణాదులైన టిబెట్టువారు చిన్న చిన్న సంచులలో నిండించుకొని హిందూస్థానమునకుఁ దీసికొని వచ్చుచుండిరి. పర్షియా వారికి హిందూస్థానములోని యొక భాగమునుండి యీఁబడుచుండిన పన్ను ఈ సువర్ణ కణములతో నిండియుండిన సంచులలో బంపఁబడు చుండెను.

హిమాలయమునకుఁ బిమ్మట నేటి యిసుకలో సువర్ణరజములు లభించుచుండెను. మఱియు నీ విధమైన మంచి బంగారము అనాయాసముగా దొరకుచుండెననుట నిత్యమై యుండెను. అయినను, మహాభారత కాలమందు రాళ్ళ గనులనుండి సువర్ణ మిశ్రితమై రాలనుండి బంగారమును దీయు కళ విదితమై యుండెనను పంగతియు క్రింది శ్లోకముఁ బట్టి స్పష్టముగఁ దెలియుచుండెను.

అప్యున్మత్తా త్ప్రలపతో బాలాచ్చ పరిజల్పతః

సర్వతః సారమాదద్యా దశ్మభ్య ఇవకాంచనం ॥ [ఉద్యో 34]

ప్రాచీనకాలమందు రాలను బగులఁ గొట్టి వానిని జూర్ణముచేసి బట్టిలోఁ గరఁగించి బంగారమును వెదలించు కళ ప్రసిద్ధమై యుండును. అనఁగా ఆ కాలమునఁ గమసాలి పనియొక్క కళ చక్కని యున్నత

స్థితికి వచ్చియుండెను. అనేక సువర్ణ భూముల వర్ణనముండెను. కాని మహాభారతమందు ఖడ్గము, సింహాసనము, చౌరంగము, కవచము మొదలైన వేర్వేఱు శస్త్రముల మీఁద బంగారపు పని చేయఁబడినట్లు కూడ వర్ణనము కనఁబడు చుండెను. ఇంతేకాక సువర్ణముచే భూషితమైన రథములను గుఱ్ఱపు సామానులయొక్క వర్ణనము లభించుచుండెను. దీనిఁబట్టి కమసాలిపని మిక్కిలి కౌశలముతో జరగుచుండెనని సిద్ధించుచుండెను. అట్లే కమ్మరుల యుద్యమము కూడఁ బరిపూర్ణావస్థకు వచ్చెను. ప్రాచీనకాలమందు లోహముతో కల్కము దయారు చేసెడి కళయుఁ దెలిసి యుండెను. వేదముల, ఉపనిషత్తుల యందును ఉక్కులేక నల్ల యినుము యొక్క యుల్లేఖము కనఁబడు చుండెను. ఇది శస్త్రములకై యుపయోగింపఁబడు చుండెను. గోళ్ళు దీసికొనెడు చిన్న గోరుగల్లు మొదలుకొని ఖడ్గము వఱకు వాయిగల శస్త్రములను ఉక్కుతోడనే నిర్మింపఁ బడుచుండెను. కమ్మరులు కత్తులు, బల్లెములు, బాణములు, చక్రము, కవచము, బాహుభూషణము గద మొదలుగా ఇనుముయొక్క, ఉక్కుయొక్కయు ఆయుధములను జేయుచుండిరి. ఈ లోహము ప్రాచ్యదేశములందు విశేషముగా దొరకుచుండెను, ఎందుచేత? అచ్చటివారు పన్నులేక నజరా ఇచ్చినట్లు చేసిన వర్ణనమును నీ యాయుధముల యుల్లేఖము చేయఁబడి యుండెను. ఇదిగాకుండ నేనుగు దంతపు పనిచేయుటలో మిక్కిలి నిపుణులై యుండిరి. నానా విధములైన కవచములు, ఆయుధములు, వ్యాఘ్రాజినముల చేనాచ్ఛాదితములైన ఇట్లే సువర్ణ ఘటితమైయున్న రథములు, నారాచములు, అర్ధనారాచములు, మొదలైన బాణములును నితరాయుధములును నింపఁబడిన రథములు, ఏనుగులయొక్క చిత్రవిచిత్రములైన చొక్కాలు మొదలైన వస్తువులను గైకొని తూర్పు దేశపు రాజులు యుధిష్ఠిరుని యజ్ఞవాటి పనులందుఁ బ్రవేశించిరి. (సభాపర్వం) పూర్వ దేశములందు నిప్పటికిని లోహపు గనులున్నవన్న మాట విదితమేయై యున్నది ఏనుఁగు దంతపు పనులు తూర్పు దక్షిణముల వైపున నుత్తమములై యుండు చుండెను. ఇప్పుడు కూడ నున్నవి.

## ర త్న ము లు

ఇపుడు మనము వజ్రములు, ముత్యములు వీని విషయమై విచారింతము. ప్రాచీన కాలమున హిందుస్థానమునకు వెలుపలికి వెలగలవస్తువులలో బంగారము వలెనే రతనములు, ముత్తియములు గూడ ముఖ్యములై యుండెను. రత్నములు, ముత్యములును దక్షిణపు కొండల యందును సింహళ ద్వారమునకు సమీపవర్తులైన సముద్రము లందును మొదట గనఁబడుచుండెను. మరి యిప్పటికిని గూడ దొరకుచున్నవి. దక్షిణపు గోలకొండల యందు వజ్రముల గనులు (అబత్‌కామశహూరహై) ముందీయఁబడిన శ్లోకమునను సరించి చోళ పాండ్య దేశముల రాజులు— "మణి రత్నాని భాస్వంతి" మెఱయుచున్న వజ్రములను కానుకగాఁ దెచ్చియుండిరి. ఇదే విధముగా హిమాలయమునకుఁ బ్రాచ్య భాగమందును బలు విధములైన రత్నములు కనఁబడుచుండెను. మహాభారత కాలమందు హిమాలయమునకు మిగిలిన భాగములయందు రత్నములు దొరకవని విశ్వసింపఁబడు చుండెను. ఇట్లు అగుటకు కారణము భృగు శాపము చెప్పఁబడుచున్నది. (శాంతి. అ. 42) మరియు నీ దృఢ నిశ్చయమిపుడును సత్యముగ కనఁబడు చున్నది. ప్రాగ్జ్యోతిషేశ్వరుఁడైన భగదత్తుఁడు యుధిష్ఠిరునికి రత్నాలంకారములను శుద్ధమైన యేనుఁగు దంతముల పిళ్ళు గల ఖడ్గములను గానుక చేసి యుండెను. యిప్పటి ఆస్సామే, ప్రాగ్జ్యోతిషమై యున్నది. యిచ్చట లోహములు, గజ దంతములు, రత్నములు నుత్పత్తియగు చుండెను. ప్రాచీన కాలమునుండి నేటి వఱకు పాండ్యము, సింహళము వీని యొద్దను ముత్యము లుత్పన్నములగు చున్నవి.

> సముద్రసారం వైడూర్యం ముక్తా సంఘాస్తథైవచ।
> శతశశ్చ కుథాం స్తత్ర సింహలాః సముపాహరన్ ॥

సింహళ దేశమునుండి వచ్చిన కానుకల వర్ణనము యీ శ్లోకములో అక్షరశః సత్యమై యున్నది. సముద్రము నుండి పుట్టిన ముత్తెములు,

పగడములు, వైడూర్యములెంత విఖ్యాతములై యున్నవో, యంత పథక ములును, అనఁగా ఒక విశిష్ట విధమయిన గద్దితోఁ జేయఁబడిన చాప లిప్పుడు కూడ విఖ్యాతమై యున్నవి. ప్రాచీన కాలమున హిందుస్థానమందు వజ్రములు మున్నగు వివిధ రత్నములును, ముత్యములును పుట్టుచుండెను. మరియు వానికి విదేశముల యందు వ్యాపారముండెను. ఇందుచేత ఆ కాలమందు హిందుస్థానము 'సువర్ణ భూమి'యను నామముతోఁ బ్రసిద్ధమై యుండెను. మరియుఁ బ్రతి దేశము వారికిని ఈ దేశమును గురించి యాశ్చర్యమును నభిలాషమును నగుచుండెను. చాలమంది యూనానీ చరిత్రకారులు, పరదేశీయులు హిందుస్థానములోని ముత్తెములకై కేవలము మూర్ఖత చేత ఇష్టము వచ్చిన మూల్యమునిచ్చు చుండిరని వ్రాసి యున్నారు.

## వస్తు విద్య

ఇప్పుడు మనము వాస్తు విద్యను విచారింతము. మహాభారతకాలమునఁ బలు విధములైన యిండ్లను మందిరములను (ఆలయములను) నిర్మించెడి కళ యే స్థితిలో నుండెనో యీ సంగతి విచారింప వలయును. భారతీయ కాలమందు రాళ్ళతో పెద్ద పెద్ద పనులను చేసెడు శిల్పకల యున్నతావస్థలో నున్నట్లు కనఁబడదు. ఈకళయందు గ్రీకువారు మిక్కిలి వృద్ధినొంది యుండిరి. గ్రీకుల్కు హిందుస్థానమునకు వచ్చినపుడు వారికి మంచి మంచి యిండ్ల పనులు ఇక్కడఁ గనఁబడలేదు. హిందుస్థానమున ప్రాచీన కాలమందుఁ దఱచుగాఁ కఱ్ఱలవి, మట్టివియు నిండ్లుండెను. దుర్యోధనుఁడు పాండవులు నివసించుటకై లక్క యిండ్లను గట్టుఁడని యిచ్చిన యాజ్ఞలో కఱ్ఱవి మట్టివియునైన గోడలను బెట్టుఁడని చెప్పి యుండెను. ఈ గోడల లోపల గుగ్గిలము, సాంబ్రాణి, లక్క మున్నగు మండెడు పదార్థములు పడవేయఁబడి యుండెను. మఱియు బైని మట్టితో పూత పెట్టబడి యుండెను. పాండవు లంతటి రాజ పుత్రులు నివసించుటకై యిట్టి యిండ్లను నిర్మింపుఁడని యాజ్ఞ యిచ్చినపుడు మహాభారత కాలమున పెద్దవారి యిండ్లు కూడ మట్టివే యగుచుండెనని యే దృఢపడుచున్నది.

పాండవులకై మయుఁడు నిర్మించిన సభయొక్క వర్ణనమును చదువఁగా ఆ సభ ప్రాయశః కాల్పనికముగా కనపడుచున్నది. కాని యీ విధముగా ననుమానించుటకు నావశ్యకత యేమియును లేదు. మయుఁడు అసురుఁడై యుండెను. దీనినిఁబట్టి మహాభారత కాలమందలి లోకులకు, ఇట్టి పెద్ద పెద్ద భవనములను నిర్మించెడు కృత్యము అసురులు లేక పారసీవారు మఱియుఁ బడమటి యవనుల చేతనే యుత్తమముగాఁ గలుగుచుండెనని తెలియుచున్నది. మయాసురునిచే నిర్మింపఁబడి యున్న యుధిష్ఠిరుని సభా విషయమున, పాటలీపుత్రములో చంద్రగుప్తునికై యనేక స్తంభములతో నిర్మింపఁ బడియున్న యొక భవనముయొక్క కల్పనతోనే యుధిష్ఠిరునికై వేలకొలఁది స్తంభములు గల యీ సభయొక్క కల్పనఁ జేసి యుండునని, తర్కము చేయఁబడి యున్నది. ప్రస్తుతమున పాటలీపుత్రములో నీ తర్వాత కార్యమును జేసి ప్రాచీన భవనములను వెదకి వెడలించుటకై చేసిన ప్రయత్నమందు చంద్రగుప్తుని యనేక స్తంభయుక్త సభా విశేషము యొక్క జాడ దొరకియున్నది. బుద్ధిమంతులు దారాయస్సనెడి పర్షియా పాదుషా పర్సిపులిస్సులోఁ గట్టించిన స్తంభ గృహము యొక్క నమూనాల మీఁద పొడవును, వెడల్పులు గల సభా గృహమును చంద్రగుప్తుఁడు పాటలీ పుత్రములోఁ దనకై కట్టించుకొనెను. పర్షియను పాదుషా పర్సిపులిస్సులోఁ గట్టి యున్న సభా గృహము నేఁటి వఱకు నున్నది యున్నట్లు నిలిచియున్నది. అది మిక్కిలి దర్శనీయమైన యొక భవనమై యున్నది. మనమొక చోట చంద్రగుప్తుఁడు తన సామ్రాజ్యములో ననేక సంగతులను పర్షియను సామ్రాజ్యమునుండి గైకొనియుండెనని చెప్పియున్నాము.అదే విధముగాఁ జక్రవర్తికై ప్రచండమైనయొకానొక సభాగృహమును నిర్మించిన కల్పనయు ఆ పర్షియా చక్రవర్తి యనుకరణముబట్టికనబడియుండెను.డిల్లీ యందలి సాధారణ సభలోఁగూడ నింకొటియే కనఁబడుచున్నది. చంద్రగుప్తుని యీ సభయొక్క ప్రత్యక్షోదాహరణముబట్టి మహాభారతకారుఁడు యుధిష్ఠిర సభయొక్క కల్పన నొకవేళ చేసియున్న యెడల అసంభవముకాదు. మఱియు, ఆ సభను నిర్మించినవాఁడు మయాసురుఁడని మనము చూచుచున్నపుడు ఆ సభకు సంబంధము పర్షియా చక్రవర్తియొక్క సభతోఁ బోయి చేరుచున్నది. ఈ సభయొక్క సంక్షిప్త

పర్ణన మిచ్చుట నిచ్చుటకుఁ దగియున్నది. "సభకు ననేక స్తంభము లుండెను. వానియందుఁ బ్రతిచోటను సువర్ణ వృక్షములు నిర్మింపఁబడి యుండెను. దానికి నలువైపులను నొక పెద్ద కోటయున్నది. ద్వారము నందు వజ్రములు, ముత్యములు మొదలైన రత్నముల తోరణములు కట్టఁబడియున్నవి. సభయొక్క గోడలమీద ననేక చిత్రములు వేయఁబడి బడియుండెను, మఱియు వానియందుఁ జాలబొమ్మలు కూర్చుండఁబెట్ట యుండెను. సభలోపల, సభయొక్క నడుమను నొక సరోవరమును నిర్మించియందు సువర్ణ కమలములు నెలకొల్పఁబడి యుండినట్లును కమల లతయొక్క పత్రములు ఇంద్ర నీలములతోఁ జేయఁబడినట్లును వికసించిన కమలములు పద్మరాగములతోఁజేయఁబడినట్లును నొక చమత్కారము చేయఁ బడియున్నది. సరోవరములోఁ బలువిధములైన మణుల చీడీలు కట్టఁబడి యుండెను. ఆజల సంచయములో జలస్థానమందు నేల ప్రతిబింబించు చుండెను. పార్శ్వమున మణిమయములైన శిలాపదములుండుట చేత సరోవరమున నిలువఁబడి చూచువానికి ముందుకూడ నిట్టి సమయమందు భూమియే యున్నదని తోఁచుచుండెను; కాని ముందునకుఁ బోయిన మీఁదట చూచువాఁడు నీటిలోఁ బడిపోవుచుండెను (సభా. అ, 3) దీనికిఁ బిమ్మట, ఎచ్చట గోడకు ద్వారము కనఁబడుచుండెనో యచ్చట అయ్యది లేకుండెను. మఱియు నీరెచ్చటఁ గనఁబడుచుండెనో అచ్చట ద్వారము ఉండుచుండెను. అట్టి స్థానములందు దుర్యోధనునికి భ్రాంతి యయ్యెను. అతఁడు మోసపోయెను, ఒకచోట స్ఫటికములస్థలమును నిర్మించి యందు, నీరున్నట్లు తోఁచుచుండిన విధముగాఁ జమత్కారము చేయఁ బడి యుండెను.మఱియొక చోటనప్పటికి స్ఫటికమయమగునొక సరస్సునందు శంఖములేక నీరు నిండి యుండెను. అందు స్ఫటికముయొక్క ప్రతి బింబము పడిన కారణముచేత, అచట నీరు పూర్తిగా లేదని తోఁచుచుం డెను, ఒకచోట గోడమీఁద అంకదొక సత్యమైన ద్వారము తెరవఁబడి యున్న విధముగా నగపడునట్లు చిత్రము తీయఁబడి యుండెను.అచట మనుష్యుని శిరము డీకొనుచుండెను. ఎదురు దెబ్బకొట్టుకొనుచుండెను. మఱియొక్క చోట స్ఫటికపు ద్వారము వేయఁబడి యున్నట్లగపడు చుండెను, కాని యధార్థమున నాద్వారము తెఱచియుండెను. (సభా.అ.47)

ఈ వర్ణనము పర్షియా చక్రవర్తియొక్క పర్షియపు లిస్సులో సభ యొక్క యాధారము మీఁదఁ జేయఁబడి యుండలేదు. ఈ వర్ణన మెచ్చటి నుండి తీసికొనఁబడి యున్నదో దీనికల్పన చేయఁబడజాలదు. మఱియు ఈ యన్ని విషయములు సంభవములై యున్నవని నిశ్చయపూర్వముగా దోఁచుచున్నది. ఈ సభయొక్క సామగ్రి యసురుల సభనుండి తీసికొని రాఁబడెననికూడఁ జెప్పఁబడి యున్నది. హిమాలయమునకు ముందర బిందు సరోవరమువొద్ద వృషవర్వుఁడనెడి దానవునియొక్క పెద్ద సభయొకటి పడి పోయి యుండెను. అందు ననేక విధములైన స్తంభములు, నానా విధ ములైన రత్నములు, మందిరములకు రంగువేయుటకై చిత్రవిచిత్రము లైన రంగులు వేర్వేఱు విధములైన చూర్ణములును నుండెను. ఈ వృష పర్వసభయొక్క పని ముగిసినతరువాత మిగిలిపోయిన సామానును మయా సురుఁడు తనతోఁ దీసికొనివచ్చెను మఱియు దానితో నతఁడు సభను దయారు చేసెను, చూర్ణము (అనఁగా సున్నము) అనేక విధముగాఁ జేయఁబడుచు న్నది. ఒక ప్రాచీన మహారాష్ట్రగ్రంథములో నీరువలె నగపడు సున్నమును నిర్మించెడు యుక్తి వ్రాయఁబడి యున్నది. మనకు మాత్రము యుధిష్ఠిర సభయొక్క విషయములన్నియు సంభవములుగా దోఁచుచున్నవి వానిని నిర్మించిన శిల్పకారుఁడు పర్షియందే కాయస్థులు అనఁగా అసురులు అయి యుండిరని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. మహాభారత కాలమునకు ముందటి భవనములు, రాతిబొమ్మలు మొదలైన పెట్లు చేయఁబడుచుండెనో మఱియు నా కాలమునాఁటి శిల్పకళ యెంతవఱకు నున్నతదశకుఁ బోయి యుండెనో యీ విషయమై ప్రత్యక్షముగా ననుమానించుటకై సాధనము లేకున్నది.

## వ్యాపారము

పని పాటలను విచారించిన పిమ్మట నిపుడు మనము వ్యాపారమును విచారింప వలయును. పూర్వ కాలమునుండియు వైశ్యులు వ్యాపారమును జేయుచుండిరి. మరియు నిపుడుకూడ వారు చేయుచున్నారు. భగవద్గీ

తలో వైశ్య కృత్యము వాణిజ్యమనియుఁ జెప్పఁబడి యుండెను. పలు దేశముల నుండి పలు విధములైన వస్తువులను గొని తీసికొని వచ్చుట యిచ్చటి వస్తువులను పర దేశమునకుఁ దిసికొని పోవుట మొదలైన లాభ దాయక కృత్యములను చాలమంది వైశ్యులు చేయుచుండిరి. మరియు సేద్యము, గోరక్షణము రెండు కార్యములను గూడ వారే చేయుచుండిరి; కాని యిపుడు వైశ్యులు వీనిని వదలిపెట్టి యున్నారు. హిందుస్థానమందే మరియొక చోట సామాను రాకపోకల సాధనము పూర్వకాలమున నేర్పుగ బిడారు (సమూహము) లై యుండెనని మునుపు చెప్పఁబడి యున్నది. మహాభారతమునందు నొకటి రెండు చోట్లను గోమంతులైన (ధాన్యపువర్తకుల దేరా) లోకుల వేలకొలఁది యెద్దుల బిడారుల వర్ణనము చేయఁబడి యున్నది. ఈ గోమంతులైన (ధాన్యపు వర్తకుల డేరా) లోకులు ఏ రాజు యొక్క యధికారమునకును లోపడిన వారు కాకుండిరి. అడవులలో నివసించెడు నలవాటున్న కారణముచేత వారు దృఢమైన వారుగన్ను, స్వతంత్ర వృత్తిగల వారుగను నుండుచుండిరి. మరియు నీ కారణము చేత వారప్పుడప్పుడు రాజులకుఁ గప్పమును గూడ నిచ్చుచుండిరి. మహాభారతములో నొకచోట రాజులు గోమంతులవల్లఁ దమకు భయమున్నదని జ్ఞప్తియుంచుకొన వలయునని చెప్పఁబడి యున్నది వారప్పుడప్పుడు దొంగతనము, హత్యయుఁ గూడఁ జేయుచుండిరి. వారివెంట సామాను పంపుటలో నప్పుడప్పుడు మోసముకూడ జరుగుచుండెను. మహాభారతములో రాజులు రాజ్య మార్గములను సురక్షితముగా నుంచుకొనుటకై జాగ్రత్త పుచ్చుకొనవలయునని చెప్పఁబడి యున్నది. మెట్టభూముల మార్గమునవలె సామానుయొక్క రాకపోకలు నదులయొక్క సముద్రములయొక్క ద్వారమునఁ గూడ జరుగుచుండెను. దీని వర్ణనమెక్కువగా లేకున్నది. కాని మహాభారతము పిమ్మట మనుస్మృతిలో సముద్రము వెంట సామానులను దెచ్చుట, పంపుట విషయమున విస్తరించి వర్ణనమున్నది. సముద్రము వెంట సామాను పంపుటలో ఎక్కువ మోసము జరుగుచున్నది. కనుకనే యిట్టి స్థితిలో సముద్రమున కావలి దేశములకు సామానుఁ బంపునపుడు ఆ విషయమున నీయఁబడు ఖర్చు వడ్డీ విషయములలో, ఎప్పటికంటె నెక్కువ వడ్డీ తీసికోవలయును. ఎందుచేత ననఁగా ఇట్టి వ్యాపారముల యందు భయము, లోభము కూడ

నెక్కువై యున్నదని. మనుస్మృతి శాసించుచున్నది. ఎప్పటి వడ్డీయొక్క కిమ్మత్తు ప్రతి మాసపు ఫీజు నూటికొక రూపాయి యుండెనని మునుపు చెప్పఁబడి యున్నది. ఈ వర్ణనముఁ బట్టి మహాభారత కాలమున సము ద్రపు టావలి దేశములతో వ్యాపారము జరుగుచుండెనని సిద్ధించుచున్నది.

మహాభారత కాలికమైన వడ్డీ వ్యాపారమును విచారింపఁగా, ఈ విష యమున వ్రాత కోతలు గూడ జరగుచుండెనని యనుమానము కలుగు చున్నది. యూనానులు, హిందుస్థానమువారు దస్తావేజులపై సాక్ష్యము లేక మొహరు వేయింపకుండిరని వ్రాసియున్నారు. కనుకనే వ్రాతకోత లవశ్యము జరగుచుండి యుండును. వడ్డీ కమీషను పనిచేయుట బ్రాహ్మ ణులకు నింద్యమని చెప్పఁబడు చుండెను. ఎందుచేత? ఇటువంటి మను ష్యులు నిర్దయులై కావలసి వచ్చుననుట స్పష్టమై యున్నది, వ్యాపా రపు వస్తువులలోఁ బలుచని నూలు బట్టలు, పట్టుబట్టలు, రత్నములు, వజ్ర ములు, పుష్యరాగములు, మణులు, ముత్యములును నుండెను. కాని యివి గాకుండ సుగంధ యుక్తములైన మసాలా పదార్థములు గూడ వ్యాపా రములో వచ్చుచుండెను. మఱియు విదేశములకుఁ బోవుచుండెను. లేక లేదు అని ఈ వర్ణనము లేకున్నది. ఇప్పుడు పాశ్చాత్య దేశములలో ఈ పదార్థముల విషయమై హిందుస్థానమున కెక్కువ ఖ్యాతి కలదు. కాని మహాభారతములో వాని యుల్లేఖము జరగు ప్రసంగము రాలేదు. ఇతి హాసముఁ బట్టి మహాభారత కాలమందుఁ గూడఁ బడమటి తీరము నుండి గ్రీక్కులయొక్క, నరబ్బులయొక్క వ్యాపారము జరగుచుండెనని తెలియు చున్నది. దీనినిఁ బట్టి ప్రాచీనకాలమందుఁ గూడ నీ వస్తువుల వ్యాపారము జరగుచుండెడిదని నమ్ముటకు నేయాటంకమును లేదు. ధాన్యములు విదే శములకుఁ బంపఁ బడక పోయియుండును. ఎందుచేత? మొదట నవ్వి చౌకగా నున్న కారణముచేత వానిని దీసికొని వెళ్ళుటకై ప్రాచీన కాల మందుఁ దగియున్న పెద్ద పెద్ద యోడలు లేకుండెను; మఱియు నితర దేశములందు వాని యావశ్యకతయు లేకుండెను. అన్ని ప్రదేశములలం దును లోకుల సంఖ్య తక్కువయై యున్న కారణముచేతఁ బ్రతి దేశమునను ఆవశ్యకతకుఁ దగిన ధాన్యము యుత్పత్తి యగుచునే యుండెను. ఇది యును గాక హిందుస్థానమందుఁ గూడ అడవులెక్కువగా నుండెను; కను

కనే కేవలము ఆహారమునకుఁ దగిన ధాన్యమే పుట్టుచుండి యుండును. ఇక్కడనుండి యిప్పటినుండి వలెనే ధాన్యము లేక ఇతర యుపక్వ పదార్థములు పంపఁబడ కుండెను. ప్రాచీన హిందుస్థానము అపక్వ పదార్థములను బంపక (ద్రవ్యము) తయారైన పదార్థములనే బయటికి బంపుచుండి యుండును. ఇంతేకాక యీ స్థితి యున్ని దేశములదియునై యుండెను.

## హిందుస్థానమందు దాసులు లేక బానిసలు లేకుండిరి.

ఇప్పుడు కృషి విషయమునఁ గొంత యింకను విచారింపఁ బడును పూర్వకాలమందు దాసులుండిరా లేరా యను ప్రశ్నము మహత్త్వ పూర్ణమైయున్నది. ప్రాచీన కాలమందు శరీర పరిశ్రమను జేసెడు కృత్యము తఱచుగా దాసులచేతఁ జేయించెడు నాచారమన్ని దేశములందును నుండెను. అదే విధముగా నొకప్పుడు వైదిక కాలమున హిందుస్థానమందు గూడ నుండెను. యుద్ధములో గెలువఁబడిన వారే దాసులగుచుండిరి. వైదికకాలమున నిచ్చటి మూల నివాసులను దాసులని చెప్పియున్నారు. మరియు నీ లోకులు జయింపఁబడియే యుండిరి. తుదకు నీవర్గమునకు శూద్రవర్ణము కలిగెను. మరియు శూద్రులయొక్క విశిష్టకృత్యము జేతనైన యార్యులకనఁగా త్రైవర్ణికులకు సేవ చేయుట నిశ్చితమయ్యెను. భగవద్గీతలో "పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్" అని చెప్పబడి యున్నది. ఇది గాకుండ భారతీయ యుద్ధకాలమందు, జయింపబడిన తరువాత నార్యులు కూడ దాసులై యగుచుండిరని తెలియుచున్నది. ఈ గెలుపు యుద్ధమందైనను సరియే లేక ద్యూత మందైనను సరియే ఏ మనుష్యుఁడైనను స్వయముగాఁ దన్నుఁ బణముగా బెట్టుకొని జితుడైనవో దాసుఁడగు చుండెను. ద్యూతములో జయమునకిదియే పద్ధతి యగు యగుచుండెను. పాండవులు స్వయముగాఁ దమ్ముఁ బందెము పెట్టి జితులైనపుడు వారు దుర్యోధనునికి దాసులై పోయిరి. ఇట్లు దాస్యము నాచారము మహాభారతకాలమునఁ గూడ నుండియుండును. ఎందుచేత? మలిచ్ఛ కటికమునఁగూడ నిట్లు జరిగిన వర్ణనమున్నది. యుద్ధములో

గెలిచిన శత్రువును చంపివేయుటకంటె వానిని దాసునిగాఁ జేసికొనెడు నాచారము మిక్కిలి తక్కువై యుండును. వనపర్వములో కథయున్నది భీముఁడు జయద్రథుని గెలిచి కట్టి తీసికొని పోయెను. మఱియు నిట్లు సందేశమును బంపెను— "పాండవులు దాసులైరని ద్రౌపదికిఁ గబురు పంపుము." (వనప. అ. 272) అనఁగా ఈ విధము దాసులఁగా జేసికొనుట కుదాహరణము అపుడపుడు జరగుచుండెను. ఆర్యులలోఁ దమ సోదరులను ఈ విధముగా దాసులఁగాఁ జేసెడు కోర్కె లేక యిచ్ఛ లేకుండను యుండుననుట "అపుడపుడు" అని చెప్పుటకుఁ గారణమైయున్నది. దాసులైన పిమ్మట నన్ని విధముల సాహసకృత్యములను జేయవలసి యుండెను. కాని వానికి స్వాతంత్ర్యముకూడఁ బోవుచుండెను. ఇంతేకాక వారియొక్క వర్ణము జాతియుఁగూడ భ్రష్టమై పోవుచుండెను. ద్రౌపది దాసియగుటకు విశ్వసించిన తరువాత, ఆమెతో నిష్టము వచ్చినట్లుగా, దాసితోవలెఁగూడ, వ్యవహరించు నధికారము ప్రాప్తమైయున్నది. అనఁగా క్షత్రియులను అట్లు సమస్తార్యులను దాసులుగాఁ జేసెడు నాచారము భారతీయ కాలమందుఁగూడ నగపడదు. ఎందుచేత? రెండు ప్రసంగములందును ఈ పరాజితులైన యార్య క్షత్రియులు దాసత్వమునుండి ముక్తులఁగాఁజేయబడి విడువబడియున్నారు. దీనిఁబట్టి భారతీయ యుద్ధకాలమందు, యుద్ధము యొక్క కఠిననియమములనుండి యక్కడక్కడ బ్రచలితులై యున్నప్పటికిని, వారు మెల్ల మెల్లగా బద్ధులగుచుండిరి.తాత్పర్యము, పాశ్చాత్యదేశములవలెనే,పరదేశములను లేక స్వదేశీయులను గూడ జయించి, దాసులఁగా లేక బానిసలఁగా జేసెడు నాచారము మహాభారతకాలములో హిందూదేశమందు లేకుండెను.

ఆ కాలములో నీ యాచారము గ్రీసు, రోము, ఈజిప్టు మున్నగు దేశములందుఁబ్రచలితమై యుండెను.ఆ దేశముల యితిహాసమును జదువఁగా మనకు, నేఁడుత్తర దేశములనుండెడు వేలకొలఁది స్త్రీ పురుషులు, పరాజితులైన ఉదాహరణముచేత, నేఁడు భయంకరమైన దాసత్వములో లేక బానిసతనములో నెట్లు పడిపోవుచుండిరోయని ఖేదముతోడ్పడనాశ్చనాశ్చర్యము కూడ నగుచున్నది. ఒక నగరము నాక్రమించిన తరువాత, పరాజితమును హస్త

గతములైన పిమ్మట నచ్చటి యోధులను జంపి వారి సుందర స్త్రీలను బానిసలుగా నుంచుకొనవలయునని నియమముండెను, హోమరు గ్రంథమున నిట్టి మాటి మాటికిని వర్ణనమున్నది మఱియు గ్రీక్కువారు తమ వీరులకు మీరుపభోగించుటకై ప్రాయముగల సుందరములైన స్త్రీలు దొరకుదురని చెప్పి ప్రోత్సహించుచున్నారు, ఈ సంగతి మహాభారతకాలమందు హిందుస్థానమున బొత్తిగా లేకుండెను. పాశ్చాత్యదేశములందువలె, హిందుస్థానమందు బానిస తనముయొక్క యాచారమును జూడకపోవుటచేత యూనానులకు మిక్కిలి యాశ్చర్యము కలిగెను, మఱియు వారు ఆ సంగతిని తమ గ్రంథములందు వ్రాసికూడ నుండిరి. "హిందుస్థానమువారు తమ దేశములోని లేక పరదేశములోని వారిని దాస్యులుగా లేక బానిసలఁగా జేయరు." యూనానీ చరిత్రకారులు హిందూదేశీయులు తాము స్వతంత్రులై యుండిరి కనుకనే రెండవవారి స్వాతంత్ర్యమును వారించెడు నిచ్ఛ వారితో బొత్తిగా లేకుండెను. మహాభారత కాలమందు దాసులులేక బానిసలు లేకుండిరని మఱియొక ప్రమాణము బట్టియు సిద్ధమగుచుండెను. *

మహాభారతకాలమందు దాసుఁడనఁగా నిశ్చితమైన నీ యర్థము శూద్రుఁడని తోఁచుచున్నది. "గార్వోఢారం ధావితారం తురంగీ శూద్రీ దాసం బ్రాహ్మణీ యాచకంచ —ఆవునకు దూడయైనచో నయ్యది బరువే మోయవలసి యుండును. ఆడు గుఱ్ఱమునకుఁ బిల్లయైనచో నయ్యది పరుగెత్తవలసి యుండును. శూద్ర స్త్రీకిఁ బుత్రుఁడగునేని దాసుఁడై కావలసి యుండును, మఱియు బ్రాహ్మణికిఁ బుత్రుఁడగునేని భిక్షమే యెత్తవలసి యుండును. ఈ శ్లోకమందు వర్ణింపబడిన మర్మము మిక్కిలి మనోరంజకమైయుండెను. అగుఁగాక దీనిఁబట్టి దాసుడనఁగా శూద్రుడనియే తెలియుచున్నది. మఱియు శూద్రునియొక్క నిచ్ఛితకృత్యము పరిచర్య చేయుటయేయని విశ్వసింపఁబడి యుండెను. కాని శూద్రులందరను సేవ చేయుచుండిరనుటలేదు, బ్రాహ్మణము లందఱును భిచ్చమెత్తుకొనని యట్లే శూద్రులందఱును దాసులు కాకుండిరి. చాలమంది స్వతంత్రోద్యమమునఁ దగుల్కొని తాము పొట్టపోసికొనుచుండిన మఱియు వారియొద్ద ద్రవ్యసంచయముకూడ నుండుచుండెను. వారు శ్రాద్ధాదికర్మములును జేయు

టకుఁ గూడ యోగ్యులని జెప్పఁబడుచుండిరి మఱియు దానములుకూడఁ జేయుచుండిరి, కాని వారికిఁ దపస్సు చేయు నధికారముండెను, అందఱు శూద్రులును దాసులు కాకుండిరి.* కాని యందఱు దాసులును శూద్రులై యుండిన మాట మాత్రము వాస్తవము. బ్రాహ్మణులందఱును బిచ్చమెత్త కుండిరి. కాని బిచ్చమెత్తు వారందఱును బ్రాహ్మణులై యుండిరి. అనఁగా బిచ్చమెత్తు నధికారము బ్రాహ్మణులకు మాత్రమే యుండినట్లుగానే దాసులందఱును శూద్రులగు చుండిరి. మహాభారత కాలమందు శూద్రులు తక్కనితరుల చేత నొక పని చేయఁబడ కుండెనని తెలియుచున్నది. బ్రాహ్మణులు, శూద్రుల పనియందు లగ్నమై యుండుట మాత్రము కలియొక్క భయంకర విలాసమై యున్నది. ఇట్టి శూద్రుల యొక్క స్థితి కూడ పాశ్చాత్య దేశములలోని దాసులకంటె మిక్కిలి శ్రేష్ఠమై యుండెను. ప్రభువునకు వారిని చంపుటకు, కొట్టుటకును హక్కు లేకుండెను. కాని పాశ్చాత్య దేశములందు మాత్రము వారి ప్రాణములఁ దీయుటకుఁ కూడ హక్కుండెను. ఇంతియే కాక యిచ్చట దాసులే లేకుండెరని ఇటుల చెప్పుట యసత్యము కానేరదు. మహాభారతములో ఇంటి నౌకరులకు నన్నము పెట్టి మఱియు తాను భుజింపవలయును నంతవఱకును నియమము చెప్పఁబడి యున్నది. ప్రాఁత బట్టలను శూద్రులకు నిచ్చి వేయవలయునని నియమముండెను. ఇదే విధముగా చెప్పులు, గొడుగులు, తెరాలు మొదలైనవి యీయఁబడు చుండెను. శూద్రునికి ద్రవ్యము నార్జించు నధికారము లేదు. అనఁగా వాని ద్రవ్యము యజమానునిదేయై యున్నదను సంగతి కేవలము దాసునికే యుపయుక్తమై యున్నది.

---

*క్రింది శ్లోకములో దాసుల లేక బానిసల యుల్లేఖము తెలియుచున్నది:—

మానుషా మానుషానేవ దాస భావేన భుంజతే ।
వధ బంధ నిరోధేన కారయంతి దివానిశమ్ ॥

ఈ వర్ణనముఁ బట్టి భారతీయార్యులకు బానిస తనమనఁగా సహింపరానిదని యనియు ఈ కారణము చేత వారిలో నీ యాచారము గలిగెననియుఁ దోచుచున్నది.

బ్రాహ్మణుల యొద్దకు శూద్రుఁడు వచ్చిన మీఁదట వారినతఁడు పోషింప వలసియే యుండెను. ఇదియుఁగాక ఆ దాసుఁడు సంతానము లేకుండ చనిపోవునేని సంతతికి అన్నము గూడ నీయవలయునను సంత వఱకు జెప్పఁబడియున్నది. ( శాంతి. అ. 60 ) శూద్రుఁడు దాసుఁడు కాని యెడల అతఁడు అమంత్రకమైనపాక యజ్ఞమును జేయవలయునని వర్ణన షున్నది. అనఁగా దాస్యముయొక్క స్వరూపము శూద్రుని పరిస్థితిని బట్టి పుర్తిగా గాకుండెను. అయినను దాస్యము దాస్యమేయై యున్నది. సప్తర్షుల కథ ( అను. అం. 93 ) యందు వారి శూద్ర సేవకుఁడు శపథము గైకొనునప్పుడు చెప్పుచున్నాఁడు – 'నేను దొంగతనమును జేసితి నేని నాకు మాటిమాటికిని దాసుని విద్యయే లభించును. ఇంటిలోని శూద్ర సేవకులకును, దాసులకును కొంచెమైనను వేతనము ఈయబడ కుం డెను. వారికన్నము, వస్త్రముల నిచ్చుటయే వేతనమిచ్చుటయై యుండెను.

ఇట్టి శూద్రదాసులు కాకుండ మిగిలిన కూలీలును వేర్వేఱు ఉద్యమముల జేయునట్టి శిల్పులును గూడ నవశ్యముండి యుందురు. పల్లెవాండ్రు, సాలెవాండ్రు, వడ్రంగులు మొదలైన శిల్పులు గూడ నుండి యుందురు. వీరి కేమేమి వేతన మీయఁబడు చుండెనో దీని సారాంశము దొరకకున్నది. తఱచుగా పొలపు పనులయందు కూలివారి యుపయోగము లేకుండెను. మహాభారత కాలమందు వ్యవసాయము చేయువారు స్వయముగా నార్య వైశ్యులేయై యుండిరి. వీరిలోనుండి యిప్పటి జాతులు ( ఒక్క జాతి ) ను దక్షిణమందలి కృషకులగు మరాటులను గూడనై యున్నారు. ఈ వైశ్యులు, శూద్ర దాసుల సాహాయ్యము చేత పొలపుఁ బనులన్నింటిని జేయు చుండిరి. ఇప్పటి వైశ్య జనము స్వయముగాఁ బొలపుఁ బనిని జేయుట లేదు. కాబట్టి యీ యుద్యమము అందఱికంటె నెక్కువగా శూద్రుల చేతి లోనికిఁ బోయి యున్నది. అయినను వ్యవసాయదారులైన బ్రాహ్మణు లును, క్షత్రియులును అనువారు వృత్తి ద్వారమున ఇప్పటికిని ఉత్తర దక్షిణ దేశముల యందుఁ గనఁబడు చున్నారు.

## సంఘము

మహాభారత కాలమందు వ్యాపార వంతులైన వైశ్యులయొక్క, శిల్పుల యొక్క యుఁగృత్యమును జేయు శూద్రులలో లేక మిశ్ర జాతివారిలో అక్క

డక్కడ సంఘ వ్యవస్థ యుండెనని నిశ్చయ పూర్వకముగాఁ దెలియుచున్నది. వీరి సంఘములకుఁ చేరు గణములేక శ్రేణియని కనఁబడుచున్నది. ఈ గణములకు నాయకులుండు చుండిరి. రాజ ధర్మములో ఈ లోకులపై పన్ను వేయునపుడు శ్రేణుల నాయకులు లోకులను పిలిపించి వారిని సన్మానింపవలయునని చెప్పఁబడి యున్నది. ఈ సంఘములకు రాజునుండి ద్రవ్య ద్వారమున సాహాయ్యము లభించెడి యేర్పాటులుండెను. రాజు రాష్ట్రమునకు వడ్డీపైని ద్రవ్యమీయ వలయుననియు రాష్ట్రమును వర్ధిల్లఁ జేయ వలయుననియుఁ జెప్పఁబడి యున్నది. ప్రాచీన శిలా శాసనములయందు నిట్టి సంఘముల యుల్లేఖము కనఁబడు చున్నది. ఈ సంఘము మిక్కిలి పెద్దది కాకుండెను. ఇవి రాష్ట్రములోని పట్టణమందలివి లేక గ్రామము నందలివి యొక్క పని చేయువారికే యగుచుండెను. మఱియు వానికి నాయకులు నియతముగా నుండెడివారు.

## తూ నిక మ ఱి యు కొ ల త

ఇప్పుడు మనము తూనికను, కొలతను విచారింతము. ధాన్యము యొక్క ముఖ్యమైన తూనిక – దష్టి – యొక్క వర్ణనము మహాభారతములో ననేక స్థానములందు యున్నది. దీని పేరు ప్రస్థమై యుండెను. శాంతి అ 60 లో రెండువందల యేబది దష్టులకు* పూర్ణ పాత్రమగుచున్నది. ఈ విధముగా ధాన్యముయొక్క పెద్ద తూనికయేయై యుండెను. ద్రోణమునకు నిప్పటి మణుఁగునకు నెట్టి సంబంధమున్నదో చెప్పఁబడఁ జాలదు. కౌటిల్యుని యర్థశాస్త్రము ప్రస్తుత కాలమందే ప్రకటింపఁబడి యున్నది. అందులో బరువును తూనికయు నీయఁబడి యున్నవి. ఆలోచింపఁగా వీని యుల్లేఖము మహాభారతములో లేకున్నది. అయినను ఇవి యా కాలమున లేవని చెప్పఁజాలము. ప్రసంగము రాని యెడల

---

*అష్ట ముష్టిర్భవేత్ కించితకిత్ంచి దష్టౌచ పుష్కలం
పుష్కలానిచ చత్వారి, పూర్ణ పాత్రం ప్రచక్షతే
ఈ శ్లోకము టీకలో నీయ బడినది.

నుల్లేఖము కూడఁ గానేరదను సంగతి సాధారణ విషయమై యున్నది. సేనయొక్కయు రజత ధాతువుయొక్కయుఁ బ్రిచారముండి నప్పుడు బరువు యొక్క చిన్న తూనిక యవశ్యము నుండి యుండును. రత్నములమ్ముడు పోయిన కారణము చేత మిగుల సూక్ష్మములైన తూనికల యావశ్యకత కూడ నావశ్యకముగా నుండి యుండును. యిదియుఁ గాక పెద్ద వస్తువుల తూనిక కూడ నుండెను. మఱియు ద్రోణము అన్నము యొక్క తూని కయై యుండెను. యుధిష్ఠిరుని యధీనములో ఉత్తర దేశీయులు ద్రోణ పరిమితమైన బంగారమును దెచ్చి యిచ్చిరని వర్ణనమున్నది. ఒక వేళనది సువర్ణ కణములది కావచ్చును. మఱియు ద్రోణమానముచేత గొలువఁబడినది కావచ్చును. పొడవుకొలత కిష్కము, ధనుష్యము యోజనము మొదలైనవియై యున్నది. చేతి వ్రేళ్ళతోఁ దెలియునట్టి తాళము, వితస్తి మొదలైన పలువిధములైన మానముల యొక్క యుల్లేఖము మహా భారతములో వచ్చియున్నవి. (మానతాలాభిః భేరీరకారయత్ — సభ పండ్రెండు బెత్తల పరిమాణముతో తయారు చేయఁబడెను.

# పన్నెండవ ప్రకరణము

## భూ గో ళ క జ్ఞా న ము

ఇపుడీ ప్రకారణములో మనము, మహాభారతకాలములో మన వారికి భూగోళజ్ఞానమెంత యుండెనో యా విషయమును వర్ణింతుము. మహాభారతములోని యనేక వర్ణనములఁబట్టి మనకు, ఈ కాలమున, అనఁగా క్రీ. పూ. దాదపు 250 సంవత్సరమున, భారతవర్షమునకు సంపూర్ణజ్ఞానముండెనని తెలియుచున్నది. గ్రీకులవృత్తాంతముఁ బట్టికూడ ఇదే తెలియు చున్నది. పంజాబునకు వచ్చిన సికందరునకు కన్యాకుమారి వరకుఁ గల దేశములయొక్క పొడవు వెడల్పులతో సహితముగా సంపూర్ణ జ్ఞానము ప్రాప్తమైనయుండెను; మరియు కనింగహాము, ఈ జ్ఞానము మిక్కిలి మంచిది అనగా వాస్తవికి స్థితి కనుకూలమై యుండెనని యొప్పుకొని యున్నారు. దీనికివిరుద్ధముగా జాలమంది యనుమానించు చున్నారు; కానియదిపొరపాటై యున్నది. మహాభారతముఁబట్టి, యంతకుమునుపు అదిగో భారతీయ యుద్ధకాలమందు, ఆర్యులకు భారతవర్షముయొక్క జ్ఞానమెంతయుండెనో యిదికూడ ననుమానింపఁబడగలదు. మహాభారతకాలమందు భారతవర్షజ్ఞానము మాత్రమే పూర్ణమైయుండలేదు, ఇంకనే మంటేని చుట్టుప్రక్కల దేశములయొక్క, అనఁగా చీనా, టిబెట్టు, ఈరాను మొదలైన దేశములయొక్కయు అధిక జ్ఞానముండెను. వారియొక్క ఈ యజ్ఞానము ప్రత్యక్షమైయుండును. అవును సంపూర్ణమైన పృధ్వివిషయమై వారు చేసియుండిన కల్పన యవశ్యముగ ప్రత్యక్షజ్ఞానముతోఁజేసియుండలేదు, కాని కేవలము తమ కల్పనా తరంగములచే నిశ్చయింపఁబడియుండెను. ఇప్పటి వాస్తవికస్థితి కయ్యది యను కూలముగానే యున్నది. ప్రాచీనకాలమునాటికి సంపూర్ణ పృథ్వీజ్ఞానముండుట సంభవముకూడ గాకుండెను. మహాభారత భీష్మపర్వములోను నితరస్థలములందును, పలువిధములైన యాత్రల వర్ణనముబట్టియు దిగ్విజయముల వర్ణనముఁబట్టియు భూగోళ జ్ఞానము లేక కల్పన యార్యులకుఁ దెలియఁబడియున్నదో, దానిని మనమిచ్చట విస్తారముగా వర్ణించుచున్నాము.

## జంబూ ద్వీపములోని వర్షములు

ముందుగా మనము, ఆకాలమున పృథ్వీవిషయమైయుండిన కల్పనను గూర్చి విచారింతుము. ఈ వర్ణనము ముఖ్యముగా భీష్మపర్వములో 5, 6, 7, 8, అధ్యాయములయందు గలదు. ప్రాచీన కాలమందు భూమిలో సప్తద్వీపములున్నవని కల్పన యుండెను. ఏడు ద్వీపముల పేరులును మహాభారతములోగలవు. మరియు ద్వీపములేడున్నవని స్పష్టముగాఁజెప్పఁబడియున్నది.

వీనిలో ముఖ్యమైనది మనము నివసించుచున్న జంబూద్వీపము లేక సుదర్శన ద్వీపమైయున్నది. ఈ ద్వీపము గోళములేక చక్రాకారమైయున్నది. ఇదియు నాల్గువైపుల మహాసముద్రముచేత నావరింపఁబడియున్నది. మఱియొకపుటలో బటమందు జూపింపబడినట్లుగానే, యిది సప్తవర్షములు లేక భాగములుగా జేయఁబడియున్నది. మిక్కిలి క్రిందిది అదిగో దక్షిణమువైపుభాగము భారత వర్షమైయున్నది. దీనికుత్తరముగా హిమాలయపర్వతముకలదు. హిమాలయముయొక్క శిఖరములు పూర్వపశ్చిమ సముద్రములలో మునిగియున్నవి. హిమాలయమునకుత్తరమున హైమవతవర్షముకలదు; మరియు దానికుత్తరముగా హేమకూట పర్వతశ్రేణి కలదు. ఈ శ్రేణికూడ పశ్చిమసముద్రములవరకు వ్యాపించియున్నది. దానికుత్తరపు వైపున ఎన్నియో యోజనములకుఁ బిమ్మట, నిషధ పర్వతశ్రేణి పూర్వపశ్చిమ సముద్రములకు వ్యాపించియున్నది. ఇంతవరకు ప్రత్యక్ష జ్ఞానము లేక వీనికిజ్ఞానము మహాభారతకాలమందుండెను. ఎందుచేతననఁగా ఈ మూడు పర్వత శ్రేణులగు హిమాలయము క్వేనలం (కారాకోరమ్) మరియు అతలాయి యని పేరుగల పర్వతముల యొక్క పూర్వపశ్చిమ శ్రేణులై యుండెను. మహాప్రస్థానికపర్వములో, పాండవులు హిమాలయమున ఉత్తరముగా వెళ్ళినపుడు వారికి వాలుకా మయమైన సముద్రమగు పడెనని వర్ణనమున్నది. ఈ సముద్రము గోబీయొక్క రేగిస్థానమై యున్నది. ఈ మూఁడు శ్రేణులును నవశ్యముగా వ్రాయఁబడియుండెను. హేమకూట నిజధ పర్వతముల నడిమి భాగమును హరివర్షమని చెప్పుచుండిరి. హరివర్షములో జపాను, మంగోలియా, తుర్కి స్థానము,

రోమ్, జర్మనీ, ఇంగ్లండు మొదలైన దేశములు సమావేశమగుచున్నవి. హైమవత వర్షములో చీనా, టిబెట్టు, ఈరాన్, గ్రీస్, యిటలీ మొదలైన దేశములు కాఁగలవు. మహాభారతముఁ బట్టి వీని జ్ఞానము భారత వాసుల కుండెనని తెరియుచుండెను.

అవును, ఇపుడు దీనికి ముందుగా నీయఁబడియుండిన వర్ణనము అవశ్యముగానే కాల్పనికము కాఁగలదు. నిషదమునకుత్తరమునను మధ్యమునను మేరు పర్వతముండెను; మఱియు మేరువునకుత్తరపు వైపున మరల మూఁడు శ్రేణులు నీలము శ్వేతములైన శృంగవంతములను పేరుగల దక్షిణపు పంక్తుల వలెనే, పూర్వ పశ్చిమ సముద్రముల వరకు వ్యాపించినదిగా విశ్వసింపఁ బడుచుండెను. వీనికి వాస్తవిక స్థితితో మైత్రి కుదుర కుండెను. 84 వేల యోజనముల యెత్తుగల సువర్ణ మేరు పర్వతము కాల్పనికమై యుండినదని కూడ స్పష్టమై యుండెను. ఉత్తర ధ్రువము దేశమున మేరు కల్పన చేయఁబడునేని, మేరువునకుత్తరపు వైపున అనఁగా అమెరికా ఖండమునందు పూర్వ పశ్చిమ పర్వతముల శ్రేణులు లేకున్నవి. కనుకనే నీలము శ్వేతముపైన శృంగ వంతములనెడి పర్వతముల శ్రేణులు కాల్పనికములనుట స్పష్టమై యుండెను. ప్రాచీనము, దక్షిణపు వైపు శ్రేణుల వలెనే, ఉత్తరపు వైపు శ్రేణులుండి యుండియుండునని కల్పన చేసియున్నారు. ఈ మేరు పర్వతమునకు రెండు వైపులను మాల్యవంతము, గంధమాదనముననెడి రెండు చిన్న శిఖరములు, ఉత్తర దక్షిణముల వైపును కల్పింపబడియున్నది. నీల పర్వతము శ్వేతపర్వతములయొక యుత్తరపు వైపు ప్రదేశములకు నీలవర్షము, శ్వేతవర్షము, హైరణ్యము లేక ఐరావత వర్షము అనెడు పేరులు గల ప్రదేశములు ఉత్తరకురువు, భద్రాశ్వము, కేతుమాలము, జంబూద్వీపములను రెండు కల్పింపఁబడి యున్నవి. ఈ ప్రదేశములలోనివారు మిగుల సుఖవంతులు, సుందరులు, పదివేల వర్షముల యాయువుగల వారు నగుచున్నారు. వారు పూర్వకాలులును సుతన్వులు నై యున్నారు. ఇది గాకుండఁగా వారి విషయమై, ఉత్తరోత్తరమున సప్తవర్షములందు వారికి సప్తభాగములందు నధికాదికమైన పుణ్యము. ఆయువు, ధర్మము, కర్మము గలప

నియుఁ గల్పన కలదు. హిమవత్పర్వతముపై రాక్షసులు, హేమకూటము నందు గుహ్యులు, నిషధ పర్వతము మీఁద నాగులు, శ్వేతపర్వతము పైని దేవతలు, నీలముపైని బ్రహ్మర్షులును గలరు. జంబూ ద్వీపములో నొక పెద్ద జంబూ వృక్షము అనఁగా నేరేడు చెట్టుకలదు. అది అన్ని కోరికలను బూరించునదియై యున్నది. దీనియెత్తు 1101 యోజనములు దీని పెద్ద పెద్ద పండ్లు నేలపైఁ బడుచుండును. వానినుండి శుభ్రమైన జలముగల యొక నది బయలుదేఱుచున్నది; అది మేరు పర్వతమునకు బ్రదక్షిణము చేయుచు నుత్తర కురుదేశమునకుఁ బోవుచున్నది. ఇచ్చట జంబురసమును ద్రాగి లోకుల మనసు శాంత మగుచున్నది. వారు క్షుత్పి పాసాశూన్యు లగుచుండిరి. ఈ రసమునుండి యింద్ర గోపమువలె మెఱయుచున్న జాంబూనద నామకమగు సువర్ణ ముత్పన్నమగుచుండెను యువతులు ఈ సువర్ణముతోఁ చేసిన భూషణములను ధరించుచున్నారు ఉపర్యుక్త వర్ణనముఁ బట్టి పాఠకులకు, మన యీ ద్వీపమును జూచు ద్వీపమని యెందుకుఁ జెప్పుచున్నారో తెలియఁగలదు. ఇదిగాక జంబూనద శబ్దమునకు – ఎఱ్ఱ రంగుగల బంగారము – ఈ యర్థమెట్లు వచ్చెనోయున్నదో యిది కూడఁ బాఠకుల ధ్యానమునకు రాఁగలదు. మేరువునకుఁ జుట్టు ప్రక్కల యందు నిప్పటి లెక్కఁబట్టి సైబీరియా, కెనడా ప్రాంతములు సమావేశ మగుచున్నవి. ఈ ప్రాంతముల యందిప్పటికిని బంగారము పృథ్వీ పృష్ఠమునందు వ్యాప్తమై దొరుకుచున్నది. సైబీరియా నదులనుండి చాల సువర్ణ కణములు కొట్టుకొని వచ్చుచున్నవి. దీనినిఁ బట్టి యీ ప్రదేశము యొక్క కల్పన కేవలము మస్తిష్కము నుండియే బయలుదేఱి యుండలేదు. లేకుంటే దానికై ప్రత్యక్ష స్థితి యొక్క యాధారము కూడా నున్నదని తెలియుచున్నది. ఇదిగాక లోకమాన్య తిలక్ మతము ననుస రించి యార్యుల మూల నివాసము ఉత్తర ధ్రువ ప్రదేశము నందుండి నచో ఉత్తర కురువు, భద్రాశ్వము, కేతుమూలము, జాంబునదము ననెడి దేశములలోని పుణ్యవతులు, సుఖులు, దీర్ఘాయుపులునైన లోకుల యే యతిశయోక్తి వర్ణనమున్నదో, ఆ వర్ణనమునకు ఏదో యొక దంతకథ ( పుక్కిటి కథ ) లేక పూర్వ స్మృతియొక్క యాధార మవశ్యముగా నుండి

యని వ్రాసియుండెను. ఈ శ్లోకములును కూట శ్లోకములే యున్నవి. ఏమైన నగుఁగాక, ఈ రెండధ్యాయములఁ బట్టియు మూఁడు ద్వీపముల నామములును ఐరావతద్వీపము, నాగద్వీపము, కాశ్యపద్వీపము నై యుండెనని ప్రకటమగుచున్నది. వానిలో నాగద్వీపము, కాశ్యపద్వీపమును శశకముయొక్క చెవుల ప్రదేశములందు జూపఁబడియున్నవి. దీనిఁబట్టి మనము నాగద్వీపమును, కాశ్యపద్వీపమును గుండ్రముగా చక్రాకారములై యున్నవని విశ్వసింపక శశముయొక్క చెవులవలే వ్రేలు చున్నవి. గాన ఆ కృతియందు జంబూద్వీపమునకు రెండు ప్రక్కలను బటములోఁ జూపియున్నాము. దీనికిఁ బిమ్మట మలయద్వీపమును, ఒక మలయ పర్వత నామముతో విశ్వసించి, భూమికి రెండవ సగమున అనఁగా జంబూ ద్వీపమునకు దక్షిణమునఁ జూపియున్నాము. కాని పృథివిపై నేడుద్వీపములున్నట్లే యేడు సముద్రములు కూడ నున్నవను కల్పన మహాభారతకాలమందుండెను, ఇపుడుకూడ మనము "ఏడు సముద్రములుకూడ నున్నవను కల్పన మహాభారత కాలమందుండెను. ఇపుడు కూడ మనము 'ఏడు సముద్రముల పారము" అని చెప్పుచు న్నాము. శతసముద్రము, అరుణసముద్రము, నీలసముద్రము, శ్వేత సముద్రము—ఈ నాలుగు సముద్రములును నిపుడు పటములో నున్నవి సూర్యకిరణములుకూడ సప్తవర్ణములవియై యున్నవి. కాని పూర్వకాలమందు సముద్రముల కల్పన రంగులపై లేకుండెను. ఇఁక నేమంటే లవణ సముద్రము, క్షారసముద్రము ఇత్యాది ప్రకారములవియై యుండెను ఇపుడు మహాభారతములో, ఉపర్యుక్త సముద్రము లెచ్చటనున్నవో వీని కల్పన బొత్తిగా అస్పష్టమైయున్నది. అవును. ఒకచోట, జంబూ ద్వీపమునను నలుప్రక్కలను సముద్రము ఉప్పునిదని యువశ్యమును వ్రాసియున్నాఁడు. రామాయణములో, జంబూ ద్వీపమునకు దక్షిణపు వైపున నున్న సముద్రమున్నదనియు గల్పన యున్నది. మంచిది, ఇపుడు మనము, మహాభారతములో మునుపటి యధ్యాయములందు నీ కల్పనయు ద్వీపములకు సంబంధించిన కల్పనయు నెట్లున్నదో చెప్పుచున్నాము.

సంపూర్ణ భూవర్ణనమైన తరువాత ఐదునొకండవ యధ్యాయములో భీష్మ పర్వమున ద్వీపవర్ణనము మరల నీయఁబడి యున్నది. అందు ముందుగాఁ బృథ్విపై ననేక ద్వీపములున్నవని చెప్పియున్నాఁడు. ఏడు ద్వీపములే యున్నవనికాదు. ఇకనేమంటే యేడు ద్వీపములు ముఖ్యములై యున్నవి. *

ఇచ్చట ఆ యేడు ద్వీపము లేవియో చెప్పఁబడలేదు. అయినను ప్రారంభమున మూఁడు ద్వీపములను జెప్పియున్నాడు. మఱియు నిచ్చట నింకను నాలుగు చెప్పఁబడియున్నవి. శేతము, కుశము, శాల్మలిః క్రౌంచము ముందుమ ఆ మూఁడు ద్వీపన్నామాలు అనఁగా జంబువు, శాశ్యద్వీపము నాగమును గలిపి మొత్తము సప్తసద్వీపములని చెప్పకొనవలయును. శకద్వీపముయొక్క వర్ణనము చాలవిస్తృత రీతిని నీయఁబడి యున్నది. శకద్వీపము జంబూద్వీపముకన్నా. ద్విగుణమై ప్రతిచోఁయున్నది; మఱియు దానికి సమీపమున క్షీరసముద్రమున్నది. ఇచ్చట ఈ ద్వీపము జంబూ ద్వీపమున కే వైపున నున్నదియో మాత్రము చెప్ప బడలేదు. కాని యిది బహుశః ఉత్తరము వైపున నుండియుండును. ఇందుఁ గూడ జంబూ ద్వీపమున వలె నేడు పర్వతములున్నవి. మరియు నన్నియే యట్లే నదులున్నవి. మలయము, రైవతకము ఈ రెండు నామములును భారత వర్షమందలి నామముల వలెనే యున్నవి. అక్కడి వారు మిక్కిలి పుణ్యవంతు లగుచున్నారు. ఇతర ద్వీపములలో గౌర వర్ణము, అర్ధ గౌరవర్ణము, శ్యామ వర్ణముగల మనుష్య లున్నారు. కాని యిచ్చట నందఱు మనుష్యులును శ్యామ వర్ణము వారై యున్నారు. ఈ సంగతి యిచ్చట విశేష రీతిని జెప్పఁబడి యున్నది. ఈ ద్వీపములో గూడ నేడు వరములు అనఁగా ఖండము లున్నవి. మరియు నిచణ

---

* త్రియోదశ సమూద్రిస్సనద్వీపానశ్నన పురూరవాః ఆదిఅ. 15 లో 13 ద్వీపములు చెప్పఁబడి యున్నవి. అని టీకాకారుఁడు ఎక్కడెక్కడనో కలిపియున్నాడు. సంఖ్యయుక్తమైన ఆ కూటమునేసౌలి పూరించియున్నాడు.

గూడ జంబూ వృక్షము వంటి దొక శకవృక్షమున్నది. దాని యెత్తు మోటుఁదనము జంబూ వృక్షముతో పాటి యున్నది. ఇచ్చటి వారు ఈ వృక్షము యొక్క సేవయందు తగుల్కొని యున్నారు. ఇచ్చట నదుల జలము కడుఁ బవిత్రమై యున్నది.- ప్రత్యక్ష గంగ యనేక రూపముల ప్రవహించు చున్నది. ఈ ద్వీపమున పవిత్రములు లోక మాన్యములునైన నాలుగు దేశములున్నవి- మగము, మశకము, మానసము మందగము. వీనిలో మగము నందు బ్రహ్మ కర్మమున నిమగ్నులైన బ్రాహ్మణులున్నారు. మశకము లో ధర్మ నిష్ఠులైన క్షత్రియులున్నారు. మానసములో నున్న వారందఱును వైశ్య వృత్తితో జీవించుచున్నారు; మరియు మందగములో ధర్మశీలులైన శూద్రులున్నారు. ఇచట రాజెవ్వరునుఁలేడు. అందఱును తమ ధర్మములతో నడచుకొనుచు నొండొరులను రక్షించుకొనుచున్నారు.

ఆ పర్యుక్త వర్ణనము ప్రాయికముగాఁ గాల్పనికమై యున్నది. యిదు గొంచెమైనను సందేహములేదు, అది జంబూ ద్వీప వర్ణనము కంటెను గొన్ని విషయములలో నతిశయోక్తితో వ్రాయఁబడి యున్నది. కాని యీ వర్ణనములో నీయఁబడి యున్నవారి నామములు నిత్యములును నైతిహాసికములునై యున్నవనుట యాశ్చర్య విషయమై యున్నది. ద్వీపముయొక్క పేరు శకమని చెప్పఁబడి యున్నది. ఈ పేరు శకముఁబట్టి పుట్టినచో, శకులును, పార్శివారును నివసించుచున్న దేశమున నుపర్యుక్త నామము గల బ్రాహ్మలు, వైశ్యులు, క్షత్రియులు, శూద్రులు నుండెడివారని యితిహాసముఁబట్టి తెలియుచున్నది. మగబ్రాహ్మణులు పార్సీవారిలో నగ్నిపూజలును, సూర్యపూజలునైన మాగి అనెడు ధర్మగురువులై యున్నారు. వీరి విషయమై, వారు మిక్కిలి గారడి చేయు వారని చెప్పఁబడుచున్నది. వీరు హిందూస్థానమునకుఁగూడ వచ్చి యున్నారు; మఱియుఁ బ్రస్తుతమున "మగబ్రాహ్మణుల, నామముతోఁ బ్రసిద్ధులై యున్నారు, వారు సూర్యోపాసకులై యున్నారు. కాని యీ బ్రాహ్మణులు మహాభారతములో వర్ణింపఁబడి యున్న శకద్వీప వాసులకియు మఱియు క్షారసముద్రమును, క్షీరసముద్రమును

దాఁటి వచ్చిరనియు విశ్వసించుట సంభవనీయముకాదు, తాత్పర్యమేమ నఁగా ఈ కాల్పనికమైన ద్వీపమునకు నే విధముగా నదులయుఁ బర్వ తములయు నామములు జంబూద్వీపమునుండి గై కొనఁబడి యున్నచో, అట్లే లోకుల నామములు మగ, ముందుగను మొదలైనవియు శక నామములును గూడ జంబూద్వీపము నుండియే యిచ్చటకు దీసికొని పోఁబడియున్నవి.

ఇపుడు మనము మిగిలిన ద్వీపములను వర్ణించు చున్నాము ఈ ద్వీపములను ఉత్తర ద్వీపములని చెప్పు చున్నారు. కాఁబట్టి యవి యుత్తరము వైపుననుండి యుండవలయును. వీని యొద్ద ఘృత సము ద్రము, దధి సముద్రము, సురా సముద్రము, జల సముద్రము (తీపు నీటి యొక్క) ఈ నాలుగు సముద్రములును నున్నవి. ఈ ద్వీపములు రెట్టింపు పరిమాణముతో నున్నవి. పశ్చిమ ద్వీపమందు నారాయణుని యొక్క కృష్ణ సంజ్ఞకమైన పర్వతమున్నది. దానిని శ్రీ కృష్ణుఁడు స్వయముగా రక్షించు చున్నాఁడు. కుశ ద్వీపములోని వారు కుశదర్భలను పూజించు చున్నారు. శాల్మవ ద్వీపమందొక శల్మవ వృక్షమున్నది. దానిని లోకులు పూజించు చున్నారు. క్రౌంచ ద్వీపమునందు క్రౌంచ నామకమైన పర్వతమున్నది. అందనేక రత్నములున్నవి. ప్రతి ద్వీపమందును నాలు గేసి పర్వతములుండెను. వానిచేత నేడు వర్షములు లేక ఖండములయ్యెను. అ పర్వతములయు, వర్షములయు వేర్వేఱు నామము లిచ్చట నిచ్చుట యావశ్యకము కాదు. వీనిలో నివసించు వారు గౌర వర్ణులగు చున్నారు. వీనిలో మ్లేచ్ఛు లెవరును లేరు. ఇంకను నొక పుష్కర ద్వీపము యొక్క వర్ణనము కూడఁ జేయఁబడియున్నది. దానిపై స్వయముగా బ్రహ్మ నివసించు చున్నాఁడు. అతనిని దేవతలును, మహర్షులును పూజిం చుచున్నారు. ఈయన్ని ద్వీపములయందును నివసించు వారి యాయువు యొక్క పరిమాణము బ్రహ్మచర్యము, సత్యము, దమము వాని కార ణము చేత రెట్టింపుగా పెరిగి యున్నది. అందఱు లోకుల ధర్మము నొకటి యేయై యున్నది. కనుక యన్ని ద్వీపములు నొక దేశమని విశ్వ సింపబడు చున్నది. యిచ్చట ప్రజలకు రాజు ప్రజాపతియేయై యున్నాఁడు.

ఈ ద్వీపమునకు ముందు సమనామకమైన గ్రామమున్నది. అక్కడ లోక మాన్యము, వామనము, ఐరావతము మొదలైన నాలుగు దిగ్గజములున్నవి. వాని యెత్తు ఆకృతి పరిమాణము కొంచెమైనను కొలువఁబడఁ జాలదు. ఈ దిగ్గజములు తమ తొండములతో వాయువును నిరోధించి యుచ్ఛ్వాస రూపమున దానిని విడుచు చున్నవి. మంచిది, ఈ వాయువులే పృథ్వి యంతటను ప్రవహించు చున్నవి.

ఈ ద్వీపముల యొక్క కల్పన కేవలము పుణ్యవంతులైన లోకులను లేక నివాస స్థానములను గల్పించుటకై చేయఁబడి యున్నది; మఱియు ఆ జంబూ ద్వీప కల్పన చేయఁబడి యున్నది యని తెలియు చున్నది. పృథ్వి పైఁ బలు విధములైన లోకములు అనఁగా నివాస స్థానము లున్న వను కల్పన యుత్పన్న మగుట స్వాభావికమై యున్నది. కాని నాలుగు దిగ్గజముల కల్పన యన్నిటి కంటె ఎక్కువ యాశ్చర్యమును కలిగించు చున్నది. ఒక దేశమందే యొకవైపుననే యీ నాలుగు దిగ్గజములును చెప్పఁబడి యున్నవి: కాని మన యూహలో ఈ నాలుగు దిగ్గజములును నాలుగు దిక్కుల యందు నాలుగు వివిధ ప్రదేశములలో నివసించి యుం డవలయును. దిగ్గజముల యొక్క కల్పన బహుశాః వాయువెట్లు ప్రస రించు చున్నదో యీ విషయము నుపపత్తిని దెల్పుటకై చేయఁబడి యుం డును. ఇచ్చట నాలుగే దిగ్గజములు చెప్పఁబడి యున్నవి. కాని దీనికి ముందు గ్రంథము లందును జైన బౌద్ధ గ్రంథము లందును నాలుగు దిగ్గజముల కల్పన కనఁబడు చున్నది. పైని జెప్పఁబడియున్న యేడు ద్వీపములును గాక యింకను మఱియొక ద్వీపము మహాభారతములో శాంతి పర్వమందు నారాయణాయాఖ్యానమున శ్వేత ద్వీపమను పేరుతో చెప్పఁబడి యుండెదు. అచ్చట నారాయణుఁడు భక్తా సహితముగా నివ సించు చుండెను. ఇది విశేషముగా ముందు పేర్కొనఁ బడును.

పాండవుల మహా ప్రస్థాన వర్ణనములోఁ జేయఁ బడిన జంబూ ద్వీప వర్ణనము ఇచ్చట నీయఁదగి యున్నది. పాండవులు తూర్పు వైపునకు బోవుచుఁ బోవుచు నుదయాచలము నొద్ద లౌహిత్య సాగరము దారికి వెళ్ళి

చేరిరి. అచ్చట అగ్ని వారి మార్గము నడ్డగించెను. అతఁడు చెప్పఁగా అర్జునుఁడు గాండీవ ధనుస్సును సముద్రములోఁ బడవైచెను. దీని పిమ్మట వారు దక్షిణపు వైపునఁ దిరిగిరి; మఱియు క్షీర సముద్రము యొక్క యుత్తర తీరము నుండి నైరృతి దిశవైపు వెళ్ళిరి. దీనికిఁ బిమ్మట మరల పడమట వైపున సంచరించి పృథ్వికిఁ బ్రదక్షిణము చేయుచు నుత్తరపు వైపునకు వెళ్ళిరి. అప్పుడు వారికి హిమాలయ మనెడి గిరి దొరికెను. దాని ముందట వారికి వాలుకా సముద్రము కనఁబడెను. దానికి ముందు పర్వత శ్రేష్ఠమైన మేరువు కన్పడ నారంభ మయ్యెను; మేరు పర్వత శిఖరముపై స్వర్గముండెను. స్వర్గ పార్శ్వమున నాకాశ గంగ ప్రవహించు చుండెను. అచ్చట వారికి ఇంద్రుఁడు లభించెను. పై వర్ణనముఁ బట్టి లౌహిత్య సాగరము అనఁగా రక్త సముద్రము, ఉదయాచలము తూర్పు వైపున నుండెనని తెలియుచున్నది. ఇతర సముద్రముల వృత్తాంతము నీయఁబడి యున్నది. లవణ సముద్రము నైరృత పశ్చిమముల నుండి కలిసినదై దక్షిణపువైపున నుండెనని నిశ్చయపూర్వకముగా తెలియుచున్నది.

పృథ్వికి తూర్పున నుదయాచలము, పడమట నస్తాచలము నున్నవి. ఈ కల్పన ప్రాచీన కాలము నుండియుఁ గలదు. ఈ పర్వతములు పశ్చిమ సముద్రమునకు ముందు విస్తరింపఁబడియున్నవి. మహాభారతములో మేరువుత్తరము వైపున నున్నదనియు దానికి జుట్టును సూర్యుఁడు, నక్షత్రములు తిరుగుచున్నవనియు వర్ణనమున్నది. ఆకాశము నందలి నక్షత్రములకు నాయకుఁడైన యాదిత్యుఁడు ఈ మేరువు దగ్గఱనే యధికముగా తిరుగుచున్నాఁడు. ఇదే విధముగా నక్షత్రములతో సహితము చంద్రుడును, వాయువును దీనికి ప్రదక్షిణము చేయుచున్నారు. (భీష్మ. అ. 6.) ఆ సమయమున సూర్యుఁడు తూర్పువైపున నుదయమై పడమటి వైపున నస్తాచలమునకు పోవునపుడు మరల ఉత్తరమున నున్న మేరు పర్వతమునకు చుట్టును ఎట్లు తిరుగుచున్నాఁడో యిది గూఢ విషయమై యుండెను. కొందఱ మతము ననుసరించి సూర్యుఁడు పడమటి వైపున అస్త గిరికి పోయిన పిమ్మట మరల రాత్రికి ఉత్తరము వైపుగా పోయి మరల మేరువునకు ప్రదక్షిణము చేసి, మరల ప్రాతః కాలమున తూర్పు వైపున

నుదయాచల శ్నిరమునకు వచ్చుచున్నాఁడు. కాని ఈ కల్పన యితరులకు సరిగా నగపడదు; కనుకనే వారు విశేషించి రామాయణకారుడు మేరు పర్వత పశ్చిమ భాగమున జెప్పి యున్నాఁడు. కాని వారి యీ కల్పి బొత్తిగా భ్రమ పూర్ణమై యున్నది. మహాభారత కారుఁడు చేసిన జంబూ ద్వీప వర్ణనమే తఱచుగా ప్రాచీన గ్రంథములందును గనఁబడు చుండెను.

## జంబూ ద్వీప దేశము

ఈ ప్రకారముగా జంబూ ద్వీపములోని స_ప్త వర్షములు అనగా స_ప్త భాగములు అంగీకరింపబడి యున్నవని స్పష్టముగా తెలియు చున్నది. అందులో భారత వర్షము, హైమవత వర్షము, హరి వర్షము వా_స్తవిక స్థితి కనుకూలమై యున్నవి; మఱియు వానిలో చాలమంది లోకుల జ్ఞానము మహాభారత కాలమున భారతీయార్యుల కుండెను. హైమవతమున లేక ఇలా వర్షమున విశేషించి చీనా, టిబెట్టు, తుర్కి స్థానము, ఈరాన్, గ్రీసు ఇటలీ మొదలైన దేశములు కలిసియుండెను. ఈ దేశముల వారి జ్ఞాన మెక్కువగా మహాభారత కాలమున నుండెను. ఉ_త్తరపు వైపు వారు (మ్లేచ్ఛులు) భీష్మ పర్వములో నిట్లు చెప్పఁబడి యుండిరి:-

> యవ నాశ్చీన కాంభోజా దారుణా మ్లేచ్ఛ జాతయః।
> సకృద్గ్రహాః పులత్థాశ్చ హూణాః పారసికైః సహ॥

ఈ శ్లోకమందు యవనులు (యూనానీ), చీనులు, కాంభోజులు, (ఆఫ్ఘన్) సకృద్గృహులు, పులత్థ్రులు, హూణులు, పారసీకులు చెప్పఁబడి యుండిరి. క్రీ. పూ. 2.0 ఏండ్ల దాదాపున భారతీయులకు బహుశః ఈ లోకుల జ్ఞానము లేకుండి యుండునని చాలమంది యితిహాస కారులదృడాభిప్రాయమై యుండెను. కాని తూర్పు వైపున చీనా వఱకును, పడమటివైపున గ్రీసువఱకు మభారతవర్షీయులకైకమత్యము చాల ప్రాచీన కాలమునుండియు నుండెను. క్రమము వర్షి యసుల పాదుషా దారియస్సు భారతీవర్షములో గొంతుభాగమునకువచ్చి రాజ్యముచేయుచుండెను. గ్రీకు చరిత్రకారు

డగు హిరోడోటస్సు క్రీ.పూ 450 దాపున నుండెను. అతడును, దారియస్సు యొక్క ఫౌజులో అతని పదునెనిమిది రాజధానులలోని సేనాయుంగూడ యుండి యుండెనని వర్ణించి యుండెను.. అందులో యవనులు శకులు, పారసీకులు, కాంభోయులు మొదలైన భారతీయారుల సేన ఉండుచుండెను. దీనిబట్టియు భారతీయార్యులకు బహు ప్రాచీనకాలము నుండియు సరియైనజ్ఞానము బాగుగా నుండెననియే సిద్ధించుచున్నది. వీరుగాక హూణులయు జైనులయొక్కగూడ జ్ఞానము వారికి ఎక్కువగా నవశ్యము ఉండియుండి వలయును. హూణుల పేరు పాశ్చాత్యేతిహాసమునందు క్రీస్తుశకము తరువాత వచ్చుచున్నదనుట సత్యము, అయినను తూర్పువైపున నున్న యీమ్లేచ్ఛులు, హూణులు మఱియు చీనావారును మిగుల ప్రాచీనులై యున్నారు. చీనాల యితిహాసము క్రీస్తు శకమువారు 2000 ఏండ్లు మునుపటినుండియు నిప్పటివరకు సమానముగా లభించుచున్నది. ముఖ్యముగా ఆలోకుల పెద్దపెద్ద చక్రవర్తులు, టిబెట్టు నేపాళముల నడుమ నుండి తమ వకీళ్లను వ్యాపారస్థులను భారతవర్షమునకుఁబంపుచుండియుందురు. హూణులు చీనదేశమునకుఁ బశ్చిమమున నివసించుచుండిరి; మఱియు వారినామముకూడ మిక్కిలి ప్రాచీనమై యుండెను. భారతవర్షమునకు వచ్చిన తరువాతనే భారతీయార్యులకు హూణులు పరిచయముకలిగెనని చెప్పబడజాలరు. సారాంశమేమనగా ఈ లోకుల జ్ఞానము, ప్రత్యక్షముగాను ఏరీతిగాను, భారతీయులకుఁ బ్రాచీన కాలమందును మహాభారతకాలమందును నవశ్యముగానేయుండెను.

శాంతిపర్వమునందలి శుకాఖ్యానాములో భూగోళ సంబంధమైన యుల్లేఖము మిక్కిలి మహత్వముగలదిగా వచ్చియుండెను. అది యిట్లున్నది. శుకదేవుఁడు మేరు పర్వతమునుండి బయలుదేరి జనకుని గురువుగాఁజేసి కొనుటకై విదేశమునకువెళ్ళెను. దారివర్ణనచేయుచు చెప్పబడియున్నది.

మేరోర్హరేశ్చ ద్వే వర్షే వర్షం హైమవతం తథా ।
క్రమేణైవ వ్యతిక్రమ్య భారతం వర్షమాసదత్ ॥
స దేశాన్ వివిధాన్ పశ్యన్‌హూణ నిషేచీనవితాన్ ।
ఆర్యావర్తమిమం దేశమాజగామ మహామునిః ॥ (శాం. అ 325)

ఈ శ్లోకములలో నుత్తరము వైపున మేరువు, దక్షిణము వైపున హరివర్షము దానికి దక్షిణమున హైమవతమును అంతమున భారతవర్షము చెప్పఁబడెను. ఇట్టి స్థితిలో మేరువును రిసైబేరియాయందే కల్పింప వలయును, వీరుగాక చీనీలు హూణులు నీ రెండు జాతుల వారును, ఆర్యావర్తమునకును మేరువునకును నడుమ నివసించు చుండిరి. క్రీస్తు, శ. 300 కు దాదాపుగాఁ బూర్వమున హూణులును చీనీలును నొండొరుల పొరుగున హరివర్షములో నివసించుచుండిరనుటయందు సందేహములేదు. చీనాయొక్క పురాణేతిహాసము, హూణులు చీనాకు సరిహద్దున నివసించు చుండిరని చెప్పియున్నది. దీనిఁబట్టి, ఆర్యులకు క్రీస్తు శకమునకు ముందే యీ హూణుల విషయమై, జ్ఞాన మెట్లుండెనో యిది చక్కఁగా దెలియుచున్నది.ఆ సమయమున వీరు చీనాకు నుత్తర పశ్చిమమున నుండిరి.

## మహాభారతకాలమున భారతవర్షముయొక్క పూర్ణజ్ఞానము

భారత వర్షముకంటే బయటదేశీయుల జ్ఞానమెక్కువగా నిచ్చట వారికి మహాభారత కాలమున నుండినపుడు, స్వయముగా భారత వర్షము యొక్క జ్ఞానము మహాభారత కాలమున వారికి సంపూర్ణముగా విస్తృత రూపమున నుండెననుటలో నాశ్చర్య విషయమేమియును లేదు. వేద కాలమున నార్యులకు పంజాబుయొక్కయు మధ్యదేశము యొక్కయు జ్ఞానముండెను. మరల తరువాత వారు, మెల్ల మెల్లగా వారికి సమస్త దేశముల జ్ఞానము కలిగెను. మఱియు మహాభారతముఁ బట్టి ఆ కాలమున వారికి నీ దేశముయొక్క సంపూర్ణజ్ఞానము కలిగియుండె నని తెలియుచున్నది. చాలమంది, పాణిని కాలమున దక్షిణ దేశముల విశేష జ్ఞానము లేకుండెనని యూహించియుండిరి. ఇది సంభవనీయ ముగా నగపడుచుండెను. పాణినియొక్క కాలము క్రీస్తుశకమునకు 800—900 వర్షములు పూర్వమని విశ్వసించుటలో నాటంకమేమియునులేదు. ఈ కాలమునకు 109 వ బుద్ధుని కాలము వఱకు దక్షిణము వైపున సరిగా కన్యాకుమారి వఱకు భారతీయార్యుల వ్యాప్తియై యుండెను. మఱియు వారి రాజ్యములుకూడ స్థాపితములై యుండెను, విశేషించి చంద్రవంశార్యులైన భోజులును యాదవులును దక్షిణమున నివసించి

యుండిరి; మఱియు నచ్చట వైదిక ధర్మము సంపూర్ణముగా స్థాపితమై యుండెను. బౌద్ధధర్మమునకు మునుపు, వైధిక ధర్మమునకు దక్షిణమున పూర్వ సామ్రాజ్యముండెనను సంగతి నిర్వివాదమై యుండెను. ప్రొఫెసరు రిష్టడేవిడ్సను వ్రాసియున్నాడు- "దక్షిణ దేశమున సిలోను వఱకు క్రీస్తు శకమునకు 200 లు వర్షములు పూర్వము వఱకు నార్యుల వ్యాప్తిగానుండెను. ఎందుచేత? నికాయమనెడి బౌద్ధగ్రంథములో వింధ్యాచలమునకు దక్షిణము వైపు వారిలో నెవ్వరి పేరునులేదు. గోదావరీ తీరమందలి రాజ్య మొక్కటి మాత్రము షోడశ రాజ్యముల సూచియందు గనబడుచుండెను. దక్షిణ భారతముయొక్క పేరిందులో లేనేలేదు ఉడిస్సా బంగాళ, దక్షిణములయు నామములు లేవు, నికాయ గ్రంథకాలమున దక్షిణమున నార్యులు వ్యాపించిరి. వినయ గ్రంథములో భరుకచ్ఛము యొక్క నామముండెను; మఱియు ఉద్యాన గ్రంథములో శూర్పారకము యొక్క నామముండెను. కాని యీ కథనము బొత్తిగా భ్రమపూర్ణమై యుండెను. నికాయ గ్రంథములో దక్షిణము వైపు దేశముల నామములు లేదు, ఇంతమాత్రముచేత దక్షిణమువైపు దేశములు తెలియక యుండెనని చెప్పుట బొత్తిగాఁ బొరపాటు విషయమై యుండెను, ఉల్లేఖభావ రూపమైన ప్రమాణము చూచుటకు సుందరముగా నగపడినను అది బొత్తిగా నయుక్తమై యున్నది. ఏ గ్రంథములో నుల్లేఖము లేదో ఆ గ్రంథములో దాని యుల్లేఖముండుట యావశ్యకమై యుండెనని నిశ్చితము కానంతవఱకు నీ ప్రమాణమునకు నేమాత్రము విలువ లేకుండెను. బౌద్ధులయొక్క నికాయము లేక వినయ గ్రంథము ధార్మిక గ్రంథములై యుండెను. ఇవి యెంతమాత్రమును ఇతిహాసము యొక్క లేక భూగోళము యొక్క గ్రంథములు కావు; కనుకనే యీ గ్రంథములలో నుల్లేఖము లేకుండుట యే విధమైన సిద్ధాంతమును గాని బయలు దేఱఁదీయుటకై ప్రమాణమైన యాధారము కాఁజాలదు. దీనిఁబట్టి, దక్షిణము వైపుయొక్క జ్ఞానము ఆ సమయమున నుండెనో లేదో యిది యే విధముగను సిద్ధింపదు. కాని మనము ముందే, అలెగ్జాండ్రికంటె మునుపటి నుండియు భారతీయార్యులకు దక్షిణ దేశజ్ఞాన ముండెనని చూచియున్నాము; మఱియు దానియొక్క అస్తిత్వ పక్షమునకు సబల

ప్రమాణముకూడ హాజరై యుండెను. సికందరుతో పాటు వచ్చిన ఇరేటా స్థానీసు మొదలైన భూగోళ గ్రంథకారులు, భారతవర్షము యొక్క జ్ఞానము, పొడవు వెడల్పుల పరిమాణములతో సహితము అలెగ్జాండరునకు పంజాబులో ప్రాప్తమై యుండెనని వ్రాసియున్నారు. ఆ జ్ఞానమునే ఇరేటా స్థానీసు తన గ్రంథములో వ్రాసియున్నాడు, కన్యాకుమారి మొదలుకొని సింధునది యొక్క ముఖము వఱకు నాతఁడిచ్చియున్న పొడవు ఇప్పటి ప్రత్యక్ష స్థితిలోఁ దఱచుగా మిక్కిలి కలియుచున్నది. ఇది చూడఁగనే జనరల్ కనింగహామునకు మిక్కిలి యాశ్చర్యము కలిగెను. మఱియు నతఁడు, సికందరు సమయమునఁ గూడ భారతీయులకుఁదమ దేశముయొక్క యా కృతియొక్కయుఁ బొడవు వెడల్పుల యాపశ్యము సంపూర్ణజ్ఞానముండెనని వ్రాసియున్నాడు. తాత్పర్యమేమనఁగా క్రీ.పూ 800 తరువాత, అనఁగా పాణినికిఁ బిమ్మట కాని సికిందరకు మునుపు, దక్షిణమున నార్యుల వ్యాప్తియయ్యెను. మఱియు పాండ్యము మొదలైన యార్యరాజ్యములు గూడ అచ్చట స్థాపితము లయ్యెను. మహాభారతములో భీష్మపర్వమునఁ జేయఁబడియున్న వర్ణనమునందు భారత వర్షములోని కన్యాకుమారి వఱకుఁ గల రాజ్యము లీయఁబడి యున్నవి. భాగము భూగోళ వర్ణనముదియే యై యున్నది, ఈ భాగములో నే దేశముయొక్క నామమైనను రానున్న యెడల నావశ్యకముగానే, అదేశము మహాభారతకాలమున క్రీ. పూ, 250 దాదాపున అస్తిత్వములో లేకుండెనని యనుమానించుటకై యవకాశమున్నది. మహాభారత భీష్మపర్వములోని 9వ యధ్యాయమందు భరత ఖండ వర్ణనలో దేశమంతట నున్న నదులయొక్క పర్వతములయొక్క దేశములయొక్క సూచియీయఁబడి యున్నది.మనకిచ్చట నీ సూచియొక్క యుపయోగ మెక్కువగా నుండెను. కాని దౌర్భాగ్యము చేత ఆ సూచి వరుసగా దిక్కుల క్రమమున ఈయఁబడలేదు; కనుక ఆ దేశములు ఏవియో యెచటనున్నవో లేక ఉండెనో యిది నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁబడఁ జాలదు. అయినను మహాభారతమందు నితరమైన పెక్కు స్థలములలో భూగోళమునకు సంబంధించని యుల్లేఖము లున్నవి. వాని నన్నింటిని బేర్కొని యుపయోగించుట యసంభవమే యై యున్నది. కాని సాధ్యమైనంత మట్టుకుఁ బ్రయత్నించి విశేషించి

తీర్థయాత్రా వర్ణనము యొక్క సాహాయ్యముచేత మనము, దేశములయొక్క నదులయొక్క బర్వతములయొక్క స్థితి యెట్లుండెనో యిది నిశ్చయించి యున్నాము. మఱియు దాని ననుసరించి మహాభారత కాలికమైన భారత వర్షము యొక్క పటమునుగూడఁ దయారుజేసి యున్నాము. ఆ యన్నిటి వర్ణనము పిమ్మటఁ జేయఁబడును.

## సప్తకుల పర్వతములు లేక పర్వతముల శ్రేణులు

మహాభారత (భీష్మ, అ. 9) మందు హిమాలయము గాకుండ భారత వర్షములోని నిమలిఖితములైన యేడు ముఖ్య పర్వతములు చెప్పఁబడి యున్నవి.

> మహేంద్రో మలయః సహ్యః శుక్తిమాన్ ఋక్షవానపి ।
> వింధ్యశ్చపారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః ॥

ఇందుఁ జెప్పఁబడిన కులపర్వతముల శ్రేణులు ఇట్లున్నవి.— (1) మహేంద్రపర్వతము—ఇది తూర్పు వైపున నున్నది. దీనినుండి మహానది బయలుదేఱుచున్నది. దీనితోఁ గలిసికొని తూర్పువైపునఁ రేవు ఉన్నది. దానిపైఁ బరశురాముఁడు తపస్సు చేయుచున్నాఁడని చెప్పుచున్నారు. (2) మలయు పర్వతము—తూర్పు ఘాటును, పడమటి ఘాటును గలుపుచున్నది. ఈ కుల పర్వతమునందు నీలగిరి యనెడి పెద్ద శిఖరమున్నది. (3) సహ్య పర్వతము అనఁగా సహ్యాద్రి ప్రసిద్ధమైయె యున్నది. ఇది మహారాష్ట్రములోఁ గలదు. దీనియొక్క శ్రేణి త్ర్యంబకేశ్వరము నుండి క్రిందుగాఁ బశ్చిమ సముద్రపు టొడ్డుయొక్క సమానంతర రేఖయందు మలబారు వఱకుఁ బోయి యున్నది. (4) శక్తిపంతము—ఇది యే కుల పర్వతమో నిశ్చయించుట కఠినమై యున్నది. బహుశః కోట్టియావాడులోని పర్వత శ్రేణియై యుండును. అందు గిరనారు యొక్క పెద్ద శిఖరమున్నది. ఈ పర్వతము యొక్క యరణ్యములో నిప్పటివరకు సింహములు దొరకు చున్నవి. (5) దీని తరువాత పర్వత శ్రేణి ఋక్ష

వంతము బహుశః రాజపుతానాలోని యరాళీ పర్వతశ్రేణియై యుండును. దీని ముఖ్య శిఖరము ఆబూపర్వతమై యున్నది. దీనిని అర్బుద పర్వతమని కూడఁ జెప్పుచున్నారు. దీని యుల్లేఖము వన పర్వతములో 82వ అధ్యాయము నందు హిమాలయ పుత్రము అర్బుదమను పేర వచ్చియున్నది. (6) వింధ్య పర్వతము ప్రసిద్ధమైయే యున్నది. ఇది నర్మదకుత్తరమున బడౌదా ప్రాంతము నుండి పశ్చిమ పూర్వముగా వ్యాప్తమై యున్నది. ఉత్తరము వైపున గంగాతీరము వరకుఁ జిన్నదైన వింధ్యాద్రి శ్రేణి వెళ్ళి యున్నది. మిర్జాపురమునొద్ద వింధ్యవాసినీ దేవి యీ పర్వతము యొక్క యొక శిఖరముపై నున్నది. (7) పారియాత్ర పర్వతము ఏదియో యిది యిపుడు నిశ్చయింప వలయును. దీని విషయమై చాల మత భేదమగు పడుచున్నది. ఎన్నియో యర్వాచీన గ్రంథములలో వింధ్యము యొక్క పశ్చిమ భాగమును పారియాత్ర మనుచున్నారని వ్రాయఁబడి యున్నది. కాని యిట్లగునేని, వింధ్యము పారియాత్రమునను పేర్లివి రెండు వేర్వేఱు కుల పర్వతములై యెట్లు కాఁగలిగి యుండెను? మన మతమున పారియాత్ర పర్వతము సింధునదికి తరువాతి పర్వతము కావలయును. ఈ శ్రేణిఁ బ్రస్తుతమున సులేమాను పర్వతమని చెప్పుచున్నారు. యాత్ర యొక్క పరి సమాప్తి యిక్కడ జరగుచున్నది; ఈ యాలోచన చేత దానికిఁ బారియాత్రమని నామము వచ్చి యుండును. మహాభారత కాలమున ఈ పర్వతము వఱకు నార్యుల నివాసముండెను. మరలఁ గొన్ని శతాబ్దముల తరువాత అచట ముసల్మానుల ప్రాబల్యము సంభవించెను. కనుక అక్కడి వఱకు హిందువుల యాత్ర కాకపోయి యుండును. ఈ విషయమున పారియాత్ర పర్వతమేదియని మత భేదముత్పన్నమయ్యెను; మఱియు బహుశః దీనిబట్టి వింధ్య పర్వతమునే పశ్చిమ భాగమునఁ బారియాత్రమని చెప్ప మొదలిడి యుందురు. రామాయణములో కిష్కింధా కాండమందు నీయఁబడి యున్న భూవర్ణనమునఁ బారియాత్ర పర్వతము సింధునదికి ముందున్నదని చెప్పఁబడి యున్నది. ఏది యేమగుగాక, ఈ విధముగా నీ ముఖ్యములైన యేడు కుల పర్వతము లున్నవి. ఇవి గాక ఈ భూవర్ణనములో ఇంకను చాల శిఖరములు లేక పెద్దవి పర్వతములున్నవని చెప్పఁబడి

యున్నది. మహాభారతమున పేర్కొనఁబడిన యితర పర్వతములలో నొక రైవతక పర్వతమున్నది ఇది ద్వారక దగ్గఱఁ గలదు. ఇది శక్తి పర్వతము యొక్క శిఖరమై యుండును. ఇదిగాక నర్మదా తపతుల నడుమనున్న సత్పురా పర్వతము విషయమునఁ గూడ అచ్చటచ్చట నుల్లేకము కనఁబడుచున్నది. హిమాలయము యొక్క గంధమాదనకైలాస పర్వతములయు వర్ణనము మహాభారతమున నెక్కువగాఁ గలదు.

## భారతములోని లోకులు లేక రాజ్యములు

భీష్మపర్వములో, భారతవర్షమునందు మహాభారతకాలమున మూఁడు విధములైన లోకులుండిరని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. అనఁగా ఆర్యులు, మ్లేచ్ఛులు వారిద్దఱ మిశ్రమమునఁ బుట్టిన జాతులును నుండెడి వారని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. కాని పిమ్మట నీయఁబడి యున్న దేశ నామములో ఆర్యులెవరో, మ్లేచ్ఛులెవరో, మిశ్రలోకులెవరో యీ సంగతి ప్రత్యేకముగాఁ జెప్పలేదు. ఇదియొక గొప్ప న్యూనతమై యున్నది, ఆ సమయములో నీ విషయము పూర్తిగాఁ దెలిసి యుండె ననుట సంభవమై యున్నది. కనుక ఆ సమయమున దానియొక్క కొంత విశేష మహత్త్వము తెలియఁబడక యుండును. అవును, ఈ యుత్తరము వైపు మ్లేచ్ఛులు అవశ్యము వేఱుగాఁ జెప్పఁబడియున్నాఁడు. కాని వారుకూడ భారతవర్షమునకు వెలుపటివారై యున్నారు. ఇందుచేత భారతవర్షము లోపల మ్లేచ్ఛ దేశము లేవిగనో యుండెనో యిది నిశ్చయము చేయుట మనకు గఠినమైయున్నది. మరల నన్ని ప్రమాణముల వలన మనము ఈ విషయమును నిశ్చితము చేయుటకుఁ బ్రయత్నింతుము. మొత్తము 1?6 దేశములు భారత వర్షములోఁ జెప్పఁబడియున్నవి. దక్షిణ భారతమున 50 దేశములును నుత్తరము వైపున మ్లేచ్ఛ దేశములుగాక 26 దేశములు జెప్పఁబడి యున్నవి. వాని పేరులు చెప్పకముందు, ఈ దేశముల నామావళి లేక పూర్వ పశ్చిమ మొదలైన దిశల ననుక్రమమును బట్టికూడఁ జెప్పఁబడి లేదన్న సంగతి మన దృష్టిలోనికి రావలయును. ఇందుచేత, అనేక విషయములలో మనము, ఈ

దేశము లేవియో యీ లోకులెవరో నిశ్చయింపఁ జాలము. వాని సూచిని మనము ముందుగా నిచ్చుచున్నాము. వానిలో నెంత వఱకు మనకు నిశ్చయముగాఁ దెలిసెనో, యంతవఱకు మనము ఇచట నిర్దేశించు చున్నాము. ఈ సూచినిబట్టి, సాధారణముగా నార్యుల యధిక ప్రాబల్య ముండిన భరత ఖండము యొక్క సీమ దక్షిణమువైపునఁ జాలదూరము అనఁగా గోదావరి యావలవఱకు, వ్యాపించి యుండెనన్న సంగతి యొకటి చెప్పఁబడగలదు. అనఁగా వర్తమాన మహారాష్ట్ర దేశము ఆ సమయమున భరత ండఖ్ఖములోఁ గలిసినదై విశ్వసింపఁ బడుచుండెను. దక్షిణము వైపు వారియొక్క యీయఁబడియున్న సూచి విషయమున నొక గొప్ప సాధారణ పద్ధతిమీఁద వారియొక్క ముకమునుండి పడమటి వైపున బొంబాయివఱకు నొక లేక గీయఁబడునేని దానికిఁ క్రింద దక్షిణము వైపు దేశములు వచ్చుచున్నవను నొక గొప్ప మహత్త్వముగల విషయము ధ్యానములో నుంపఁదగి యున్నది, మన ప్రదేశముల సూచిని దిగ్విజయములో నుల్లిఖితమై యున్న దేశముల సూచితోడ సరి చూతము; మఱియు మహాభారత కాలమున అనఁగా చంద్రగుప్తుని కాలమునఁ బ్రసిద్ధమైన దేశములును లోకులును నేవియో నెవరో దీనిని విచారింతుము.

## తూర్పు వైపు దేశములు

ముందుగా మనము కురువులతోఁ బ్రారంభింతము. దీనిని ఈ సంచికలో కురు పాంచాలమని చెప్పియున్నాఁడు. కురు పాంచాలములకు రాజధాని హస్తినాపురమై యుండెను. అది గంగకుఁ బడమటి యొడ్డున నుండెను. వానికి తూర్పు వైపున పాంచాలుర రాజ్యముండెను. అది పర్వములో ద్రోణుఁడీ దేశములో సగముపాలును గెలిచి కౌరవుల రాజ్యములోఁ గలిపివైచి యుండెనని వర్ణన మున్నది. పాంచాలదేశము గంగకుత్తరము వైపున దక్షిణము వైపునను యమున వఱకు నుండెను. గంగయొక్క యుత్తరము వైపు భాగమును ద్రోణుఁడు గెలిచి కౌరవుల రాజ్యములోఁ గలిపెను; గంగయొక్క దక్షిణ భాగమును ద్రుపదునికై

యుంచెను. కలుపఁబడిన భాగమునకు రాజధాని యహిచ్ఛత్రపురమై యుండెను. ఈ అహిచ్ఛత్రపురము పూర్వకాలమునఁ బ్రసిద్ధమై యుండెను. మఱియు వర్తమానమున రామాపురము నొద్ద నుండెను. ప్రచలితములై యున్న పుక్కిటి పురాణముల బట్టి యిచ్చటి వేలకొలది బ్రాహ్మణులు దక్షిణము వైపునను, తూర్పు వైపునను బంగాళము, మైసూరు వఱకు వెళ్ళి యున్నారని తెలియుచున్నది. ద్రుపదునికి మిగిలియున్న రాజ్యములో గంగా తీరమున మాకాది, కాంపిల్యము ననెడి పట్టణములు రెండుండెను.

రాజాసి దక్షిణే తీరే భాగీరథ్యా హము త్తరే ।

ఇత్యాది ( ఆది. అ. 138 ) శ్లోకములను జూడుఁడు. దీనికి పిమ్మట తూర్పువైపున మఱియొక రాజ్యము కోసలముండెను. దీనికిఁ గూడ రెండు భాగములు ఉత్తర కోసలము, దక్షిణ కోసలమును నుండెను. ఉత్తర కోసలము గంగకు నుత్తరము వైపునను, దక్షిణకోసలము దక్షిణము వైపునను వింధ్య పర్వతము వఱకు నుండెను. అయోధ్య నశించిన తరువాత నుత్తర కోసలమునకు రాజధాని వింధ్య పర్వతమందలి కుశావతియై యుండెను. దీనికి తూర్పువైపున మిథిల రాజ్యముండెను. దానికిఁ బడమటి సరిహద్దు సదానీరా నదియై యుండెను. మిథిలదేశము గంగదాఁక లేకుండెను. గంగయొడ్డు మీఁద కాశీరాజ్యము కూడ నుండెను. కాశికి దక్షిణము వైపున మగధ రాజ్య ముండెను. ఈ రాజ్యము మిక్కిలి ఫలవంతమును నెక్కువ జనసంఖ్య కలదియునై యుండెను. ఈ మగధుల రాజధాని అప్పటి వఱకు పాటలీ పుత్రము గానుండెను. ఇకనేమంటే రాజ గృహము లేక గిరివ్రజమై యుండెను. దీనికి చుట్టుప్రక్కల నయిదు చిన్న గుట్టలు ( ఎత్తు భూములు ) గలవు. వానిపైనున్న పురాతన భవనముల వల్ల ఇప్పుడు కూడ దాని పరిచయము లభించుచున్నది. మహాభారతము యొక్క యాదిపర్వమున మగధుల రాజ్యమును వసువు యొక్క యేక పుత్రుఁడగు బృహదశ్వుఁడు స్థాపించి యుండెనని చెప్పఁబడి యున్నది. హస్తినా పురమునుండి యర్జునుఁడు, భీముఁడు, కృష్ణుఁడు జరాసంధుని

చంపుటకై రాజగృహము లేక గిరిప్రాంతము వైపు వెళ్ళినపుడు వారికి దాఁటవలసి వచ్చిన దేశములయొక్క, నదులయొక్క వర్ణన మహాభారతమున మిక్కిలి సూక్ష్మముగాఁ జేయఁబడి యున్నది. అది యిచ్చట నీయదగి యున్నది వారు కురుజాంగల దేశము మీదుగాగాక రమణీయమైన పద్మసరోవరమునకు వచ్చిరి. దీనికిఁ బిదప వారు కాలకూట పర్వతమును దాఁటిరి. మహాశోణనదమును నీరానదిని దాఁటి వారు సరయూనదికి వచ్చిరి. అచట నుండి వారు పూర్వ కోసలదేశమునఁ బ్రవేశించిరి. తరువాత వారు మిథిల మూలాదేశములకు వెళ్ళిరి; మఱియు చర్మణ్వతి గంగశోణ నదము దాఁటి వారు తూర్పు దిక్కునకేసి ప్రయాణము చేసిరి. అపుడు వారు మగధదేశమునకుఁ జేరిరి. దీని తరువాత వారికి గోరఖ పర్వతము లభించెను. అచట వెల్లవేళలయందును గోవులు మేయుచుండెడివి; మఱియు విపుల జల ప్రవాహములుండెను. ఆ పర్వతము పై నెక్కి వారు మగధ పురమగు గిరి వజ్రమును జూచిరి. (సభా. అ 118) గిరి వ్రజము యొక్క రాజధాని మారి పాటలీపుత్ర రాజధాని గంగ పై మహాభారతకాలమునకు ముందే యుండెను. కాని మహాభారతములో దాని వర్ణన బొత్తిగాలేదు. అవశ్యముగా నిది యాశ్చర్య విషయమై యున్నది, కాని యచట నా సమయమందు టొద్ద రాజులుండిరి. కాఁబట్టి ప్రాచీన రాజధానియొక్క యుల్లేఖము మహాభారతములో చేయఁబడి యుండెను.

ఇచట నార్యదేశముల సరిహద్దు సమాప్తమయ్యెను, దీనికి తూర్పు భాగము, అనఁగా ఇప్పటి బంగాళా ప్రాంతమందు, మిశ్రార్యులుండిరని స్పష్టముగాఁ దెలియుచుండెను. ఈ దేశములు అంగము, వంగము, కలింగము అనెడి పేరులతో బ్రసిద్ధములై యుండెను. ఈ దేశములకు బోవుదురేని బ్రాహ్మణులు పతితులగుదురని విశ్వసింపఁబడుచుండెను. ఆది పర్వములో 104 వ అధ్యాయమందు, దీర్ఘతముఁడనెడు ఋషికి అంగ ప్రవంగుఁడు, కలింగుఁడు, పుండ్రుఁడు, సుహ్మఁడు అను పేరిటి యైదుగురు పుత్రులు బలిరాజు స్త్రీల గర్భమునుండి పుట్టిరని వర్ణింపఁబడి యుండెను. ఈ వృత్తాంతముఁ బట్టియే యిచట ఆర్యులు మిశ్రార్యులని సిద్ధించుచుండెను, అంగవంగ కలింగములను ప్రస్తుతకాలమున చంపరాను

ముర్శిదాబాదు, కటకము అని చెప్పఁగలుగుచున్నాము. ప్రౌంఢ్ర సుహ్మ దేశములు రెండును మహాభారతములోని సూచిలో లభింపకుండెను. భరత ఖండములకు వెలువలివై యెంచఁబడి యుండును. ఇవిగాక తూర్పువైపువి యింకను దేశములు చెప్పబడియుండెను. అవి తామలిప్తకము మఱియు ఓఢ్రములై యుండెను. తామ్రలిప్తినగరము కలకత్తా దగ్గఱ నుండెను. అది తామలకమను పేరుతో గ్రీకులకుఁ దెలిసి యుండెను. ఓఢ్రమిప్పటి ఒరిస్సా యైయుండెను. ఉత్కలులుకూడ ఉడిసా యొద్దనే నివసించుచుండిరి. మఱియు నిప్పుడుకూడఁ బంచగౌడ బ్రాహ్మణులలో నుత్కల బ్రాహ్మణుల జాతి యొకటి యుండెను. దీనిఁబట్టి యుత్కలుల యునికి బంగాళము వైపున నిప్పటికిని గనఁబడుచుండెను. ప్రాగ్జ్యోతిషులకు రాజైన భగవదత్తుఁడు భారతీయ యుద్ధములో నుండెను. ప్రాగ్జ్యోతిష దేశము ఇప్పటి అస్సాము అయి యుండెను. భరతఖండము యొక్క సూచిలో దీనిపేరు కూడ లేకుండుట యాశ్చర్య విషయమైయుండెడు. ఒకప్పుడు సుహ్మదేశము వలెనే యిదికూడ మహాభారతకాలమున భరతఖండము నేడు వెలుపటిదిగా నూహింపఁబడియుండును. ఇదియే మణిపురము యొక్క లేక మణిమంతమనెడి దేశముయొక్క స్థితియై యుండెను. అర్జునుఁడు ఈ దేశమందు తన మునుపటి నివాససమయమున వెళ్ళియుండెను. అచట నతనికిఁ జిత్రాంగదయనెడి స్త్రీ లభించెను మఱియు బభ్రువాహనుడనెడు కొడుకు కలిగెను. ఆ మణిపుర రాజ్యముయొక్క పేరు ఇందు లేకుండెను. అది బహుశః మ్లేచ్ఛ దేశమై యుండును. ఇచట,అంగవంగముల ముందరకు నర్జునుఁడు వెళ్ళ మొదిలిడినపుడు అతనితో నున్న బ్రాహ్మణులు తిరిగివచ్చిరని స్పష్టమైన వర్ణనముండెను.

ఇపుడు మనము తూర్పుదిక్కు వైపున భరతుని దిగ్విజయములో నేదేశములు చెప్పఁబడి యుండివో యిది జూడవలయును. సభాపర్వములో పుమాలము, కోసలము,అయోధ్య, గోపాలకక్షము, మల్లము, సుపార్శ్వము, మలంగము, అనఘము, అభయము, వత్సము, మణిమంతము, శర్మకము విదెహము, మిథిల, శకబర్బరము, సుహ్మము, మగధము, దండధారము,

అంగము, పుండ్రము, వంగము, తామ్రలిప్తము, లౌహిత్యము మొదలైన దేశముల నతఁడు గెలిచెననిచెప్పఁబడియున్నది. వీనిలోఁగొన్ని దేశముల యుల్లేఖము పైనిజేయఁ బడియేయున్నది. కాని కొన్నింటి పేరులు మహాభారతములోని సూచిలోలేవు.

## దక్షిణము వైపు దేశములు

ఇపుడు మనము దక్షిణమువైపునకు వచ్చుచున్నాము. కురుక్షేత్రము నుండి దక్షిణముగా వెళ్లినమీఁదట మున్ముందు మనకు శూరసేన దేశముతగులుచున్నది. దీనికి రాజధానియైన మధుర యమునాతీరమున బ్రసిద్ధమైయున్నది. దానికి పడమటి వైపున మత్స్య దేశముండెను. మత్స్యదేశము జయపురమునకు లేక అలవరమునకు నుత్తరము వైపున నుండెను. దానికిరాజధాని యేదియైయుండెనో, అది చెప్పఁబడఁజాలదు. విరాటపర్వములో, పాండవులజ్ఞాతవాసమునకై బయలుదేరినప్పుడు వారు గంగాయొడ్డుమీఁదుగా నైరుతీ దిశకుఁ బోయిరని వర్ణనమున్నది. లోకులను మోసపుచ్చుటకై కావలయునని తెలియు చున్నది. వారు ముందుగా యమునయొక్క దక్షిణతీరమందలి పర్వతములను దాఁటి పాంచాల దేశమునకు దక్షిణమువైపునుండియు దశార్ణదేశమునకు నుత్తరము వైపునుండియు, యకృల్లోమము గుండ శూరసేనముగుండ మృగములను వేఁటాడుచు, మేము వ్యాధులమని చెప్పుకొనుచు విరాటదేశమునకు వెళ్ళిరి. దీనిఁబట్టి దశార్ణదేశము యకృల్లోమ దేశము నిచ్చటనెచ్చటనో దగ్గఱనే యుండియుండునని తెలియుచున్నది. దీనికిఁబిమ్మట కుంతి

---

*వనపర్వములో ౩౦౮ వ యధ్యాయమునందుఁ గర్ణునిజన్మకథయున్నది. అందులో కర్ణునిఁబెట్టెలోనుంచుకొని యా పెట్టెను అశ్వానదిలోఁబడవైచెనని వర్ణదమున్నది. అదిమరల నచ్చటనుండి చర్మణ్వతీనదికిఁ బోయెను. అచ్చటనుండి గంగకుఁబోయి గంగనుండి చంపాదేశము ( అంగము ) లో అధిరథునకు దొరకెను. ఈ వర్ణనముఁబట్టి కుంతిభోజదేశము చంబలనది తోఁ గూరిని దక్షిణము వైపున కుండెనని తెలియుచున్నది. గ్వాలియరు ఇష్టేటుయొక్క కోత్వాలు స్థానమును లోకులు కుంతిభోజపురమని విశ్వసించుచున్నారు. ఇది పైవర్ణనముఁబట్టి సత్యముగాఁదోచుచున్నది.

భోజుల దేశము చర్మణ్వతీ నదిపైనుండెను. ఇది యిప్పటి గ్వాలియరు ప్రాంతముననున్నది. దీనితరువాత నిషధ దేశమునకు వచ్చుచున్నది. ఈ నిషధ దేశము నలమహారాజుదియైయున్నది. ఈ దేశము సేంధియా సర్కారువారి యధికారములోనున్న యిప్పటి నరవర పీర ప్రాంతముననున్న దని విశ్వాసింపఁబడుచున్నది. నలదమయంతుల ఆఖ్యాన మందుఁగూడ, నిషధమునుండి వనములోనికిఁబోయిన మీదట, నలుడు దమయంతితో, నీవు నీతండ్రియింటికి విదర్భకుఁ బొమ్మని చెప్పుచుఁ జూపిన మార్గము కూడ నీదేశము యుపయుక్తముగానున్నది. నిషధమునుండి దక్షిణముపైపు గాఁజూపినమార్గము అవంతినిఋక్షవత్ పర్వతమునుదాఁటి వింధ్యమహాశైలము వైపునకును త్రివేణి నదివైపునకును జూపియున్నాఁడు. ఋక్షవాతము రాజపుతానాలోనున్నది, కాని నిషధ దేశమునకు దక్షిణమునకు దక్షిణము వైపున దానియనేక శాఖలదాఁటిన కుంతీ దేశము అగుచున్నది. అవంతీ దేశమిప్పటి మాలవయైయున్నది. అవంతి దేశమును దాటిన తరు వాత వింధ్యపర్వతమున్నది; మరియు వింధ్యమునకు ముందు నర్మదా నదియున్నది. కాని యిందు నర్మదానదియొక్క పేరు చేప్పఁబడలేదు; పయోష్ణి పేరు

చెప్పి యున్నాఁడు; అది బహుశః విదర్భ దగ్గఱ నదియగుట చేత చెప్పి యుండును. అవసరమైతే మాల్వాయు నుజ్జయిని యునై యున్నది. ఇందులో నే మాత్రమును సందేహము లేదు. కాని విదర్భదేశము ఏదియో ఈ విషయమై శంక లేక మత భేదమున్నది. వర్తమానమగు బరారే విదర్భదేశమని కొందఱు విశ్వసించు చున్నారు. ఈ విదర్భము యొక్క రాజధాని భోజకటమని చెప్పఁబడి యున్నది. మఱియు దీని యందలి నది పయోష్ణియని విశ్వసింపఁ బడియున్నది. భోజకటము, పయోష్ణి విదర్భము మూడును వింధ్యమునకుఁ బశ్చిమమున నర్మదానదికి యుత్తరము నను విశ్వసింపఁ బడుచున్నవి. ఆ దేశములయు, నదులయు నామములు రెండు రెండుమాఱులును, మూఁడు మూఁడు మాఱులును గూడ వచ్చియున్న వనియు జ్ఞప్తిలో నుంచుకొన వలయును. దీనిఁబట్టి ఆర్యులు వెళ్ళిన

చోటులకునెల్లఁ దమము మునుపున్న కొన్ని కొన్ని పేరులను తమతోఁగూడ తీసికొని పోయిరని యనుమానము బయలుదేఱు చున్నది, విదర్భమునకు దమయంతితో సంబంధమున్నట్లే రుక్మిణితోఁ గూడ నున్నది. హరి వంశములో శ్రీకృష్ణుఁడు రుక్మిణిని హరించుటకై పోవు చుండినపుడు నర్మదా నది మీఁదనే రుక్మిణితోఁ గలిసికొని యుండెనని వర్ణన మున్నది. ఇప్పటి బరారు విదర్భమని విశ్వసింపఁ బడునేని శ్రీకృష్ణుఁడు నర్మదానదిని దాఁటి పోవలసి యుండు ననుట స్పష్టమై యున్నది. కాని యట్లు చేసినట్లుగా వర్ణనము ఏమున్నది? ఏదియైన నగుఁగాక, ఈ విషయము సంశయమమై యున్నది, ఎందుచేత రుక్మిణి విషయమున రెండుచోటుల నిప్పటి సఱకు పుక్కిటి కథలు ప్రచలితమై యున్నవి. బరారు ప్రాంత మందలి యమరావతీ నగరమందు శ్రీకృష్ణుఁడు రుక్మిణిని నే దేవి దర్శనమునకు వచ్చినపుడు హరించి యుండెనో, యా దేవియొక్క గలది చూడఁబడు చున్నది. ఇదే విధముగా నవంతికిఁ బడమటి వైపున వింధ్య పర్వతముతోఁ గలిసియున్న అంబఝరీ యనెడు నొక ప్రాంతమున్నది, అచ్చటఁ గూడ దేవియొక్క యొక గుడి యున్నది. శ్రీకృష్ణుఁ డిచ్చట నుండియే రుక్మిణిని హరించెనని ప్రసిద్ధి కలదు. ఇది గాకుండ మూఁడవది కూడా మరియొక విదర్భము గోదావరి దక్షిణము వైపున నొక సమయమునఁ బ్రసిద్ధమై యుండును. ముసల్మానుల కాలమున ఈ విదర్భమై యుండెను. వరిస్తాను తన యితిహాసములో భేదరమను పేరు ఆ శబ్దమునుండియే బయలు దేఱెనని వ్రాసి యున్నాఁడు. ఇదిగాక నలదమయంతులయు, రుక్మిణియొక్కయు కథను గూడ అచ్చటనే యుల్లేఖించి యున్నాఁడు. శంకర దిగ్విజ మందుఁగూడ సాయణాచార్యుఁడు ఈ విదర్భయొక్క యుల్లేకమునే యిక్కడ నున్నదానిగాఁ జేసియున్నాఁడు. మహాభారతములోని యస్పష్టములైన వనములను విచారింపఁగా మన మతమున, మహాభారత కాలమున బరారు విదర్భమని తప్పక ప్రసిద్ధికెక్కి యుండుననియే తోచుచున్నది. ఈ విదర్భము నొద్ద తూర్పువైపున ప్రాక్కోసల మనెడు దేశము మహాభారత మందును, హరివంశమందును జెప్పఁబడి యున్నది. విదర్భదేశము సాధారణముగా దాక్షిణాత్య దేశములలో లెక్కపెట్టఁ బడుచుండెను. ఈ సంగతి మహాభారతములో రుక్మిణి తన సీమను తీసికొని పాండవుల పక్షములోఁ జేరుటకు వెళ్ళినపుడు

చెప్పఁబడియున్నది. ఉద్యోగ పర్వములోని 158వ యధ్యాయము యొక్క ప్రారంభముననే భోజవంశోద్భవుఁడైన దక్షిణ దేశాధిపతి యగు భీష్మకుని ప్రసిద్ధ పుత్రుఁడు రుక్మి పాండవులపై పుఁకు వచ్చెనని చెప్పియున్నాఁడు. దీనిఁబట్టి ఈ విదర్భదేశము దక్షిణదేశములలో నుండెననియే సిద్ధించుచున్నది. ఈ దేశముయొక్క రాజధాని కుండిన నగరమై యుండెను; మఱియు భోజకటకుని పేరుగల మఱియొక నగరమున రుక్మి నివసించి యుండెను.

విదర్భమును విచారించిన తరువాత సహజముగనే మన యెదుర మహారాష్ట్రము యొక్క విచార ముత్పన్న మగుచున్నది. కాని మహా రాష్ట్రము యొక్క పేరు సంపూర్ణము మహాభారత మందెచ్చటను లేదు. దీనిఁబట్టి మహారాష్ట్రము యొక్క యుత్పత్తి యా సమయమందు కొంచెమైన లేదని విశ్వసింపఁ బడఁజాలదు. విదర్భములో బాగా బరారులో భోజుల నివాసము లేకుండెనన్నచో మహారాష్ట్రములో యాదవుల నివాసము ఆ సమయమునసై యుండెనని విశ్వసించుటలోఁ గూడ నాటంకమేమియును లేదు. కాని ఆ సమయమున మహారాష్ట్రమునకు ముఖ్య స్వరూపము ప్రాప్తము గాకుండెను. దానిలోని చిన్న చిన్న భాగములా సమయమున నుండెను. ఈ భాగముల పేరులు మహాభారతమున దేశ సూచిలో వచ్చి యున్నవి. ఆ పేరులు రూపవాహితము, అశ్మకనుల పాండు రాష్ట్రము, గోవరాష్ట్రము, మల్లరాష్ట్రమునై యున్నవని చెప్పుటలో మనకు బొత్తిగా సందేహము లేదు. విదర్భము తరువాతనే యీ సూచిలో వీని పేరులు వచ్చి యున్నవి పాండురాష్ట్రము, గోవరాష్ట్రము, మల్లరాష్ట్రము వీనికి రాష్ట్ర శబ్దము మహత్త్వపూర్ణమై యున్నది. ఇదే రాష్ట్రక నామముతోడ ఆ సమయమునను తరువాతను గూడఁ బ్రసిద్ధిని పొందెను. కాలక్రమమున ఈ మూఁడు రాష్ట్రములును కలిసిపోవుట చేత మహారాష్ట్రమై యున్నది. భోజములు మహాభోజమైనట్లే రాష్ట్రములు మహా రాష్ట్రకము లయ్యెను. ఇతర ప్రమాణము బట్టి యాదేశముల స్థానము కూడ ఈ మహారాష్ట్రముననే యుండెనని తెలియుచున్నది. అనేకములైన పూర్వపు లేకములఁ బట్టి అశ్మకాదేశము దేవగిరి యొక్క చుట్టుప్రక్కల ప్రదేశముతోడనే కలిసిపోయి యుండెనని సిద్ధించుచున్నది. హరివంశము యొక్క పూర్వార్ధమందు రుక్మి బలరామునితో ద్యూతమాడినపుడు దాక్షిణాత్య రాజులు తమలోఁ దాము బలరాముని

గెలుచుటకు సంకేతము చేసికొనిరి. ఆ రోజులలో ముఖ్యుఁడు అశ్మకాధిపతియై యుండెనని వ్రాసియున్నాఁడు. అనఁగా దక్షిణమున ఆర్యరాజ్యములలో అశ్మకాదేశము ముఖ్యమై యుండెను. బౌద్ధ గ్రంథములలో గూడ అస్సవ రూపముతో దక్షిణమున నున్న యీ యశ్మజుల యుల్లేఖము చేయఁబడి యున్నది. మహారాష్ట్రిలలో అశ్మకులు ముఖ్యులై యుండిరని తాత్పర్యము. చాల బట్టియు, లేఖములఁ బట్టియు, గోవ రాప్రమఁనెడు దేశము నాపికకు చుట్టుప్రక్కల ప్రదేశమై యున్నదని మైయున్నది. పాండురాష్ట్రముకూడ దాని దగ్గఱది కావలయును, మల్ల రాష్ట్రము కూడ మహారాష్ట్రములో నొక భాగమై యుండును. ఈ నలుగురైదుగురు లోకులును గలిసి యవి మహారాష్ట్ర నామముతోఁ బ్రసిద్ధములైనవి. మఱియు వాని భాష మహారాష్ట్రియ నామముతోఁ బ్రసిద్ధమయ్యెను. ఈ సంగతి మహాభారతకాలమునకుఁ బిదపఁ క్రీస్తు శకమునకు మునుపే యై యుండును. ఈ సూచియందు మహారాష్ట్రము పేరు లేదు. ఇందుచేత మహారాష్ట్రియ పేరు ప్రాకృతభాష యంతకుఋార్వము లేక యీ సమయమున నుత్పన్నముగాక యుండునని కూడ నమ్మఁబడఁజాలదు. ఎందుచేత? రాష్ట్రముయొక్క పేరు లోకుల విషయమై యీ సమయముననే ప్రసిద్ధమై యుండెనని స్పష్టమైయున్నది.

ఇపుడు మరాటీ వారి విషయమును గుజరాతీ దేశము విషయమునను విచారింపఁబడును. వీనిపేరు బొత్తిగా సూచిలో లేకున్నది.దీనిఁబట్టి గూర్జరులు గుజరాతికి మహాభారతకాలము వఱకు రాలేదనియే విశ్వసింపవలసి యున్నది. వర్తమానమగు. గుజరాతీ ప్రాంతములోని యే దేశము లీసూచిలోఁ గనఁ బడుచున్నవో, యవి కేవలము ఆనర్తమును సురాష్ట్రమునై యున్నవి. సురాష్ట్రనామముకూడ నీ సూచిలో లేకుండుట మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. దీనిఁబట్టి సురాష్ట్రనామము మహాభారత కాలమునకుఁ బిదప నుత్పన్నమయ్యెనని యూహింపఁబడజాలదు. ఎందుచేత? సురాష్ట్రనామము మహాభారతమందు అనేకమైన యితర స్థలములయందుఁ గనఁబడుచున్నది. వన పర్వములో ధౌమ్యుడు చెప్పిన తీర్థయాత్రలందుఁ బ్రభాస తీర్థము సురాష్ట్ర దేశమందే సము

ద్రిపుటొడ్డు మీఁదఁ జెప్పియున్నాఁడు. దీనిఁబట్టి సురాష్ట్రము కాఠియా వారు అయియున్నదని తెలియుచున్నది. ఇపు డానర్తదేశమేదో ఈ విషయమై కొంచెము మతభేదముండును. కాని అనర్తము ఇప్పటి గుజ రాతు దేశమై యున్నది; ఎందుచేత? ధౌమ్యుఁడు చెప్పిన యీ తీర్థ యాత్ర వర్ణనమందే, పడమటివైపున నున్న యీ నర్తదేశమునఁ బశ్చిమ వాహినియగు నర్మదానది చెప్పఁబడి యున్నది. కనుకనే యిప్పటి గుజ రాతుయొక్క ముఖ్యదేశము అనర్తవను సురాష్ట్రమును ఆ సమయమున బ్రసిద్ధ దేశములై యున్నవి. వీనియందు ఆర్యుల నివాసము చాల బ్రాచీన కాలమున నై యుండెను. ఇటువంటి ఫలవంతమైన దేశమున చాలకాలమువఱకు ఆర్యులు నివసింపకుండుట కూడ నుండుట సంభవముకాదు అనఁగా, ఇచ్చటి యార్యుల నివాసము మిక్కిలి పురాతనమై యున్నది ఈ దేశమునకు అర్వాచీన కాలమందుఁ దమ నామము నిచ్చిన గూర్జ రులు తప్పకుండనే ఆ సమయమువఱకు ఈ దేశమునకు రాలేదని, ఇట్టి యనుమానము బయలుదేఱుట కవకాశమున్నది. గూర్జరులు తరువాత నెప్పుడు వచ్చిరను ప్రశ్నమునకు నీ గ్రంథముతో సంబంధమేమియును లేదు. మఱియు నార్యులై యుండిరో లేక యార్యేతరులై యుండిరి. కనుకనే మన మిశ్రము నిచటనే విడిచిపెట్టు చున్నాము. అవును, ఆర్యు లనియు క్రీ. 400 పూర్వము ఈ ప్రాంతమునకు వచ్చిరనియు నింత మాత్రము అవశ్యముగా మనమత భేదమునిచ్చట వ్రాయుచున్నాము.

సముద్రపు యొక్క యొడ్డునను నుత్తరమునుండి నర్మదవఱకు ఆర్యుల నివాసముండెను. ఇంతియేకాదు. ఇక నేమంటేని మహాభారత కాలమున నర్మదకు దక్షిణము వైపున వర్తమానమగు ధానా ప్రాంతము వఱకుఁగూడ నివాసమై యుండెను, ఈ పైపున నున్న రెండు దేశ ములు మహాభారతము ఉత్తరదేశ గణనలో బరిగణితములై చేయఁబడి యున్నవి. ఆ రెండు దెశములను పరాంతము అరాకతములై యున్నవి అపరాంతము యొక్క నామము మహాభారతము తరువాత యాపశ్యక గ్రంథ ములలో వచ్చుచున్నది. ఈ యనేక గ్రంథములఁబట్టి అపరాంతము

ఇప్పటి యుత్తర కొంకణమని తెలియుచున్నది. అపరాంతము యొక్క ముఖ్య పట్టనము ప్రాచీనకాలమున శూర్పారమై యుండెను. దాని నిప్పుడు సోపారాయని చెప్పుచున్నారు. శూర్పారవము యొక్క నామము ప్రాచీన బౌద్ధ గ్రంథములలోఁ గూడఁ బ్రసిద్ధమై యున్నది. పాండవుల తీర్థయాత్రా వర్ణనములో శూర్పారము యొక్క పేరు వచ్చియున్నది. వారిచటికి యాత్ర చేసిరని వ్రాసియున్నాఁడు; మఱియు లోపల సహ్యాద్రిపైపునకు వెళ్ళి పరశురాముని వేదిని దర్శించిరి. పరశురాముని నివాస స్థానము తూర్పు పైపున మహేంద్ర పర్వతముపై నుండెను; మఱియు అచట వైతరిణీనది భూమియొక్క వేదియునుండెను. కాని పై వర్ణనముఁబట్టి పరశురామునికి మఱియొక చోటు పడమటి యొడ్డుమీఁద మహాభారతకాలమునకు ముందియ్యఁబడి యుండెనని తెలియుచున్నది. ఇపుడు కూడనిచ్చట, అనఁగా సోపావాకుఁ దూర్పువైపునఁ బర్వతమందు, వైతరణీ నదియుఁ బరశురాముని వేదికయు వజ్రేశ్వరి దగ్గఱ లోకులుచూపుచున్నారు. తాత్పర్య మేమనఁగా శూర్పారక క్షేత్రము మిగులఁ బురాతన మైయున్నది; అది అపరాంతమున ముఖ్యమై యుండెను. అపరాంతము పేరు మహాభారతములో నితరత్ర రెండు చోటుల వచ్చియున్నది. అపరాంతమనఁగాఁ దాత్పర్యము ధానాజిల్లామై యున్నదనుటలో సందేహమేమియునులేదు. ఈ దృష్టిచేత, పరాంతమును నేఁటి సూరతుజిల్లాగా విశ్వసింపవలయును. అవరాంతము వఱకు మహాభారతకాలమున నార్యుల నివాసమై యుండెను. ద్రోణపర్వములో నొకచోట, అపరాంతమునఁబుట్టి అచ్చటి హస్తి శిక్షకులు శిక్షనేర్పిన యొక యేనుఁగుయొక్క వర్ణనము చేయఁబడియున్నది. దీనిఁబట్టి ధానాజిల్లాలోని యడవిలో నాకాలమునఁ జాలయేనుఁగులుండెనని తెలియుచున్నది; అవి యుద్ధకృత్యమునఁ జాలఁ బ్రసిద్ధములై యుండెసు. కానడా జిల్లాయందును మైసూరు లడవియందును నిపుడు కూడ నేనుఁగులు లభించుచున్నవి. మహాభారతములో నపరాంతమై యున్న రెండవ యుల్లేఖము శాంతపర్వ

ములో 39 వ యధ్యాయమందుఁ బరశురామ చరిత్ర సందర్భమున వచ్చి యున్నది. పరశురాముఁడు పృథ్విసంతను గశ్యపుని కిచ్చినపుడు వానిని బృధ్వి యావలకుఁ బొమ్మనెను. ఆ సమయమున సముద్రము వానికై శూర్పారక దేశము నుత్పాదించెను.

తాతః శూర్పారకం దేశం సాగర స్తస్య నిర్మమే ।
సహసా జామదగ్న్యస్య సోపరాంతో మహీతలం ॥

ఇందు శూర్పారక దేశమే అపరాంత మహితలమని స్పష్టముగాఁజెప్పి యున్నాఁడు. దీనిఁబట్టి అపరాంత దేశమునకే శూర్పారకము రాజధాని యని తెలియుచున్నది. మఱియు అపరాంతదేశము నేఁటి థానాజిల్లా ప్రదేశమై యున్నది. ఈ విషయమున బొత్తిగా సందెహముండదు,

ఇచట, పరశురాముని క్షేత్రము మఱియుఁ బరశురామునికి సముద్ర మిచ్చిన ప్రదేశము ప్రస్తుత కాలమువ శూర్పారపమని యెంచఁబడదు, ఇంకనేమంటేని దక్షిణము వైపునఁ గోంకణమందు చిప్లూనులోను చిప్లూను చుట్టు, నున్నదిగా నెంచఁబడుచున్నదని యొక మహావిషయము చెప్పఁ దగియున్నది; మఱియుఁ బరశురాముని క్షేత్రము మందిరముకూడ నిపుడు చిప్లూనులోనే యున్నది. ఇందుచేత దక్షిణ కోంకణమే పరశురాను క్షేత్ర మని యెంచఁబడు చున్నది. కాని మహాభారతమందు శూర్పారక భూమిని బరశురామ క్షేత్రమని యెంచి యున్నాఁడు. ఇదిగాక యపరాంత దేశము యొక్క గణన భరతఖండ దేశములలోఁజేయఁబడి యున్నది.మఱియు గోంక ణముయొక్క పేరు దక్షిణ దేశముల సూచికయందు నీయఁబడి యున్నది. దీనిఁ బట్టి, మహాభారత కాలమున నార్యుల నివాసము కోంకణమందు లేకుండెనని. యనుమానము బయలుదేఱుచున్నది. ఉత్తరము వైపు నుండి, ఎపుడు శూర్పారక దేశమునుండి దక్షిణము వైపుగాఁ గోంకణము

ములో నార్యుల నివాసమయ్యెనో, అపుడు ఆర్యులు పరశురాముని స్థాన మును శూర్పరకమునుండి తొలఁగించి దక్షిణ కోంకణమునందుఁ జేసిరి. ఇందుచేతనే, యిపుడు శూర్పారకములోఁ బరశురాముని క్షేత్రములేదు. నేఁటి సోపారా యొక క్షేత్రమైయున్నది, ఇది వసయీ దగ్గఱ గలదు' అనఁగా, క్రీ. పూ. 300 వర్షముల పిమ్మట బ్రాహ్మణుల నివాసము వసయీ నుండి చిపూనుపైపు పోయెను. పెరిప్లస్సు గ్రంథములో సం॥ 150 దాదాపున థానా దగ్గఱి ప్రదెశము ఆర్యదేశమని చెప్పనారంభించిరని వ్రాసియున్నాఁడు. ఇటమీఁద మువల్మానులయొక్క పోర్చుగీసుల యొక్క కష్టకారణమున, ఈ దేశములో బ్రాహ్మణులు నివసించువారై బొత్తిగాఁ గాకుండిరనుట వింతమైయున్నది. క్రమముగా దరువాత మరా టుల శాసనకాలమందు వారు మరల దక్షిణ కోణమునుండి యుత్తర కోణమునకు వచ్చిరి. చరిత్రములో నీ పరివర్తనము జప్తియుండఁ దగియున్నది. అగుఁగాక; దక్షిణపువైపుఁ జెప్పఁబడియున్న దేశము లలో కోంకణము మాలవదేశములు మనకుఁ బరిచితములై యున్నవి. ఘాటమాథాలోని మాలవులు బహుశః మాలవులై యుందురు. వీరుకూడ నిప్పటి యార్యులై యున్నారు. మాలవశబ్దము ఘాలుమాథా ప్రదెశము నకుపయుక్తమగుచున్నది. ఇట్టివి మూఁడు ప్రదేశములు భారతవర్షమం దున్నవి. సహ్యాద్రియందలి ఘాటామాథాయందు, వింధ్యాద్రి యందలి ఘాటామాథాయందు, పంజాబు పగ్గఱి భావాలపూరు ఇష్టేటులోని పర్వత ములయందలి ఘాటామాథాయందును–ఈ మూఁడు చోట్లను మాలవుల పేరు కనఁబడుచున్నది. దక్షిణమందలి మాలవులు మామాలుతే యైయుం దురు. ఉత్తరము వైపునను పంజాబునను గల మాలవులు క్షుద్రక నామమునతో మహాభారతమందు ననేక స్థలములఁ వచ్చియున్నారు. మఱియు దీనిని గ్రీకు చరిత్రకారులు మల్లయ అక్సిద్రె, అని చెప్పు చున్నారు.

దక్షిణము వైపున నింకను బ్రసిద్ధులు చోలులు, ద్రవిడులు, పాండ్యులు, కేరలులు మాహిషికులు నై యున్నారు. వీరి నామములు

క్రిమముగాఁ బూర్వ పశ్చిమ తీరముల ననుసరించి, పైని చెప్పఁబటి నట్లుగా, ఇపుడును బ్రసిద్ధమై యున్నవి. చోలమనఁగాఁ దాత్పర్యము మదరాసు అయియున్నది. చోలమండలము ఇప్పటి కారోమండలమై యున్నది. దానికి దక్షిణముపైపు తాంజావూరే ద్రివిడమైయున్నది. పాండ్యము ఇప్పటి తిర్నల్‌లేక యైయున్నది. కేరళము తిరువన్కూరు అయియున్నది. మాహిషము మైసూరై యున్నది. ఇంత మాత్రమున నామనము నిశ్చయపూర్వకముగా స్థిరపఱుపఁ గలుగు చున్నారము. వన వాసి యనుపేరు కూడ నిప్పటివఱకుఁ బ్రసిద్ధమై యున్నది. ఈ దేశము మైసూరున కుత్తరముపైపునఁ గలదు. వనవాసి బ్రాహ్మణులు నేఁటివఱకు బ్రసిద్ధమైయున్నారు. కాహ్లాడము దగ్గఱది కుంతల దేశము కావచ్చును. ఇవిగాక, మహాభారతములోని దక్షిణముపైపుఁ దెశముల సూచిలోని యితర దెశములను మనము, నిశ్చయపూర్వకముగాఁజెప్పఁజాలము. ఈ దెశములో మహాభారతకాలమున నార్యుల నివాసమై యుండెనని నిశ్చయపూర్వక ముగాఁ జెప్పఁబడఁగలదు. కాని యది బహుశఃఈ దెశములో ద్రావిడభాష బంద్రైపోవునంతటి పెద్దదికాక యుండును; మఱియుఁ దృష్టనుత్తరముపైపు ప్రిదేశమునవలె నచ్చటఁ గూడ నార్యభాషల ప్రిచారము అగుచుండెను. మహాభారతకాలమున నిచ్చట ద్రావిడ భాష ప్రిచలితమై యుండుటయే కారణమై యున్నది. మరియు నిండుతైయీ ప్రాంతము సూచిలోని లెక్కనుండి మహాభారతమందు వేఱుగా లెక్కింపఁబడి యున్నది.

ఇపుడు మనము సహదెవుఁడు దిగ్విజయములలో జయించిన దక్షిణ దేశములను విచారింతము. ఇందనేక దెశములున్నవి. అవి భీష్మపర్వములో దెశసూచియందు లేకున్నవి. నర్మద కుత్తరము పైపున సేకము అసరసేనము ననెడి రెండు దేశములు చెప్పఁబడియున్నవి, వీనికిఁ బిమ్మట జెప్పి భోజ కమును గోసల దేశమును జెప్పియున్నాఁడు. కిష్కిందలో మైందుఁడు

ద్వివిదుఁడు ననెడి వానరులతో యుద్ధమైనట్లు వర్ణనమున్నది. దీని తరువాత మాహిష్మతీ నగరము చెప్పఁబడియున్నది. ఇది నర్మదాపై నుండియుండును. అనఁగా సహదేవుఁడు మరల అటకుదిరిగి వచ్చును. మఱియు మునుపు చెప్పఁబడిన లోకులుగాక వారు కోంకణములో శూర్పారకము, తాలాకటము దండకము, కరహాటకము, ఆంధ్రము, యవనపుపురముఁకూడ జయించిరని వ్రాసియున్నాఁడు. ఇక్కడ యవనపురము పేరెట్లు వచ్చెనో, దీనిని మనము విచారింపవలయును. ఇతిహాసములో, అలెగ్జాండరు దండయాత్ర తరువాత యవనులు పశ్చిమ సముద్రముపై రెండు మూఁడు చోట్లఁ బట్టనములను స్థాపించిరని. ప్రమాణము లభించుచున్నది. "గస్టవఆపర్టు" దక్షిణమంవలి ప్రాచీనవ్యాపారము, విషయమున (సం18 78 మద్రాసు జర్నలులో, ఒక లేఖమును వ్రాసియుండెను. అందు వ్రాసినదేమనఁగా అలెగ్జాండరు తరువాత కరాచి యొద్ద, గుజరాతులో మఱియు మలబారు తీరమున మూఁడుపట్నములు స్థాపింపఁబడెను. చివర పట్నముపేరు వ్యజనశము అయియుండెను., ఈ నగరముపేరు మహాభారతకాలమందు భరత ఖండమున దాని సహదేవుఁడు జయించిన యవనపురము ప్రసిద్ధమై యుండును.

దక్షిణమందలి యాలోకుల సూచిలోఁ గొందఱ విచిత్రలోకుల నామములు వచ్చియున్నవి; కాని యవి దిగ్విజయ వర్ణనములోఁ గలవు. పైని చెప్పఁబడిన వానరులు గాక ఏక పాదులును కర్ణప్రావరణములును పురుషాదులునుగూడఁ జెప్పఁబడియున్నారు. మహాభారతకాలమున వీరు కాల్పనికులనియే యెంచఁబడి యుందురు. ఒక పాదముగలవారు, కర్ణముతోఁ దమ్మును వారించుకొనువారు, మనుష్యులను తినువారును మహాభారతకాలమునఁ బ్రత్యక్షముగాక యుందురు. ఇఁదుచేత వారి నామములు భీష్మపర్వ సూచిలో నీయఁబడలేదు.

## పడమటి వైపు దేశము

పడమటివైపు దేశములును లోకులును నెవరై యుండిరో యిపుడు

చూడవలయును. పడమటిపైపు దేశముల సూచికలో సింధువు, సౌవీర కుచ్ఛదేశములు కలవు. సింధువు నేఁటి హింధుప్రాంతమైయున్నది. దీనికిని కఠియావారునకును నడిమి ప్రాంతము సౌవీరము, ఏది సముద్రతీరముతోఁ గలిసియున్నదో ఇందు నేఁటి కరాచీ బందరు అయియుండును. దీనిపేరు బైబిలులో షఫీరు అని చెప్పఁబడియున్నది. పడమటిపైపు వీని ప్రాంతములతో సముద్రద్వారమున మిక్కిలిఁ గలయిక యుండెను. బైబిలులో, బంగారము, నెమిళ్ళు. వానరములు ఈ ప్రాంతములనుండి వచ్చుచుండెనని చెప్పియున్నాఁడు. కచ్ఛదేశము ఇప్పటి కర్ణమని ప్రసిద్ధమేమైయున్నది. దీనికిఁ బేరు అనుపమనికూడ నీయఁబడి యున్నది. సింధు సౌవీర కచ్ఛముల కుత్తరమున నున్న గాంధారదేశము సింధువునకు ముందుండెను. ఇదికూడఁ బ్రసిద్ధమైయున్నది, దీని వర్తమాన రాజధాని వశమైయున్నది. పేషావరము లేక పురుషపకము యొక్క నామములు మహాభారతమందు రాలేదు. కాని గాంధారము పేరు మాటి మాటికిని వచ్చుచున్నది. గాంధారమున కుత్తరమునను సింధువునకు ముందును కాశ్మీరదేశముకూడఁ బ్రసిద్ధమైయున్నది. దీని నడుమనుండి సింధు నదియు సతలజ నదియుఁ బ్రవహించుచున్నవి. ఈ నాలుగైదు దేశములును పడమటిపైపు పటములో చివరదేశములై యున్నవి. మఱియు వీని నామములు మహాభారతములోని దేశ సూచియందు నొక చోట నీఁబడి యున్నవి.

వీని కిటీవల, కురుక్షేత్రమునకుఁ బడమటి పైపున, అనఁగా మార్వాడ, పంజాబు, ఇప్పటి పెద్ద పెద్ద ప్రాంతము రెండున్నవి. వీనిలో మహాభారతకాలమున వందలకొలది విధముల లోకులుండి యుందురు; మఱియు వారియొక్క చాల నామములు కూడ మహాభారతములోఁ బ్రతిచోటను గనఁబడుచున్నవి. కాని యన్నింటి యొక్క

సరియైన జాడ తెలిసికొనుట యత్యంత కఠినమై యున్నది. నకులుని పశ్చిమ దిగ్విజయములో నిట్టి వర్ణనమున్నది.— "రోహిత్రక పర్వతమును దాఁటి యతఁడు మత్త మయూరమును గెలిచెను; మరుభూమి, శైరీష కము మహత్థము, దశార్ణము, శిబి, త్రిగర్తము, అంబష్టము, మాల వము, పంచకర్పటము, వాటధాన దేశమును గెలిచెను; మఱియు మద్ర దేశమున శకుల నగరమునకుఁ జని యతఁడు తన మాయయగు శల్యుని వశపఱుచుకొనియెను" దీనిఁబట్టి మహాభారతకాలమందు శాకలన గారము ప్రసిద్ధమైయుండెనని తెలియుచున్నది. ఈ నగరియొక్క యుల్లేఖమును గ్రీకులుకూడఁ జేసియున్నారు. ఇతిహాసమందు, ఈ నగరములోఁ దరువాతఁదరువాతఁ బెద్ద పెద్ద యవనరాజులును కనిష్కా దికులును రాజ్యము చేసిరని వ్రాసియున్నాఁడు. పంజాబునందలి శాల్వు లును కేకయులును గూడ మహాభారతమందుఁ బలుమాఱు పేర్కొనఁబడి యున్నారు; మఱియుఁ దక్షశిలా నగరము యొక్కయు నుల్లేఖము పలుమఱు చేయఁబడియున్నది. కాని వీని నామము మహాభారతమందు మాటి మాటికిని వచ్చుచున్నది. ఇదే విధముగా క్షుద్రకుల నామముకూడ మాటి మాటికిని వచ్చుచున్నది. అలెగ్జాండరు పంజాబుసింధు ప్రాంతము లను గెలిచినపుడు ఇచ్చటి యనేక జనుల నామములు వారి యితిహాస ములో వచ్చియున్నవి. కాని నామముల పరివర్తనము గ్రీకు భాషలో వచ్చియున్నది. కనుక ఆ పేరులకు మహాభారత సూచిలోని పేరులతో మైత్రి కుదుర్చుట బొత్తిగా నసంభవమై యున్నది.

## ఉత్తరమువైపు లోకులు

అర్జునుని దిగ్విజయముయొక్క వర్ణనముచేత నుత్తరమువైపు లోకులయొక్క కొంత వర్ణనము చేయఁబడగలదు. కులిందము, ఆనర్తము తాలకూటము మొదలైన దేశముల వర్ణనము అయిన తరువాత. శకుల

ద్వీపము మొదలైన సప్తద్వీపముల రాజులతో నతనికి యుద్ధము జరిగెనని వ్రాసియున్నాఁడు, ఇచటనే ప్రాగ్జ్యోతిష దేశరాజమగు భగదత్తుని నతఁడు గెలిచెననియు వ్రాసియున్నాఁడు. అంతర్గిరులు బహిర్గిరులు లెవరైన లోకులను గూడ నతఁడు గెలిచెను. ఇటపిమ్మట త్రిగర్తము, దార్వము, కోకనదము, కాంభోజము, దారదము మొదలైన దేశముల వారిని గెలిచెను. కాంభోజులును దరదులును అఫ్గనిస్థానమందును పడమటి టిబెట్టునందును నివసించు ప్రజలై యున్నారు. ఇటపిమ్మట కింపురుష గుహ్యాదు లైన కాల్పనిక ప్రజల యుల్లేఖమున్నది. అక్కడనుండి, అర్జునుఁడు హరి వర్షమునకుఁ జనెనని వ్రాసియున్నాఁడు. అగుఁగాక, కురు పాంచాలదేశము తఱచుగా నుత్తరమువైపున హిమాలయముతోఁ గలిసియున్నది. దీనిఁబట్టి, దానికి మీఁదుగా నున్న టిబెట్టు మొదలైన దేశముల విషయమున, అర్జునుని దిగ్విజయముయొక్క యే వర్ణనము వచ్చియున్నదో, దానిని బ్రాయికముగాఁ గాల్పనికమని తలంచుటలో నాతంక మేమియును నగపడదు. (శాంతి. అ. 202లో) హిమాలయమునకు రెండవ వైపున నేఁటివఱకు నెవఁడును గనఁబడడని చెప్పియున్నాఁడు. దీనిఁబట్టి మహాభారతకాలమున భారతీయార్యులు హిమాలయమునకు ముందు టిబెట్టు దేశములోనికి వెడలక యుండునని యూహ కలుగు చున్నది. జంబూద్వీపముయొక్క యే కల్పనను వారు చేసియున్నారో, అందు హిమాలయమునకుఁ బిమ్మట వృత్తాంతమును వారు వినియుందురు. అర్జునుని యుత్తర దిగ్విజయము నందు, అతఁడు హిమాలయమును దాఁటి హరి వర్షమునకుఁ జని యుండెనని వ్రాసియున్నాఁడు. అచట నతనికొక నగరము తారసిల్లెను. అనట హృష్టపుష్టులైతే జస్వులౌ ద్వారపాలురు అతనిని వెనుకకు నెట్టిరి; మఱియు ఈ పట్టణమును నీవు గెలువఁ జాలవు. దీని పిమ్మట యుత్తర మరుదేశమునందు మనుష్య దేహముతో నెవనికిని ప్రవేశము కాఁజాలదు" అని చెప్పిరి. ఇటుపిమ్మట వారు తమ రాజ్యము చొప్పున అర్జునునికి దివ్యాభరణములు, దివ్య వస్త్రములు మొదలుగా

నుపకరణములను యజ్ఞమున కిచ్చిరి (సభా. అ. 28). దీనిఁబట్టి టిబెట్టు దేశమునకు భారతీయార్యులు వెళ్ళక పోవుట మాత్రమే కాక వారి నచటికి వెళ్ళనీయకుండిరని కూడ తెలియు చున్నది. టిబెట్టు దేశస్థులు నేఁటి వఱకుఁ దమ దేశములోని కెవరిని రానీయ కుండిరను సంగతి ప్రసిద్ధమైయె యున్నది. అవశ్యముగా ఈ యిరువదవ శతాబ్దిలో టిబెట్టు ప్రాంతము పరాకీయులకై యెంతయో కొంత (కొంచెముగానో గొప్పగానో) తెఱవఁ బడియే యున్నది. ఉత్తరము వైపున నుత్తర మరు దేశము లున్నవి. ఈ కల్పనకు, చంద్రవంశీయులైన కురువులు ఉత్తరము వైపు నుండి గంగా ఘట్టములద్వారమున వచ్చియుండిరనుటయే యాధారముగా నగుపడు చున్నది. మఱియు నీ విషయమైన పురాతనపు పుక్కిటి పురాణములఁ బట్టి, మన జన్మభూమి యుత్తరము వైపను ధారణ దృఢమయ్యెను. అయినను వీరు టిబెట్టువారు కారు. ఆర్యుల మూలస్థానము ఉత్తర ధ్రువము వైపుననుండెను. ఇదియే సిద్ధమై యున్నది; మరియు భారతీయార్యుల మూల స్థానము ఎచ్చటనో యొకచోట సైబీరియాలో గావచ్చునని మనము మునుపే చెప్పితిమి. అయినను అగర్తులు, అనర్తులు మున్నగువారు నుత్తరము వైపున మరలఁ జెప్పఁ బడిరేని యిందాశ్చర్యము లేదను నంతమాత్రము ఇచట నావశ్యము చెప్పవలసి యున్నది; ఎందుచేత? ఆర్యుల నివాసముత్తరము వైపునుండియే దక్షిణము వైపునకు వచ్చి యున్నది. కనుక నుత్తరము వైపువారి నామములు దక్షిణము వైపువారికి మరల ప్రాప్తించినచో నిందాశ్చర్య విషయమేమి యును లేదు.

ఉపర్యుక్త వర్ణనములో మనము దిగ్విజయము నాధారము చేసికొని భీష్మ పర్వమందలి దేశ సూచిలోని వారు భారత వర్షమందలి భిన్న భిన్న భాగములందు నే విధముగాఁ జూపఁబడ గలరో విచారించితిమి. మేగస్థినీజు భారత వర్షముల సూచిని తయారుచేసి యుండెనని తెలియుచున్నది. ఆ సూచియందు 118 పేరు లుండెనని వ్రాసి యున్నాఁడు. స్ట్రేబో ఆ సూచిని తన గ్రంథములో నెత్తియున్నాఁడు. మేగస్థినీజు గ్రంథమిపుడు దొరకుట లేదు. కాని దౌర్భాగ్యము వల్ల స్ట్రేబో యొక్క గ్రంథ మందు

మనకీ సూచి దొరకదయ్యెను. భీష్మపర్వ సూచియొక్క వైగుణ్యమును మనము ముందే చెప్పియున్నాము. అందియం బడి యున్న దేశముల నామములు ఏ విశేషాను క్రమముతోడను చెప్పఁ బడలేదు. కాని కొన్ని చోట్లను వర్ణ సాదృశ్యము చేత మంత్రము నామములొకచోట నీయఁ బడి నవై కనఁబడుచున్నవి. అయినను దేశముల క్రమమును గని పట్టుటకై సాధ్యమైనంత వఱకు ప్రయత్నము చేయఁబడి యున్నది. తంగణము, పరతంగణము అను పేరుగల రెండు దేశములు లోకులు ఎవరు దక్షిణ లోకుల యంతమున నీయఁబడిరో అవి బహుశః పొరపాటున నీయఁ బడి యెను. వీరు ఉత్తరము వైపువారు అనఁగా టిబెట్టువారు అని యిచట చెప్పవలయును. వన పర్వములోని 254వ యధ్యాయ మందు కర్ణుఁడు దుర్యోధనునికై చేసిన దిగ్విజయము యొక్క వర్ణనము సంగ్రహముగా నీయఁబడియున్నవి. అందులో వచ్చిన దేశములు ఇట్లున్నవి:- ముందుగా ద్రుపదుని గెలిచి యతడుత్తరము వైపు వెళ్ళెను. అచట నతఁడు నేపాల దేశమును జయించెను. తూర్పువైపున అంగ, వంగ, కళింగ, శండిక, మిథిల, మగధ, కర్క ఖండములను గెలిచెను, పిమ్మట నతఁడు వత్స దేశమున కేగెను. అచటనున్న కేవల వృత్తి కాయుక్తములైన భూముల నతఁడు గెలిచెను. అటు పిమ్మట మోహన నగరమును, త్రిపురమును, కోసలమును నతఁడు జయించెను. అపుడతఁడు దక్షిణము వైపునకేగెను. అచట ముందుగా రుక్మిని గెలిచెను. మరలఁ బాండ్యము, శైల ప్రదే శములవైపు వెళ్ళెను. ఇటు పిమ్మట కోసలము దేశమును గెలిచెను. పిదప శిశుపాలుని గెలిచి యవంతి దేశమును జయించెను. మరియు నతఁడు పడమటివైపు వెళ్ళెను. అట్లు యవనులను, బర్బరులను కప్ప మ్మిచ్చుటకై యాతఁడు బాధ్యులనుగాఁ జేసెను. ఈ చిన్న దిగ్విజయ వర్ణనములోఁ గ్రొత్త గ్రొత్త దేశములు చాల వచ్చి యున్నవి; కనుకనే ఈ వర్ణనము మహాభారతముకంటె నిటీవలిది కాను గదాయని శంక కలుగు చున్నది. అయినను ఇట్లు తలంపక దేశ సూచియందుఁ గ్రింద నీఁబడిన నామములింకను చెప్ప వలయును:- ఉత్తరమున 1 నేపాల పూర్వము, 2 శుండికము, 3 కర్క ఖండము; మధ్య దేశమున 4 వత్సము, 5 మోహ నము, 6 త్రిపురము, దక్షిణమున 7 శైలము, 8 నీలము, పశ్చిమమున 6 బర్బరము ఈ నామములు దేశసూచియందు వేఱుగా బెంపఁబడియున్నవి.

## న దు లు

ఇపుడు మనము భారతమనందలి నదుల విషయమై విచారింతము. భీష్మపర్వములో నీయఁబడియున్నయీ నదుల సూచియు దిక్కుల క్రమమునననుసరించి యుండలేదు, ఇటునటు నిచ్చచొప్పున నీయఁబడియున్నది. కనుక నీ నదులేవియో నిశ్చయించుట మిగులఁ గఠినమైయున్నది. అయినను మహాభారతములోని యితరస్థలముల యుల్లేఖములఁబట్టి మనము కొంచెము ప్రయత్నింపగలము. మొదట మనము త్తరమువైపు అదిఁగో పంజాబులోని నదుల విచారింతము. ఋగ్వేదములోఁ బదియవమండలమున నదీసూక్తమున్నది. అందుఁజెప్పఁబడి యున్ననదులు ఋగ్వేదకాలమునఁ బ్రసిద్ధములైయుండెను. వాని విషయమున అవి తూర్పు దిక్కునుండి పడమటవైపుగాఁ జెప్పఁబడియున్న వనునీక్రమము కనఁబడుచున్నది.

ఇమంమే గంగే యమునే సరస్వతీ శుతుద్రిస్తోమం
సచతా పరుష్ణ్యయా।

ఈసూక్తమునుబట్టి ప్రాచీనకాలమున నార్యులు ఎంతవఱకు వ్యాపించి యుండిరో యిది చెప్పబడఁగలదు. మొదట గంగ, దానికి పడమట యమున, తరువాత సరస్వతి, మరల శుతుద్రి, దీనికిఁబిమ్మట (పరుష్ణి) పిదప అసిక్ని, తదనంతరము మరుద్వృధ మఱియు వి స్తత వచ్చుచున్నవి. శుతుద్రి నేఁటి సతలజయైయున్నది. పరుష్ణివేఁటి యైరావతిలేక రావియైయున్నది. అసిక్ని విపాశ అనఁగానేఁటి ప్యాసాయై యున్నది; మఱియు వితస్త ఝేలము అయి యున్నది. మరుద్వృధ యేనదియో యిప్పటివరకుఁ జక్కఁగా నిశ్చితము కాలేదు. సింధు నదము ప్రసిద్ధమైయున్నది. కుమకాబూలు నదియై యున్నది; మఱియు గోమతియు సువస్తు లేక స్వాత సింధువు యొక్క యావల వైపునుండి కలసిన నదులై యున్నవి. సరయునది పంజాబు నావలి వైపుదై యున్నది. కానియది యీసూక్తములోఁ జెప్పబడలేదు. జెందు గ్రంథము నందు దానిపేరుఁ ( హరయు ) అని కనఁబడుచున్నది. ఇదేవిధముగా సరస్వతీ ( హరహవతీ ) నామనుకూడ జెందుగ్రథమునఁ గలదు. ఈ

ప్రాచీనార్యులనది నామములైన సరస్వతీ సరయువులు ఉత్తర భారత నదులకుఁ బ్రాప్తమయ్యెను, ఇందాశ్చర్యములేదు. రామాయణములోని వర్ణనముఁబట్టి మనము, అశ్వపతియొక్క కేకయదేశము రావికిని విపాశకును నడుమనుండెనని చెప్పఁజాలుదుము. గీక్కులు ఈ నదుల నామములను బొత్తిగా వేఱుచేసియున్నారు. మహాభారతమందు సరస్వతి, శతద్రువు, యమున వీనికినడుమ హిమాలయమందుత్పన్న మయ్యెనని వ్రాసియున్నాఁడు; మఱియుఁ గురుక్షేత్రమునుండి పోవుచుఁ బోవుచు మరుదేశపు రోగిస్థానమిందు గుప్తమయ్యెను. కాని మహాభారతకాలమున కూడ ఆ నది యొకప్పుడు పడమటివైపుగాఁ బ్రవహించుచు కచ్ఛము యొక్క యుద్ధమువలన అరేబియా సముద్రములోనికిఁ బోయికలిసెనని పుక్కిటపురాణమొకటి ప్రచలితమైయుండును. దీనిపిమ్మట సరస్వతీ తీర్థయాత్ర వరనములోమనము విస్తరించి విచారింతుము. పంజాబుదేశములోని యేయే యితరనదులు మహాభారత నదిసూచిలోఁ జెర్చఁబడియున్నవో, యీసంగతిని నమగామింతకంటె నేక్కువ నిశ్చయించి చెప్పజాలము చంద్రభాగానది పంజాబుది యైయున్నది. ఈనదికి ఈ పేరే యపుడుకూడఁ బ్రసిద్ధమైయున్నది. దేనియొక్క చర్చలో ముందుగా వచ్చియున్నయో, ఆయీనది వైదికమైన యసిక్నియై యున్నది. ఇదిగాక దృషద్వతీ నది కురుక్షేత్రములో సరస్వతీ యమున నడుమను జెప్పఁబడియున్నది, ఈ పుణ్యనదియొక్క వర్ణనము సరస్వతీ నదితోపాటుగనే చేయఁబడియున్నది. సరస్వతీ దృషద్వతీ నదుల మధ్యమగు పుణ్యదేశము అన్నింటికంటె నెక్కువ పవిత్రమైయున్నది. మఱియు దీనిని బ్రహ్మర్షిదేశమని తలంచుచున్నారు.

కురుపాంచాలములకుఁ దూర్పువైపున నే యేనదులున్నవో యీ సంగతి నిపుడు మనము విచారించుచున్నారము. మునుపు వర్ణింపఁబడినట్లుగా, శ్రీకృష్ణుఁడు, భీముఁడు, అర్జునుఁడు ఇక్కడనుండి మగధమునకు నరుగ మొదలిడినపుడు వారికి గండకి, మహాశోణము, సదానీరయనెడు నదులు తగిలియుండెను. ఇటుపిమ్మట వారికి సరయువు తగిలెను, అయోధ్యలోని సరయూనది ప్రసిద్ధమైయున్నది. కాని సరయూ గంగా

నదుల నడుమను గండకి, సరయువు. సదానీరయనెడు నదులులేవు. ఈ మూఁడు నదులును సరయువునకుఁ దూర్పువైపునఁ గలవు. సరయూ గంగలకు నడుమనున్న గోమతీనది యిచట బొత్తిగనే చెప్పఁబడలేదు. ఈ విధమైన భ్రాంతి నుత్పన్నము చేయు ననేక స్థలములు మహా భారతములోఁ గలవు. గండకి * యు సదానీరయు బీహారుప్రాంతపు నదులై యున్నవి. ఇందుచేత, సరయువునకుఁ బడమటివైపున నీపేరులే యున్న రెండు చిన్న నదులున్నవని విశ్వసింపకుండఁ బనిలేదు. గంగాశోణములను దాఁటి వారు మగధమునకు వెళ్ళిరను వర్ణనము సరిగానున్నది. శోణనదము మగధములోఁ గలదు; మఱియు నయ్యది దక్షిణము వైపుగా గంగలోఁ గలియుచున్నది. బంగళా ప్రాంతపునదు లేయేవి మహాభారతములోఁ జెప్పఁబడి యున్నవో యిది చూడవలయును లౌహిత్యనది బ్రహ్మపుత్రయై యున్నది. కాని బ్రహ్మపుత్ర యొక్క పేరు

---

* గంగాగత్వా సముద్రాంభః సప్తధా సమపద్యత ॥ 19. (ఆ. అ. 130) గంగ యేడు విధములుగాఁ బ్రవహించి, అని యర్థముచేసి టీకాకారుఁడు హిమాలయమందే సప్త గంగలను జెప్పియున్నాఁడు. అవి యిట్లున్నవి. వస్వోకసార. నళిని, పావని. సీత, సింధువు, అలకనంద, చక్షువు. కాని మన మతముఁబట్టి ముందటి శ్లోకములోఁ జెప్పఁబడియున్న నదులు సప్తయని యాశయము కనఁబడుచున్నది.

గంగాంచ యమునాంచైవ ప్లక్షజాతాం సరస్వతీమ్ ।రథస్థాం సరయూంచైవ గోమతీం గండకీం తథా॥ అపర్యుషితపాపాస్తే నదీః సప్త పిబంతియే ॥

గంగ, యమున, ప్లక్షావతారణ తీర్థమునుండి వెడలిన సరస్వతి, రథస్థ, సరయువు, గోమతి, గండకి—ఈ పెద్ద నదులు హిమాలయము నుండి బయలుదేఱి కలిసి సముద్రములోనికిఁ బోయి కలియుచున్నవి. ఆది పర్వములో నీయఁబడి యున్న జ్ఞానమిచటఁ దీసికొనఁదగి యున్నది.

నదుల సూచిలో లేదు. కౌశికి యనెడు నింకొకనది బంగాళములోనిదిగా దెలియుచున్నది. తీర్థవర్ణనమందు గయదగ్గఱ ఫల్గు నది వచ్చియున్నది, కాని నదుల సూచిలోలేదు. క్షీరతోయ బంగాళములోని యొక నదిగాఁ దెలియుచున్నది. ఇపుడు మనము దక్షిణాత్య నదులపైపు వచ్చుచున్నాము.

ముందుగా గంగలోఁ గలిసిన యమునానది ప్రసిద్ధమే యైయున్నది. ఆ యమునయందుఁ గలిసి మాలవనుండి వచ్చిన చర్మణ్వతి లేక చాంబుల్‌నదియు నట్లే ప్రసిద్ధమై యున్నది. ఈ నదియొడ్డున నొకరాజు వేలకొలఁది యజ్ఞములను జేసియుండెను; అచట యజ్ఞములోఁ జంపఁబడిన పశువులయొక్క చర్మముల రాసులు ప్రోగై యుండెను; ఇందుచేత దీని నామము చర్మణ్వతి యయ్యెను. వేత్రవతి లేక వేతవానది చంబల్నదివలెనే మాలవానుండి బయలుదేఱి యమునలోఁగలియుచున్నది సింధువు లేక కాలీసింధువుకూడ మాలవానదియై యున్నది. దీనిపేరు నదుల సూచిలోఁ గనఁబడదు. మహానది తూర్పువైపుగా మహేంద్రపర్వతము దగ్గఱనుండి పోవుచున్నది. బాహుదానదికూడ నిచ్చనేయున్నది. వింధ్యమునకు దక్షిణము పైపున నర్మదానది ప్రసిద్ధమేయై యున్నది. ఇట్లే పరోష్ణి అనఁగా తాప్తీనదియుఁ బ్రసిద్ధమైయున్నది. కాని తాప్తియొక్క పేరు మహాభారతములో నెచ్చటను గనఁబడదు. వైతరిణీ నది తూర్పువైపునకుఁ బోయి తూర్పు సముద్రములోఁ బడుచున్నది. ఇటు, మహారాష్ట్రములోని సహ్యాద్రినుండి బయలువెడలి తూర్పుగాఁ బోవు నదులు గోదావరి, భీమరథి అనఁగా భీమ, వేణ, కృష్ణయని చెప్పఁబడియున్నవి. కృష్ణవేణయను నొకనది వేషగా జెప్పఁబడియున్నది. కృష్ణకు దక్షిణము వైపునఁ గావేరీ నదియు నదుల సూచిలో వ్రాయఁబడి యున్నది. దీనికిఁ గూడ దక్షిణము వైపున ట్రావన్కూరులోని తామ్రపర్ణినది యున్నది. కాని దీని పేరు నదుల సూచిలోఁ గనఁబడదు; అయినను తీర్థ వర్ణనమునందు దీనిపేరు వచ్చియున్నది. కోంకణములోని నదులు బొత్తిగాఁ జిన్నవి యైయుండెను. వానిపేరు ఈసూచియందు వచ్చియుండెనా. లేకలేదు, అను సంగతి

చెప్పఁబడఁజాలదు. పడమటి వైపున బ్రవహించు నదులలో నర్మదాప యోష్ణుల యుల్లేఖము మునుపే వచ్చియుండెను. మహీనది గుజరాతిలో గలదు. దాని యుల్లేఖమీ సూచిలోలేదు. సింధువుయొక్క యుల్లేఖము ప్రారంభమందే యుండెను. ఇచట, అన్నిటికంటెఁ బెద్దనది గంగయై యుండెను. మఱియు దానికి భాగీరథీ, మందాకిని మొదలైన పేరు లుండెను. ఈ నదుల సూచి దేశముల సూచివలె నిచ్చట నిచ్చుచు న్నాము. మఱియు నేనదులును మనము దీనిలో నిప్పటి నదులతో మైత్రి కలుపఁగలమో, వానిపై తారకాచిహ్నము చేయఁబడియున్నది.

## మ హా భా ర త కా ల తీ ర్థ ము లు

ఇపుడు, మహాభారతములో వర్ణింపఁబడిన తీర్థముల వృత్తాంతము ఇచట నీయఁబడుచుండెను. పాండవుల యీ తీర్థయాత్రల వర్ణనమునకు మునుపు తీర్థముల రెండు సూచులీయఁబడియుండెను. అనఁగా, ఒకమాఱు నారదుని నోటినుండియు రెండవమాఱు దౌమ్య ఋషి నోటి నుండియు ఈ రెండు సూచులయందును గొంచెము భేదముండెను. పాండవులు ప్రత్యక్షముగా, నేయే తీర్థములకు వెళ్ళిరో యాయా తీర్థ ముల వర్ణనము వనపర్వములో విస్తరించి యీయఁబడి యుండెను. ఎక్కడెక్కడకుఁ బాండవులు వెళ్ళిరో, యీ స్థానములకు నేఁటి తీర్థ యాత్రా స్థానములతో మైత్రిఁ గలుపుట యనెడు మనోరంజకకార్యము చేయఁదగియుండెను. మన మందులకై యథాశక్తిని ప్రయత్నింతుము ముందుగాఁ బాండవులు కామ్యకవనములో నుండిరని వ్రాసియున్నాఁడు, ప్రాచీనకాలమందుఁ బ్రతిదేశముయొక్క భిన్న భిన్న భాగములలోను వనములుండెను.. ఆ వనముల యందుఁ బ్రతివాఁడును నివసించుటకును సెలవుండెను. వనముపై నేదేశపు రాజునకును సత్త లేకుండెను. వన వాసులైన క్షత్రియులు ఇట్టి వనములలో వేఁట మీఁద బొట్టపోసికొను చుండిరి; మఱియుఁ దపస్సు చేసెడి బ్రాహ్మణులు కందమూలఫలము లను దిని తమ్ము నిర్వహించుకొనుచుండిరి. ఈ సంతి యెంత మాత్ర

మున గల్పనికముకాదు. ఇటువంటి పరిస్థితి మహాభారతకాలము వఱకు నుండెను. గ్రీక్కులు వనములో నిర్భయముగా నివసించెడి తత్త్వవేత్తలైన సమునులను వర్ణించి యున్నారు. బౌద్ధ గ్రంథములలోఁగూడ నిట్టి వనేక వర్ణనము లుండెను. బుద్ధుడు రాజ్యమును త్యజించిన పిమ్మట, ఇట్టి యనేకారణ్యములలో నుండెనని వ్రాసియుండెను. వానిలోఁ బ్రతి వనమునకును భిన్న భిన్న నామములు గలవు. లుంబినీవనముయొక్క పేరు బౌద్ధగ్రంథములలోఁ బలుమాఱు వచ్చుచున్నది. అగుఁగాక; పాండవులు వనవాస కాలమున నెన్నియో వనములందుండిరని మహాభారత మందు వ్రాసియున్నాఁడు. ఆ వనముల యొక్క స్థలములను ముందుగా మనమిచ్చట నిశ్చయింతము. పాండవులు మొట్టమొదటఁ గామ్యకవనము నుండిరని వ్రాసియున్నాడు. వారు భాగీరథీ తీరముపై నుండి ముందుగా గురుక్షేత్రము వైపు వెళ్ళిరి. సరస్వతి, దృ ష ద్వ తి, యమునలను దర్శించి వారు పడమటి వైపుగా వెడలిరి. అపుడు గుప్తరూపమున నున్న సరస్వతి యొద్దున నున్న నిర్జనమగు మైదానములో ఋషిప్రియ మగు కామ్యకవనము వారికగపడెను. (వన. అధ్యా. ౫) దీనిఁబట్టి కామ్యక వనము మరుదేశమున నుండెనని ధ్యానములోనికి రాఁగలదు. ఆ వనమును విడిచి మరల వారు ద్వైత వనమునకు నేగిరి ద్వైతవనము ఉత్తరము వైపున హిమాలయపు చఱియలందునై యుండును అందు పశువులు, పక్షులు, మృగములు, ఏనుఁగులును తండోప తండములుగా నుండెను. మఱియు నందు సరస్వతీ నది ప్రవహించు చుండెను. ఈ ద్వైత వనమునుండియే వారు తీర్థయాత్రకు వెడలిరని వ్రాసియున్నాఁడు; మరియుఁ దిరుగఁ గామ్యక వనమునకు వచ్చిరి. ఇక్కడకు ముందుగా తూర్పువైపున నైమిశారణ్య మున్నది. ఈ పుణ్య దేశము అయోధ్యకు పడమట గలదు. దీనికిఁ దూర్పున గోమతీ తీర్థ మున్నదని వ్రాసియున్నాఁడు. దీని పిమ్మట నైమిశారణ్యమునకు ముందుగా వచ్చిన మీఁదట గోమతిలో స్నానముచేసి వారు బాహుదానది మీఁదుగా వెళ్ళిరని వర్ణించి యున్నాఁడు. ఈ బాహుదానది యిచట రెండవమాఱు వచ్చియున్నది. దీనికిఁ బిదపఁ బాండవులు ప్రయాగమునకు వచ్చిరి. ఈ ప్రయాగము

గంగా, యమునా సంగమమేదైయై యున్నది. గంగా సంగమము నందు వారు బ్రాహ్మణులకు దానములు చేసిరని వ్రాసి యున్నాఁడు. ఇచట ప్రయాగ భూమి దేవతల యజ్ఞభూమియని చెప్పఁబడి యుండెను. మరల ప్రయాగము నుండి పాండవులు గయకు వెళ్ళిరని వ్రాసి యున్నాఁడు. గయలో దయాశిరమను పేరుగల పర్వతమున్నది. మరియు ఇసుకచేత శోభిల్లునట్టి మహానది అనఁగా ఫల్గు నది యున్నది. ఇదిగాక యిచట బ్రహ్మవేదియు దగ్గఱగా నున్నది. మరియు నక్షయవటము కూడఁ గలదని వ్రాసియున్నాఁడు. ఈ యక్షయవటమే శ్రాద్ధముచేయుటకై సర్వశ్రేష్ఠమగు స్థానమని చెప్పఁబడి యున్నది. ఇచట నక్షయపదము ప్రాప్తమగు చున్నది. ఇచట గయ రాజుయొక్క వర్ణనము కూడ నిచ్చి యున్నాఁడు. దీని తరువాత పాండవులు గయనుండి బయలుదేరి మణిమతి యను పేరి దుర్జయనగరియందుండిరని వ్రాసి యున్నాఁడు; మరియు దిరుగ వారు అగస్త్యాశ్రమమును దర్శించిరి. ఈ తీర్థమెచ్చట నున్నదో నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁ జాలదు; అయినను ఆ వర్ణనముఁబట్టి భాగీరథి మీఁద నయ్యాశ్రమ ముండెనని స్పష్టముగాఁ దెలియుచున్నది. అగస్త్యుఁడు వాతాపిని జంపిన వర్ణనము కూడ నీయఁబడి యున్నది. ఇటు పిమ్మట కౌశికీ నదియొక్క వర్ణనమీయఁబడి యున్నది. ఈ నది భాగీరథిలో నుత్తరము పైపునుండి కలియుచున్నది. కౌశికీ నదిపై విశ్వామిత్రుఁడు తపముచేసి బ్రాహ్మణ్యమును సంపాదించెనని వ్రాసియున్నాడు. ఇదిగాక భాగీరథియందు భగీరథుఁడు చేసిన యజ్ఞము యొక్క యు వర్ణన మీయఁబడి యున్నది. ఇచటను మరల పాండవులు నంద అలకనంద యనెడు రెండు నదుల మీఁదుగా వెళ్ళిరని వ్రాసి యున్నాఁడు; మరియు దిరుగ హేమకూట పర్వతము మీఁదికి వెళ్ళిరి. ఈ పర్వతముపై నదృశ్యమగు వేదఘోషము విన వచ్చుచున్నది. కౌశికీ నదియొద్ద నుత్తములైన నదులుండి యుండును. ఇచటనే విభండక పుత్రుఁడైన ఋష్యశృంగుని యాశ్రమమున్నది ఋష్యశృంగుని కథ యిచ్చట నీయఁబడియున్నది. కౌశికినుండివెడలిపాండవులు సముద్రము మీదికిపోయిరి. మఱియు నే చోటను గంగ సముద్రముతోఁ గలియుచున్నదో, ఆ స్థలమందు నైదువందల నదుల నడుమ భాగమందు వారు సముద్రములో

స్నానముచేసిరి. గంగానది సముద్రమందు సహస్ర ముఖములఁ గలియు చుండినదను వర్ణనము ప్రసిద్ధమై యుండెనే, దాని యుల్లేఖము ఈ 500 నదుల నామముతోఁ జేయఁబడినట్లు తెలియుచుండెను. ఇచటఁ దూర్పు వైపు తీర్థములు సమాప్తములయ్యెను. ఈ వర్ణనములోఁ గాని వెళ్ళిన వర్ణనము లేకుండుట మిగుల నాశ్చర్య విషయమై యుండెను. అయి నను దౌమ్యుఁడు చేసిన తీర్థవర్ణములో రెండు మూఁడు తీర్థములింకను వ్రాయంబడియుండెను. వాని సమావేశ మిచ్చటఁ జేయఁబడగలదు. కాలింజర పర్వతముమీఁద హిరణ్య బిందువనెడు పేరనొక పెద్ద స్థాన ముండెను. దీని తరువాత భార్గవణముని మహేంద్ర పర్వతము చెప్పఁ బడియుండెను. ఆ పర్వతముపైని భాగీరథీనది మణికర్ణికా సరోవరములో నుండి వచ్చినదని వ్రాసియుండెను. మహేంద్రపర్వత యొక్క యీ మణికర్ణికాతీర్థము వాస్తవమునఁగాశీయందే యుండియుండునని యనుమా నించుటయందుఁ గొంచమైనను బాధయుగపడదు. అయినను, కాశీ లేక వారణాశియొక్క విస్తృతమైన వర్ణనము ఈ తీర్థ వర్ణనములో లే ద న్న విషయము ఆశ్చర్యకరమై యుండెను. ఏది యేనియగుఁగాక; ఇ పు డు మనము దక్షిణ తీర్థములవైపు వచ్చుచుంటిమి

పాండవులు గంగాముఖము నందు స్నానము చేసి సముద్ర తీరము వెంటఁ గలింగ దేశమునకుఁ బోయిరి. అచట వారికి ముందుగా వైత రిణి నది తగిలెను. ఈ నదిలో స్నానము చేసి వారు పవిత్రులై రి. ఈ నదియందు స్నానము చేయుగా వారు మహాతపో బలయోగమున మృత్యు లోకమునుండి మిగుల దూరముగా వెళ్ళిరని తెలియుచుండెను. ఇక్కడకు దగ్గఱనే మహేంద్ర పర్వతముండెను. ఆ ప ర్వ త ము పై ఁ బరశురాముఁడు ఉండెను పృథ్విని గశ్యపుని కిచ్చినపుడు అది సముద్రములో మునుగ నారంభించెను. ఆ సమయమందుఁ గశ్యపుని తపః ప్ర భా వ ము వలన నయ్యది సాగరము నుండి వెలుపలికి వేది రూపమున నిచటనుండి పోయి యుండెను. ఈ వేది సముద్రములో నొకానొక చిన్న ద్వీపమై యున్నది. పాండవులు సముద్రములో స్నానముచేసి యా వేదిపై నెక్కిరి; మరియు నిట మీఁదట మహేంద్ర పర్వమమీఁద నాఁగిపోయిరి. ప్రతి చతుర్దశికిని

నచటఁ బరశురాముని దర్శనమగుచున్నది. తదనుసారముగా నా దినమందు దర్శనము చేసి పాండవులు సముద్రపు టొడ్డుల మీఁదుగా దక్షిణ దిశపైపు వెళ్ళిరి. సముద్ర తీరమందలి తీర్థములు ఇచట నామ నిర్దేశము లేకుండ చెప్పఁబడి యున్నవి. ప్రశస్తా నదినిజూచి వారు సముద్ర గామినియగు గోదావరి మీఁదికి వచ్చిరి. అటు పిమ్మట ద్రావిడ దేశములో సముద్రపు టొడ్డున నున్న యగస్త్య తీర్థము నొద్దకు వచ్చిరి. అటు పిమ్మటఁ బవిత్ర ములైన యితర తీర్థములకుఁ గ్రమముగాఁ బోయినమీఁదట వారు శూర్పా రక క్షేత్రమునకు వచ్చిరి. దక్షిణపూర్వ దేశాల యందలి యీ తీర్థముల వర్ణనమందు రెండు మూఁడు పేరులు మన కగపడకున్నవి. ముఖ్యముగా తూర్పు పైపున జగన్నాథ స్థానము యొక్క లేక పూరియొక్క వర్ణనము లేదు. ఇట్టి స్థితిలో మన యెదుర, ఈ క్షేత్రము యొక్క మాహాత్మ్యము పిదప నుత్పన్న మైనదా? యను ప్రశ్న వచ్చు చు న్న ది. ధౌమ్యుఁడు చెప్పిన తీర్థ వర్ణనములోఁ గూడఁ బూరిపేరు లేదు; మరియు నారదుని వర్ణనమందుఁ గూడఁ బూరిపేరు రాలేదు. ఇట్లే రామేశ్వరము పేరుకూడ పాండవుల తీర్థయాత్రలో రాలేదు. దీనిఁబట్టి ఈ తీర్థములిటీవల నుత్పన్న ములై యుండునని సంశయము కలుగుచున్నది. కాని మనము, ఉల్లేఖా భావరూపమైన ప్రమాణము అసమర్థమైనదను సంగతి ననేక స్థలములయందు జెప్పియే యున్నాము. ఇదిగాకుండ, పాండవులు సముద్రపు టొడ్డుల మీదఁగా మెట్టమార్గమున వెళ్లిరి. నావపైఁగూర్చుండి వెళ్ళలేదని సంగతి యుఁగలదు. ఈ కారణముచేతవారు బహుశః అగస్త్య తీర్థమునుండి ద్రవిడదేశములో నుండుచు నొక్కమాఱుగాఁ బశ్చిమపుటొడ్డుమీఁదికి వచ్చి యుందురనుట సంభమై యున్నది. పశ్చిమపుటొడ్డునవున్న గోకర్ణమహా బిలేశ్వరతీర్థము యొక్కయు వర్ణనము చేయఁబడలేదు. దీనిఁబట్టి ఆ తీర్థము ఆ సమయమున లేకుండెనని విశ్వసింపఁబడజాలదు. మంచిది, ధౌమ్యుఁడు దక్షి ణము పైపున చేర్చిన తీర్థముల నిపుడు చూడుఁడు. మొదట గోదావరి, వేణానది, భీమరథినది, పయోష్ణి, ఈ నదులుచెప్పఁ బడియున్నవి. పయోష్ణి యొడ్డున రాజైన నృగువు వందలకొలది యజ్ఞములను జేసి యుండెనని వ్రాసియున్నాఁడు. పాండ్యదేశములోని యగస్త్య తీర్థము మఱియు వరుణతీర్థము యొక్క వర్ణనముకలదు; మఱి జీవద దామ్రపర్ణి

గోకర్ణతీర్థముల వర్ణనమున్నది. నారద తీర్థ యాత్రయందు నింకను నెక్కువగాఁ జెప్పఁబడియున్న తీర్థములు కావేరినదియుఁగామూరి తీర్థములై యున్నవి. అనఁగా దక్షిణీసిరము నందుఁ గన్యాకుమారి యొద్ద నుల్లేఖ మున్నది. కృష్ణ, మరియు దండకారణ్యము యొక్కయు నుల్లేఖము కలదు. సప్తగోదావరముయొక్కయు నుల్లేఖము కలదు; అదిగో గోధావరి యొక్క యేడుముఖములు నిచ్చట నిర్దేశింపఁబడి యున్నవి. అన్నిటి కంటె విశేషసంగతి, ఉజ్జయినిలోని మహాకాళముయొక్క వర్ణన చేయఁ బడుటయైయున్నది; మరియు నిచ్చట రెండు స్థానములు, ఇపుడుకూడ ప్రసిద్ధములై యున్న కోటతీర్థము భద్రవటము ఉల్లేఖితములై యున్నవి పైనిచెప్పఁబడిన వర్ణనముఁబట్టి దక్షిణముపైపు యొక్క యధికజ్ఞానమెట్లు గుచు వచ్చెనోయిది యనుమానింపఁ బడగలదు. దీనిఁబట్టి పాండవుల తీర్థయాత్ర కంటె ధౌమ్యతీర్థ యాత్రల వర్ణనమందు నెక్కువ తీర్థముల పేరులున్నవని స్పష్టమగును; మరియు నంతకంటె నధికముగా నారదుని తీర్థయాత్రావర్ణనమందుఁ దీర్థములపేరులువచ్చియున్నవి.

ఇపుడు మనము పడమటిపైపు తీర్థములను పెర్కొను చున్నాము. పాండవులు శూర్పారక తీర్థమునకువచ్చిరి; అచటవారు వనములోఁ బ్రాచీన రాజులుచేసిన యజ్ఞములనుజూచిరి; మరియు యొడ్డునుండి లోపలికిఁ బోయినమీఁదటఁదపస్వులైన బ్రహ్మణులతో నిండియున్నపరశురాము వేదిని జూచిరి. వశువులు, అశ్వినీకుమారులు, యముఁడు, కుబేరుఁడు, ఇంద్రు డు, విష్ణువు, విభువు, శంకరుఁడు మొదలైనవారి సుందరములైన మంది రము లవలోకించిరి. ఇటు మీదట వారుమరల శూర్పారక తీర్థములకు వచ్చిరి; మరియు నచటనుండి ప్రభాసతీర్థమునకుపెళ్ళిరి. ప్రభాసతీర్థము కాఠియావాడునందు దక్షిణ సముద్రముపై ద్వారకకు దూరముగానున్నది. అచ్చటవారు శ్రీ కృష్ణుని యాదవులను గలిసికొనిరి. ఇచటనుండి పాం డవులు విదర్భదేశాధిపతి చేత వృద్ధినొంది యున్న పవిత్రమైన పయోష్ణి నదికి వచ్చిరి. దీనిఁ బట్టి విదర్భ దేశములోని యీ నది గుజరాతిలో నుండి యుండునను ననుమానము బయలుదేఱు చున్నది. కాని పాండ వులు తరువాతఁ దిరుగఁ పయోష్ణినది అనఁగా తాప్తీ మీఁదికి వచ్చియుం

డురనుటయు సంభవమై యున్నది. ఎందుచేత? ఇచటి నుండి వారు వైడూర్య పర్వతము నర్మదా నదులపైకి వెడలిరి. పక్షాంతరమున ప్రభాస తీర్థము కాఠియా వాడులోనిదిఁ గాక యుండును. ఏదియో యగుఁగాక; నర్మదానదిలో స్నానముచేసి వారు రాజగు శర్యాతి యొక్క యజ్ఞ ప్రదేశమునకును చ్యవ నాశ్రమమునకును వచ్చిరి, ఈ రెండు స్థానములును నర్మదా తీరమందే యుండెను. ఇచట చ్యవన మునియు శర్యాతియొక్క కన్యయగు సుకన్యక యొక్క గాథ కలదు. ఇచటి నుండి మరల వారు సింధునది తీర్థము మీఁదికి వెళ్ళిరి; మరియు అచట సరణ్యములోనున్న సరోవరమును జూచిరి. అటు పిమ్మట వారు పుష్కర తీర్థము మీఁదికి వచ్చిరి; మరియు నార్థిక పర్వతముపై నుండిరి. తదనంతరము గంగా, యమున, సరస్వతుల యొడ్డులపై తీర్థములను జూచిరి. పాండవుల యొక్క యీ పశ్చిమతీర్థ యాత్రయొక్క వర్ధనము మిక్కిలి విచిత్రమును మిగుల స్పష్టముగా చేయఁ బడినదియునై యున్నది. విశేషించి పుష్కరము యొక్క వర్ణనము ఇతర స్థలములందు విశేషముగా చేయఁబడినట్లుగా నిచటఁ గనఁబడదు. నారద తీర్థయాత్ర యందును, ధౌమ్యతీర్థ యాత్ర యందును పుష్కరముయొక్క యెక్కువ వర్ణనమున్నది. పుష్కర క్షేత్రము బ్రహ్మదియై యున్నది. ఇది పుష్కరయొక్క పెద్దచెఱువై యున్నదినది కాదు. అయ్యది రాజపుతానా యొక్క మధ్య భాగమునఁ గలదు. దీని నిందలియర్బుదము అనఁగా ఆబూ పర్వతము అచట చెప్పఁబడియున్నది. నారదుని తీర్థయాత్ర వర్ణనమందు ద్వారక వర్ణన మున్నది. వాస్తమున పాండవుల కాలమందు ద్వారకకుఁ దీర్థత్వము ప్రాప్తముకాలేదు; మరియు నీ కారణము చేతనే పాండవులు ద్వారకకు వెళ్ళలేదు. నారదుని యొక్క వర్ణింపఁ బడిన తీర్థయాత్ర మహాభారతము నాఁటిది కాదు. ఆ సమయమున ద్వారక స్వభావము చేత నొక గొప్ప తీర్థస్థానము అయి యుండెను. ఈ స్థానము యొక్క బహు విస్తర వర్ణనము చేయఁబడి యున్నది. ( ద్వారకలో పిండారక తీర్థమునందు స్నానము చేసిన యెడల సువర్ణ లాభము కలుగుచున్నది. ఆ తీర్థమునందు నేఁటికిని పద్మ రూప చిహ్నములతోఁ గూడిన ముద్రలు ( బంగారు నాణెములు ) కనఁబడుచుండుట

వింత సంగతియై యున్నది. అచటఁ ద్రిశూల చిహ్నములు గల కమల ములు కనఁబడు చున్నవి. ఇచట నెల్లపుడును శంకరుని నివాసమున్నది. ఈ వర్ణనముఁ బట్టి మహాభారత కాలమున ద్వారక యొక ప్రసిద్ధమై యుం డెనని తెలియుచున్నది. కాని ద్వారకను క్రొత్తగా శ్రీకృష్ణుఁడు స్థాపించి, రైవత పర్వతము మీఁద నతఁడు క్రొత్త దుర్గము నిర్మించి, అతఁడు నిజధామమునకుఁ బోఁగా ద్వారక నీటిలో మునిగెనన్న సంగతిపై మనము ధ్యానముంచినపుడు, శ్రీకృష్ణుని లేక పాండవుల కాలమున ఈ తీర్థము లేకుండెనని స్పష్టముగాఁ బ్రకటమగు చున్నది. దీనిఁబట్టి స్వభా వతః, ఈ వర్ణనము మఱియు ఈ సంపూర్ణమైన నారదోక్త తీర్థయాత్ర మహాభారత కాలికము అనఁగా క్రీ. పూ. 250 వత్సరము దాదాపుదిఁకను ననుమానము కలుగుచున్నది.

ఇటీవల నుత్తరపు పైపు తీర్థముల వర్ణనములో యుగంధరము, అచ్యుతస్థలము, భూతలయము నసెడి యమునా నదిపై నున్న తీర్థముల వర్ణనము కలదు. ప్లక్షావతరణ తీర్థముయొక్క యుల్లేఖముండి తరువాత కురుక్షేత్రమునకుఁ బాండవులు వెళ్ళిన వర్ణనమున్నది. కురుక్షేత్రమునుండి సరస్వతియొక్క వినశన తీర్థ వర్ణనము కలదు. దీనితరువాత విపాశ అనగా వ్యాసానది వచ్చియున్నది. విపాశనుండి మరల వారు కాశ్మీరమునకు వెళ్ళిరి. దీని పిమ్మట మరల వారు మానస సరోవరము మీఁదికి వెడలిరి. అచట వారికి వితస్తానది యగపడెను. వితస్తానది యొద్ద జల, ఉపజల యను పేరుగల రెండు నదులు వారికిఁ దగిలెను. తరువాత నాకము శ్వేతగిరి పర్వతములపై నుండి వారు కైలాస పర్వతము మీఁదికి వెళ్ళిరి. అచటనే వారికి భాగీరథియొక్క దర్శనమయ్యెను. దీని తరువాత వారు గంధమాదన పర్వతము మీఁదికి వచ్చి చేరిరి; మఱియు విశాలా సంజ్ఞక మైన బదరి ( బైరి )యు నరనారాయణ ఆశ్రమమును నెచట నున్నవో, ఎచటి నుండి యలకనందానది బయలుదేఱు చున్నదో, అచటికి వారు వెళ్ళి చేరిరి. నర నారాయణాశ్రమ మందుఁ జేరిన మీఁదట ఘటోత్కచుని సాహాయ్యము చేత ముందునకుఁ బోయి మరల వారు భాగీరథినదిలో స్నా నము చేసి తమ తీర్థయాత్రను సాగించిరి.

## పుష్కర కురుక్షేత్రముల మహత్త్వము

మహాభారత కాలమందు రెండు తీర్థములు లేక తీర్థముల స్థానములు మిక్కిలిఁ బ్రసిద్ధములై యుండెను. ఒకటి యర్బుదము నొద్ద పుష్కర తీర్థము రెండవది కురుక్షేత్రము. పుష్కర తీర్థమన్ని తీర్థములకును రాజై యున్నది. పుష్కరమును నుదయాస్తమయము లందు స్మరించిన వానికిఁ గూడ నన్ని తీర్థముల యందును స్నానము చేసిన ఫలము దొరకఁ గలదు. పుష్కరతీర్థము విషయమై మఱియొక సంగతి, బ్రహ్మకు ఏక మాత్రమైన తీర్థమిదియే యను నదియై యున్నది. మిగిలిన తీర్థములన్నియు శివ విష్ణువులవి యన్య దేవతలవి యునై యున్నవి. నారదుఁడు చేసిన తీర్థప్రశంసయందు ఈ తీర్థములన్ని తీర్థములకు నాదిభూతమని చెప్పఁబడి యున్నది. రెండవ తీర్థము కురుక్షేత్రమైయున్నది. నారద తీర్థ వర్ణనమందు ఈ తీర్థమునకై యొకగొప్ప స్వతంత్రమైన యధ్యాయము ( వన ప. ౮౩వ యధ్యాయము ) ఈయఁబడి యున్నది. నేను కురుక్షేత్రమునకు నేగెదను, కురుక్షేత్రములో నుందును, పాప విముక్తుఁడనగుదును నని చెప్పెడు మనుష్యులు కూడ నున్నారు. దృషద్వతికి నుత్తరమునను, సరస్వతికి దక్షిణమునను నున్న క్షేత్రము లన్నియు పుణ్య భూములై యున్నవి. ఇన్ని క్షేత్రములలోను ననేకములు వేయేల నూఱుల కొలది క్షేత్రముల వర్ణనము ఈ యధ్యాయ మందుఁ జేయఁబడి యున్నది. వానిలో మూఁడు ముఖ్యమై యున్నవి. మొదట పృథూదకము, అన్ని క్షేత్రములలోను కురుక్షేత్రము పవిత్రమైనదని వ్రాసి యున్నాఁడు. కురుక్షేత్రమందు సరస్వతియు, సరస్వతియందుఁ బృథూదకయును నన్నిటికంటె నెక్కువ యుత్కృష్టమై యున్నవి. శ్యమంతక తీర్థము రెండవ తీర్థము. ఈ యైదు తటాకములను పరశురాముఁడు క్షత్రియులను సంహరించి వారిరక్తముతో నింపించెను. మూఁడవతీర్థము సన్నహతీ నామకమై యున్నది. సూర్య గ్రహణ కాలమందు ఈ తీర్థములో స్నానము చేసిన మనుష్యుఁడు శతాశ్వ మేధములు చేసినవాని పుణ్యమును పొందునని వ్రాసియున్నాఁడు. ఈ తీర్థములో అన్ని తీర్థములును గలవు. అందుచేత దీనిపేరు సన్నహతియై యున్నది. సూర్యగ్రహణ కాలమందు

కురుక్షేత్రమునఁ గౌరవులు, పాండవులు, యాదవులు, గోపాలురు అందఱు నొక చోటఁ బోగ్రైరని భాగవతమున వ్రాసి యున్నాఁడు. మఱియు నేఁడును సూర్యగ్రహణ కాలమునఁ గురుక్షేత్ర గమనమునకు విశేష మహిమ విశ్వసింపఁబడుచున్నది. అచట లక్షలకొలదిమనుష్యులు పోగుపడుచున్నారు.

ఆ కాలమున కురుక్షేత్రమునందు మరణించినవాఁడు ముక్తుఁడగునని దృఢ విశ్వాసముండెను. ఇందుచేతఁ గౌరవ పాండవులు ఈ క్షేత్రములో యుద్ధమునకై చేరియుండిరి. కాని ఇంతపెద్దసేన కురుక్షేత్రమునమండ కలుగుట యనెడుసంగతి సంభవముకాదు. స్వయముగా మహాభారతమందే కురుక్షేత్రమునకునడుమను నివసించి రెండు వైపులసేనలును మిగుల విస్తీర్ణమగు ప్రదేశమునవ్యాపించి యుండెనని వ్రాయఁబడియున్నది. పంజాబులోకొన్ని పూర్తిగాఁగురు జాంగలము రోహితకారణ్యము మఱియు మరుభూమిపరకును సైన్యము వ్యాపించి యుండెను. అహిచ్ఛత్రము, కాలకూటము, గంగా (పూల్, సేతువు, వారణము, వాటధానము అట్లు యమునకు దక్షిణము వైపున నున్న పరగతములవరకు సైన్యములు వ్యాపించియుండెను. భారతీయ యుద్ధము ఒక ప్రదేశమున జరిగెనని చాలమందియొక్క కల్పనకలదు. కాని మహాభారతములో మఱియొకచోట కురుక్షేత్రము, అహిచ్ఛత్రము, ( నేఁటిరామపురము ) వరకు వటిధానములనెడి గ్రామములను దక్షిణమున హస్తినా పురమునకుఁ చాలవరకుగాఁ గలవని వర్ణనము చేయఁబడియున్నది. ఇంతవరకు సేన లుండెను. దీనిఁబట్టి నూఱుకోసుల పొడవును నూటయేఁబది కోసుల వెడల్పుగల ప్రదేశమందు జరిగియుండునని తెలియుచున్నది.

సరస్వతి విషయమై మహాభారతములో యొక స్వతంత్రమైన యాఖ్యానము శల్యపర్వములో నియ్యఁబడియున్నది. దానిఁబట్టి మనకు సరస్వతియొక్క వృత్తాంతము చాలఁ దెలియుచున్నది. బలరాముఁడు యుద్ధమునకు వెళ్లక సరస్వతి తీర్థమునకువెళ్లెను. ఆసమయమున నీరు సరస్వతియొక్క పైదిక్కు నుండి అనఁగా ముఖము వైపునుండి ప్రవహించెడువైపునకు వెళ్ళెనని వ్రాసె యున్నాఁడు. వాస్తమున సరస్వతి సముద్రములోఁ గలియలేదు. ఇపుడుకూడ నయ్యది ఘాఘరానదికిఁ

బోయి కలియుచున్నది. కాని ప్రాచీన కాలమందు నెప్పుడును నీ నది యరబ్బుసముద్రములోఁ గచ్ఛ రణము యొద్దఁ గలియుచుండి యుండును. బలరాముఁడు తన యాత్రను ప్రభాస తీర్థమునుండి మొదలుపెట్టెను. ఈ తీర్థ మెప్పుడు ద్వారకకు దక్షిణమునఁ బడమటి యొడ్డుపై నున్నది. దీనికిఁబిమ్మట నతఁడు చమసోద్భేద తీర్థముమీదికిఁ బోయెను. అచ్చటి నుండి మరల నుదపాన తీర్థము మీఁదికేగెను. ఈ తీర్థము కేవలమొక నూయియై యుండెనని వ్రాసియున్నాఁడు. కాని యిచ్చట లతావృక్షముల పచ్ఛాఁదనముచేతను భూమియొక్క నున్నఁదనము చేతను సిద్ధులు సులభముగానే గుర్తింపగలరని గూడఁ జెప్పియున్నాఁడు. అవశ్యముగా నా నూయి మార్వాడులోని రేగిస్థానములో నుండి యుండును. దీనికిఁ బిమ్మట బలరాముఁడు వినశన తీర్థమునకుఁ బోయెను. ఇచ్చట శూద్రాభీరుల ద్వేషకారణమున సరస్వతి నష్టమయ్యెను, అనఁగ నిసుకలో గుప్తమైపోయెను. ఇందుచేత దీనిపేరు వినశనయై యున్నది.

అతఁడు సరస్వతినదిలో స్నానముచేసెను. ఇచ్చటనుండి యుత్తరమునకుఁబోవుచు నతఁడు సరస్వతి యొడ్డు పైనున్న యనేకతీర్థములను జూచెను. ముందునకుఁ బోవుచుఁ బోవుచుఁ నతఁడు ద్వైతవనమునకుఁ జేరెను. ఈ వనమును మునుపు వర్ణించియే యున్నాము. ఈ వనము హిమాలయపర్వతము క్రింది భూమికి సమీపమున నుండెను. దీనికి ముందు సరస్వతి దక్షిణముపైపున ప్రవహించుచున్నది. ముందునకుఁ బోయి యిచ్చట హిమాలయమునుండి యేడునదులు బయలుదేరియున్నవని వాసియున్నాఁడు; మరియు నయ్యవియన్నియుఁ గలిసి సరస్వతిగా నేర్పడెను. ఇందుచేత దీనికి సప్త సారస్వతను పేరు ప్రాప్తించెను అక్కడనుండి పిమ్మట ననేక తీర్థములను జూచుచు నతఁడు హిమాలయము లోపలఁ బ్రవేశించెను; మరియు అతడు సరస్వతి పుట్టిన వఱకు నతఁడు యాత్రచేసెను. సరస్వతియొడ్డున ననేక బ్రాహ్మణులు ప్రాచీన కాలము నుండియు నుండుచుండిరి. ఒకప్పుడు పండ్రెండు వత్సరములు అనావృష్టి యయ్యెను, కాబట్టి బ్రాహ్మణులకుఁ గొంచెమైనను దినుటకు దొరకకుండెను. అపుడు సారస్వతముని సరస్వతియొక్క యాజ్ఞవలన మత్స్యే

ములచేతఁ దనపొట్ట పోషించుకొని వేదములను రక్షించెను. భ్రాంతిపడి యితర స్థానములకుఁ బోయిన బ్రాహ్మణులకు సారస్వతముని, వేదాధ్యయనమును, జెప్పెను, ఇందుచేత వారందఱును సారస్వతమునికి శిష్యులైరి; అప్పటినుండియు మత్స్యములను దినెడి యాచారము ఈ బ్రాహ్మణులకు తటస్థించెను. అగుఁగాక, దీనికి, బిమ్మట యమున యొక్క ప్రతియొడ్డునకును వెళ్లి బలదేవుఁడు కురుక్షేత్రమున శ్యమంతపంచకములో దిగి గదాయుద్ధ సమయమున నుపస్థితుఁడయ్యెను. ఈ విధముగా సరస్వత్యాఖ్యానమందు సరస్వతీముఖమున నుద్గమము వఱకు వర్ణనము వచ్చియున్నది. ఈ యాఖ్యానముఁ బట్టి ప్రాచీన కాలమున సరస్వతీనది ప్రత్యక్షముగా మార్వాడనుండి ప్రవహించుచుఁ బశ్చిమ సముద్రమునకుఁ బోయి కలియుచుండెనని యనుమానించుటకు నేమాత్రము బాధయుఁ గన్పడదు.

## నగరములు

మహాభారతమందు నేయే నగరముల పేర్లు వచ్చెనో వీని యుల్లేఖము చాల వఱకుఁ బైవర్ణనములోనై యున్నవి. కౌరవులకు ముఖ్య రాజధానీ నగరము హస్తినాపురము, అగంగ యొడ్డున నుండెను. ఇపుడది నష్టమై పోయి యున్నది. కాని యది డిల్లీకి నాగ్నేయ దిక్కున నుండెననుట నిశ్చితము. పాండవుల రాజధానీ గ్రామమగు నింద్రప్రస్థము యమునకుఁ బడమటి యొడ్డునఁ బ్రసిద్ధమై యున్నది. పాండవు లడిగిన యైదు గ్రామములలోపలను నాలుగు గ్రామములివి – ఇంద్రప్రస్థము, వృకప్రస్థము, మాకంది అనఁగా వారణావతము మఱియొకటియేదో గ్రామమును కలిపి యైదు గ్రామములడిగి యుండిరి. ఇంద్రప్రస్థమునకు దక్షిణపు వైపున యమునా తీరమందు వృకప్రస్థ ముండెను. గంగయొడ్డున నొక మాకందియు, యమున యొడ్డున నొక మాకందియు నుండెను. నాల్గవ గ్రామమైన వారణావతము గంగా తీరమందుఁ గలదు. ఈ సంగతి యాది పర్వమునుఁ బట్టి తెలియుచున్నది. ( ఆది. అధ్యా 146 ). మత్స్యుల రాజధాని విరాట నగరమై యుండెను. దీని కుత్తరమునను నింద్రప్రస్థ

యమునకు దక్షిణమునను ఉపప్లావ్యమనెడి నగరముకలదు. విరాటనగరము జయపురము నొద్దఁ గలదు. ఇట్టి స్థితిలో నుపప్లావ్యము జయపురమునకు ఢిల్లీకిని నడుమ నుండవలయును. పాండవులు యుద్ధ సన్నాహమును నుపప్లావ్యములోఁ జేసియుండిరి. శూరసేనుల రాజధాని మథురయై యుండెను. అదియే యమున యొడ్డునున్న యిప్పటి మథురా నగరము. ద్రుపదుల రాజధాని గంగ కుత్తరమున అహిచ్ఛత్రమై యుండెను. అహిచ్ఛత్రము ప్రస్తుతమున సంయుక్త ప్రాంత మందలి రామా పురమునకు సమీపమునఁ గలదు. ద్రుపదుని మఱియొక రాజధాని కాంపిల్యము. ఇది గంగకుఁ బడమటియొడ్డున నుండవచ్చును. కాన్యకుబ్జము గాధియొక్క రాజధానియై యుండెను. ఇది గంగకుఁ బడమటి యొడ్డుననున్న యిప్పటి కన్యాజ పురము. యమునకు దక్షిణ తీరమునఁ జేది రాజ్య ముండెను. దానికి రాజధానియైన శుక్తిమతి వన పర్వములో 22 వ యధ్యాయమందు వర్ణితమై యున్నది. మహాభారతమున దేశ సూచిలో వత్సదేశము పేరు రాలేదు; వత్సరాజుయొక్క రాజధానియగు కౌశాంబి పేరుకూడ మహాభారతమునఁ బ్రత్యక్షముగా లేదు. అయినను దెలియుట యవశ్యమై యుండెను. ఆది పర్వము ( అ. 63 ) న రాజగు వసువుయొక్క నలుగురు పుత్రులును నాలుగు రాజ్యములను నగరములను స్థాపించిరని వ్రాసి యున్నాఁడు. వారిలో నొకఁడు కుశాంబుఁడు. కనుక అతఁడు స్థాపించిన రాజధాని కౌశాంబి యనుట స్పష్టము. గంగా యమునా సంగమ మందు ప్రయాగ యొక్క పేరు ప్రసిద్ధమై యున్నది. అది యిప్పటి ప్రయాగ యేయై యున్నది. ఉత్తరపు వైపునున్న యయోధ్య నగరము నేటి అయోధ్యయే. మిథిల విదేహ దేశము యొక్క రాజధానిగాఁ బ్రసిద్ధమై యున్నది. అంగ దేశములోని చంప యనెడు రాజధాని యొక్క పేరు మహాభారతములో వచ్చియున్నది. అది యిప్పటి బీహారు ప్రాంతమందలి చంపరాను. భారతీయ యుద్ధకాలమందు గంగా, యమునా ప్రదేశమందు భారతీయార్యుల సంపూర్ణ నివాసమై యుండెను; కాని యప్పటి చాల నగరముల వర్ణనము మహాభారతములో వచ్చి యుండెను. ఈ సంగతి యాశ్చర్య విషయమై యున్నది; మఱియు వానిలోఁ జాల నగరము లిప్పుడు శేషించి యుండెను. భీష్ముఁడు కాశిరాజు

కూఁతును హరించి తెచ్చెను, దీనిఁబట్టి కాశీనగర మా సమయమునఁగల దని యనుమానము చేయఁ బడఁగలదు. మగధుల రాజధానియగు పాటలి పుత్రము లేకుండెను. కాని రాజగృముండెను. దీని వర్ణనము గ్రంథ ములలోఁ గూడ నుండెను. బుద్ధుఁడీ నగరమునకు వెళ్ళియుండెను. ఈ నగరమిపుడు నష్టమైయుండెను. మగధలోని పుణ్యక్షేత్రమగు గయ యాస మయమున నవశ్యము ప్రసిద్ధమై యుండును. సంయుక్త ప్రాంతమం దలి యింకొక పగరము పేరు ఏక చక్ర మని కనఁబడుచుండెసు. బకా సురుండిచటనే చంపఁబడెను. ఈ నగరము గంగకు ఉత్తముగ నుండును. దీని తరువాత పంజాబు ప్రాంతములోని రెండు నగరముల పే రు లు మాత్రము వచ్చియుండెను. ఒకటి శాకలము రెండవది తక్షశిల. ఈ రెండు పత్తనములును నేడు నష్ట ప్రాయమై యుండెను. శాకలముస్యాలకోట సమీపమున నుండెను; తక్షశిల రావల్పిండి దగ్గర నుండెను. బొంబాయి ప్రాంతమందలి మూఁడు నగరములు పేర్కొనఁబడియుండెను—ద్వారక భరుకచ్ఛము శూర్పారకముఁ ఈ మూఁడు నగరములు నిపుడు కూడ నుండెను. అవిగాక యితరమైన జీవనగరపేరుల యుల్లేఖము కలదు, అవి విదర్భలో కాండినపురము భోజకటములై యుండెను. అది యమరా వతి యందు నుండగలవు.

భరతఖండములోని దేశములపేర్లు భీష్మపర్వము అధ్యా. 6 లోఁ జూపఁబడిన దేశములపై * గుర్తు పెట్టబడి యుండెను. కోష్టమునుంచిన దేశముల నామములు రెండుమాఱులు వచ్చియుండెను.

"ఈ క్రిందివిగాక యింకనుదెలియనివి చాల క్షుద్రనదులు గలవు; మహా నదులలో జ్ఞప్తి యున్నవి మాత్రమిచటఁ జెప్పఁబడి యుండెను. అనఁగా వీనిలోఁ గొన్ని నదులు మిగిలిపోయి యుండెను. -ఉదాహరణార్థము- ఉజ్జైనిలోని శిప్రానది.

# ఆర్యభాగము లేక ఉత్తర ప్రాంతపు దేశములు

1 కురువు *
2 పాంచాలము *
3 శాల్వము
4 మాదేయము
5 శూరసేనము *
6 పుళిందము
7 బోధము
8 మాలము
9 మత్స్యము ×
10 కుశల్యము
11 సౌశల్యము
12 కుంతి
13 కాంతికోసలము
14 చేది*
15 మత్స్యము ×
16 కరూషము ×
17 భోజము ×
18 సింధువు
19 పుళిందుకూ
20 ఉత్తమము
21 దశార్ణము *
22 మేకలము
23 ఉత్కలము
24 పాంచాలము *
25 కోసలము
26 నైకపృష్ఠము
27 ధురంధరము
28 గోధము *
29 మద్రము
30 కళింగము
31 కాశి *
32 అపరకాశి
33 జఠము
24 కుకురము
35 దశార్ణము
36 కుంతి
37 అవంతి •
38 అపరకుంతి
39 గోమంతము
40 మందకము
41 సండము
42 విదర్భ /
43 రూపవాహిక
44 అశ్మక ×
45 పాండురాష్ట్ర
46 గోపరాష్ట్ర
47 కారీతి
48 అధిరాజ్య
49 కుశాద్య
50 మల్లరాష్ట్ర
51 వారవాస్య
52 యువాహ
53 చక్ర
54 చక్రాతి
55 శక
56 విదేహ
57 మహథ
58 స్వక్ష
59 మలజ
60 విజయ
61 అంగ
62 వంగ
63 కళింగ
64 యకృల్లోమ
65 మల్ల — భార్గవ
66 సుదేష్ణ — పుండ్ర
67 ప్రహ్లాద — భర్గ
68 మాహిక — కిరాత
69 శశిక — సుదృష్ట
70 బాహ్లిక — యామున
71 వాటధాన — శక
72 ఆభీర — నిషాద
73 కాలతోయక — నిషద
74 అపరాంత — ఆనర్త
75 పరాంత — నైరృత
76 పాంచాల — దుర్గాల
77 చర్మమండల — ప్రతిమత్స్య
78 అటవీశిఖర — కుంతల
79 మేరుభూత — కోసల
80 ఉపాకృత — తీరగ్రన
81 అనుపావృత్త — శూరసేన
82 స్వరాష్ట్ర × — ఈజిక
83 కేకయ — కన్యాకాగుణ
84 కుందాపరాంత — లలథార
85 మాకేయ — మసౌర
86 కక్ష — మధుమంత
87 సముద్రనిష్టర — సుకందక
88 ఆంధ్ర × — కాశ్మీర
89 అంతర్గిర్య — సింధు
90 బహిర్గిర్య — సౌవీర
91 అంగ — గాంధార
92 మలయ — దర్శక
93 మగధ — అభిసార
94 మానవర్జక — ఉలూత
95 సమంతర — శైవల
96 ప్రావృషేయ — బాహ్లిక

| | | | |
|---|---|---|---|
| దార్వీచవ | త్రిగర్త | చీనకాంభోజ | కువింద |
| నవదర్వ | శాల్వసేని | సకృద్గ్రమా | అనర్త |
| [illegible]వాతజాద | వ్యూక | కులత్థ | మల్ల |
| రథారగ | కోకబక | హూణ | లాలకూట |
| బాహువద్య | హోష్ఠ | పారసీక | ప్రాగ్జ్యోతిగ |
| సుదామాక | సమవేగవశ | రమణ | అంతర్గిం |
| సువఃల్లిక | వింధ్యచువిక | భీన | బకిర్గిం |
| ఒఢ్ర | దక్షిణమువైపులోకులు | దశముక | త్రిగర్త |
| ద్రవిడ | పుళింద | శూద్రాభము | దాక్వ |
| కేరల | బల్కల | పరద | కోకనద |
| ప్రాచ్య | మాలత | కాశ్మీర | కాంభోజ |
| భూషిత | బల్లవ | వశు | వరద |
| | అపరపల్లవ | ఖాశక | కింపురుశ |
| వనవాసిక | కుళించ | ఓతచార | గుహ్యక |
| కర్ణాటక | కాలద | పల్హవ | దక్షిణమునసహదేవుని |
| మాహిషిక | కుండల | గిరిగహ్వర | దిగ్విజయములోని వారు |
| వికృ | కరట | ఆత్రేయు | సేక |
| మూషక | మూషక | భరద్వాజ | అపరసేక |
| ఝుల్లిక | స్తనబాల | స్తనపోషిక | కిష్కింద |
| కుంతల | సనీవ | ప్రోషక | మాక్షిం |
| సౌహృద | ఘటస్సృంజయ | కళింగ | శూర్పారక |
| నభకానన | అఠిక | కిరాతజం | కాలకూట |
| కౌకుట్ట | పాశివాలు | తోమర | దండక |
| చోళ | తనయు | హన్యమాన | కరహారక |
| కోంకణ | నునయు | కరభంజక | అంధ్ర |
| మాలక | ఋషిక | లంపాక | యవనపుర |
| నకుంగ | ఎదభ | లంపాకులన | కర్ణప్రాకరణ |
| | కాక | సాత్వకి చిమ్మెనట ఏకపాద | |

కుకుర ఉత్తరపై పుష్లేచ్చులు( ద్రో.) పురుపాద
అంగార తంగణం, పరతంగణ అర్జునునిదిద్వజయ భీమునిదిగ్విజయము
మారిష ఇవిదక్షిణలోకులలోపార ములో (సభా పన)లోని వారు
ధ్వజిన్యుత్సవసంకేత పాటువలనచెప్పబడును ఉత్తరవుపై పుపుమాల
యవనయ వచ్చినవారి పేర్లు అయోధ్య నేపాల ఐరావతి

| | | | |
|---|---|---|---|
| | నీవార | వీరవతి | వేదాస్య |
| గోపాలక | విత్త | వస్త్ర | హరిశ్రిక |
| సుపార్శ్వ | అహిత | సువస్త్ర | హంశ్ర |
| మలశ | తూర్పుజిల | దేవిక | సుప్రయోగ |
| అనఘ | శుండిక | వేదస్మృత | పవిత్ర |
| అభయ | కర్మఖండ | వేదవతి | కుండలి |
| వత్స | మధ్య ప్రదేశము | త్రివద | రాజని |
| మణిమాక | వత్స | ఐక్షుల | పురమాలిని |
| శర్మక | మోహనము | కృమి | పూర్వాభిరామ |
| వర్మక | త్రిపుర | కరీషిశి | వీర |
| శకబర్చన | దక్షిణము వైపు | చిత్రవాక | భీమ |
| సుహ్య | శైల | చిత్రసేన | మోఘవతి |
| దంఢదార | నల | గోమతి | పాశాయని |
| లౌహిత్య | పడమటి వైపు | ధృతపాక | పాపహర |
| మణిపుర | బర్మక | గండకి | మహేంద్ర |
| అర్జునుని | మొదట భీష్మ పర్వము | కౌశికి | పాటలావతి |
| యాత్రలో నకులుని | 9అధ్యాయనదుల పేర్లు | నిచిత | కరాషిణి |
| పశ్చిమ యాత్ర | గంగ | రోహతారణ | అనుసౌష్ణ |
| లోని వారు | సింధు | రహస్య | కుశచీర |
| మాత్రమయు | సరస్వతి | శతకుంభ | మకరి |
| శైరీషక | గోదావరి | సరయూ | ప్రకిర |
| మహత్థ | నర్మద | చర్మణ్వతి | మేన |
| అంచష | బాహర | వేత్రవతి | హేవ |
| మాతిక | మహానది | హస్తిసోమ | ధృతవం |
| పంచకర్పట | శతద్రు | దిక | పురాకల |
| శాల్వ | చంద్రభాగ | శరావతి | అనుష |
| కేకయ | యమున | పయోష్ణి | శైబ్య |
| తక్షశిల | దృషద్వల | వేణ | కాపి |
| బాకీక | విపాశ | భామరథి | సదానీర |
| క్షుద్రికి | విపావ | కావేరి | అధృష |
| కర్ణుని దిగ్విజయ | స్రేతవతి | చులుక | కుశధార |
| యాత్రలో | (వనకృష | వాణి | సదాకాంత |
| పర్వ)ఎక్కువమం | వేణ్య | శతబల | శివ |

మ హా భా ర త మీ మా ం స

| | | |
|---|---|---|
| బ్రహ్మమేధ్య | బృహద్ధ్వని | కృష |
| గౌరి | శీఘ్రు | మందవాకిని |
| కంపన | పిచ్ఛిల | బ్రాహ్మణి |
| హిరణ్యవతి | భారద్వాజ | మహాగౌరి |
| వయ | కశికి | దుర్గ |
| వీరకర | శోణిగా | చిత్రపల |
| పంచమి | బాహద | చిత్రరథ |
| రథచిత్ర | చంద్రమ | మంజుల |
| జోనురథ | దుర్గ | మందాకిని |
| విశ్వామిత్ర | శిత్రిశిల | వైవరణి |
| కపింజల | బ్రహ్మవిద్య | కోష |
| ఉపేంద్ర | బృహద్వల | శుక్తిమతి |
| బహుళ | యవక్ష | అనంగ |
| కువీర | రోహి | వృషసి |
| అంబువాకిని | జంబూనది | లౌకిత్య |
| వినతి | సునస | కరలోయ |
| కింజల | తమన | వృషక |
| వేడే | యూసి | కుమారి |
| మంగవేడే | వసాకున్య | ఋషికుబ్జ |
| ఎదిశ | వారణసీ | మారిష |
| కృషవేణి | నీల | సరస్వతి |
| తామ్రమ | ధృతవతి | మందాకిని |
| కపిల | పర్ణాశ | సుపుణ్య |
| కలు | మాధవి | సర్వ |
| సునయ | వృషభ | గంగ |

# పదమూడవ ప్రకరణము

## జ్యోతిర్విషయకమగు జ్ఞానము

మహాభారతకాలమున భారతీయార్యులకు జ్యోతిష శాస్త్రజ్ఞానమెంత యుండెనో యిపుడు చూడవలయును. మహాభారతమందు జ్యోతిషశాస్త్ర జ్ఞాన మెంత యుండెనో యిపుడు చూడవలయును. మహాభారతమందు జ్యోతిర్విషయకములైన యుల్లేఖములఁబట్టి మహాభారత సమయమునకు విశేషమైన జ్యోతిషశాస్త్రజ్ఞానము ప్రాప్తమై యుండెనని సిద్ధించుచున్నది. దీనిఁబట్టి చాలకాలము క్రితమే వేదాంగ జ్యోతిషముయొక్క నిర్మాణమయ్యెను. జ్యోతిషశాస్త్రమున గణిత శాస్త్రమునకుఁ జాలఁ బ్రదేశము కూడ నై యుండెను. సూర్యచంద్ర గణితములను జేయుపద్ధతి లోకులకుఁ దెలిసియుండెను. అయినను సమగ్రముగా జ్యోతిషశాస్త్రము యొక్క యౌన్నత్యము మహాభారతకాలమునకుఁ దరువాతనే యయ్యెను. ఇట్లంగీ కరింపక తప్పదు. యూనానులకుఁగూడ జ్యోతిషవిషయకజ్ఞానము మహాభారతకాలమునకుఁ బిమ్మటనే వర్ధిల్లెను మఱియుఁ గ్రిస్తుశక ప్రారంభ మునకు దాదాపున నా జ్ఞానమునకు భారతీయ జ్యోతిషశాస్త్ర జ్ఞానముతో సమ్మేళనము జరిగెను; దీనికిఁ బిదప, సిద్ధాంతము మున్నగు గొప్ప గొప్ప విస్తృతములైన యుత్తమ గ్రంథములు భారత వర్షమందుఁ దయారయ్యెను. ఇపుడీ భాగమున భారతీయ కాలమందు జ్యోతిషజ్ఞానమే విధముగా వర్ధిల్లుచు వచ్చెనో యీ సంగతి విచారింపఁబడును.

భారతీయ కాలమునకు మొదట అనఁగా వైదిక కాలమునకుఁ జివర భారతీయార్యులకు 27 నక్షత్రములయు. మఱియు వాని నడుమను జంద్రగతియొక్కయుఁ జక్కగా జ్ఞానము కలిగియుండెను, యజుర్వేద మందు నిరువదియేడు నక్షత్రములు పఠింపబడి యున్నవి. ఈ పేరులే మహాభారతములోఁ గూడ వచ్చుచున్నవి. చంద్రుఁడ దినమున నిరువది

యేడు నక్షత్రములలో నేదోయొక నక్షత్రమున నుండుచుండ సూచింపబడి యుండెను. ప్రస్తుతకాలమున తేదీ యుపయోగింపఁబడినట్లు భారతీయ కాలమున నక్షత్రము లుపయోగింపఁబడుచుండెను. ఈ తదీయందీపని జరగెనని యిపుడు చెప్పఁబడుచున్నట్లే యతపని యీ నక్షత్రమున జరఁగియుండెనని మహాభారత కాలమునఁ జెప్పఁబడుచుండెను. సమగ్రముగాఁ ఇరువైయేడు, నక్షత్రముల సంఖ్య యొక లెక్కను బట్టి తక్కువైయుండెను. ఎందుచేత? చాంద్రమాసమిరువదియేడు దినములకంటెఁగొంచె మెక్కువగా నున్నది. కనుకనే యొకప్పుడిరువదియేడు నక్షత్రములకు బదులుగా నిరువది యెనిమిది నక్షత్రములని తలంచెడు రీతి యలవాటై పడియుండెను. కాని యీ యిరువది యెనిమిది నక్షత్రములును మొట్ట మొదట కాల్పనికములే యై యుండెను. వానికై కాల్పనిజస్థానముకూడ నీయఁబడి యుండెను. ఈయబిజ్జి నక్షత్రము విషయమై మహాభారతఁ వనసర్వమందు నొక యద్భుతమైన కథ వ్రాయఁబడి యున్నది. వన పర్వములో 230 వ యధ్యాయమందు నీ శ్లోకములు వచ్చియున్నవి;—

> అభీజిత్స్పర్ధమానాతు రోహిణాకన్యసీస్వసా।
> ఇచ్ఛన్తి జ్యేష్ఠతాం దేవీ తపస్తప్తుంవనం గతా॥
> తత్రమూడోస్మి భత్రం తేనక్షత్రం గగనాచ్చ్యుతం।
> కాలంత్విమం పరం స్కరదబ్రహ్మణా సహ చింతయ ॥
> ధనిష్ఠాదిస్తదా కాలో బ్రహ్మణా పరికల్పితః ॥
> రోహిణీత్వభవత్పూర్వం ఏవం సంఖ్యా సమాభవత్ ॥
> ఏవముక్తేతు శక్రేణ త్రిదివం కృత్తికా గతాః।
> నక్షత్రం సప్తశీర్షాభం భాతి తద్వహ్నిదైవతమ్ ॥

ఈ శ్లోకముల కర్థము సరిగా నగుటలేదు. కాని యభిజివృక్షత్రము నకు ఘనతకై రోహిణితో జగడము సంభవించిన కారణముచేత నాయభిజిత్తుగగనము నుండి యుఁజికెనని స్పష్టముగాఁజెప్పఁబడియున్నది. ఆ సమయు

స్కందుఁడు, బ్రహ్మదేవునితో ఈ విషయమై విచారించి, ధనిష్ఠతోఁ గాల మును లెక్కింప నారంభించెను. ఇంతకుఁ బూర్వము రోహిణి ముఖ్యమై యుండెను. ఈ విధముగా వ్యవస్థ చేసిన పిమ్మట సంఖ్య పూర్ణమయ్యెను. మఱియుఁ గృత్తిక యాకాశమున కెక్కెను. ఏడు తలలుగల యీ నక్ష త్రము వహ్నిదైవతమై నేఁడు గగనమందు వెలుఁగుచున్నది. ఈ కథకు ముందటి వెనుకటి కథలతో సంబంధమెట్లో యేమో యూహకు రాకున్నది అవును, ఇప్పుడు ఉపలబద్ధమైయున్న గర్గ సంహితను బట్టి కూడ జ్యోతిష శాస్త్రముతో స్కందదేవతకు సంబంధమున్నట్లగపడు చున్నది. ఈ గ్రంథ మందు శివస్కందుల సంభాషణ రూపమున సమస్త జ్యోతిష జ్ఞానమును చెప్పఁబడియున్నది. ప్రాచీనకాలమున నక్షత్రములకు మొదట రోహిణీ నక్షత్రముండెనని తెలుచున్నది; తరువాత నయ్యది సంపాతముగ వెను కకుఁ దొలఁగిపోయిన కారణమున విరుద్ధము కానారంభించెను. మఱియు గాలగణనయందు గడబిడ కానారంభమయ్యెను. కనుక నొకనక్షత్రమును వెనుకను దోసి కృత్తికా నక్షత్రముతో నక్షత్రగణన యగుటయారంభ మయ్యెను. మహాభారతమున "ధనిష్ఠాది స్తదాకాలః" అనియు నుల్లేఖము న్నది. ఇదియే కృత్తికాది గణనయని చెప్పఁబడికూడ నున్నది. మునుపు రోహిణ్యాది గణన యుండెను, ఇపుడశ్విన్యాది గణనయున్నది, వీనినడు మను శ్రవణ నక్షత్రమందు నుత్తరాయణము వచ్చినట్లుగూడ నుల్లేఖము మహాభారతమందుఁ గలదు. అనుస్మృతి (అశ్వమేధపర్వము) లోఁ జెప్పి యున్నాఁడు— "శ్రవణాదీని ఋక్షాణి ఋతవః శిశిరాదయః" ఇది వేదాంగ జ్యోతిషమునకుఁ బిమ్మటిది అనఁగా క్రీ॥పూ। 400 కు దాదాపు స్థితియై యున్నదని దీక్షితుఁడు చెప్పియున్నాఁడు. దీని యుల్లేఖము మఱి యొక చోటఁ జేయఁబడియున్నది. లోకమాన్యతిలకు వైదిక కాలము నకు మునుపు మృగ శీర్షమునందు నక్షత్రారంభమగుచుండెనని సిద్ధము చేసియున్నాఁడు. అగుఁగాక దీనిమర్మము క్రింది వివేచనముఁబట్టి తెలియఁ గలదు.

భారతీయ కాలారంభము మొదలుకొని మహాభారత కాలపర్యంతము నక్షత్రము యారంభమునఁ గృత్తికలే యుండెను. బ్రాహ్మణగ్రంథము

లందుఁగూడఁ గృత్తికలే ప్రారంభమున నున్నవి. మహాభారతములోని యనుశాసన పర్వమునందలి 64 వ యధ్యాయమందు సమస్త నక్షత్రముల సూచి నిచ్చి ప్రతి నక్షత్రము నందును దానము చేయుటవలన వేఱు వేఱు విధములైన యేపుణ్యములు లభించుచున్నవో చెప్పియున్నాఁడు. ఈ సూచియందుఁగూడ ప్రారంభములోఁ గృత్తికలే యున్నవి. ఏడు నక్షత్రముల నొక వరుసగాఁ జేసి యన్ని నక్షత్రముల పట్టిక నిచ్చుట నీయఁబడుచున్నది.—

| | | | |
|---|---|---|---|
| కృత్తిక | మఘ | అనురాధ | ధనిష్ట |
| రోహిణి | పూర్వ | జ్యేష్ఠ | శతభిషక్కు |
| మృగశిర | ఉత్తర | మూల | పూర్వాభాద్ర |
| ఆర్ద్ర | హస్త | పూర్వాషాఢ | ఉత్తరాభాద్ర |
| పునర్వసు | చిత్ర | ఉత్తరాషాఢ | రేవతి |
| పుష్యమి | స్వాతి | అభిజిత్తు | అశ్విని |
| ఆశ్లేష | విశాఖ | శ్రవణము | భరణి |

ఎపుడును బూర్వకాలమునఁ బ్రారంభము మృగశీర్షతో నగుచుండెను. పిదప రోహిణీతో నారంభమైనపు డపశ్యమ్ముగా, శతభిషనక్షత్రమందుఁ గాలారంభమగుచుండెను. కృత్తికలతోఁ బ్రారంభమైనపుడు కాలము ధనిష్ఠాదియై యుండెను. ఈ సంగతి చదువరుల ధ్యానమునకు రాఁగలదు. ప్రస్తుతము భారతకాలమునాఁటి కులాగణన కట్టుబడిపోయెను. అశ్వినితో నక్షత్రారంభము కామొదలిడెను మఱియుఁగాలారంభముఁ గూడ వసంతారంభముతో నగుచున్నది. మహాభారత కాలమున కిటీవలి సమయమున నశ్విన్యాది గణన యారంభమయ్యెను. మఱియు దానికి మైత్రి, వృషభాది ద్వాదశ రాసులయందున్న చంద్రునికోఁ గలుపంబడెను. క్రీస్తుశకారంభము మొదలుకొని నేఁటివఱకు నీ నక్షత్ర గణనయే నడచిన

చున్నది. మునుపటి క్రమముననుసరించి, సంపాతగతిచేత పిమ్మట నొక ప్పుడు గాకున్న మఱి యొకప్పుడు నక్షత్రారంభమొకటి రెండు నక్షత్రముల వెనుకకు రేవతి లేక యుత్తరాభాద్రతోఁ జేయుట తటస్థించియుండును.

పూర్వము రోహిణీ నక్షత్రమొకానొకప్పుడు నక్షత్రములన్నింటిలోను ప్రముఖమై యుండెను. ఈ విషయమును జూపెడి యొకానొక కథ మహా భారతములో నున్నది. ఈ యిరువై యేడు నక్షత్రములును దక్షప్రజాపతి కన్యకలై యున్నవి; అతఁడు వీరిని జంద్రునికిచ్చి వివాహముచేసెను. కాని చంద్రుడందఱను సమానముగా ప్రేమింపక రోహిణిపై ఎక్కువ ప్రేమను జేయనారంభించెను. అపుడు మిగిలిన వారు దక్షునితో ఈ సంగతి చెప్పుకొనిరి. కాని యీ విషయమై దక్షుని మాట వినడాయ్యెను. అపుడు దక్షుఁడు చంద్రునికి నీవు క్షయరోగి వగుదువుగాకని శాపమిచ్చెను. ఇందుచేతఁ జంద్రునికి క్షయము సంభవించు చున్నది. మఱియుఁ బ్రభాస తీర్థమున స్నానము చేయుటవల్ల నయ్యది పోవుచున్నది. (శల్య పర్వము సరస్వత్యాఖ్యానము) ఈ కథకుఁ దాత్పర్యము చంద్రుని గతి న్యూనాధిక పరిమాణము చేత రోహిణీ నక్షత్రమందతఁడు చాలకాలము వఱకు నుండునట్లగ పడుచున్నది. ప్రభాసతీర్థము పడమట వైపునఁ గలదు. మఱియు నమావాస్యకు పిమ్మట చంద్రోదయము పడమట నగుచున్నది. దీనిఁబట్టి ప్రభాసతీర్థమందు స్నానము చేయుటవలనఁ జంద్రుఁడు క్షయ రోగము నుండి ముక్తుఁడగు చున్నాఁడను కల్పన యయ్యెను.

భిన్న భిన్న నక్షత్రములఁ బట్టి చంద్రగతియొక్క జ్ఞానము మహా భారత కాలమందుఁ జక్కగా నుండెను. ఇట్లే నక్షత్రముల యందు సూర్య గ్రహముయొక్క నముకూడ మహాభారత సమయమున సంపూర్ణమై యుండెను. రాత్రవఁగానే నక్షత్రములయందుఁ జంద్రగతి యగపడుట సహజమై యున్నదనుటలో సంశయము లేదు: కాని సూర్యగతి కేసి సూర్యోదయాస్తమయముల పిదపనే యేయే నక్షత్రమంగారకుని మీఁద నగపడుచున్నదో చూచి ధ్యానమిచ్చుట సంభవమై యున్నది. ఈ విధముగా భారతీయార్యులకు నక్షత్ర మండలమందు సూర్యుఁడు గూడ తిరు

గుచున్నాడను సంగతి తెలిసి యుండెను. సూర్య మండల మంతయు తిరుగుటకై 365 దినములు పట్టును. ఇంత కాలములోఁ జంద్రుఁడు 354 దినములలో పంద్రెండు మాఱులు తిరుగు చున్నాఁడు. కొన్ని దిన ములు మిగులుచున్నవి. మాసముల కల్పన చంద్రుఁడు తిరుగుటను బట్టియే యగుచున్నదనియు నమావాస్య పూర్ణిమల బట్టి మాసమున మగు చున్నదనియు స్పష్టమై యున్నది. సంవత్సర కల్పన సూర్యగతిని బట్టి కలుగుచున్నది. ఇట్లొక వత్సరములో పంద్రెండు నెలలును పదునొకండు దినములును నగుచున్నవి. ఈ రీతిని బట్టి చూడఁగా చంద్ర మాసము లతో సౌర వత్సరమునకు మైత్రి కుదరదు. అయినను భారతీయార్యులు చంద్రమాసమును సౌర వత్సరమును గూడా విడువలేదు. ఎందుచేత ? పూర్ణిమ యందును నమావాస్య యందును వారికి విశేష యజ్ఞములుండు చుండెను. మఱియును వారు సౌర వర్షమును కూడ విడువజాల కుండిరి. కారణమేమనఁగా ఋతుమాసము సౌర వర్షముపై నాధారపడి యున్నది. కాఁబట్టి చంద్ర మాసములతో కూడ సౌర వర్షమునకు మైత్రి కుదుర్చు టకై ప్రయత్నించిరి. మహాభారత కాలమున వారికి సౌరవర్షము సరిగా 366 దినములని తెలియదు. ఈ లెక్కనుబట్టి వారు పంచవర్ష పరిమితమైన యుగమును గల్పించి యీ యైదు సంవత్సరములయందును రెండు మాసములెక్కువగాఁ గలిపెడు పద్ధతిని సాగించిరి. అయిదు వర్షములలో రమారమి రెండు నెలలెక్కువ (12-6-30 దినములు) చాంద్రమాసమున బెరుఁగుచున్నవి. మనము మునుపొక చోట, ఈ పద్ధతి భారతీయ యుద్ధ కాలమున నుండి యుండునని చూపియేయుంటిమి. భారతీయ యుద్ధ సమయమునఁ గొందఱు లోకులు 354 దినముల చాంద్రవత్సరమును మన్నించియుండి యుందురు. మఱికొందఱు 366 దినముల సౌరవర్ష మును మన్నించి యుందురు. ఇందుచేత, పాండవులు పదుమూఁడేండ్ల వనవాసము మఱియు నజ్ఞాతమాసము, నియమానుసారముగా, భావించిరి యిది గాకున్నను—ఈ విషయమై వివాదము తటస్థించిన మీఁదట భీష్ముఁడు [దీని నిర్ణయించుచు] జెప్పియున్నాఁడు-

> పంచమే పంచమే వర్షే ద్వేమాసా వుపజాయతః
> ఏవమప్యధికామాసాః పంచచద్వాదశక్షపాః ॥
> త్రయోదశానాం వర్షాణామితిమే వర్తతే మతిః ।

ప్రతియైదు సంవత్సరములకు రెండు నెలలుత్పన్నమగుచున్నవి. ఈ రెండు మాసములను వేదాంగ జ్యోతిషమందు నేడు వర్షముల యుగము లలో రెండుమాఱులు ప్రత్యేకప్రత్యేకముగాఁ గలిపెడు పద్ధతి చెప్పఁబడి యుండెను. మొదటి మాసము మొదటి 2/12 వర్షములయందు శ్రావణము నకు ముందును రెండు మాసములు పంచ వర్షయుగమునకుఁ జివర మాఘమునకు ముందును; అనఁగా మహాభారతకాలమున శ్రావణ మాఘ మాసములు రెండే యధికము లగుచుండెను, యీ యధికమాసముల యుల్లేఖము మహాభారతములో మఱియొకచోట నెచ్చటనులేదు.

సూర్యచంద్రులగాతులు తెలిపిన తరువాతఁ బంచవర్ష యుగము మహాభారత కాలమునఁ బ్రచలితమై యుండెను. వీని సూక్ష్మగణనకై బేయఁబడిన కాల సూక్ష్మవిభాగము లెట్లున్నవి:- కాలకాష్ఠ, ముహూర్తము దినము, పక్షము, నెల, ఋతువు, వత్సరము, యుగము. వీనికోష్ఠము కూడ మహాభారతములో శాంతిపర్వమందుఁగలదు.

> కాష్ఠానిమేషా దశాపంచచైవ త్రింశత్కాష్ఠా గణయేత్కలానాం ॥
> త్రింతత్కలశ్చాపి భవేన్ముహూర్తో భాగఃకలాయా దశా మశ్చయశస్యాత్॥
> (శాంతి పర్వము అ.231)

ఇచట నిమేషమనఁగా ఱెప్పవేయుట యనియే గణించియున్నాడు.

| | | | |
|---|---|---|---|
| నిమేషములు- | కాష్ఠ | దినములు- | నెల |
| కాష్ఠలు- | కల | నెలలు- | వర్షము |
| కలలు- | ముహూర్తము | వర్షములు- | యుగము |
| ముహూర్తములు- | దినము | | |

ప్రతికాలమును ప్రతికాష్టకును ప్రత్యేక నామములులేవు. గాని దినము నిండనున్న ప్రతిముహూర్త మునకును వేఱు వేఱు నామములున్నవి. మహాభారతకాలమున నీ ముహూర్తములకు సంబంధము ప్రతిధార్మిక కర్మము తోడను శాఖాశాఖముగా నూహింపఁబడుచుండెను. ఏతదను సారముగాఁ బూర్వాకాలము మొదలుకొని నేఁటిదాక,ఈ ముహూర్తమందు పనిచేయవలెను. ఈ ముహూర్తమందు పని చేయఁగూడదు. అను దృఢనిశ్చయమున్నది. కాని మహాభారత కాలమున ముహూర్తశబ్దమున కున్నయర్థమైతే మఱువఁబడియున్నది. ప్రస్తుతకాలమున ముహూర్తమున కర్థము ఏదో యొక శుభము లేక యశుభమయిమై యైపోయినది. ముహూర్తమనఁగా దాత్ప ర్యము కొంతకాలమని ప్రస్తుతకాలమందుఁ దఱచుగా నెవ్వరికిని దెలియకున్నది. ప్రస్తుతకాలమున నైతే ముహూర్త కాలము సాధారణముగా నొక యర్థ నిమేషముగాఁ గైకొనఁబడుచున్నది; కాని యుల్లిఖితమైన పటము ననుసరించి ముహూర్తము రెండు గడియలు లేక 48 నిమేషములగుచున్నది. ఉల్లిఖితమైన పటమందును అమర కోశమందు నీయఁబడి యున్న పటమందును గొంతభేదమున్నది.

అష్టాదశ నిమేషాస్తుకాష్ఠా స్త్రింశత్తు తాః కలా ।
త్రింశత్కలో ముహూర్తస్తు త్రింశద్రాత్ర్యహనీ చ తే ॥

ఇందు భేదము స్పష్టమైయున్నది. దీనిఁబట్టి మహాభారతానంతరము పూర్వపు జ్యోతిషకాలగణనా పద్ధతిలోఁ గొంచెము భేదము తటస్థించి భిన్నత్వము సంభవించెను. రెండు లెక్కలలోను దినము మాత్రమొక్కటియే యైయున్నది. ఒకటి సూర్యోదయము మొదలుకొనియు రెండవది సూర్యాస్తమయము మొదలుకొనియు దినము లేక అహోరాత్రము రెండును సమానముగా విశ్వసింపఁబడియున్నది. దినమునకుఁ దరువాత పరిమాణము మహాభారతమునాఁడును దానికిఁ బిమ్మటను జాల వేఱ

య్యెను. మహాభారత కాలమునకుఁ బిమ్మట నేడు దినములొక సప్తాహ మయ్యెను. వేఱు వేఱు గ్రహముల నామములమీఁద బ్రతిదినమునకును వేర్వేఱు నామములుంచఁబడెను. ఇట్లు వారము లుత్పన్నమయ్యెను. మహాభారతములో నీ వారములు లేనేలేవు. ఈ వారముల యుత్పత్తి ముందు ముందెట్లయ్యెనో తెలిసికొనవలయును. ఈ వారములు మొట్ట మొదట ఖాలియము లోకులలో నుత్పన్నములై యచటనుండి ప్రపంచ మంతటను వ్యాపించియున్నవి. హిందుస్థానమందీవారములు మహాభారత కాలాంతరమున బైబ్రిక్టియను యునానులతోపాటు వారి జ్యోతిష్కుల పద్ధతితో సహితము మన యర్వాచీన జ్యోతిషశాస్త్రమందు బ్రవేశించెను

వైదిక కాలమందుఁ బ్రసిద్ధమై యున్న యాఱు దినములకుఁ బృష్యమనుపేరుగల దండక నామము మహాభారతమందుఁ గనఁబడదు. ఈ యాఱు దినముల దండకము, యజ్ఞోపయోగమునకై వైదికకాల మునఁ గల్పింపఁబడి యుండెను. 277 దినముల చాంద్రవత్సరము, 779 దినములు సామాన్యవత్సరము మఱియు 2:7 దినములు నక్షత్ర సౌరవ వత్సరమునగుచున్నది. యీ మూడు వత్సరములును వైదికకాలమున విశ్వసింపఁబడి యుండెను. మఱియు వానిలో నాఱాఱు దినముల యంత రముండెను. సామాన్యముగా నెలకు 30 దినములగుచున్నవి. ఆఱు దిన ముల యీ విభాగము యజ్ఞకృత్యమునందు మిగుల నుపయోగపడు చుండెను. ఈ యాఱుదినముల పృష్ట్యము అనఁగా సప్తాహము, మహా భారతమున, యజ్ఞమునకుఁ బ్రాబల్యము పోయిన పిదప నిలిచిపోయి యుండును. తిథి నక్షత్రము ఈ రెంటి కారణముచేతఁ జాంద్రమానగ ణనమందు, దినముయొక్క మహత్త్వము భిన్న భిన్న మగుచుండెను. ఏ దినమున నే నక్షత్రమందుఁ జంద్రుఁడుండునో, యదే యీ దినము యొక్క నక్షత్రమై యున్నది. మహాభారత కాలమున తిథికంటె నక్షత్ర

మునకు మహత్త్వమెక్కువయై యుండెను. 27 నక్షత్రములకు 27 భిన్న దేవతలు విశ్వసింపఁబడి యుండిరి. మఱియు నా దేవతల స్వభావము ననుసరించి యీ యా నక్షత్రమువలన గుణము లేక యవగుణ మగు నని విశ్వసింపఁబడుచుండెను. ఈ విధముగా, మహాభారత సమయమందు ఫలజ్యోతిష దృష్టిచేత నక్షత్రముల యుపయోగ మెక్కువ యగుచుం డెను, ఎచ్చటికైనను వెళ్ళుట, వివాహము చేయుట లేక యుద్ధము చేయుట తటస్థించునేని, నక్షత్రము చూచుకొని యోగ్యనక్షత్రమందు జేయవలసి యుండెను. ఏ నక్షత్రమందు మనుష్యుఁడు జన్మించునో యా నక్షత్రము ననుసరించి యా మనుష్యుని యాయువునందు సుఖ దుఃఖములు సంభవించుననెడి కల్పన మహాభారత సమయమునఁబూర్ణ స్వరూపమున నడచి యుండెను. ఇందుచేత, జన్మకాల నక్షత్రము నిచ్చెడు పద్ధతి మహాభారతమువల్ల దృగ్గోచరమగుచున్నది. యుధిష్ఠిరుని జన్మము ఏ మంచి నక్షత్రముల గుణములయందు మఱియు సమయము నందు నైయుండెనో వాని వర్ణనము నిట్లు చేసియున్నాడు.

> ఐంద్రే చంద్ర సమారోహే ముహూర్తే భిజిదష్టమే ॥
> దివోమధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేతి పూజితే ॥

ఇందు చంద్రసమారోహము అనఁగా ఇంద్రదేవతది యని చెప్పఁ బడి యున్నది. దీనిఁబట్టి యే విధముగా నింద్రుఁడు సమస్త దేవత లకు రాజై యున్నాడో యదేవిధముగా యుధిష్ఠిరుఁడు కూడ నందఱకు రాజగునని సూచితమగుచున్నది. ఇది జ్యేష్ఠా నక్షత్రము. చూడఁగా మహా భారత సమయమున నక్షత్రముల మహత్త్వము సమస్తముకంటె శ్రేష్ఠ మని విశ్వసింపఁబడుచుండెను. మఱియు జన్మనక్షత్రము ననుసరించియే మనుష్యుని యాయుర్దాయ గడచుచున్నదని యూహింపఁబడుచుండెను, అయినను ఫలజ్యోతిషమును నిందించువారును వానిపైని విశ్వాసముకల వారును నా కాలమునఁ గూడ నుండిరి.

బహవస్సంప్రదృశ్యంతే తుల్యనక్షత్ర మంగళాః ।
మహత్తు ఫలవైషమ్యం దృశ్యతే కర్మ సంగిషు । [వనపర్వము]

ఫలజ్యోతిషము మీఁద నిపుడుకూడ చూడఁగాఁ జాలమంది యొక నక్షత్రమందే పుట్టుచున్నారు; అయినను వారి కర్మము ననుసరించి యాయుష్యము యొక్క ఫలములోఁ జాల వైషమ్యము గనఁబడుచున్నది యని యాక్షేపము చేయఁబడుచున్నది. ఈ యాక్షేపమె మహాభారతకాలమందుఁ గూడఁ జేయఁబడుచుండెను. అగుఁగాక; నక్షత్రములకు దేవతలు వేర్వేఱుగా విశ్వసింపఁబడుచుండిరి. ఆ దేవతల ననుసరించి ఫలము కలుగునని నమ్మకముండెను. జ్యోతిషమందలి యీ సిద్ధాంతమునే యనుసరించి మహాభారత యుద్ధ సమయమున, సౌతి యనేకమైన యశుభ చిహ్నములను వర్ణించియున్నాఁడు. సౌతి ప్రాణములకు నక్షత్రములకు నభిమానులైన నక్షత్రములయందుఁ గ్రూర గ్రహ దృష్టి పడియున్నదది దీని చూపుటకై యత్నించియున్నాఁడు. దీని వివేచనము మునుపు జరిగి యేయున్నది. అగుఁగాక; మహాభారత సమయమున భారతీయ జ్యోతిషమంతయు నక్షత్ర ఘటితమై యుండెననుట స్పష్టమై యున్నది.మహాభారతమునకుఁ బిదప గ్రొత్తవారైన బ్రైక్టియను గ్రీకుల సాహాయ్యమున నేర్పడిన సిద్ధాంత జ్యోతిషమందు ఆలోచింపగా నక్షత్రములు వెనుకవడి రాసులకును లగ్నములకును బ్రాధాన్యము వచ్చెను. ఆయలవాటే యిప్పటివఱకును సాగివచ్చుచున్నది. నక్షత్రములకుఁగూడ గొంత యుపయోగ మీ సమయము నందు గలదు; కాని నక్షత్రములకు దేవతలేవియను సంగతి పరీక్షింపఁబడుటలేదు. ప్రస్తుతకాలమున జ్యోతిషములకుఁగూడఁ దఱచుగా నీ విషయమైన జ్ఞానము లేకున్నదను నంతవఱకుఁ జెప్పవచ్చును.

మహాభారత కాలమున నక్షత్రముల తరువాత దినమునకు మహ

త్త్వము తిథి సంబంధమున నెన్నికవగా నుండెను. పక్షము నిండనున్న దినముల సంఖ్య తిథి కర్థమై యున్నది. తిథులన్నిటిలోఁ బంచమి, పూర్ణిమ శుభముల విశ్వసింపఁబడి యున్నవి. మఱియు నియ్యవి పూర్ణములని చెప్పఁబడి యున్నవి. యుధిష్ఠిరుని జన్మ విషయమునఁ తిథౌ పూర్ణేతి పూజితే, లని యుల్లేఖము చేయఁబడియే యున్నది. మహాభారతమందు సమాచారమేదని చెప్పఁబడునపుడు నక్షత్రము లుపయోగింపఁ బడినంతగా తిథులుపయోగింపఁబడుట యగపడదు. కొన్నిచోట్లఁ తిథులు యుల్లేఖము దొరకుచున్నది. విరాట నగరమునకు గోగ్రహణమునకై సుశర్మ సప్తమికి వెళ్లెననియుఁ గౌరవులష్టమికి వెళ్ళిరనియు వర్ణింపఁ బడి యున్నది. స్కందునికి దేవ తాధి పత్యము పంచమినాఁడీయఁ బడెను. షష్ఠినాఁడతఁడు తారకాసురుని బరాభవించెను. కాని యీ సందర్భము లేనెలలోనే పక్షమున జరిగెనో చెప్పఁబడలేదు. ఇది మిగుల నాశ్చర్యమైన సంగతి యై యున్నది. ముందీవిషయమై యుల్లేఖము కాఁగలదు. పక్షములు రెండని చెప్పవలసిన యావశ్యకతలేదు. ఒకటి శుక్ల పక్షము. రెండవది కృష్ణ పక్షము. శుక్లపక్షమును మొదటి దానిగను గృష్ణపక్షమును రెండవ దానిగను వ్యవహరించెడు వాడుక మహాభారత కాలమున నుండియుండును. ఈ యాచారము యానానులయు నన్యదేశీయులయొక్కయుఁ బద్ధతికి విరుద్ధమై యుండెను. ఈ కారణముచేత యూనానీ చరిత్ర కారుల ధ్యానము దీనివైపునకు సహజముగనే చేరుచున్నది. సికందరు కాలమున హిందుస్థానమందుఁ బ్రచలితమై యున్న కాలగణనను వర్ణించుచు నితిహాస లేఖకుఁడైన కర్టియ సురూభస్సు చెప్పియున్నాఁడు—ఇచ్చటి లోకులు ప్రతి నెలకును, పదునైదు దినముల, రెండు పక్షములను విశ్వసించుచున్నారు. అయినను సంపూర్ణ వత్సరము యొక్క గణనయందు భేదము తటస్థింపదు. అనఁగా నొక వత్సరము 366 దినములదిగా విశ్వసింపఁబడుచున్నది. ఇకనేమంటే చాలామంది

జనులు చంద్రుఁడు పూర్ణుడై యుండెడు తిథితో లెక్క నారంభించినట్లే వేర్వేఱు నెలలను జోడింపరు. ఏ సమయమున చంద్రుఁడు శీఘ్రముగా నుదయింప నున్నాడో ఆ సమయమునుండి యిచ్చటి వారు లెక్కింప నారంభించు చున్నారు. వీనిఁబట్టి సికందరునాఁడు -మహాభారత కాలమున- ఇతర దేశములందువలె మాసములు పూర్ణిమాంతములు కాకుండెను. ఇఁకనేమంటేని యిప్పటివలెనే యమావాస్యాంతములై యుండెను.

ఇఁకనేమంటేని నక్షత్ర స్థితియిట్టిదై యుండెడిదని విశ్వసింపఁ జాలను. పౌర్ణమాస్యాంత మాసపద్ధతి భారతీయ కాలమందు, వైదిక కాలమందువలెనే, యచ్చటచ్చటఁ బ్రచలితమై యుండెను. వన పర్వములో 152 వ యధ్యాయమందు గుబేరుఁడు యుధిష్ఠురునితోఁ జెప్పుచున్నాఁడు- ‹‹ ఇచట నీవు కృష్ణ పక్షమంతయు నుండుము:” దీనిపై టీకాకారుఁడు మిక్కిలి దీర్ఘమైన టీకను చేసియున్నాఁడు. ‹‹దీనిపైఁ గొందఱు లోకులు ఆ కాలములోఁ గృష్ణపక్షము మొదటిదై యుండెడిదని చెప్పుచున్నారు. కాని యీ కథనము భ్రాంతమై యున్నది; ఎందుచేత? పూర్వాపర పక్షములకు శుక్ల కృష్ణములనెడు సంజ్ఞలున్నవి. ఇదే విధముగాఁ బూర్ణిమకుఁ బౌర్ణమాసి యని పేరున్నది. దీనిఁబట్టి దీని యందు నెల పూర్ణమగుచున్నదని యేమాత్రము నర్థము తీయఁగూడదు; ఇఁకనేమంటే మాస శబ్దమున కర్థము చంద్రుఁడని కూడఁగలదు దీనిఁబట్టి పూర్ణిమను పౌర్ణమాసియని చెప్పుచున్నారు.” ఇచట భాషలన్నింటియందును చంద్రునికిని మాసమునకును దగ్గఱ సంబంధమున్నదను నంత మాత్రమే చెప్పవలసి యున్నది. ఇంగ్లీషు భాషలలోఁగూడ మంథ శబ్దమునకు ‹‹మూన్” చంద్రుఁడు శబ్దముతో సంబంధమున్నది. ఇట్లే సంస్కృతములో ‹‹మాస, శబ్దము మొదటఁ జంద్రవాచకమై యున్నది పిమ్మట మాసమునకు బోధకమయ్యెను. పారసీలోఁగూడ మాహశబ్దము చంద్రవాచకమై యున్నది; దాని యర్థము కూడ మాసమయ్యెను. ఈ విషయమున నాశ్చర్యమునకుఁ బనిలేదు; ఎందుచేత? అందఱు లోకులం

దును మొదటి మాసములు చంద్రునిచే నిశ్చయింపఁబడి యుండెను. అగును, చాల స్థలములయందుఁ చంద్రుఁడు పూర్ణుఁడైన తరువాత మాసమును లెక్కించెడు రీతి యుండెను. ఇదే విధముగా భారతీయ ప్రజలయందును బూర్ణ చంద్రుని బట్టి మాసమును లెక్కించెడు పద్ధతి యుండి యుండును. మహాభారతమందు దాని యుల్లేఖాదిక మొకానొక చోటఁ గనఁబడుచున్నది. వైదిక సాహిత్యమున నయ్యది యుండనే యున్నది. కాని మహాభారత సమయమున నుత్తర హిందు స్థానమందు నిదాన పంజాబునందు– యూనానులకు నామాంత మాసము బ్రచలితమై లభించుచున్నదని నిశ్చయమై యున్నది. మహాభారతకాలమునకుఁ బిమ్మట నుత్తర హిందుస్థానములోఁ బూర్ణిమాంత్మాస పద్ధతి సాగెను. అది యిపుడు కూడ విక్రమ సంవత్సరముతో పాటు బ్రచలితమై యున్నది. విక్రమ సంవత్సరము పూర్ణిమాసముపుది యగుచున్నది. ఈ యాచారమెపుడు బయలు దేఱినది. ఇది యొక గొప్ప బ్రశ్నమై యున్నది. కాని శక వర్షము సదా యామావాస్యాంత మాసములదిగా విశ్వసింపఁబడుచున్నది మఱియు నన్ని జ్యోతిష గ్రంథముల యందును నీ గణనయే యీయఁబడి యున్నది. ఈ సమయమందు హిందుస్థానమున రెండు పద్ధతులును బ్రచలితమై యున్నవి. నర్మద కుత్తరమున సంవత్సరముతో పాటు పూర్ణిమాంత మాసము ప్రచారమై యున్నది. మఱి దక్షిణమున శకవర్షముతోడి పాటుగా నమావాస్యాంత మాసము ప్రచలితమై యున్నది.

సామాన్యరీతిని బట్టి మాసము 30 దినములదిగా మన్నింపఁబడు చుండెను, ప్రతి పక్షమునకుఁ బదునైదు తిథులు విశ్వసింపఁబడుచుండెను; తిథుల పేరులు పతిపత్తు, ద్వితీయ మొదలగు సంఖ్యలపై నుండెను కాని చంద్రునికి సూర్యునితో సంగమము 29 దినములయందు నపు దపుడిరువదియొనిమిది దినములయందే యగుచున్నది, ఇందుచేత నొక యర్ధ పక్షమునందు నొకటి లేక రెండు తిథులు తగ్గిపోవుచున్నవి లేక యుపుడపుడొక

తిథి యెక్కువకూడ నగుచుండెను. చాంద్రగ్రహ గణితము తెలియనపుడు మొదటినుండియు నేపక్షమున నెన్ని తిథులుండునో తెలియకుండెను; ఈ సంగతి యంతమునఁ బ్రత్యక్షానుభవమందలి విశ్వాసము వల్లనే విడువ వలసి యుండెను. మహాభారతముఁబట్టి భారతీయ కాలమున నింత సమయ మిట్టిది కూడ నుండెనని ప్రకటమగు చున్నది. అరబ్బు లేవిధముగా నీ సమయమందుఁగూడఁ బ్రత్యక్ష చంద్రుని జూచి తదనుసారముగా మాసమును విశ్వసించు చున్నారో. ఆ స్థితియే మొదట, నొకప్పుడు భారతీయార్యులకుండెను, మఱియు మొదటనుండియు తిథియొక్క వృద్ధి లేక క్షయమును దెలిసికొనుట, వారికిఁ గఠినమై యుండెను. భీష్మ పర్వారంభమున ధృతరాష్ట్రునితో వ్యాసుఁడు చెప్పుచున్నాడు-

> చతుర్దశీం పంచదశీం భూతపూర్వాంచ షోడశీమ్ ॥
> ఇమాంతు నాభి జానేహ మమావాస్యాం త్రయోదశీం ॥

"నేను చతుర్దశి, పంచదశి, షోడశి అనఁగాఁ బదునాఱవ తిథిని గూడ నమావాస్యగాఁ జూచితినిఁ అనఁగా నొకటి రెండు దినముల యొక్క వృద్ధి లేక క్షయమును జూచితిని. కాని నేను బదుమూఁడవ దినమును అమావాస్య యని యెఱుఁగను.' ఈ వాక్యముఁ బట్టి భార తీయ యుద్ధ సమయము నతిథులను నిశ్చయించెడు గణిత ముత్పనగ మైయుండలేదని సిద్ధమై యున్నది. కాని యీ సమయమున నీ గణి తము తెలిసియున్నది. అందఱు బదుమూఁడు దినముల పక్షము చాల మాఱులగుచున్నదని యెఱుఁగుదురు. దీనిఁబట్టి మనము వ్యాసుని కంటెఁ జతురులమని యెంత మాత్రమును జెప్పఁజాలము. వేదాంగ జ్యోతిషములోఁ తిథుల గణితము కలదు. అనఁగా భారతీయ యుద్ధ సమయమున-వ్యాసుని సమయమున వేదాంగ జ్యోతిషమునకుఁ బూర్వమే నిశ్చయ పూర్వకముగా వచియింపఁబడి యున్నది. అనఁగా

క్రీ. పూ॥ 1400 మునుపు భారతీయ యుద్ధము జరిగి యుండెననుట నిశ్చితమై యున్నది. అగుఁగాక; మహాభారతము, వర్తమాన స్వరూప మునకు వేదాంగ జ్యోతిషమునకుఁ బిమ్మట వచ్చెనని మునుపే చెప్పఁ బడి యున్నది. మహాభారత సమయమున సూర్య చంద్రుల యోగము 28 దినములకు నగుచున్నదన్న సంగతి తెలిసియుండును. క్రింది శ్లోక మును పట్టి యిదే యగపడుచున్నది-

> అష్టావింశతి రాత్రించ చంద్రమస్య సహ భానునా।
> నిష్పతంతి పునః సూర్యాత్సోమా సంయోగ యోగతః

సూర్యునితో నక్షత్రములు 28 రాత్రులు తిరిగి, చంద్రునితో సంయోగమైన పిమ్మట, మరల సూర్యునుండి వెలువడుచున్నవి. ఈ శ్లోక మున కిట్లి యర్థము తెలియుచున్నది. అగుఁగాక! సూర్యచంద్ర సంయో గము 28 రాత్రుల పిమ్మట నగుచున్నదను సంగతి ప్రదర్శింపఁబడియే యున్నది. (ఉద్యో. అ. 110)

మొత్తము నెలలు పండ్రెండున్నవి. మహాభారత కాలమున వానికి బ్రస్తుతము ప్రసిద్ధమైన నామములే యుండెను. అనఁగా మార్గశీర్షాది నామములే వాడుకలో నుండెను. ఇవిగాక ప్రస్తుత కాలమునఁ బ్రచలితమై యున్న శుచిశుక్రాది నామాంతర ములు కూడఁ బ్రచలితములై యుండెను. ఏ నక్షత్రము పైకిఁ బూర్ణి మందు జంద్రుఁడు వచ్చుచున్నాఁడో యా నక్షత్రము పేరు మాసమున కిచ్చి ప్రాచీనకాలమందుఁ బూర్వనామములుండిపోఁ బడి యుండెను; అనఁగా నీ నామములు పూర్ణిమాంత మాసములు నాఁటివని ప్రకటమే యై యున్నది, మాసనామము లెట్లున్నవి-మార్గశీర్షము, పౌషము, మాఘము, ఫాల్గుణము, చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వినము, కార్తికము. దీని యారంభము

మార్గశీర్షముతో నగుచున్నది. ఇప్పటివలెఁ జైత్రముతో నారంభమగుట లేదను సంగతి ధ్యానముంపఁ దగి యున్నది. మార్గశీర్ష మాసమును నాగ్రహాయణమని జెప్పియున్నాఁడు. అనుశాసన పర్వముయొక్క 06 వ 409 వ యధ్యాయములందుఁ బ్రతిమాసమందును నుపవాసము చేయుటకు ఫలము వ్రాసియున్నాఁడు. అందుకూడఁ బ్రారంభము మార్గశీర్షముతోనే యున్నది. ఇదిగాక గీతయందును "మాసానాం మార్గశీర్షోహం" అని చెప్పియున్నాఁడు. దీనిఁబట్టి భారతీయ కాలమందు మాసముల యారంభమున మార్గశీర్షము కావలయునని తెలియుచున్నది. పూర్వము మాసముల యారంభమున మార్గశీర్ష మెందులకుండెనో యనునది యొక గొప్ప పశ్నమై యున్నది. కాని యిచ్చట మనమీ కఠిన పశ్నమును విమర్శింపరాదు. భారతీయ కాలమందంతటను మాసముల క్రమము మార్గశీర్షాదియై యున్నది మఱి యిపుడు దాదాపు క్రీస్తు సంవత్సర ప్రారంభమునుండియుఁ జైత్రాదియై యున్నది మఱి యిపుడు దాదాపు క్రీస్తు సంవత్సర ప్రారంభము నుండియుఁ జైత్రాది యయ్యెను. ఈ విధముగనే నక్షత్ర గణన సైతము మహాభారతమునఁ గృత్తికాదియై యుండి దాదాపు క్రీస్తు శక ప్రారంభము నుండియే యశ్విన్యాదియై యయ్యెను.

బ్రాహ్మణ గ్రంథములందును యజుస్సంహిత యందును నున్న యితర నామములు మహాభారత మందెచ్చటను గనఁబడవు. సౌతి క్రింది శ్లోకమునందు శ్రీ కృష్ణుఁడు రాయబారమునకై వెళ్ళిన సమయము చెప్పఁబడి యున్నది.

కౌముదే మాసిరేవత్యాం శరదంతే హిమాగమే ।

ఇందుఁ డీకాకారుఁడు కౌముద నామమును గార్తికమునకుఁ జెప్పియున్నాఁడు; కాని యే నామావళి యందును నీ నామమును కనఁబ

డదు. అనఁగా మార్గశీర్ష నామక్రమమందునులేదు, శుచిశుక్రాది నామ క్రమమందును లేదు మఱియు యజుర్వేదమందున్న మూఁడవ నామ క్రమమందును లేదు. ఇది వింతమైన సంగతిగా నున్నది. పూర్వ వర్ణిత మైన గోగ్రహణ తిథులతో పాటు ఏ మాసము పేరును జెప్పఁ బడ లేదను నొక సంగతి వ్రాయదగి యున్నది. మాసమును అనగా తిథిని జెప్పుట యసంభవము. కాఁబట్టి భారతీయ యుద్ధ సమయమునఁ బ్రాచీనమై యజుర్వేద మాసనామములు అరుణము, అరుణజము మున్నగు ప్రచలితములై యుండెననియు భారతీయ కాలమందు మార్గశీర్షాది నామముల ప్రచారము జరిగిన కారణము చేత లోకులకో పురాణ నామమును దుర్బోధములయ్యెననియుఁ దలఁచుట కేయాటంకమును లేదు. ఇందుచేత మహాభారత కాలమందు నామములు సౌతియొక్క గ్రంథమునుండి తొలఁగింపఁబడి యుండునని విశ్వసింపఁ బడఁగలదు, ఈ విషయమైన విమర్శము మఱియొక స్థలమున నైయే యున్నది. ఇపుడు ఋతువులపైపు తిరుగుదము.

ఋతువులు వైదికములును లెక్కలో నాఱును నై యుండెను. మహాభారత కాలమున నిదియే ప్రచలితములై యుండెను. ఈ ఋతువులు వసంతము, గ్రీష్మము, వర్ష, శరత్తు, హేమంతము, శిశిరము నై యుండెను. భగవద్గీతయందు మాసానాం మార్గ శీర్షోహం ఋతూనాం కుసుమాకరః, అనఁగా ఋతువుల యారంభమున వసంతముండెననియు మాసముల యారంభమున మార్గశీర్ష ముండెననియుఁ జెప్పి యున్నాఁడు. ఈ రెండింటికిని గలయిక కుదురకున్నది. ఇది యొక చిన్న సమస్యయే యై యున్నది. ఈ యాఱు ఋతువులును పొందు స్థానమునకు బయటివియు వేదకాలికములు నై యున్నవి. ఆ ఋతుగణనయే మహాభారత కాలము దాఁక నున్నది, మఱి యిపుడు కూడఁ జైత్రాది గణనతో పాటుగా సాగివచ్చుచున్నది. మార్గశీర్షాది గణనయు

ములను భారతీయ కాలమునం దుత్పన్నములయ్యెను. కాని వానికి మేళనము ఋతువులతోఁ జేయఁబడలేదు. శ్రీకృష్ణుని యుపర్యుక్త వర్ణనమందు “శరదంతే హిమాగమే, అని చెప్పియున్నాఁడు మఱి నెల కార్తికమని జెప్పియున్నాఁడు. ఇదియునుగాక సర్వసస్య సుఖేకాలే–అన్ని విధముల యాహారమును గడ్డియుఁ తయారగుట వలన లోకులు సుఖులై యున్నారను వర్ణనము కలదు. దీనిఁబట్టి వర్తమాన సమయము నను మహాభారత సమయమునను, ఋతువుల సంబంధమునఁ గొంచెమెక్కువ యంతరము తటస్థింపలేదని తెలియుచున్నది. సూర్యగతి మీఁద ఋతువులాధారపడి యున్నవి. మఱియు అయన బిందువులే మనకుఁ బోయిన కారణముచేత వసంతారంభము మెల్ల మెల్లగా వెనుకకుఁ దొలఁగి పోపుచున్నది; ఇందువలన ఋతువు వెనుక పడుట ప్రసిద్ధమే యై యున్నది. ఈపై వర్ణనము మహాభారత కాలముది అనఁగా క్రీ. సం. నకుఁ గొంచె మించు మించుగా **250** వర్షముల మునుపటిది యై యున్నది–ఇట్లు నమ్మిన మీఁదట నొక మాసము దాదాపు ఋతుచక్రము వెనుక కీడ్వఁబడి యున్నట్లగపడును. ఎందుచేత? ప్రస్తుతమునఁ దఱచుగా నాహారము మఱియు ఘాసము ఆశ్వీయుజ మాసమున పండి తయారగు చున్నది. ఆ సమయములోఁ గార్తికమునఁ దయారైనట్లు వర్ణనమున్నది; ఆ సమయములోఁ గార్తికమునఁ దయారైనట్లు వర్ణనమున్నది. మరల మన మెప్పటి వఱకుఁ జైత్రారంభము నుండియే వసంతారంభమును విశ్వసించుచున్నారము. ఈ గణన మహాభారతమునకుఁ బిమ్మటిదియై యున్నది; అది దాదాపుగాఁ గ్రీస్తువత్సర ప్రారంభముదియై యున్నది. ఇందు ఆశ్వీన కార్తికములు వర్షమాసములు శరన్మాసములై యున్నవి జ్యేష్ఠాషాఢములు గ్రీష్మ మాసములు: శ్రావణ భాద్రపదములు వర్షమాసములు. ఇప్పటి లెక్కను బట్టి వర్ష ఋతువు తఱచుగా నాషాడము నుండి ప్రారంభమగుచున్నది, సభాపర్వమందుఁ శుచి శుక్రాగమే కాలే శుష్యేత్తోయ మిహాల్పకమ్” అని చెప్పియున్నాఁడు. ఈ యుల్లేఖము జ్యేష్ఠాషాఢమాసములే గ్రీష్మ ఋతువువియను స్థితిని బోధించుచున్నది. శుచి శుక్రములు, జ్యేష్ఠాషాఢముల నామములై యున్నవి. అనఁగా మహాభా

రత కాలము మొదలుకొని నేఁటి వఱకు సరాసరిని ఋతువు లొకనెల వెనుకపడి యున్నవి. హిందుస్థానమందు నిజమైన వర్ష ఋతువు నాలుగు మాసములు. విశేషించి ఋతువుల యీ భేదము దక్షిణ మందెక్కువగా నగపడుచున్నది. ప్రాచీన ఋతుచక్రమందుఁ వర్షర్తువునకు రెండు నెలలే విశ్వసింపఁబడి యున్నవి. రామాయణమందుఁ గిష్కింధాకాండములో నీ శ్లోకమున్నది.—

పూర్వోయం వార్షికోమాసః శ్రావణః సలిలాగమః ॥
ప్రవృత్తా స్సౌమ్య చత్వారో మాసావార్షిక సంజ్ఞితాః ॥

దీనిఁబట్టి రామాయణ కాలమందుఁ గూడ వర్షర్తువు మొదటినెల శ్రావణముగనే మన్నింపఁబడి యున్నది. దానిని సలిలాగమని కూడఁ జెప్పి యున్నాఁడు. అనఁగా వర్షర్తు ప్రారంభ మనియే చెప్పియున్నాఁడు దీనిఁబట్టి రామాయణ సమయమందుఁగూడ ఋతువులు, వర్తమాన సమయము కంటే ఒక నెల ముందుండెననియు వర్షఋతువునకు నాలుగు మాసములు విశ్వసింపఁబడి యుండెననియుఁ బ్రకటమగు చున్నది. దీనిఁ బట్టి రామాయణ మహాభారత సమయము రెండువేల వత్సరముల ముందటిదని నిశ్చితమగుచున్నది.

సూర్యుని యుత్తర దక్షిణ గతులను బట్టి ఋతువుల చక్రము ఉత్పన్నమగుచున్నది. మహాభారత సమయమున నీ సంగతి తెలిసియుండెను. వనపర్వములోని 163 వ యధ్యాయమందుఁ జెప్పియున్నాఁడు— "సూర్యుఁడు దక్షిణము వైపునకు వెళ్ళుటచేత శీత ముత్పన్నమగుచున్నది. మఱి యుత్తరము వైపునకు మరలిన మీఁదట నతఁడు నీటి నిగిర్చివేయు చున్నాఁడు. మరల నతఁడు నీటిని విడుచుచున్నాఁడును; అపుడు భూమిపై సస్యాదికము నుత్పత్తి చేయుచు దక్షిణము వైపునకు వెళ్ళుచున్నాఁడు. ఈ విధముగా సుఖోత్పత్తికై కారణభూతుఁడైన యీ మహా తేజశ్శాలియగు సూర్యుఁడు వృష్టి వాయువు మఱియు నుష్ణత వీని యోగము మన ప్రాణుల నభివృద్ధి చేయుచున్నాఁడు."

ఋతు చక్రమొకమాఱు తిరిగినచో నొకవత్సరమగుచున్నది. వత్సర కల్పన ఋతువులను బట్టియే యుత్పన్నమగుచున్నది. సూర్యగతిని బట్టి ఋతువులు పుట్టు చున్నవి. సూర్యుఁడు దక్షిణోత్తరములకు మారునట్లే ఋతువులు మారుచున్నవి. అనగా వత్సరము విషయములో సూర్యుని పై నవశ్యము అవలంబితులమై యుండవలయును. ఈ సౌర వర్షము నకు సరిగా నవధి యెంతయో నిశ్చయించుట గొప్పకార్యమై యున్నది; కాని యీ కార్యమేమాత్రమును గఠినమైనది కాదు. సూర్యుఁడు బాగుగా దక్షిణమునకు వెళ్ళినపుడు బిందువునుండి యవధిని నశించుచు, మరల నా బిందువు మీఁదికి రెండవమాఱు సూర్యుఁడు వచ్చిన సమయమును జూచి సరిగా నవధి స్థిరీకరింపఁబడఁగలదు. ఇటువంటి కొలఁతయు గణనయు జేయ్యవలసిన అవసరము, వార్షిక సత్రకారణమున, భారతీయార్యులకు వచ్చు చుండెను. ఇందుచేత వారికి సరియైన వత్సర జ్ఞానము ప్రాప్తమై యుండెను. వత్సరమునకు ఉత్తరాయణము, దక్షిణాయనమునని రెండు భాగములుండెను. ఈ రెండు భాగముల మధ్య బిందువు అనగా విషువ దినము వారికిఁ దెలిసియుండెను. మహాభారతములో ఉత్తరాయణము పుణ్యకారకమును బవిత్రమునై యున్నదనియు స్పష్టముగాఁ జెప్పఁ బడి యున్నది. ప్రాచీన కాలమందు ఉత్తరాయణములో మృతి నొందిన యెడల బ్రహ్మవేత్తలై బ్రహ్మమును బొందుదురనియు దక్షిణాయణములో మృతి నొందిన యోగులు చంద్రలోకమునకు వెళ్ళి మరల తిరిగి వత్తు రనియు విశ్వసింపఁబడు చుండెను. భగవద్గీతయందు నిట్టి దృఢ నిశ్చ యము యొక్క స్పష్టమైన యుల్లేకమున్నది.

అగ్నిర్జ్యోతిరాహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మ విదోజనాః ॥

ఈ శ్లోకము ప్రసిద్ధమై యున్నది. మహాభారతమందు శరపంజర మునఁ బరుండియున్న భీష్ముఁడు, దేహ త్యాగముకై, యుత్తరాయణ కాలమును నిరీక్షించు చుండెనని వ్రాసి యున్నాఁడు. మహాభారత కాల

ర్యుఁడు బాగుగా దక్షిణ దిశకు వెళ్ళి అక్కడ నుండి తిరుగ ంనారంభించు కాలమును ఉత్తరాయణమని చెప్పుచుండిరి. ఇది జ్ఞప్తి యుంచుకొనఁదగిన విషయమైయున్నది; ఎందుచేత? సూర్యుఁడుత్తరము వైపునకు గాని జూచి యుధిష్ఠిరుఁడు, భీష్మునియొద్దకు వెళ్ళుటకై బయలుదేరెను ( అనుశాసన అ. 167 ). దీనిఁబట్టి విషువవృత్తముపైకి సూర్యుఁడువచ్చినది మొదలు ఉత్తరాయణమని విశ్వసించెడు నాచారము మహాభారత కాలమున లేకుండెనని ప్రకటముగాకున్నది. మఱియొక విషయ మేమనఁగా మహాభారతకాలమున , ఆలోచింపగా భారతీయ యుద్ధమున ఉత్తరాయణము మాఘమాసమున నయ్యెడిది భీష్ముఁడు మరణ సమయమునఁ జెప్పియున్నాఁడు-" మాఘోయం సమనుప్రాప్తో మాసః సౌమ్య యుధిష్ఠిర " ఇపుడుత్తరాయణము పౌషమాసమున నగుచున్నది. మహాభారత కాలమున సూర్యుఁడు దక్షిణమున కెరదుకు వెళ్ళుచున్నాఁడో యీవిషయమైన కల్పన లేకుండెను. మహాభారతకాలమందు భారతీయర్యులకు పృథివియొక్క కీలము, సూర్యుని చుట్టును దిరిగెడు గీఁతవైనకుఁ గొన్నియంశములు వంగియున్నదను సంగతి తెలిసియుండుట సంభవము కాదు. వారికి భూమి సూర్యునికి నలుప్రక్కలను దిరుగుచున్నదని కూడఁ దెలియకుండెను. సంధ్యాసమయమున సూర్యుఁడు పశ్చిమమున నస్తమించి ప్రాతః కాలమునఁదూర్పు వైపునట్లుదయించు చున్నాడను విషయమై వారద్భుతమైన కల్పనను జేసియున్నారు. వారు భూమిని సముద్రదేశము లేక పెడల్పుగల ప్రదేశమునుగాఁ జెప్పుచుండిరి, ఇందుచేత నిట్లి కల్పనచేసివై బట సంభవమైయున్నది.

> అస్తంప్రాప్య తతస్సంధ్యామతిక్రమ్య దివాకరః।
> ఉదీచీం భజతే కాష్ఠాం దిశమేష విభావసుః
> సమేరు మనువృత్తస్సన్ పునర్గచ్ఛతి పాండవ।
> ప్రాఙ్ముఖః సవితా దేవః సర్వభూతహితేరతః॥

వన పర్వ మందలి 163 వ అధ్యాయములో వివిధమైన వర్ణనము కలదు. సూర్యుఁడుత్తరదిశకు వెళ్లి మేరువునకుఁ బ్రదక్షిణముచేసి మరలఁదూర్పున నుదయించు చున్నాడు. ఇట్లే చంద్రుఁడు కూడ మేరువునకుఁ బ్రదక్షిణము చేసి, నక్షత్రముల యందుండి తూర్పునకు వచ్చు చున్నాడు.

దక్షిణాయనోత్తరాయణముల వీని మధ్యబిందువు సంపూర్ణముగాఁదెలియ్యఁబడియుండెను సంవత్సరము యొక్క యవధికూడ భారతీయ కాలమందుఁ దెలియఁబడియుండెను. ఈ సంవత్సరమందుఁ బండ్రెండు చాంద్ర మాసములును బైగాఁగొన్ని దినములును గూడనుండెడివి. కాఁబట్టి పంచ వర్షముల యుగమును విశ్వసించి యందు రెండునెల అదనముగాఁ గలిపెడు పద్ధతి మహాభారతమందు వర్ణితమైయున్నవి. ఇదిమునుపు వ్రాయబడియే యున్నది. ఈ యుగములలోని పంచవర్షములు వేర్వేఱు నామములతో వేదాంగ జ్యోతిషమందును వేదములందున్ను జెప్పఁబడియున్నది. మహాభారతమందు మొదటి రెండు చోట్ల నామములు సంవత్సరము, ఐదవ సంవత్సరమున్నగానవి పేర్కొనఁ బడియున్నవి. ఒకచోటఁ బంచపాండవులకు బంచ సంవత్సరముల యుపమ యీయఁబడి యున్నవి. ఈ పంచవర్షముల యుగముకంటెఁ బెద్దయుగముయొక్క కల్పన మహాభారత కాలమందుఁ బూర్ణమైయుండెను, ఇందాశ్చర్యమే లేదు. ఈ నాలుగు పెద్ద యుగముల నామములు కృతము, త్రేత, ద్వాపరము, కలియుగమునని నిశ్చయింపఁబడి యుండెను. బ్రాహ్మణకాలమందుఁగూడ వీని వ్యావహారముండెను. అపుడు, మహాభారతకాలమందీకల్పన పరిపూర్ణమై యుండుటలో నాశ్చర్యములేదు. భిన్న భిన్న యుగముల కల్పన ప్రాచీనలోకులందారు యందునుండెను, ఇట్లేయది భారతీయార్యుల యందును నుండెను. మొదటియుగము మంచిది; పిదప నుత్తరయుగములందుఁజెడ్డకాలమువచ్చుచున్నదియను కల్పన కూడ సార్వత్రికమై యున్నది. ...య బ్రాహ్మణ మందు వ్రాసియున్నాఁడు-

కలి శ్శయానో భవతి సంజిహానస్తు ద్వాపరం ।
ఉత్తిష్ఠంస్త్రేతా భవతి కృతం సంపద్యతే చరత్ ।

ఈ నాలుగు యుగముల యొక్క చతుర్యుగము లేక మహాయుగము విశ్వసింపఁబడి యున్నది. ఈ చాతుర్యుగము యొక్క యుల్లేకము భగవద్గీతయందుఁ గూడఁగలదు.

సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥

ఈ శ్లోకము ప్రసిద్ధమై యున్నది మఱియు దీనిఁబట్టి యప్పుడప్పుడు చాతుర్యుగమే కేవల యుగముగాఁ జెప్పఁబడుచుండెను. మహాభారతమందు వనపర్వములోని 188 వ అధ్యాయమునఁ గాలి ద్వాపరము, త్రేత, కృతయుగము ననెడి నాలుగు యుగములకు వత్సర సంఖ్య యొకవేయి, రెండువేలు సంవత్సరము లిచ్చియున్నాఁడు; మఱియుఁ బ్రతియుగమునకు సంధ్య, సంధ్యాంశము ఒకటి, రెండు. మూఁడు, నాల్గు శతకములీయబడియున్నవి. అనఁగాఁ జతుర్యుగముల వత్సర సంఖ్య పండ్రెండువేల వత్సరములగుచున్నది. ఈ పండ్రెండువేల చాతుర్యుగము లేక మహాయుగము లేక కేవలయుగ మగుచుండెను; దాని వేయి యుగములు బ్రహ్మదేవునికొక దినమగుచుండెను. మహాభారతకాల మందిట్టి కల్పనయే యుండెను.

ఏషా ద్వాదశ సాహస్రీ యుగాఖ్యా పరికీర్తితా ॥
ఏతత్సహస్ర పర్యంత యహో బ్రాహ్మముదాహృతమ్ ॥

(వనపర్వ అ 188)

ఈ పండ్రెండు సంవత్సరములకు సంజ్ఞయుగమై యున్నది: ఇట్టి వేయి యుగములయందు బ్రహ్మకొక దినము పూర్ణయగుచున్నది మనుస్మృతిలో నిట్టి గణనయే యున్నది. భారతీయ జ్యోతిశ్శాస్త్రములోని యిప్పటి గ్రంథములయందుఁ గూడ నీ గణనయే గ్రహింపఁబడియున్నది. చాతుర్యుగముల యొక్క పండ్రెండువేల యేండ్లు మనుష్యులవి కావు. దేవతా వర్షములని కూడ వాని యందుఁ జెప్పఁబడి

యున్నది. మనుష్య సంబంధమైన యొక యేఁడు–దేవతలకొక దినము మనుష్యుల 360 ఏండ్లు– దేవతలకొక యేఁడు జ్యోతి శాస్త్రమును బట్టి యిట్లే లెక్క నిశ్చయింపఁబడి యున్నది. ఈ లెక్కను బట్టి ముందటి చతుర్యుగము 43 లక్షల 32 వేల మనుష్య వత్సరములది యగుచున్నది ఇది జ్ఞప్తి యుంచుకొనఁదగిన విషయమై యున్నది.

మహాభారతమందును మనుస్మృతి యందును నున్న కల్పనను బట్టి భారతీయ జ్యోతిషకారులీ కల్పనను బెంచిరని కొందరాధునిక విద్వాంసుల యభిప్రాయమై యున్నది. అనఁగా, భారతీయార్యుల యూహను బట్టి మహాభారతకాలమందుఁ జతుర్యుగముల పండ్రెండు వేల యేండ్లును మనుష్యవత్సరములవియే యైయుండెను. కాని పేర్కొనబడిన విద్వాంసుల యీ మతము మనకు మన్నింపఁదగినదికాదు. కలియుగ మొక వేయియు మనుష్యవత్సరములదియె యైయున్నదను కల్పన యెన్నడను సంభవము కానేరదు. దేవతలయొక దినము మనుష్యుల కొక వత్సరమై యున్నదను కల్పన బహు ప్రాచీనమై యున్నది. ఉత్తరమున నుత్తర ధ్రువముపై మేరువున్నది; అచటి నాఱుమాసముల దినమును యిన్ని మాసములదే రాత్రియు నుండుట యనుభవమై యున్నది మఱియు, దేవతలు మేరువుపై నున్నారను కల్పన కలదు. మనుస్మృతి యందు నుత్తరాయణ దక్షిణాయనములే దేవతల యొక్క అహూరాత్ర ములని చెప్పఁబడి యున్నది. ఇచట వేయి యుగములు బ్రహ్మకొక దినమగుననియు వ్రాసియున్నాఁడు; గీతయందుఁ గూడ బ్రహ్మ యొక్క రాత్రి యంతయె పెద్దదని స్పష్టముగా వ్రాసియున్నాఁడు. ఈ లెక్కను బట్టి మహాభారతమందును జెప్పఁబడియున్న పండ్రెండువేల యేండ్లను దేవతల వత్సరములే యై యుండెను. అవి మనుష్యుల వత్సరములు కావు మనుష్యుల వత్సరములని నమ్మఁబడునేని యుగముల పరిమాణము బొత్తిగా చిన్నది యగు చున్నది. కలియుగము వేయియేండ్లదేయని విశ్వసింప బడుట యెన్నటికిని సంభవము కానేరదు. బ్రాహ్మణ కాలమందు చూడగా భిన్న భిన్న యుగముల వర్షసంఖ్య యింతయని నిశ్చయింపఁ బడలేదు,

అయినను ఆ సమయమునఁ గలియుగము పదివేలయేండ్ల కన్న మిగుల
పెద్దదని స్పష్టముగా విశ్వసింపఁ బడుచుండెను. అథర్వ వేదమందే ప్రొ॥
రంగాచార్యులు చూపియున్నాఁడు. (8-2-11) ఈ వాక్యమున్నది–
"మేము నీ అవధిని నూఱు, పదివేలనూఱు వత్సరములు, ఒకటి, రెండు
మూఁడు, నాలుగు యుగములకు సరా సరిగా విశ్వసించు చున్నాము.
అనగా యుగముయొక్క వ్యవధి పదివేలేండ్లకంటె అదనమై యున్నది.
వన పర్వములో చతుర్యుగమునకు (చతుర్యుగికి) పండ్రెండు వేలని
వ్రాయఁబడి యున్నది. అచట దివ్య వర్షము లనియే యర్థము చేయ
వలయును. కాలముయొక్క యనంతత్వము విషయమున భారతీయా
ర్యుల కల్పన, కలియుగమునొక వేయి వత్సరములదిగాఁ జెప్పెడు నట్టి
సంకుచితమైన కల్పనను వారెన్నఁడును జేసియుండరను నంతటి యుదా
రమై యుండెను. విశేషించి మహాభారత కాలమునకుఁ గలి యుగము
యొక్క వేయియేండ్లు పూర్ణమై పోయెనని వారు చేసిన యీ కల్పన
సంభవము కాదు. శాంతి పర్వములోని 311 వ యధ్యాయమును బట్టి
మహాభారత కాలమందు కాల గణన యొక్క కల్పన యెంత హెచ్చుగా
నుండెనో తెలియుచున్నది. మొదట బ్రహ్మదేవునియొకదినము ఒక కల్ప
ముదిగనే విశ్వసింపఁబడుచుండెను; కాని యేడువేల రెండువందల యేఁబది
వర్షముల దినమగునని కల్పన చేయఁబడి యున్నది. మహాభారత కాల
మునను మనుస్మృతి కాలమునను కలియుగ మొకవేయి రెండు వందల
దివ్య వర్షములది అనఁగా నాలుగు లక్షల ముప్పది రెండువేల ([illegible])
వర్షములదిగా విశ్వసింపఁబడియుండెనని తాత్పర్యము.

శాంతిపర్వము (2? అ) లో యుగముల వర్షములు మరల లెక్కిం
పఁబడి యున్నవి. ఇచట టీకయందు కృత యుగములో 4000 వర్షములు
దేవతలవని సరిగా చెప్పఁబడి యున్నవి; ఎందుచేత? దీనికి ముందు దేవ
తల యహో రాత్రముల వర్ణన మున్నది. "ముందు చెప్పబడి యున్న
మనుష్యలోక దిన రాత్రులననుసరించి యీ వర్షముల గణన చేయఁబడి
యున్నది. "ఇచట దివ్య వర్షముల యొక్క యుద్బోధ మగుచున్నది.
ఇచటఁ గొంచెము సందేహము మిగిలి యుండునెడల నయ్యది పూర్వోక్త

మైన యుపనిషద్వచనములచేత తొలగింపబడ గలదు. మహాభారతమందు కలియుగమొక వేయి మానవ వర్షములదియై యుండెనను కల్పనయుండుట యెన్నడు సంభవమే కాదని తాత్పర్యము. నాలుగులక్షల నలుబది రెండు వేల వర్షముల యుగముయొక్క కల్పన హిందుస్థానమందొక చోటనే లేకుం డెను; ఇకనేమంటే ఖాల్డియనులు జ్యోతిష శాస్త్రమును విశేషముగా నభ్య సించి యుండిన పాశ్చాత్య దేశముల యందును ఈ కల్పనయే యుం డెను. యుగముయొక్క పరిమాణమును కొంచెమో గొప్పయో యెక్కు వగా విశ్వసింపకుండుట తక్క జ్యోతిషమునకు గత్యంతరము లేకున్నది; మఱియు జ్యోతిషమునకై యుపయోగించునట్టి పెద్ద సంఖ్య (సంఖ్యా నాకము) కలదు. (360×12×100=432100) గణితమునకై యిది మిగు లనుప యోగపడుచున్నది. వత్సరము యొక్క 360 దినములను మరల 1200 రో॥ గుణింపఁగా ఈ సంఖ్య ప్రాప్తించి యున్నది. ఈ యుగ కల్పన ప్రాచీన కాలమునుండియుఁ బ్రచలితమై యున్నది.

1000 మానవ వర్షముల కలియుగమును విశ్వసించెడు కల్పనయైతే తుచ్ఛమే యై యుండెను. కాని యింతకంటెఁ గూడఁ దుచ్ఛమైన కల్ప నను గొందఱు చేసియున్నారు. వారు మహాభారతమందలి యొక యుగమున కర్థమొక వత్సరము చతుర్యుగమునకు నాలుగు వత్సరము లని తలఁచుచున్నారు. భిన్న భిన్నములైన నాలుగు వత్సరముల నామ ములు కృతము, త్రేత, ద్వాపరము, కలియుగమై యుండెను, కాని యీ కల్పన నిష్ప్రమాణమై యుండెను. వనపర్వముతో రెండు స్థలముల యందుఁ గొన్ని విరోధాభాసములైన వచనములుండెను; వాని యాధారము మీఁద నీ యూహము చేయఁబడి యుండెను. “సంధి రేష త్రేతాయా ద్వాపరస్య చ,” వనపర్వములోని 121 వ యధ్యాయము నందు, ఒక తీర్థ సంబంధముఁ బట్టి చెప్పఁబడి యుండెను; మరల 41 వ యధ్యాయమందు హనుమంతుఁడును గలిసికొన్న సమయమున “ఏతత్కలియుగం నామ అచిరాద్యత్ప్రవర్తతే“ అని చెప్పియున్నాఁడు. అట్టిచో, ఒక వత్సరము యొక్క యవధి లోపల త్రేతాద్వాపరముల సంధియుఁ బిమ్మటఁ గలియు గము నెట్లు రాఁగలదు? అని ప్రశ్నము కలుగుచున్నది. కాని ముందటి

వర్ణనములో వీష, అను శబ్దమువలన సమయముయొక్క బోధము కానేరదు దేశముయొక్కయే బోధమగుచుండెను. ముందు వెనుకల సందర్భముఁబట్టి యీ సంగతి తెలియఁ గలదు. ఇచ్చట శర్యాతి నృపునియొక్కయు చ్యవన ఋషి యొక్కయుఁ గథ యీయఁబడియుండెను. చ్యవనఋషి తపస్సు చేయువాఁడు అనఁగా త్రేతాయుగమునకు దర్శకుఁడై యున్నా డు. త్రేతయందుఁ దీపము ప్రధానమనియు ద్వాపరమందు యజ్ఞము ప్రధానమనియు వర్ణింపబడి యున్నది, ఇచ్చ రూ 125వ యధ్యాయము నకు ఒకమనిషికి శార్యాతిరాజు తనకూ, నిచ్చెనని కథయున్నది. అనఁ గా క్షేత్రప్రశాంసా సం ర్భమున నిచట ఈ దేశము తీర్థము, త్రేతాద్వాప రముల సంధియు నైయున్నదని చెప్పఁబడియున్నది.

మహాభారతములో, బహుత్రిస్థానమందును భిన్న భిన్నయుగములయందు వేరు వేరు ధర్మములు ప్రచలితమైయున్నవని వర్ణించియున్నాఁడు. ఈ విషయమై యిచ్చట నెక్కువగా వర్ణింపవలసిన యావశ్యకతలేదు. కలియుగ ము కన్న ద్వాపరము రెట్టింపు త్రేతమూడు రెట్లు, కృతా యుగము నాలుగురెట్లు నగుననెడు కల్పన ప్రాచీనమై యున్నది. ఉపనిషత్తులఁబట్టి ప్రాచీన కాలమంధీశబ్దముల యుపయోగము ద్యూతములో నగుచుండెడిదని కనబడుచున్నది. ఆసమయమున దీని కర్థము పాచికలనుండెడు, ఒకటి, రెండు, మూఁడు, నాలుగు చిహ్నములగుచుండెను. ఈ యర్థముయొక్క ప్రాచీనమోపయోగముపై ధ్యానముంచుట చేతఁగూడఁ కృతాయుగమొక వర్షమునకు నామమనున కలన సతిగా నచ్చుటలేదు. ఇంకొకచోట యుగ శబ్దము వర్షంచకమైనట్లు తెలియుచున్నది, కాని యది యిట్లుకాదు.

తస్మిన్యుగసహస్రాంతే సంప్రాప్తే చాక్షుషే యుగే।
అనావృష్టిర్మహారాజ జాయతే బహువార్షికా॥

వనపర్వములోని, 188వ యధ్యాయ మందీ పద్య మున్నది.ఇందు యుగ సహస్రాంతే అనుదాని కరము వర సహస్రాంతే అని కాదు; ఇక నేమంటేని 'చతుర్యుగ సహస్రాంతే' యని యగుచున్నది. అనగా కల్పాం

తమందెప్పుడు సృష్టియొక్క లయమగునో, యప్పటి వర్ణనమిది; ఇచట యుగమున కర్థము చతుర్యుగమే యని చెప్పవలయును. ఎందుచేత ? యుగ సహస్రాంతమున అనగా ఒక వర్ష సహస్రముగల కలియుగమునకు చివర— ఇట్లర్థము చేసిన మీదటఁ బ్రతి కలియుగము చివరను సృష్టి నశించుచున్నదని విశ్వసింపవలసి యుండును. అగుగాక; మహాభారత మందెచ్చటను యుగ శబ్దము ఒక వర్షమను నర్థమందు రాలేదు; చివరకు కృత త్రేతా ద్వాపరకలిపదములు వర్షనామములను కల్పనయే పొరపాటై యున్నది.

కల్పముయొక్క కల్పన మిగుల బురాతనమై యున్నది. 'ధాతా యథా పూర్వ మకల్పయత్ ' ఈ వైదిక వచనముఁబట్టి కల్పశబ్దము బయలు దేఱెను. దీని కర్థము బ్రహ్మదేవు డుత్పాదించిన సృష్టి యొక్క కాలము (సమయము) యియున్నది. భగవద్గీతా కాలమందు కూడ ఈ కాలమొక వేయి చతుర్యుగములదిగా విశ్వసింపబడి యుండెను. 'కల్పాదౌ విసృజామ్యహమ్ " ఈ శ్లోకమందుఁ జేయఁబడిన వర్ణనము ననుసరించి కల్పారంభమందుఁ బరమేశ్వరుఁడు సృష్టి నుత్పాదించు చున్నాఁడు కల్పము సమాప్తమైన తరువాత సృష్టిని లయము సంభవించుచున్నది. ఈ కల్పము యొక్క పూర్ణమైన సరిహద్దు 432000 చతుర్యుగము ?×1000 అగుచున్నది. అనగా 432000000 అగుచున్నది. ఈ కల్పన యిప్పటి భూగర్భ శాస్త్ర వర్ష సంఖ్యయొక్క కల్పనతో మిక్కిలి కలసి మెలసి యున్నదని చదువరులకు తెలియగలదు. ఈ కల్పము యొక్క యధికమైన యవధియందు భిన్న భిన్న మన్వంతరములు మహాభారత కాలమందును మన్నింపఁబడి యుండెను. మనువు యొక్క కల్పన కూడ బహు ప్రాచీనము; వైదిక కాలము నుండియు కలదు; కల్పము యొక్క యవధిలో వేర్వేఱు మనువులున్నారని విశ్వసింపఁబడి యుండెను. భగవద్గీతలో నలుగురు మనువుల యుల్లేఖము 'మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవస్తదా " అను నర్థ శ్లోకమునందు వచ్చియున్నది. ఇప్పటి జ్యోతిష శాస్త్ర మతము ననుసరించి యే కల్పము నందుఁ బదునలుగురు మనువులున్నారు. ఈ పదునలుగురు మనువుల యొక్క కల్పన మహాభారత కాలమందుండెనో లేదో చెప్ప జాలము. ప్రతి మన్వంతర మందును సంధి కాలము కలదని యీ

వైపు జ్యోతిషికుల కల్పన కలదు. భిన్న భిన్న యుగముల సంధి కాలమువలె నీ కల్పన చేయఁబడి యున్నది. నాలుగు యుగములును సమాప్తము కాగానే మరల మఱియొక నాలుగు యుగములు మన్వంతరములో వచ్చుచున్నవి. ఇప్పుడున్న కలియుగము సమాప్తము కాగానే మరలఁ గృత యుగము వచ్చును. వర్తమానకాలమందలి కలియుగము భారతీయ యుద్ధ కాలమునుండి యారంభమై యున్నది. మహా భారత కాలమందీ కల్పన పూర్ణముగాఁ బ్రచలితమై యుండెను. హనుమంతుని పూర్వోక్త వచనము గాక, గధా యుద్ధానంతరము శ్రీకృష్ణుఁడు బల రామునికి బోధించుచుఁ జెప్పియున్నాఁడు– "ప్రాప్తం కలియుగం విద్ధి ప్రతిజ్ఞాం పాండవస్య చ" భారతీయ యుద్ధమున కనంతరముననే వచ్చిన చైత్రి శుక్ల ప్రతిపత్తునకుఁ గలియుగ మారంభమయ్యెను. ఇపుడు కలియుగము సమాప్తమై కృత యుగమారంభ మగునప్పుడు చంద్రుఁడు, సూర్యుఁడు, పుష్య నక్షత్రము, బృహస్పతియు నొక స్థానమునకు వత్తురు. అను నీ కల్పన కలదు.

యదా చంద్రశ్చ సూర్యశ్చ తథా తిష్య బృహస్పతీ ।
ఏకరాశౌ సమేష్యంతి ప్రవర్త్స్యతి తదా కృతమ్ ॥

(వన పర్వ అ. 188?)

గణితశాస్త్రము వలన ఈ యోగమెపుడు వచ్చునో తెలుఁపఁబడ జాలదు. ఎందుచేత? ఇవన్నియు నొకరాశికి వచ్చుట యసంభవమై యున్నది. రాశి శబ్దము నకర్థ మిచట సామాన్యమైన మేషాది రాశి కాదు, ఇంకనేమంటేని యిచట యుతి యర్థమై యున్నది. మహా భారత కాలమందు మేషాది రాసులు తెలియఁబడి యుండలేదని మనము చూచియున్నాము. చంద్రుడు, సూర్యుఁడు. బృహస్పతి, పుష్య నక్షత్రము యుతి కలయుక యసంభవముగాఁగాన్పట్టుచున్నది. అయినను నదియొక శుభయోగముగా విశ్వసింపఁబడి యుండును.

మొట్టమొదలు నిమేషము అనఁగా నేత్రములయొక్క రెప్పపాటు కాలము మొదలుకొని చతుర్యుగము, మన్వంతరత్వము, కల్పము అనుపేరి గల చివరకాలముల మర్యాదవఱకు అనఁగా బ్రహ్మదేవుని దినము వరకు జేరును. కాలముయొక్క యీ కల్పన హిందుస్థానమందుఁ బుట్టి యిచటనే పెరిఁగెను. ఖాలిదును ప్రజలయందొక యుగము లేక 'సృష్టివర్షము' 432000 వర్షపుదియై యుండెను. కాని దానిఁబట్టిమన కల్పన బయలుదేఱలేని చూపఁబడెను. ఎందుచేత? సష్టియొక్క ఆయుర్వత్సర మర్యాద 43 కోట్ల సవత్సరముల వఱకుఁజేరియున్నది. ఈ కల్పన భారతీయకాలమందే యుత్పన్నమై యుండెను. బ్రాహ్మణ కాలమందు యుగకల్పన దశాసహస్రవర్షముల కంటె నెక్కువైన యొక కాలమునకు దుల్యమై యుండెను. ఎందుచేత? ఉపనిషత్తులలో ఒకటి, రెండిటి యందుఁబదివేల వర్షములయొక్క నంతకంటె నధికమును ఎక్కువయు నుల్లేఖము కలదు. భారతీయజోతిషికులు భారతకాలమందు యుగమర్యాదను నిశ్చయించి కల్పమర్యాదనుగూడ నిర్ణయించిరి. ఈపనిని విశేషించి గర్గుఁడనెడు జ్యోతిష్కుడు చేసియుండును. మహాభారతమందు విఖ్యాతుఁడైన జ్యోతిషికుఁడు గర్గుఁడు. సరస్వతి తీరమందుఁ దపస్సు చేసికాలజ్ఞానమును సంపాదించెనని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

> తత్ర గర్గేణా వృద్ధేన తపసా భావితాత్మనా।
> కాలజ్ఞాన గతిశ్చైవ జ్యోతిషాం చ వ్యతిక్రమః॥
> ఉత్పాతా దారుణాశ్చైవ శుభాశ్చ జనమేజయ।
> సరస్వత్యా శ్శుభే తీర్థేవిదితా వై మహాత్మనా॥ (శాల్యప)

దీనిఁబట్టి సర్వతీ తీరమందు గర్గుఁడు కురుక్షేత్రమున నీయుగపద్ధతి అన్వేషించి నిశ్చయించెనని తెలుచున్నది. శుశయూనానులలో నీపద్ధతికనఁబడని కారణమున నియ్యది భారతీయార్యుల దేయని చెప్పవలసియున్నది. అది యూనానుల కంటెను ముందటదై యుండుటయు, బ్రికటమై యున్నది. గర్గుఁడెప్పటి వాఁడో చెప్పజాలము, కాని యతఁడు మహాభారతముకన్నఁ బూర్వుఁడు అనఁగా క్రీస్తునకు 200 ఏండ్లపూర్వపువాడు

వర్తమాన కాలమందు, ప్రసిద్ధమైన, గర్గసంహితా గ్రంథ మతనిదే యై యుండును; దానికొకవేళ గొంచెము రూపాంతరమై యుండును. అందు రాసులు లేవని మనము ముందే వ్రాసియున్నాము. దీనిఁబట్టి రాసులు వ్యవహారములోనికి వచ్చుటకు మునుపటిది. అనఁగా క్రీ॥పూ॥ 100 వర్షములకుఁబూర్వపుది యైయుండునని ప్రకటమగుచున్నది.

ఉల్లిఖితమైన యవతరణలోఁ జ్యోతిషాం చవ్యతిక్రమః. అని చెప్పబడియున్నది. అనఁగా గర్గునికి గ్రహముల వేలు వాలు గతి తెలియునని చెప్పఁబడియున్నది. దీనిఁబట్టి భారతీయయుద్ధ కాలమునకు దాదాపు గ్రహగతి యంత యెక్కువగాఁ దెలియఁబడుకున్నను మహాభారత కాలమున నాజ్ఞానమునకుఁ బరిపూర్ణత ప్రాప్తమయ్యెనని ప్రకటమగుచున్నది. ఎపుడును నక్షత్రములను బరీక్షించెడు భారతీయార్యులకు నక్షత్రములకుఁ గూడ గతి కలుగు నున్నదను సంగతి ముందే తెలిసియుండును. సూర్యచంద్రులుగాక, నక్షత్రములలో సంచారముచేయు ఈగ్రహములు బుధుడు శుక్రుఁడు, అంగారకుడు, గురుఁడు, శనియై యుండెను,

తే పీడయన్భీమ సేనం క్రుద్ధా స్సప్త మహారథాః ।
ప్రజా సంహారణే రాజన్ సోమం సప్తగ్రహా ఇవ ॥

( భీష్మ వ. అ 130 )

ఈ శ్లోకమందుఁ జంద్రుఁడు దక్క మిగిలిన యేడు గ్రహములను జెప్పఁబడి యున్నవి; అపుడు రాహువును ప్రత్యేక గ్రహముగా విశ్వసింపవలయును, లేక యిచటి సప్త గ్రహములే వేఱని విశ్వసింప వలయును. " రాహురర్కముపైతిచ " యను వాక్యముఁ బట్టి మహాభారత కాలమందు గ్రహ రూపమున రాహువుయొక్క పరిచయము బాగుగానై యుండెనని నిశ్చయ పూర్వకముగా నగపడు చున్నది. భారతీయ కాలమున నర్గునికి ముందే నక్షత్ర చక్రముపై నుండి వెళ్ళుటకై ప్రతి గ్రహమునకు ఎంత కాలము పట్టుచున్నదో యీ విషయమైన కల్పన యుండి యుండును. గ్రహముల వ్యతిక్రమము విషయమై గర్గునికి విశేష జ్ఞానము ప్రాప్తమై

యుండును. గర్గుని నాఁటికి సూర్య చంద్రులది తక్క అన్య గ్రహముల తిరుగుడునకు సరియైన కాల మర్యాద తెలిసి యుండ దనియు గర్గునికి గ్రహములు వక్రమై యున్నట్లును నొకచోట స్థిరమై యున్నట్లును తెలిసి యుండెననియు ననుమానము జనించు చున్నది. మహాభారత మందు కొన్ని గ్రహముల యొక్క యనేకుల్లేఖములు కలవు. ఇట వానినన్నిటి నెత్తవల సిన యావశ్యకత లేదు. మహాభారత సమయమునఁ గొన్ని గ్రహములు విశేషించి శనియు నంగారకుఁడును దుష్టులై యున్నారను కల్పన యుం డెను మంగళుఁడెఱ్ఱని రంగు గలవాఁడుగను రక్తపాతము చేయువాఁడు గను జెప్పఁబడు చుండెను. గురుఁ డొక్కఁడు మాత్రము శుభుఁడుగను సమస్త ప్రాణులను రక్షించు వాఁడుగను విశ్వసింపఁ బడుచుండెను. ఒకటి రెండు గ్రహములయొక్కయు నక్షత్రములయొక్కయు యోగము మాత్రము శుభమని చెప్పఁబడు చుండెను.

యథా దివిమహాఘోరౌ రాజన్‌బుధశనైశ్చరౌ। (భీష్మ ప. అ. 104)

ఈ వచనమందు బుధ శనైశ్చరుల యోగము భయంకరమని విశ్వ సింపఁబడి యున్నది. భీష్మ పర్వారంభమున వ్యాసుఁడు ధృతరాష్ట్రునికి జెప్పిన ప్రాణిహానికరమగు భయంకర దుశ్చర్యములందును ఉద్యోగ పర్వ ములోని అ 14 లోఁ జివరను దీనికి మునుపు శ్రీకృష్ణ కర్ణుల కలయిక యందు కర్ణుఁడు జరిగినట్లు వర్ణించిన దుశ్చిహ్నముల యందును గ్రహ ములయొక్కయు నక్షత్రములయు నశుభ యోగములను విస్తరించి వర్ణించి యున్నాఁడు. గర్గుని గ్రంథమందు వర్ణితమైన యోగములు మొదలుకొని తఱచుగా సౌతి యీ యోగములను మహాభారతములోఁ గలిపివైచి యుం డును. ఎందుచేత? గర్గుని యుల్లిఖితమగు నవతరణమందు "ఉత్పాతా దారుణాశ్చైవ శుభాశ్చ" అని చెప్పఁబడి యున్నది. అనఁగా అశుభములు లేక భయంకరములైన యుత్పాతములయొక్కయు శుభములైన శకునముల యుక్క జ్ఞానము గర్గుని కుండెను.అనఁగా వీని పరిగణనను గర్గుఁడుపూర్వము చేసి యుండెను. గర్గ సంహితయందును నిప్పటి యీ శుభా శుభములైన యోగములు చూడఁబడు చున్నవి. ఈ శుభా శుభ యోగములు మూల భారతీయ యుద్ధ సమయమున వ్రాయఁ బడినవి కావు. ఈ విషయమై పూర్వము వివేచనము జరిగియే యున్నది. కావున నిచట నా యోగ

ములను వ్రాయవలసిన యావశ్యకత వేరు అగును. ఇచట మాత్రము గర్గుని సమయమున లేక మహాభారత సమయమున గ్రహముల గతి చెప్పబడి యుండెననియు వాని ఫలములు నక్షత్రములపై నుండి చెప్పఁబడు చుండెననియుఁ జెప్పవలయును; ఎందుచేత? ఆ సమయమునందు రాసుల జ్ఞానమే లేకుండెను. రెండవది గ్రహముల వక్రము వక్రాను వక్రమునైన గతి మహాభారత మందును గర్గ సంహిత యందును జెప్పఁబడి యున్నది. మూఁడవ సంగతి యేమనఁగా— శ్వేతగ్రహము లేక ధూమకేతువు మహాభారత సమయమున తెలియఁబడి యుండెను మఱియు నయ్యది మిగుల నశుభమని యెంచఁబడు చుండెను. ఈ శ్వేతగ్రహమునుబట్టి యింకను కొన్ని కాల్పనిక గ్రహములయు లేక కేతువులయుఁ గల్పన మహాభారతకాలమందు జరిగి యుండెను; ఈ ప్రకారముగా వాని యుల్లేకమే యశుభ చిహ్నముల యందుఁ గలదు. ఇందుచేతఁ సప్త మహాగ్రహాః ఇటువంటి వచనములను సందిగ్ధములఁగా నెంచవలసి యున్నది. నాలుగవ సంగతి యిది, మహాభారత కాలమందు రాహు నొకగ్రముగా నెంచెడు కల్పన యై యుండెను— అనఁగా ఆ సమయమువలన రాహువు క్రాంతి వృత్తము నందుఁ దిరుగు వాఁడును తమోమయుఁడును నదృశ్య గ్రహమునని దృఢ నిశ్చయముండెను. ఇట్లు కాదేని రాహువు సూర్యుని యొద్దకు వచ్చునని చెప్పుట సంభవము కానేరదు. మహాభారత మందు కొన్ని స్థలములలో రాహువునకై కేవలము గ్రహ శబ్దమే ప్రయుక్తమైయుండెను. రాహువు యొక్క పురాణ కల్పన కూడ— అనఁగా అతఁడు సూర్య చంద్రుల నాక్రమించెడు నొక రాక్షసుఁడను కల్పన— మహారతభారత మందుఁ గలదు. ఎందుచేత? ఒకచోట రాహువునకు కబంధ స్వరూపము వర్ణితమైయుండెను. సూర్యుని కగ్రా సంగ్రహణ సమయమున రాహువు కేవలము పొగమసి యొక్క రాశియైనట్లు ప్రత్యక్షానుభవమైన మీఁదట, అది శిరస్సులేని రాక్షసుఁడుగా నెంచఁబడి వాఁడు నివసించుస్థానము సముద్రమని విశ్వసింపబడెను.

అత్రమధ్యే సముద్రస్య కబంధః ప్రతిదృశ్యతే।
స్వర్భానోః సూర్యకల్పస్య సోమసూర్యౌజిఘాంసతః॥ (ఉద్యో॰అ110)

ఇందు రాహువుయొక్క మొండెము పశ్చిమ సముద్రమందు నిలిచి

యున్నదని వర్ణింపఁబడి యుండెను. పశ్చిమ సముద్రమున రాహువు యొక్క కల్పన యెందుకుఁ జేయఁబడి యున్నదో తెలియదు. చంద్ర సూర్య గ్రహముల సరియైన కల్పన మహాభారత సమయమునన్నై యుండెనని నిశ్చయ పూర్వకముగా చెప్పఁబడఁ గలదు. ఎందుచేత ? శాంతి పర్వమందాత్మ స్వరూపమును వర్ణించుచు రాహువు రాక్షసుఁడుకాడు, కేవలము ఛాయయై యున్నాఁడని మిక్కిలి ప్రశస్తముగా చెప్పియున్నాడు; మఱియు ఆ ఛాయ యా కోశమందు లేదు, కేవలము సూర్య చంద్రులపై నగపడు చుండెను. మఱియొక చోట నీ సంగతి వ్రాయఁబడి యుండెను; అనఁగా తత్త్వ జ్ఞాన పరిశీలనమందు, శాంతి పర్వములోని 203 వ యధ్యాయమున ఈ విషయము వచ్చియుండెను.

పై వివేచనమును బట్టి పాఠకులకు భారతీయ కాలమున భారతీయార్యులకు జ్యోతిర్విషయవమున మెట్లుండెనో మఱియునయ్యది యే విధముగా పెరుగుచు వచ్చి యుండెనో జాడ తెలిసియుండును. ఈ జ్ఞానము ముఖ్యముగా యజ్ఞ సంబంధమున సూర్య చంద్ర జాతులకు మాసములకు, వత్సరమునకు మైత్రి గుదుర్చుటకై, పుట్టినని మఱియు నందు ఫల జ్యోతిష మందలి శుభా శుభ యోగముల దృష్టిచేత నౌన్నత్యమయ్యెను. కేవలము జ్యోతిర్విషయకమైన శోధచేయు తలంపు మంచిదియే కాకపోనిమ్ము, అయినను ఈ కారణములఁబట్టి భారతీయార్యులు మహాభారత కాలమునకు జ్యోతిష జ్ఞానమందు మిక్కిలి యున్నతిని చేసియుండిరి. శక యవనులు లేక బ్యాక్ట్రియన్ యూనానులు అటు తరువాత హిందుస్థానముపై నాక్రమణము చేసి చాల కాలమువఱకు నీ దేశమున రాజ్యముచేసిరి. ఆ సమయమందు వారి రాజధాని యుజ్జయినియై యుండెను. క్రీ. సం. ఆరంభమునకు దాదాపున భారతీయ జ్యోతిషముయొక్క లేక యవన జ్యోతిషము యొక్క సాహాయ్యమును బొంది యిప్పటి సిద్ధాంతాది జ్యోతిషము యొక్క వృద్ధి జరిగెను. ప్రత్యక్ష జ్యోతిష విషయకమైన జిజ్ఞాస వలన నాకాశ మండలి గ్రహములను నక్షత్రములను సరియైన దృష్టిచేత నధిక వివేకము చేయు నుత్సాహము భారతీయార్యులకు లేకుండెను.

యథా హిమవతః పార్శ్వం పృష్ఠం చంద్రమసో యథా ॥
నదృష్టపూర్వం మనుజైర్న చతన్నాస్తి తావతా॥ (శాంతి 203)

అర్థశ్లోమునఁ జంద్రుని పృష్ఠభాగము కనఁబడదని చెప్పియున్నాఁడు. ఇందుచేత నియ్యది లేదని తిరస్కరింపఁ జాలము. ఈ విధముగనే దృష్టాంతము ఆత్మయొక్క యస్తిత్వ సంబంధమున ఈయఁబడియున్నది. దీనిఁబట్టి చంద్రుని యొక్క యొకవైపు మాత్రము మనకగపడుచున్నది. ఈ సంగతి, చంద్రునిఁ బ్రతిదినము ననేక పరిశోధనలతో రక్షించి భారతీయులు నిశ్చయించినట్లగపడుచుండెను ఇప్పటి పాశ్చాత్య జ్యోతిశాస్త్రము కూడ నీ సిద్ధాంతమును మన్నించియుండెను. వేర్వేఱుగా నిరువది యేడు నక్షత్రములు గాక యుత్తర నక్షత్రములను గూడ భారతీయార్యులు కనిపెట్టి యుండిరి. వానికి వేర్వేఱు నామములను గూడ నుంచియుండిరి. సప్తర్షుల యుల్లేఖము విశేష రూపమునఁ జేయవలయును. ఆకాశము వైపు చూచునట్టి యే మనుష్యుని మనస్సునందును, ఉత్తర ధ్రువమునకు నిరుగుపొరుగులకు దిరుగుచున్న యీ యేడు నక్షత్రముల గుంపుయొక్క పరిణామము కాకుండ నుండఁజాలముతదను సారముగా, భారతీయార్యులు తమ ప్రాచీన సప్త ఋషులతో నీ సప్త నక్షత్రములకు మైత్రిని గుదిర్చి రేని యందాశ్చర్యములేదు. కాని యీ సప్త ఋషులుత్తరమందున్నారనియు, ఇట్లె పూర్వ దక్షిణ పశ్చిమములందును వేర్వేఱు సప్త ఋషులున్నారనియు, వారు చేసియుండిన కల్పన కొంచెము విలక్షణముగా నగపడుచుండెను. (శాంతి. అ 208) దక్షిణము వైపునఁ గల్పిత సప్తర్షుల దర్శనము భారతీయార్యుల కెన్నఁడును గానఁ జాలదనుట ప్రకటమై యుండెను. అయినను దక్షిణము వైపున నగపడుచున్న తేజస్విని యగు తార కొన్ని దినములు మాత్రమగపడి యదృశ్యమగుచుండెను. ఆ తారకు మహాభారత కాలమందు అగస్త్యఋషి యను పేరు పెట్టఁబడి యుండెను. అగుఁగాక; మహాభారత కాలమందు ఆకాశ మండలి గ్రహములను లేక నక్షత్రములను కనిపెట్టుటకై యేదైన యంత్రముండెనో లేదో ఈ విషయమును విమర్శించునట్టి క్రింది శ్లోకమును బట్టి ఇట్టిదేదో యొక యంత్రము లేక చక్రము మహాభారత కాలమున నుండి

యుండునని కల్పన చేయబడఁగలదు. వనవర్వమందలి 133 వ యధ్యాయ మునఁ జెప్పియునాఁడు—

> చతుర్వింశాతి పర్వత్వాం షణ్ణాభి ద్వాదశప్రిధి ।
> తత్త్రిషష్టిశాతారం వై చక్రం పాతు సదాగతి ॥

ఓ రాజా? ఇరువది నాలుగు పర్వములును ఆఱు నాభులును పండ్రెండు చదరములును 260 అంపములును గల చ క్రి ము నీ కెల్లపుడును మేలు చేయుఁగాక, ఈ మాటను అష్టావక్రుఁడు పలికి యున్నాఁడు ఈ సంవ త్సర చక్రమునకు నై యుండెను, నంవత్సరమున నిరువై నాలుగు పూర్ణిమా మావాస్యలు పర్వములై యుండెను. ఋ తు వు లు నాభులు పండ్రెండు చదరములు అనఁగా మాసములు. 360 దినములే అంపములు. యీ చక్రము బహుప్రాచీనమై యుండెను. వై దిక సాహిత్యమందును గనఁబడు చుండెను. ఈ చక్రిము వలన నాకాశ స్థగ్రహములను దెలిసి కొనెడి చక్ర ముత్పన్నమగుట అసంభవము కాదు. ఇతిహాసమును బట్టి భారతకాలమందు ఆర్యులకు నీ రెండు విషయముల సూక్ష్మజ్ఞానము కలిగి యుండెనని సిద్ధమగుచుండెను.

జ్యోతిష శాస్త్రమందలి రెండవ స్కంధము లేక భాగము, అనఁగా సంహితావిషయమునను జాతక విషయమునను రెండు శబ్దములు వాయ పలసి యున్నవి. ఈ భాగము లిప్పటి వఱకు వేఱు వేఱుగా లేకుండెను వానికి విశేషమైన యౌన్నత్యముకూడఁ గాకుండెను. అయినను ఈ విష యములను నానా విధములై నయుత్పాత ములును దుర్భక్ష మాదిగాఁగల విపత్తులును గ్రహముల నడకపై యాధారపడి యున్నవని విశ్వసింపఁ బడి యుండెను: వేయేల మనుష్యుని సుఖదుఃకములు జన్మ నక్షత్రముమీఁద నవలంబింతమైయున్నవి; మఱియు నీదృష్టిచేత గర్గది జ్యోతిషిముల య న్వేషణముఁ అధిక్కని ( వేచనయ ) కల్పనలును బ్రిచలితమై యుండెను. ఉదాహరణ మునకై క్రింది శ్లోకములో, వర్షాభావముతో శుక్రినికిఁగల సంబంధమును జూడుఁడు.

భృగోఃపుత్రః కవి ర్విద్వాన్ శుక్రః కవిసుతో గ్రహః।
త్రిలోక్య ప్రాణయాత్రార్థం వర్షావర్షే భయాభయే॥

స్వయంభువానియుక్తః సన్ భువనం పరిధావతి॥ 42 ॥ ( అను.అ. 36 ) ఇటువంటి వాక్యములు భారతీయ యుద్ధ సందర్భమందునేకములు గలవు. సమాజమున కంతకును లేక ప్రతీ వ్యక్తికిని సుక దుఃకములు గ్రహములపై నాధారపడియున్నవి, ఈవిషయమైన సంహితయు జాతకశాస్త్రమును, మహాభారతమునకుఁ బిమ్మట యూ నా ను ల ను ఖాలియనులును జ్యోతిషికుల సాహాయమును బడసి, ముందుముందెక్కువగా వర్ధిల్లిరి. కాని యిచ్చట నయ్యది విశేషించి పేర్కొనవలసిన యావశ్యతలేదు.

